సమస్తమును తెలిసికొనినాఁడు" అని శ్రీధరుడు భావించి పలుకుటలో నాతనికి నరసింహస్వామిపైఁగల విశ్వాసము, నరసింహ ప్రసాదాతిశయము ద్యోతకము లగుచున్నవి. నరసింహానుగ్రహమున నా పరమేశ్వరుని నానామూర్తుల నర్చించినవారికి, ఒక పాండిత్యమేమి, సకలైశ్వర్యములు సంప్రాప్తించును. పరమపదప్రాప్తికి శివానందలహరి నోలలాడు శంకరభగవత్పాదులే నరసింహుని కరావలంబనముగఁ జెప్పుట, ఇందుకు ప్రబలసాక్ష్యము.

* * * *

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"

అని గీతలో ప్రభువిచ్చిన అభయమున కనుగుణముగ హిరణ్యకశిపుఁడు జగత్కంటకుఁడై సాధుహింస యొనర్చినవేళ ప్రహ్లాదభక్తుడు "త్వమేవ శరణం మమ" అన్న నిశ్చలతాత్పర్యమున నర్థింప నా పరమేశ్వరుడు నరసింహుఁడై యవతరించి దుష్టశిక్షణ శిష్టరక్షణ లొనర్చినాడు. తాను ప్రత్యక్షదైవము నని, సర్వాంతర్యామి నని, సర్వమంగళాస్పదుఁడనని, సద్యః ఫలప్రదుఁడనని ప్రత్యక్షముగ నిరూపించినాఁడు. విష్ణు, మత్స్య, బ్రహ్మాండాది పురాణములందును, భాగవతమునందును, నరసింహ వైభవకథలు నవ్యభావోత్తేజకములై ప్రసరించినది. హరివంశ నృసింహ పురాణములలో నా యవతార మహిమాతిశయములు మనోజ్ఞవైఖరిని వర్ణితములైనవి. ఆగమగ్రంథము లా వికుంఠుని వివిధమూర్తి విభేదములను విపులరీతి నిరూపించినవి.

నరసింహావతార కథా కథనములందు బహువిధవైవిధ్యము, గోచరించుచున్నది. ఒక తంత్రగ్రంథమందలి కథ యిది : "యోగినులు ఒకప్పుడు శ్మశానమున సంచరించుచు తంత్రప్రభావమున శివునాహ్వానించిరి. ప్రణయకలహవేళ కుపితయైన పార్వతిని తన మనోవీథిని నిల్పుకొని యా పరమశివుడు వారికడకు వచ్చినాఁడు. అంతట యోగినులు తమ శక్తిచే శివుని హృదయమునుండి, పార్వతి నాకర్షించి ఏమేమొ యొనర్చిరి. శక్తిలేనివాఁడైన శివుఁడు, వారి నరికట్టలేక పోవుటచే యోగినులు మరి మరి విజృంభించిరి, నారాయణుఁ డప్పుడు

నరసింహరూపమును ధరించి యోగినులను క్షోభపెట్టి గర్జించి పిమ్మట శివుని స్తుతించినాఁడు. స్తుతి వీర్యము కూడిన నిజవీరత్వముతో శివుడు శక్తిగలవాడైనాఁడు". అది శివరాత్రి సమయము. ఈ పై కథనమునకు ప్రమాణము.

"నృసింహ తను నా సాకం క్షోభయన్ యోగినీగణమ్,
జగర్జఘోర గంభీరం నారాయణ ఇత స్తతః॥" అనునది.

*

అవతారములలో నృసింహుఁ డొక విచిత్రావతారము. శ్రీహరి యవతారము. నరత్వసింహత్వముల సాంకర్యము గల యవతారము. నరత్వము జాతి, సింహత్వము జాతి, కాని నరసింహత్వము జాతికాదు. దీనిని భావించి నరసింహత్వము జాతి కాదని తార్కికులైనవా రంగీక రించినారు. నరసింహత్వ మొకతత్వము. పరతత్వము. కావుననే నర సింహోపాసకులు ఈ స్వామిని నానారూపములతో నర్చించెదరు. సాక్షాత్తు ఉపనిషత్తులు పూజార్హుఁడని అంగీకరించిన నారాయణునిగా నర్చించెదరు. కరావలంబన స్తోత్రమున ఆచార్య శంకరుఁడు, నృసింహుని క్షీరోదధిప్రభు వనినాడు. పెరియాళ్వారు, నమ్మాళ్వారు, తిరుమంగై యాళ్వారులును నరసింహుఁడు నారాయణుఁడే యనినారు.

వాసుదేవ చతుర్మూర్తికి వాసుదేవ, సంకర్షణ, (సింహ) ప్రద్యుమ్న (వరాహ) అనిరుద్ధ వ్యూహములు ప్రధానములని వైష్ణవుల పాంచరాత్రోత్సవము చెప్పుచున్నది. విష్ణుధర్మోత్తరమునందుఁ జెప్ప బడిన విష్ణుని చతుర్ముఖములు నీ చతుర్విధ వ్యూహములకు, సంకేత ములే యని గుర్తింపదగియున్నది. కావున నరసింహావతారము, సంక ర్షణ, ప్రద్యుమ్న వ్యూహములకు సంబంధించిన యవతారము.

*　　　*　　　*　　　*

"ఉగ్రం వీరం మహావిష్ణుం, జ్వలతం సర్వతోముఖమ్
నృసింహం భీషణం భద్రం, మృత్యు మృత్యు నమామ్యహమ్"

ఇది నరసింహ పూర్వతాపనీయోపనిషత్తులోని నరసింహమహా మంత్రము. పరమేశ్వరుఁడు తొలుత నరసింహ రూపమున బ్రహ్మకు

ప్రత్యక్షమై ఈ మహామంత్రమును చెప్పినాడట! ఈ నారసింహ మహామంత్ర, మాధారముగ నా పరమేష్ఠి పిమ్మట స్రష్టయై సర్వవేదములను, ప్రపంచించినాఁడట! ఈ నారసింహానుష్టుప్పు లేనిదే యంత్ర ప్రతిష్ఠయును పూర్తి కానేరదు. కావున, ప్రతి యంత్రప్రతిష్ఠయును దీనిని లిఖించుకొనవలసినదే. కావున నిది సర్వయంత్రములకును మూలమగుచున్నది. భగవద్గీతలోని విశ్వరూప సందర్శన ఘట్టమందలి శ్లోకములకు (ద్వితీయాధ్యాయము 20 మొదలు 31 వరకు గలవి.) నీ నారసింహ పవిత్రమునకు విశేషమైన అనుబంధమున్నది. ఇందలి ఉగ్రవీరాది శబ్దములు ఆ దేక్రమమున భగవద్గీతయందు గన్పట్టుచున్నవి. అందువలన నీనారసింహ మహామంత్రాతిశయమును, ఉపనిషత్తులు, గీత, ద్రావిడ ప్రబంధములు అన్నియు నంగీకరించినవి.

"ప్రపంచ సారతంత్రములోని 23 వ పటలమందలి, 2–3 శ్లోకములు నరసింహ మంత్ర లాపకులకు ధ్యానశ్లోకములు."

ఉగ్రం వీరం మహావిష్ణుం' ఇత్యాది నృసింహమంత్రము, సంప్రదాయజ్ఞులు సవిశేషముగ నుపదేశమును పొందెడు మంత్రము. అంతేకాదు. ఇందు నవనరసింహు లున్నారు. ఉగ్రనరసింహుఁడు, వీర నరసింహుఁడు, మహావిష్ణువు (లక్ష్మీనృసింహుడు) జ్వాలానరసింహుఁడు, సర్వతోముఖ నరసింహుఁడు, ఉజ్వల నృసింహుఁడు, భీషణనృసింహుఁడు, భద్రనృసింహుఁడు, మృత్యోర్మృత్యు నరసింహుడు (హిరణ్యకశ్యప సంహారకుడు)

నరసింహస్వామి నిశితదంష్ట్రాముఖుఁడు, అష్టభుజుఁడు. "నాభికి దిగువగా రక్తాకారుఁడు. పైన సితరూపుఁడు. అర్కాగ్నీందు నేత్రుడు అష్టభుజములలో అష్టవిధములగు ఆయుధవిశేషములను ధరించినవాఁడు" అని ఆగమముల వలన తెలియుచున్నది. ఆయన ఆయుధ విశేషములను అటు నిటు మార్చి కూర్చినచో నరసింహునకు 40320 ఆకార భేదములు కల్గుచున్నవి. ఇందు, కార్యార్థియైన ఉపాసకుఁడు కావలసిన కమనీయ రూపమును అర్చించి, ఐహికసిద్ధులను, ఆముష్మికసిద్ధులను పొందుచున్నాఁడు. ఉత్పాతశాంతి, ఉపద్రవశాంతి, సర్వప్రియత్వాదులను సంపాదించుచున్నాడు.

నరసింహస్వామి సర్వార్థసిద్ధుల నొసగు సర్వేశ్వరుఁడగుటయే గాక ఉపాసకులకు వారు తానగుటకు అవకాశమిచ్చు ప్రభువు. ఇందుకు శంకరభగవత్పాద శిష్యుడైన పద్మపాదాచార్యులవారు నృసింహ రూపమును ధరించుటయే నిదర్శనము.

మంత్ర విదుఁడైన బ్రాహ్మణుఁ డొకడు నృసింహ సాక్షాత్కారమునకై తపమొనర్చువేళ అరణ్యబాలుఁ డొకఁడు వచ్చి "నీ విట్లుండుటకుఁ గారణ మే"మని ప్రశ్నించినాఁడు. ఆటవికుఁ డగు నా బాలు నజ్ఞానిగ, భావించి యా విప్రుఁడు "సగము మానవుఁడు సగము సింగము నైన వానికై ఇట్లుంటి"నని చెప్పినాఁడు. ఆ బాలుడు అక్కడనే యొక మాటున కేగి, భక్తసులభుఁడైన నృసింహుని తీగలతోఁ గట్టి చంక నిడుకొని విప్రుని కడకుఁ గొనివచ్చినాఁడు. అంత నా బ్రాహ్మణుఁడు "ఇంత కాల ముగ్రముగ, నీకై తపమొనర్చుచున్న నాకు దర్శన మిచ్చితివి కావు. ఈ అడవిపిల్లవాని చంకలో నిరికితివా"? అని సాకూతముగ ప్రశ్నించినాఁడు. స్వామి, యా బ్రాహ్మణుని దైన్యమునకు కరిగి జన్మాంతరమున 'ఆవేళ సాక్షాత్కార ధన్యుఁడవయ్యెద"వని వరమిచ్చి నాఁడట! అతఁడే మఱుసటి పుట్టువున పద్మపాదుడైనాఁడు. ఆచార్యశంకరుఁడు, పద్మపాదుఁడు, తపస్సమాధిలో నున్న వేళ కాపాలికుఁ డొకఁడు వచ్చి శంకర శిరమును ఖండించుటకుఁ బూనుకొనినాఁడు. పద్మపాదుఁ డెట్లో సమాధినుండి లేచి నరసింహరూపమును ధరించి యా కాపాలికుని సంహరించినాఁడు. ఇట్లే నరసింహోపాసకు లెందరో నరసింహాకృతిని ధరించి శత్రుంజయు లైరనుట కెన్నియో నిదర్శనము లున్నవి.

*　　*　　*　　*

40320 రూపభేదములు గల స్వామి నరసింహుఁడు. ఒక స్థలమందు ఒక నరసింహుని ప్రతిష్ఠించిన ఆ పరిసరములలో, నా స్వామి తన నలుబదివేల మూడువందల యిరువది రూపములతో విహరించు గావున నరసింహాలయములున్న నెలవులు ఆపదలు లేనివి; సంపత్సమృద్ధములు. ఈ రహస్య మెఱిఁగినవా రగుట వలననే యావద్భారతీయులలో ఆంధ్రులు విశేషించి నరసింహ భక్తులు. అహోబిలము, మంగళగిరి, సింహాచలము, యాదగిరి, ధర్మపురి, వేదాద్రి, అంతర్వేది

వంటి సుప్రసిద్ధ నరసింహక్షేత్రము లన్నియు ఆంధ్రదేశము లోనివే. అహోబిలమున నవనరసింహు లున్నారు. మంగళగిరి నృసింహుఁడు ఆంజనేయుని క్షేత్రపాలకునిగాఁ గల లక్ష్మీనృసింహుఁడు. పానకాల రాయుఁడు; సింహాచల నృసింహుఁడు వైరిహరరంహుఁడైన వరాహ నృసింహుఁడు. ధర్మపురిలో యోగనరసింహస్వామి, యాదగిరిలో జ్వాలానరసింహస్వామి దర్శనమిత్తురు. ఈ నవనారసింహ వివిధ దైవతముల పేర్లనే, తమ బిడ్డలకు పేర్లు పెట్టుకొనుట అను ఆచారము ఆంధ్రదేశమున, నున్నట్లు భారతదేశమున మరి యే యితర ప్రాంతమందును కన్పట్టదు. అందువల్ల నరసింహస్వామి ఆంధ్రుల దైవ మనుట అతిశయోక్తి కాదు. ఇంత అత్యధికముగా నరసింహార్చన మన దేశమున సాగుటకు, ఇందు నిరంతరము హిరణ్యకశ్యపులచే పీడితులగు ప్రహ్లాదు లధికసంఖ్యలో నుండుట కారణమై యుండునన్న యొక సుకవి యూహ యెంతయు సమంజసమైనది. ఆంధ్రదేశమునకే కాక యావద్భారతమునకును నేఁడు దైత్యబాధ మిక్కుటమైనది, నానా రీతుల సర్వరంగములందును విజృంభించి విహరించుచున్న ఆ హిరణ్యకశ్యపులను సంహరించి శిష్టప్రహ్లాద రక్షణార్థము అనంతనరసింహు లవతరింపవలసిన ఆవశ్యకత యెంతైన నున్నది. కావున నరసింహోపాసకు లా దివ్యతత్త్వమును పరమదీక్షా దక్షతలతో పరివ్యాప్తి నొందింతురుగాక !

“శత్రోః ప్రాణానిలాః పంచ వయం దశ జయోఽత్ర కః
ఇతి కోపాదివా తామ్రాః పాంతువో నృహరేర్నఖాః”

[శత్రువైన హిరణ్యకశ్యపుని ప్రాణము లయిదు, మేము పది. ఇందు జయ మేమంతయున్నది–ఇట్లు కోపమున నెఱ్ఱందన, మొందినవో యన్నట్లున్న నరసింహదేవుని గోళ్ళు మమ్ము రక్షించుఁగాక !]

శ్రీవత్సాది మనోజ్ఞ లాంఛనములన్ జెన్నొంది శ్రీమంతమై
కైవల్యంబగు శ్రీనృసింహ ఘన మేకాలమ్ము కళ్యాణ రే
ఖావృష్టిన్ నిజభక్తలోక చిరకాంక్షా సస్యసంవృద్ధికై
తా వర్షించెడుగాత భారతమహాధాత్రిన్ గృపాపూర్ణతన్.

* * * *

శ్రీ నాళీకమనోజ్ఞ నేత్రుఁడు, లసల్లక్ష్మీసింధు కన్యా హృద
బ్జా నందోజ్జ్వల షట్పదప్రభుడు భక్తావాసలీలా మనో
జ్ఞా నూన ప్రభుతా విశేషుఁడు, కృపాయత్తుండు శ్రీ వేంకమాం
బా నారాయణ సుబ్బరాయకవి సమ్యక్తుష్టిమైఁ బ్రోచుతన్.

యోగానంద నృసింహ యోగివరు నత్యుత్సాహియై చేరి, యా
యోగీశున్ గురుగా వరించి, మహనీయోద్యోగియై నారసింహ
శ్రీ గోపాల విచిత్ర తత్త్వ మెద భాసింపంగ సాధించె నే
రా గాజుల్వెల్యము సుబ్బరాయ సుకవిన్, రక్షించుగా కద్దియున్.

తనదగు వృత్తిమాని నిరతంబును సద్గురుసేవనంబు, స
జ్జన ఘన సాధు సంగతియు, సర్వసుభక్త కథానులాపముల్
తన ఘనవృత్తులై మెలఁగు తజ్జ్ఞున కీకృతికర్త కిచ్చుతన్
దనియగ నెల్ల సంపద లుదారత లచ్చి జగమ్ము మెచ్చగన్.

హిందూ కళాశాల
గుంటూరు
22—6—67

'సాహిత్యాచార్య', 'కవిభూషణ'
వావిలాల సోమయాజులు
ఆంధ్రభాషాపండితుఁడు

---

## ఆకాంక్ష

ఖ్యాతిగైకొనిన యోగానంద నరసింహ
స్వామి శుశ్రూషలో సకల మెరిగి
ఆధ్యాత్మ వేత్తగా నలర దీక్ష వహించి
అష్టాక్షరీమంత్ర మభ్యసించి
ప్రహ్లాద చరితపై రక్తి మిక్కిలిగాక
భాగవతారుగా వాసిగాంచి
జ్ఞాన వైరాగ్య విజ్ఞాన బోధలనంది
తనివార పుణ్యతీర్థముల కేగి
మనసు నిండుగ నారసింహుని స్మరించి
ఘనత నార్జించు నీ గ్రంథమును రచించు
గ్రంథకర్తయు, నీ దివ్యరచన నీడ
లక్ష్య చరితగ నాల్గుకాలములు బ్రతుకు.

మారీసుపేట, తెనాలి
14—7—67

రంగకవి
(నాగు ప్రచురణలు)

ఓమ్ నమోభగవతే శ్రీ లక్ష్మీనృసింహాయనమః

# శ్రీ యోగానంద నరసింహ మహర్షి జీవిత చరిత్ర

## ప్రథమ ఖండము

### జననము

శ్రీమంతమును లక్ష్మీదేవి నిలయమును నగు కమల మడుసు నుండి వెలువడుచున్నను దానిచే నణుమాత్రమైన మాలిన్యము నొందక తనశిరమును జలముల పైకెత్తి వినిర్మల వాతావరణమున దేలియాడుచు తనదివ్యసౌరభ సౌందర్యములను నల్దిక్కుల వెలార్చు చుండును. రాజ హంస జలసమ్మిశ్రితమగు పాలనుండి జలమును వేఱుపరచి పాలను గ్రోలును. ఇట్లే మహనీయులు సంసారమున మెలగుచుండియు సంసార పంక నిమగ్నులుగాక నిర్లిప్తులై బ్రహ్మానందమును గ్రోలుచు పరమ హంసలై వెలయుచుందురు. మానససరోవరములీల ప్రశాంతము గంభీ రము మందాకినీ తోయములవలె వినిర్మలము పావనము, హిమా లయమువలె సుస్థిరము మహోన్నతము, అటులయ్యును విశ్వజన మహోపకారకమునగు శీలమున దీపించు వీరలే సర్వజన సన్మార్గదర్శకులు, విశ్వకల్యాణ హేతుభూతులు. ఇట్టి మహనీయులలో నుత్తమోత్తమ గణ్యులగు శ్రీ యోగానంద నరసింహమూర్తి చరిత్ర మన కెంతయు పఠనీయము, స్మరణీయము, మననీయమునుగదా ?

క్రీస్తుశకము పందొమ్మిదవ శతాబ్దమున హిందూదేశమున కర్నూలుజిల్లా యందు మారికాపురము తాలూకాకు చెందిన "తోక పల్లి" యను గ్రామమున మహారాజ వంశమున కొండెబోయిన గురు మూర్తియను సత్పురుషుడు లక్ష్మాంబ యను సతీమణితో కాపురము సేయుచుండెను. ఈ వంశీయులు వైష్ణవభక్తిపరులు. ఈ వంశీయులందరు

నాగేంద్రుని కులదైవముగా భావించి పూజలు సేయుచుందురు. ఈ పుణ్యదంపతులు ఋజుమార్గ వర్తనులై పవిత్ర ధర్మజీవనమునకు పేరు గాంచి యుండిరి.

కటికి పేదతికముతో సంసారమున మెలంగుచు సదా భగవంతుని ప్రార్థించుచుందురు. ఎన్ని యాటంకములు సంభవించినను నీ దంపతు లిర్వురు ధర్మజీవనము చేయుచు హరిసేవాపరాయణులై శక్తికొలది యతిథుల నాదరింపుచు కష్టసుఖములను సమముగా జూచుచు "కలిమి లేములు కావడికుండ"లను నార్యోక్తి పాటింపుచు నోర్పుతో నేర్పుతో కాలమును గడుపుచుండిరి.

ఈ దంపతులకు సంతానము లేదయ్యెను. సంతానము లేదను సంతాపముతో సతిపతు లిర్వురు నిశ్చలమైన మనస్సుతో రాత్రింబవళ్ళు ఇష్టదైవమగు నాగేంద్రుని ప్రార్థింపుచు భక్తితో నాగేంద్రుని పుట్టకు ప్రదక్షిణములు చేయసాగిరి. వీరి నిర్మల భక్తికి నాగేంద్రుడు పరమానందము చెంది వారికి సాక్షాత్కరింప, "ఆహా! మానోములు పండె" నని నాగేంద్రునకు నమస్సులర్పించిరి. నాగేంద్రుడు వారిపై కరుణ బూని 'సుపుత్రప్రాప్తిరస్తు'ని దీవించి యంతర్థాన మొందెను.

వారి జన్మలు సార్థకత చెందినవి. తదుపరి కొంతకాలమున కా దంపతులకు హరిభక్తి మెండాయెను. నిరంతరము శ్రీమన్నారాయణుని ప్రార్థించుచు హరిసేవలు జేయుచు నమందానంద కందళిత హృదయారవిందులై యెడతెగక హరినామము చేయదొడంగిరి. వీరి జీవితములు తరించుసమయ మాసన్నమైనది. వీరిపై శ్రీహరి దయాకిరణములు ప్రసరించినవి. గురుమూర్తి లక్ష్మాంబదంపతులకు జన్మాంతర మహాభాగ్యవశమున విష్ణ్వంశతో శ్రీ యోగానంద నరసింహస్వామి వారు 1886 వ సంవత్సరమునకు సరియగు, వ్యయనామసంవత్సర మాఘ శు ౧౧ ఏకాదశి గురువారము పగలు గం. 11 ల 11 నిమిషములకు సింహలగ్నమందు నవతరించిరి.

సూర్యోదయమైనంతనే నలుదిక్కుల నావరించిన చీకటి నశించు రీతి నా బాలభాను డవతరించిన మరుక్షణమే వారివంశమే పవిత్రమైనది. వారి కుటుంబములో గల యీతిబాధలను చీకట్లు సమసిపోయినవి. ఆ పుణ్యదంపతుల మనసానందాబ్ధిలో నోలలాడినది. ఇరుగు పొరుగు ముత్తైదువులందరు లక్ష్మాంబ ప్రసవించినదను శుభవార్తవిని యాశా జ్యోతులు వెలుంగ పరుగుపరుగున గురుమూర్తి గృహమున ప్రవేశించిరి. కోటిసూర్యుల కాంతితో వెలింగెడి యా బాలుని ముఖబింబము దర్శించి సంభ్రమాశ్చర్యచకితులైరి. లౌకికపు బాలురవలె గాక శిశు రూపములో నున్న యా మహాజ్ఞానిదృష్టి యూర్ధ్వమునకు ప్రసరించు చుండెను. ఈ దృశ్యమును వీక్షించెడి మాతాపితరులు, గ్రామపౌరు లేమియు దోచక యమోమయస్థితితో చేష్టలుడిగిన బొమ్మలవలె బాలు నొకేదృష్టితో చూడసాగిరి.

అంత నా పరమభాగవతోత్తముడు మాతాపితరులను తేరిపార చూడ, "ఆహా! మనము ధన్యాత్ములము మన చూపు చూచుచున్నా డ"ని సంతోషమును పొందిరి. పౌరులెల్ల బాలుని ప్రజ్ఞావిశేషమును మెచ్చుకొనుచు "ఆహా! గురుమూర్తి లక్ష్మాంబయు గతజన్మలో నెంతటి పుణ్యమొనరించిరో! ఇట్టి మహనీయమూర్తి యవతరించిరి. 'పూవు పుట్టినతోడనే తావిగొలుపు' నన్న సామెత యీ బాలునివలన సార్థకత నందినది." ఆ పుణ్యదంపతులను వేనోళ్ళ పొగడుచు పౌరులెల్ల స్వగృహంబులకు జనిరి. పూర్వపుణ్య సంస్కారమున నవతరించిన యా బాలుని బ్రహ్మభావన యంతర్ముఖదృష్టి భావిజీవితమున జీవబ్రహ్మైక్య సిద్ధిపొందగలరను భావనకు నిదర్శనముగా నవతరించిన మరుక్షణమే గోచరింపజేసిరి. ఇట్టి బ్రహ్మభావనను సామాన్య మానవులగుటచే తెలిసికొనుశక్తి లేక యాశ్చర్యమానసులైరి.

లోకరక్షణార్థ మవతరించిన మహాపురుషుడు నా డుదయించిన బాలభానుడు, సనాతనధర్మమహాసాగరము నుప్పొంగ చేయుటకై,

వేదాంతరహస్యములను దేశమంతట వ్యాపింపచేయుటకై, విష్ణ్వాంశతో నవతరించిన సిద్ధపురుషులు వీ రని యెరుగకయే యా పురజనులందరు నమందానందసాగరమున తేలియాడిరి. ఆబాలభానుని పాదములయందు చక్రములవలె ముద్రలున్నవి. హస్తములయందు పద్మరేఖలు ప్రకాశించు చున్నవి. ఫాలభాగమున తిరుమణి విష్ణురేఖలు వెలుగొందుచున్నవి. ఆ బాలుడు దినదిన ప్రవర్ధమానుడై పెరుగుచుండెను.

ఆ బాలునిలో పుంజీభవించినమహత్తర దైవశక్తిచేత నూయల తొట్టిలో పరుండినపు డొకనాటి వేకువజామున "ఓం" యను ప్రణవ ధ్వని వినవచ్చినది. మాతృదేవి యీ ధ్వని విని యింటిలో నలువైపుల బరిశీలించి యెచ్చట యేమియు దోపక నటునిటు తొట్రుపాటుతో దిక్కులు చూచుచున్నంత నా ప్రణవ మూయల తొట్టిలో ధ్వనించు చుండెను. ఊయెలలో బ్రహ్మానందమును పొందెడి బాలుని చూడ కన్నులు మూసికొని చక్కగా పరుండి తదేకనిష్ఠతో బాహ్యప్రపంచ మునే మరచి ప్రణవస్వరూపమగు నోంకారమును గానము చేయు చుండెను. సముద్రగర్భములో జన్మించిన రత్నమువలె నా పల్లెటూరి వాతావరణమున ప్రకాశ మొందుచుండెను. ఆ బాలుని "సుబ్బా రాయు" డని పిలువదొడంగిరి. ఇట్టి పవిత్రమూర్తిని కన్నతల్లిదండ్రులను పుణ్యమూర్తులని వేరుగా బ్రశంసింపబనిలేదు. లక్ష్మాంబకు జన్మించిన బాలు రందరికన్న చిన్నవాడగు నాగయ్య పెరిగి పెద్దవాడగుచుండెను.

విష్ణ్వాంశతో నవతరించిన యా యన్నగారియందీ ముద్దుల నాగయ్యకు మిక్కుటమగు ప్రేమయుండెడిది. తల్లి బెట్టిన తాయము లన్నియు భద్రముగా దాచి యన్నగారికే సమర్పణ జేసెడివాడు. అత్యంత భక్తితో సమర్పించిన యా తాయములన్నియు సర్వభూత దయగల యా కరుణారసమూర్తి తోడిబాలురకు పంచిపెట్టెడివాడు. ఆ కరుణారసమూర్తిని ముద్దుపేర్లతో రకరకములుగా పిలిచెడివారు. ఎవరే పేరుతో పిలిచినను నన్నేయనుకొని చిందులు త్రొక్కుచుండును.

అన్ని నామములు నాయనకే చెందినవి. పిలిచిన వెంటనే వారలకు శాంతముగా ప్రసన్నవదనముతో వినయవిధేయతలతో సమరస భావముతో సమాధాన మిచ్చుచుండును. ఈ విధముగా బాల్యజీవిత తోకపల్లిలో కొంత కాలము గడచినది. [illegible]

ఈ పసితనమున గోవు లన్నను లేగదూడ లన్నను నత్యంత ప్రేమతో నాదరించెడివాడు. గోమాతలను ముద్దిడుకొనుచు శరీరమును మరచి తన్మయత చెందెడివాడు. వీధి పాఠశాలకు పంపించిరి కాని ప్రయోజనము లేకపోయెను. వీధిపాఠశాలలో చేరి తోటి బాలురతో కలియక యొక్కడే యేకాంతముగా కూర్చొని మౌనభావముతో నాకాశమువంక చూచెడివాడు. ఉపాధ్యాయులు బాలుని భావనచూచి మనతత్త్వములో లేడు. ఆతని బుద్ధి యెటులో యటులే ప్రవర్తించును గాని మనభావముల ననుసరింపడు. ఇట్టి వానికి విద్యాభ్యాసము చేయుటెట్లని గురువు లనుకొనిరి! బ్రహ్మవిద్యాభ్యాస మొనర్చి యోగదీక్షలో నుండవలసిన యీ బాలభక్తశిఖామణి నికిమాలిన పొట్టకూటి పొల్లువిద్య తన కక్కరలేదేమొ! తల్లిదండ్రులు సైతము కుమారుని మనోభావము తెలిసికొనలేదు. కన్నకొమరు నత్యంత గారాబముతో పెంచుచుండిరి.

తోడిబాలు రందరు గోవులను తోలుకొని సమీపారణ్యమునకు వెళ్ళుచుండగా బాలభక్తుడగు నీ సుబ్బారాయుడు వారి వెనువెంట నరణ్యమునకు వెళ్ళి, వారితో నాటలాడుకొనుచుండును. తోడిబాలురగు వెంగన్న, పెదకాశిరెడ్డి, తిరిపేట వీరయ్య మొదలగు వారందరు నీ బాలుని మనోతత్వమున కచ్చెరువొందుచు పొగడు చుండెడివారు. బాల్యజీవితము కొంత కాలము జన్మభూమియగు తోకపల్లిలో గడచినది.

## జన్మభూమి వీడుట

తోకపల్లి వీడి మార్కాపురము చేరి బాయమ్మ యను భక్తురాలి గృహమున బ్రవేశించి "అమ్మా! మీ యింట నుండెదను! నీ

పని చేయుమనిన నాపనిని శ్రద్ధతో చేసెద"నని చెప్పగా బాయమ్మ పసివానివాక్యముల కెంతయో సంతసమంది బాలుని భావము గుర్తించి "ఏయూరు ఎచ్చటనుండి యిచ్చట కరుదెంచితి"వని ప్రశ్నింపకయే తనయింటిలోని మేకలను కాయుటకై యీ బాలుడు సరిపోవునని యెంచి "సరే! నాయనా! నీయిచ్చవచ్చినరీతి మెలగు"మని చెప్పెను. బాలుడు సంతోషించి "అమ్మా? ఏమిపని చేయవలయునో వెంటనే సెలవీయు"డని యడుగ బాయమ్మ బాలుని నమ్రతకు అచ్చెరువొంది ప్రియమార నతనికి భోజనమిడి పెరుగుతో కలిపిన యన్నము చద్ది గట్టి యా మూటను బాలునకిచ్చి "జాగ్రత నాయనా" యనిచెప్పి బాలుని సాగనంపెను.

బాయమ్మగారి మేకలను దోలుకొని యెవ్వరితో కలియక యొంటరిగా కొండమార్గమున నడువసాగెను. ఆ యడవి మార్గమున నెవ్వరో బాటసారులు మార్గాయాసమున నలసిసొలసి యీ బాలభక్తున కెదురై కన్నీరుగార్చుచుండిరి. వారినిచూచి యోర్వలేక యెందులకట్లు దుఃఖించెదరని యడుగ బాటసారులు తడబడు మాటలతో "నాయనా! ఆకలిబాధతో నలమటించి పోవుచున్నా"మనిరి.

ఈ కరుణార్ద్రహృదయుడు జాలితో నన్నిబాధలకన్న నాకలి బాధ మిన్నయని వీపుపైనున్న పెరుగన్నము విప్పి వారియెదుట నుంచి "తినండి బాబూ! నేను ఇంతకుముందే మాతల్లి పెట్టిన యన్నమును తృప్తిగా తిని మేకలను దోలుకొని ప్రయాణమైతిని. సర్వప్రాణులు ఒకటే! మీరు తృప్తిగా భోజనము చేయుడి" యను నా బాలుని దయారస వాక్యముల కెంతయో సంతసమంది యా చద్దిమూటలోనున్న పెరుగన్నమును బాటసారులందరు తృప్తిగా భుజించిరి. అది యేమి శక్తియోగాని యొక బాలునికి కట్టిన పెరుగన్నము బాటసారు లందరు తినినను చద్దియే మిగిలినది. పూర్వపుణ్యముతో నవతరించిన యీ

భక్తశిఖామణి శేషించిన పెరుగన్నమును బాటసారులందరకు నిది సాదముగాదు! ప్రసాదమని పంచియిచ్చెను.

ఈనాడు యింత ప్రేమతో బాటసారులకు బంచిపెట్టిన యీ పెరుగన్నమునే భావిజీవితములో తిరునల్లూరి వీరరాఘవస్వామి యీ మహాభక్తునకు, చేతులార తినిపించెననుట కవకాశ మేర్పడినది. అట్టి కారణము చేతనే "చేసిన ధర్మము చెడని పదార్థము చేరును మనవెంటని" పెద్దలనెదరు. బాటసారులానందము పట్టజాలక ముద్దులొలుకు నవమోహనాకారుని కౌగిటజేర్చి యెత్తి ముద్దాడి "నాయనా! ఏ తల్లి గన్నదో! నీవు చిరంజీవివై వర్థిల్ల నా భగవంతుడు చల్లగా కాపాడవలయు"నని దీవించి బాలుని మాటిమాటికి తిరిగిచూచుచు బాటసారులు వెళ్లిపోయిరి.

సాయంత్ర సమయమునకు మేకలను దోలుకొని యజమానురాలగు బాయమ్మగారి గృహాంగణము చేరెను. ఆ రోజు మేకలన్నియు నెమరులు వేయుచు హాయిగా ప్రశాంతముగా నున్నవి. బాయమ్మ "ఆహా! యిది యేమి యాశ్చర్యము! ఇట్టి యానందము నా మేకలెన్నడును పొందలేదు. ఈ రోజే యింత ప్రశాంతముగా నున్నవి. ఇదంతయు నీ బాలుని చలువయే" యని బాలుని చేతులలో జేర్చుకొని శరీరమును నిమురుచు నెంతో యానందము చెంది "నాయనా! సుబ్బారాయుడు! నీ వెంతో పుణ్యమూర్తివి. నీ వేమి, కోరుకొనెదవో యా కోర్కె లన్నిటిని నెరవేర్చెదను. మా గృహమందే యుండు" మని కోరెను.

బాలుడు "అమ్మా! నీ యింట నుండుటకు వెళ్ళుటకు నా దేమున్నది తల్లీ! అంతయు శ్రీహరి చిత్తము మన మందర మా జగన్నాటక సూత్రధారియగు శ్రీమన్నారాయణుని చేతిలో కీలుబొమ్మలమేకదా? సర్వస్వతంత్రుడు శ్రీహరియే సర్వనియంతయు శ్రీహరియే, సర్వభూతములయందును సాక్షిస్వరూపుడై స్వయంజ్యోతియై వెలింగెడి

పరమాత్మయు శ్రీహరియే. ఈ విషయమున నణుమాత్రమైన సందేహము వలదు. మనము నిమిత్తమాత్రులము. కర్తవ్యమును గుర్తించి మెలంగుట మనవంతు భక్తులను కాపాడుట తనవం"తని చెప్పెను. వినుచున్న బాయమ్మ యానందాశ్రువులు రాల్చుచు నాశ్చర్యము చెంది "ఆహా! పది పదాఱేడుల బాలు డేమి! ఇట్టి మహోపదేశము లుపదేశించు టేమి? ఇతడు సామాన్య బాలుడు మాత్రము కాదు. జన్మాంతర మహాపుణ్యఫలమున నవతరించి ఇచ్చటి కరుదెంచిన లోకోద్ధారకుడే యని నిశ్చయించుకొని, యా బాల భక్తునకు సాష్టాంగనమస్కృతు లొనర్చెను.

"తండ్రీ! అజ్ఞానముతో సుజ్ఞాని నెరుగక సామాన్యునిగా భావించి నా యింట సేవకుగా నియమించితిని ఎంతటి యపచార మొనర్చితి. మొదటి రోజే తమ శక్తిని తెలిసికొంటిని. నే నెంతయు ధన్యురాలను. నీవు నా పాలిటి నారాయణుడవే కాని యన్యుడవు కావ"ని బాయమ్మ జోహారు లర్పించెను. ఆ దివ్యబాలుడు "తల్లీ! ఎందుల కీ విధముగ వ్యసనపడెదవు. నీ విశ్వాసమే నిన్ను రక్షించును. భయము వలద"ని చెప్పెను. ఆమె "నాయనా! నా హృదయక్షేత్రమున జ్ఞానబీజము నాటితివి. మీరే నాకు, గురువు లని దలంచెద" ననుచు నెంతో పశ్చాత్తాపమును పొంది మనఃపూర్వకముగా, ప్రార్థించెను. బాయమ్మ యచంచలమైన దివ్యభక్తి కా బాలభక్తుడు మనస్సున మెచ్చుకొని యామె దుఃఖమునకు నొచ్చుకొని సంతోషవాక్యములతో నామె మనస్సు నానందింపజేసి చిత్తశాంతిని ప్రసాదించెను.

లోకోపకారమునకై యవతరించిన యా పుణ్యమూర్తి యొకే స్థలమున నుండగలరా? కొన్ని రోజులు మాత్రమే బాయమ్మగారింట నుండిరి. ఒకరోజు వేకువజామున లేచి కాలకృత్యములు నెరవేర్చి మాతృప్రేమగల మహాసాధ్వితో "తల్లీ! సెలవు! వెళ్ళివచ్చెద"నని చెప్పిరి. బాయమ్మ కన్నీరు గార్చుచు గద్గదకంఠముతో, "నాయనా!

ఎచ్చటకు వెళ్ళెద"వని దీనముగా అడిగినది. "తల్లీ ఎందులకు పరితపించెదవు ? ఎచ్చటనుండి వచ్చితినో యచ్చోటునకే వెళ్ళెదను, ప్రాణులెల్ల సంయోగ వియోగములు పొందవలసినదే కదా! బ్రహ్మానంద సాగరము చేరువరకు నీ జీవులందరు నిహలోక పరలోక ప్రయాణములు సాగించవలసినదే ! ఈ వాక్యములన్నియు నేకాగ్రచిత్తముతో వినుచున్న బాయమ్మ, యానందాశ్చర్యములు పొందెను.

సుబ్బారాయుని గుణసంపద కాలక్రమమున సువ్యక్తము కాసాగెను. ఆతని ధైర్యమును గూర్చి చెప్పవలయును. ఎట్టి భయంకర స్థలములకైనను నిర్భయముగ వెళ్ళుచుండును. దయ్యాలు తిరుగాడు తావులని యితరులు వెళ్ళుటకు భయపడుచోటుల కాతడు నిర్భయముగా తిరుగుచుండును ఈ బాలుని వాక్యములు వినిన పండితపామరులు ముగ్ధులగుచుండెడివారు. తోడిబాలురాతని యెడబాటున కోర్వజాలకుండెడివారు. ఒక్కసారి కాంచినవారు సైతము పండ్లు మిఠాయిలను గైకొని మరల మరల నాతని జూడవచ్చుచుందురు. సహజలబ్ధమైన యాకర్షణశక్తియే కాలక్రమమున ముముక్షు జనసహస్రముల నాతని సన్నిధికి గొనివచ్చి మహాభావమై ప్రకాశించెను. లోకకల్యాణార్థ మావిర్భవించు మహనీయుల చరిత్రలు బాల్యమునుండియు నిట్టి యద్భుత ధీవిభవాదులతో విరాజిల్లు చుండుట పురాణేతిహాస ప్రసిద్ధము. సుబ్బారాయుడు పసితనమునందే సర్వభూతదయగల సాధుమూర్తి. ఏ పాఠశాలయు నాయనను దనయం దిముడ్చుకొనజాలకపోవుట యబ్బురము కానేరదు. ఈ రీతిని బాల్యమున నే చదువులు చదువకయే చదువులలో, మర్మములను గ్రహించి పవిత్ర మనోవాక్కర్మములచే జీవితమును జ్వాజ్వల్యమాన మొనర్చు నిట్టి మహనీయులకంటె లోకమున ధర్మోపదేశకు లెవ్వరు ? ధర్మమార్గప్రదీపకు లెవ్వరు ? ఏ చదువులు చదువకయే వేదాంతమును గ్రహించిన నీ లోకోత్తర పురుషుని చరిత్ర మిక్కిలి యానందసంధాయకము.

మాతృమూర్తివలె చూచెడి బాయమ్మగారిని వదలి వెళ్లుటకు నాతనికి మనస్సొప్పక కొన్ని రోజు లచ్చటనే కాలముగడిపెను. ఒక రోజున తనలో తా నిట్లూహించెను. "నే నొకచోటనుండు వాడను కాదు. ఈ చోటు వీడవలయునను సంకల్పము కలుగుచున్నది. బాయమ్మ గారితో చెప్పుదమనిన నా వియోగము నామె భరింపజాలక నన్ను వెళ్ళనివ్వ"దని నిశ్చయించుకొని యొకనాటి యర్ధరాత్రమున లేచి బాయమ్మను దర్శింప నాయమ్మ ప్రగాఢనిద్రయందు మునింగియుండెను. ఇదియే సమయమని యెఱింగి బాయమ్మకు నమస్సు లర్పించి యా రాత్రియే నచ్చోటు వదలి వెళ్ళెను.

మరునా డుదయమున లేచి బాయమ్మ "నాయనా! సుబ్బా రాయా!" యని పిలువ నిశ్శబ్దముగా నుండెను. గృహమంతయు వెదకి బాలుని గానక "ఎట్లు వచ్చెనో యట్లే వెళ్ళిపోయితివిగదా! అంతయు దైవలీలగా నున్నది. మెఱపుకాంతివలె కన్నులకు సాక్షాత్కరించి వైరాగ్యప్రబోధ మొనర్చి యదృశ్యుడైనాడు! ఆహా! అట్టి పుణ్య మూర్తి నెన్నడు దర్శించెదను! ఎప్పుడు సంభాషించెద"నని కొంత తడవు చింతించి యబ్బాలభక్తశిఖామణి ప్రబోధించిన వేదాంత వాక్యములను స్మరించి మనస్సును శాంతింపచేసికొనియెను.

## భాగవతుల సంఘమున చేరుట

బాయమ్మగారి గృహము వదలిన సుబ్బారాయుడు కొన్ని రోజులకు వీధి భాగవతపు సంఘమును కలిసికొనెను. ఆతనితత్వ మెరుగకయే యా భాగవతు లీ పరమభాగవతోత్తముని దర్శించినంతనే వారి మనస్సులు వీనియందు లగ్నమైనవి. "నాయనా! నీవు మా సంఘములో చేరి వేషములు వేతువా!"యని యడుగ, నాతడు వారితో "వేషముల నెన్నియైనను వేసెదను. వేషము లన్నిటిని నేనే యాడించెదను. ఇదియే నా యుద్యోగమ"ని చెప్పెను! "తండ్రీ! మా సమాజమున నెంతకాలముందురు తెలుపు"డని కోరగా– "నెంత కాల ముండెదనో!

ఏ సమయమున వెళ్లెదనో! ఏ స్థలమునకు చేరుదునో! ఆ ఈశ్వరునకే యెఱుక ? మనకేమి దెలియును. తోలు బొమ్మలమ"ని సమాధానము చెప్పిన నా భాగవతులు విని పరమాశ్చర్యమును పొందిరి. "ఓ మహాను భావ! జోహారు దేవ! తమ మృదుమధుర వాక్యములను వింటిమి. మీ శక్తి కంటిమి. బహువింతగా వేదాంతము నుస్మిలన మొనర్చితిరి. తమ కే వేషములు వేయనవసరము లేదు. అన్ని వేషములను తమరై యాడించుడు. ఇదియే తమరు చేయవలసినది". భాగవతుల మాటలు విని సంతోషించి "అట్లే! మీ యిచ్ఛకు నచ్చిన చొప్పున మెలంగెద" ననియెను.

ఈ విధమున నాటకము లాడుచు కొంత కాలమునకు దక్షిణ దేశమునకు చేరిరి. నాటకములాడు సమయములలో వేషములకు ముందుగనే రంగస్థలమున బ్రవేశించి చక్కని చిక్కని వాక్యములతో పసందైన హాస్యపూర్వక నటనలతో ప్రేక్షకులను కడుపు లుబ్బ నవ్వించుచుండెడివాడు! ఈతడు లేనిదే నాటకము రక్తికట్టనట్లు భాగ వతులు గుర్తించి, యీతడు సామాన్యుడుగాడు. ఈతడు మనలో నున్నందుననే నిన్ని నాటకములు రక్తిగా నాడగలిగితిమని తలచి యీ బాలభక్తుని యఖండగౌరవముతో నెంతయో యాదరణ జూపుచు నిలవేల్పువలె నారాధించుచుండిరి. ఆతనినోటినుండి వెలువడు వాక్యములు భావగంభీరములై వినువారిని ముగ్ధుల నొనర్చుచుండెను. రోజులు గడచుచుండినవి. భాగవతుల సంఘము వారికి రాబడి బెరిగినది.

ఒకరోజున ఆతనితో సంఘమువారు "తండ్రీ! మాకు వచ్చు నాదాయమున తమకు భాగమేర్పరచినార"మని విన్నవించగా నా భక్త శిఖామణి వారి వాక్యములెల్ల నాలించి వికటముగా నవ్వుచు "మీరు నిజముగా భాగవతులైన నన్నిట్లు దలంపరు! మీ యాదాయమున నాకు భాగమా? ఎంత వెఱ్ఱి? ఈ చరాచరజగత్తుననే నాకు భాగ మున్నది. మీయందుండెదను. మీరు భాగము నిర్ణయించకపోయినను

నా భాగ్యము నేను తీసికొనుచుండెదను". ఈ మహాత్ముని వాక్యములకు తగు సమాధానము చెప్పుటకు తెలియక భాగవతులు "దాసోహ" మ్మనిరి. "నాయనలారా! మీరు నాకిచ్చు భాగము దాసోహ మ్మొకటియే! దీనినిదప్ప నేను దేనిని కోరువాడను గాను.మీ రొసగి నను స్వీకరించువాడను గా"నని భాగవతులకు ప్రబోధముచేసెను. భాగవతులు వీరిద్వైవభావన సమదృష్టి త్యాగశీలతకు అబ్బురపడిరి.

## శ్రీ వైష్ణవాచార్యుల యొద్ద చేరుట

భాగవతులొక గ్రామమున నొకనాటిరాత్రి "శ్రీ కృష్ణలీల" లను నాటకమును ప్రదర్శించుచుండిరి. ఆనాటకమును చూచుటకు నలుదిశల నుండి ప్రజలు తండోపతండముగా వచ్చిరి. నాటకమును బ్రదర్శించెడి యా గ్రామమున వైష్ణవ సంప్రదాయమునకు చెందిన మహాపండితుడు గలడు. ఆ పండితశ్రేష్ఠుడా నాటకమును వీక్షించుటకై వేంచేసి యొక యున్నతాసనమున నాశీనుడై ప్రశాంతుడై నాటకమును వీక్షించు చుండెను. నాటకము పూర్తియగు వరకా వైష్ణవమూర్తి చూచుచునే యుండెను. ఆ నాటకమును నవరస భరితముగ నూతన భంగిమలతో రక్తికట్టించిన మహామేధావియగు సుబ్బారాయుని పాత్రపోషణ, కార్య నిర్వాహణ, మద్భుతధారణాశక్తి, యేవంవిధానేక సద్గుణములను తదేక దృష్టి వీక్షించిన శ్రీ వైష్ణవాచార్యు లాశ్చర్యామితానందము లిరుబురి గొన నాటకపరిసమాప్తి నొందిన వెంటనేలేచి కళాపోషకులగు సుబ్బా రాయుని గాఢాలింగన మొనర్చుకొని "నాయనా! నీకు మహాదశ రానున్నది. జన్మాంతర సంస్కారమున నవతరించిన మహానుభావు డవుగాని సామాన్యుడవుకా"వని పొగడుచు తన దివ్యభవనమునకు తీసికొనివెళ్ళెను.

భాగవతులు "ఆహా! మనకూర్మి చెలికాని సుబ్బారాయు నీ గ్రామవాసులగు శ్రీ వైష్ణవాచార్యులవారు తీసికొని వెళ్ళిరి. మన సంఘమునందు మరల చేరునో లేక యీ పరమ భక్తాగ్రేసరు డే స్థల

మున కేగునో" యని వారిపై నాశణమే యాశపీడిరి. భాగవతు లందరి మనస్సు లామూర్తిపై నాటినందున వారి వియోగమునకు చాల ఖేద పడిరి. రమ్మనిన వచ్చువారుకాదు పొమ్మనిన పోవువారునుకాదు. అది వారి యిష్టమేయని గ్రహించిన యీ భాగవతులు వైష్ణవాచార్యులతో కలసివెళ్ళెడి యీ బాలభక్తునితో మారుమాటాడక మిన్నకుండిరి.

శ్రీ వైష్ణవాచార్యులతో వెళ్ళిన నా బాలభక్తునిపై నాచార్యోత్తములు గాఢబద్ధానురాగులై వసతులన్నియు చక్కగా నేర్పరచి కన్నతండ్రివలె నాదరించుచుండిరి. ప్రేమానురాగులై వీక్షించెడి వైష్ణవాచార్యులను గురుభావముతో పూజించుచు తలలో నాల్కవలె వారిమనస్సునకు తగినరీతిగా మెలగుచుండెను. అనుదినము వైష్ణవ స్వామి యీ యూరి రచ్చల చేరుచుండెడి గ్రామపౌరులకు నే భాగవతము నుండియో రామాయణాది పవిత్ర గ్రంథముల నుండియో భక్తి రస భరితమై వీనులకు విందొనగూర్చెడి ఘట్టములను శ్రావ్యముగా బఠించి, యందలి భావముల, నరటిపండొలిచినరీతి విప్పిచెప్పెడివారు. పురాణపఠన మొనర్చు సమయములయందు వారిసేవలొనర్చెడి సుబ్బారాయుడను బాలభక్తాగ్రేసరమూర్తి యాచార్యుల పాదముల యొద్దనే పద్మాసనాసీనుడై నిష్ఠతో శ్రద్ధాభక్తులు గలిగి మనస్సును పురాణము నందే నిలిపి ప్రశాంతుడై వినుచుండెడివాడు.

పురాణము వినుచున్న యీ బాలుని హృదయము భక్తిరస ఘట్టముల యందానందము చెంది కన్నులనుండి యశ్రుధారలు ప్రవహించు చుండెడివి. శరీరము గగుర్పాటు చెందుచుండెడిది. బాలభక్తాగ్రేసరుడగు సుబ్బారాయుడు షోడశప్రాయుడై విరాజిల్లు చుండెను. వైష్ణవాచార్యుని గృహమున నిత్యనైవేద్య దీపారాధన దేవతార్చన కార్యక్రమము లన్నియు యథావిధిగా జరుగుచునే యుండెను. ఆచార్యులు దైవము నారాధించుచు మంత్రపూతముగ పూజలు గావించు సమయముల సుబ్బారాయుడు తదేక దృష్టితో పూజయందే మనస్సును

నిల్పి భగవదనుభూతిచే ప్రపంచమునే మరచి యాత్మానంద మనుభవించు చుండును.

ఇట్టి దృశ్యములనుగాంచిన యాచార్యులు లోలోన సంతసించుచు "ఆహా! అచంచలమైన దైవభక్తి యిటులే ప్రకాశించును. ఎన్ని శాస్త్రములు వల్లించినను, నెంతకాల మిట్లు పురాణము లెన్ని చదువుచున్నను నేమి ప్రయోజనము ? ఆచరణలేని చదువువలన నహంభావము నొందు. నేను బాల్యమాదిగా భజనలు చేయుచున్నాను. దైవముల నారాధించుచున్నాను. సద్గ్రంథపారాయణ మొనర్చుటే కాక గ్రామవాసులకు పురాణశ్రవణమున నానందమును చేకూర్చుచుంటినిగాని యీ బాలభక్తుని మనోనిశ్చలత నాకీనాటికి కుదురలేదు. ఆ పుణ్యపురుషుని పూర్వజన్మ సంస్కారమేకాని మరేమియు కాదు. వీరి భావావేశము సామాన్యభక్తులకు లభించునదికాదు" అని నిశ్చయించుకొనెను.

ఒకరోజున వైష్ణవాచార్యులు భాగవతమున సప్తమస్కంధమునందు ప్రహ్లాదచరిత్రఘట్టమున హిరణ్యకశిపుని ప్రహ్లాదుని సంవాదమున ప్రహ్లాదుడు "తండ్రీ! అందుగల డిందు, లేడని సందేహము లేదు. శ్రీహరి సర్వవ్యాపి నెందువెదకిన నందే సాక్షాత్కరించును. ఇది పరమసత్య"మని చెప్ప దుష్టప్రవృత్తితో సంచరించెడి దానవేశ్వరుడు కోపావేశమున కుమారుని గద్దించి "ఓరీ! బాలకా! నీకు మతిపోయెనా! శ్రీహరి పిపీలికాది బ్రహ్మపర్యంతము నిండి నిభిడీకృతుడై వెలుంగుచున్నాడని నీనోటికి వచ్చినట్లు కారుకూతలు కూసెదవా! మూర్ఖుడా! నీ హరి నీ సభా స్తంభమున జూపింపగలవా ?" యని క్రోధకషాయితాత్ముడై పండ్లు పటపటనూరుచు గదాదండమును ద్రిప్పి యొక్కవ్రేటు స్తంభమున వ్రేసెను. అంత హరి ప్రళయధ్వనులతో మన్నుమిన్ను వెలుంగు దీప్తితో వీరనృసింహస్వరూపమును దాల్చి దానవునిపైకి లంఘించి వొడిసి పట్టుకొని దుష్టుని గర్భము జీల్చి పరమభక్తుడగు ప్రహ్లాదుని

కాపాడి ప్రపంచమున శాంతిజ్యోతి వెలిగించి, ప్రహ్లాదుని రాక్షస సామ్రాజ్యమునకు పట్టభద్రునిగావించి యంత్యమున మోక్షసామ్రాజ్య మొసగి యనుగ్రహించెను. శ్రీహరిలీల లనంతములు అత్యాశ్చర్యము లని పౌరాణికుడు చెప్పెను.

పాదములచెంతనే కాచుకొనియున్న బాలభక్తుడు తదేక ధ్యానమున నదియెల్ల వినెను; ప్రహ్లాదునిచరిత్ర వినిన తక్షణమే యా బాలకుని మనస్సు పూర్తిగా మారినది. పరిపక్వము జెందిన హృదయమగుట నీ భక్తునిహృదయము ద్రవించినది. ముత్యపుచిప్పయందు బడిన చినుకు ముత్యమయ్యెడురీతి నీ భక్తుని హృదయమున భక్తిబీజము నాటబడినది. ఈ మహాభక్తుడు వినిన ప్రహ్లాదచరిత్రభావములనే యాహ్లాదముతో మననముచేయుచు తనలో తా నిట్లూహింపదొడగెను.

"నేను ప్రహ్లాదునివలె నరసింహస్వామిని దర్శించవలెను. ఇదియే నా వాంఛ, ఇదియే నా జీవితాశయము, నా జీవితపరమావధి. ఆ వీర నృసింహమూర్తియే నాకు తల్లియు, తండ్రియు, గురువును, దైవమును సర్వస్వమును నని నిశ్చయించుకొని పరమ కారుణికుడగు వైష్ణవాచార్యులకు సాష్టాంగనమస్కృతు లొనర్చెను. వెంటనే, యాచార్యస్వామి బాలుని హృదయపరివర్తనను గుర్తించి "ఓహో! జన్మాంతర మహా పుణ్యఫలముచే నీ బాలునిమనస్సు మారినది. వీని భవిష్యము మహోజ్జ్వలముగ ప్రకాశించు శుభసమయ మాసన్నమైన" దని తెలిసికొనిరి. గృహమునకు తీసికొనిపోయి పూజామందిరమున జేర్చి పద్మాసనాసీను గావించి బాలునికర్ణమున ప్రణవము నుపదేశించి "నాయనా! నీకీనాడు 'ప్రణవిక' మహామంత్రము నుపదేశము చేసెదను. భక్తితో జపించి భవబంధములను తుదముట్టజేయు" మని యాస్వామి యానతిచ్చిరి.

ఇది పరమపవిత్రమంత్రము. భవబంధలతాలవిత్రము. సంసార తరుచ్ఛేదనయంత్రము. ముక్తి నొసంగెడి మూలమంత్రము మరువక భక్తితో జపింపుము నాయనా! శ్రద్ధగా నాలింపుము తండ్రీ!" యని

నైష్ణవాచార్యులు "హరి నారాయణ గోవింద" యను మంత్రరాజము నుపదేశము చేసిరి. సుబ్బారాయుడాచార్యుల నోటినుండి వెలువడిన యా మహామంత్రము నా క్షణమునుండియే ధ్యానించుచు నిశ్చేష్టుడయ్యెను. ఆ దృశ్యమును గాంచిన యాచార్యోత్తములు పరమాశ్చర్యముతో కూడిన మహదానందమును పొందుచు "విజ్ఞానులైన పెద్దలే ఎన్నో సంవత్సరములు ధ్యాననిష్ఠులై పొందెడి ధ్యానసిద్ధిని, నీ బాలుడు రెప్పపాటు కాలముననే పొందియున్నాడు. ఇది యెంతటి భాగ్యమన వచ్చును! ఇట్టి మహనీయమూర్తి నాకు కోటిజన్మలకైనను సిద్ధింపడు. నా నిమిత్తమే యీ రూపమున వేంచేసి" రని యాచార్యస్వామి ధ్యాననిష్ఠలోనున్న బాలశ్రేష్ఠుని పాదకమలములపై ప్రణమిల్లిరి. ఆ బాలయోగి కొంత తడవు నిశ్చేష్టుడైన పిదప కన్నులువిప్పి తనముందే పరుండియున్న యాచార్యులను జూచి పరిపూర్ణహృదయముతో లేవనెత్తి గాఢాలింగనము చేసికొని, "ఓ! మహాభాగా! తమ యపార కరుణామృతవృష్టిచే నా జన్మ చరితార్థమైనది. పరమ పావనమైన మంత్రము నుపదేశము చేసితిరి. మీరే నా కాచార్యు"లని ముమ్మారు ప్రదక్షిణము చేసి పాదపద్మములను కన్నుల కద్దుకొనెను.

ఆచార్యస్వామి యానందమును పట్టజాలక "ఓ! బాలయోగీంద్రా! శిష్యునకు గురుదేవులం దెట్టి భావన యుండవలయునో యా పాఠమును ప్రపంచమున కాచరణరూపమున ప్రబోధము చేసితి"వని వేనోళ్ళపొగడుచు సంతోషమును పట్టజాలకపోయెను. పిమ్మట నా యాచార్యుడు "ఓ! బాలయోగీంద్రా! గోవిందనామ మహిమను వర్ణింప నా యాదిశేషునకైనను దరమా—

"గోకోటి దానం గ్రహణే ఖగస్య
ప్రయాగ గంగోదక కల్పవాసః
యజ్ఞాయుతం మేరుసువర్ణదానం
గోవిందకీర్తన సమం శతాంశైః" (లఘుభాగవతే)

సూర్య చంద్రగ్రహణ కాలములయందు కోటిగోవులు దానము చేసిన ఫలము, ప్రయాగలో గంగాతీరమున కల్పకాలము వాసము చేసిన ఫలము, మేరుపర్వతమంత బంగారమును దానమిచ్చిన ఫలమును, గోవిందనామామృతమున నూటెంట నొకపాలయిన నుండదు. మానవుడీ సమస్త పుణ్యకర్మముల ఫలమువలన స్వర్గమునకుబోయి యక్కడ సుఖ మనుభవించి పుణ్యక్షయమై నంతట నీ భూమిమీద బుట్టి సుఖ దుఃఖముల ననుభవింపవలసి యుండును. గోవిందనామామృత పానమున దివ్యప్రేమను బడసి శ్రీ భగవానునితో నియతముగ నివసించి పరమానందసాగరమున శాశ్వతముగా నోలలాడుచుండును.

"బ్రహ్మాండ శతదానస్య యత్ఫలమ్ సముదాహృతమ్
తత్ఫలమ్ లభ్యతే రాజన్ కృతే గోవిందకీర్తనే" (ఆదిత్య పురాణె)

[భూలోకము భువర్లోకము సువర్లోకము మహర్లోకము జన తప స్సత్యలోకములు — అతల వితల సుతల తలాతల మహాతల రసాతల పాతాళములను చతుర్దశ భువనాత్మక బ్రహ్మాండములు నూరుమార్లు దానములు జేసిన నెంత ఫలము గలుగునో యా ఫలమును భక్తుడు గోవిందనామకీర్తనమువలన బొందగలడు]

"తదేవ పుణ్యం పరమం పవిత్రం
గోవింద గేయే గమనాయపత్రమ్
తదైవ లోకే సుకృతైక సత్రం
యదుచ్యతే కేశవ నామ మాత్రమ్". (పద్మ పురాణె)

కేవల కేశవ నామోచ్చారణమే పరమ పవిత్రమైనది. గోవింద మందిరమునకు గొనిపోవు నశ్వగజాదులను బూన్చు వాహన మదియే! జగత్తునందు సుకృతము ధనము నదియే యని శ్రీ వైష్ణవాచార్యులు గోవిందనామ మహిమను చెప్పెను. మన కథానాయకు డగు ముద్దుల బాలయోగి ముగ్ధుడయ్యెను.

బాలయోగి గోవిందనామ మహిమను వినుచునే యా మహా మంత్రమును సునిశ్చలభావముతో విధివిరామము లేక జపించుచునే యుండెను. ఆ బాలయోగి పట్టుదల వర్ణింపనలవికానిది. ఈ విధముగా రాత్రింబవళ్ళు నా మంత్రరాజమును మనస్సున ధ్యానించుచునే యుండెను.

ఒక దినమున నాచార్యుల యొద్దకు వెళ్ళి సెలవిమ్మని యడుగ నా బాలయోగి ప్రయాణము నాచార్యులు తెలిసికొని "తండ్రీ! నీవు లోకోత్తర పుణ్యమూర్తివి. నివురుగప్పిన నిప్పుకణికవలె ప్రవర్తించుచుంటివి. తమ యిచ్ఛ యెటులో యటులే కానిండు మహాత్మా!" యని మిన్నకుండెను. బాలయోగి యాచార్యులకు గురుభక్తి వెల్లివిరియ వినయవిధేయతలతో ప్రణామము లర్పించి "ఆచార్యదేవా! రాజమార్గమును జూపి రక్షించిన దేశికేంద్రులు మీరే! తమరు కరుణార్ద్రహృదయులు. తమ మేలెన్నటికి మరువలేను సెల" వని యడిగెను. 'సెలవు' అను మాటను వినిన యాచార్యులు కొయ్యబారి పోయి కొన్ని క్షణము లట్లే యుండిరి. బాలయోగి యాచార్యుల శరీరమును తన యమృతహస్తముతో స్పృశింప కొయ్యబారిపోయిన యాచార్యులకు పూర్వస్మృతి గలిగెను. బాలయోగిని చూచి కన్నీరు కార్చుచు "ముద్దుల కుమారా! నన్ను వీడిపోయెదవా? నీ దర్శన మిక యెన్నటికో!" యని ఖేదపడు నాచార్యులను బాలయోగీంద్ర మూర్తి దయారసవాక్యముల "స్వామీ! సర్వశాస్త్రములు సాంగోపాంగముగా పఠించిన దేశికేంద్రులు. తమరే సంయోగవియోగములకు సంతాపమును వెలిబుచ్చిన సామాన్య మానవుల గతి యెట్లని విన్నవించెను.

బాలయోగి వాక్యములసారము గ్రహించిన వైష్ణవాచార్యులు "సంతోషము నాయనా! నీకు సర్వేశ్వరుడు తోడునీడయై సదా రక్షించు గాక! నీ వలన లోకకల్యాణము చేకూరుగాక! సంసార సముద్రమున

మునిగి తేలుచు దిక్కుదోచక తపించెడి దీనజను లెందరినో నీ వుద్ధరించెదవుగాక"ని దీవించి సెలవిచ్చెను.

## శ్రీ వైష్ణవాచార్యులను వీడి కొండమార్గమున వెళ్ళుట

ఆచార్యులకు వీడ్కోలు చెప్పి బాలయోగీంద్రు లా స్థలమును వీడి కొండమార్గమున ప్రయాణము సాగించెను. అది మహారణ్య మధ్య భాగమునకు తీసికొనిపోయెను. ఎత్తైన కొండలు, విశాలమైన వృక్షరాజములు, ప్రవహించెడి సెలయేళ్లు, వివిధ విధములగు పక్షుల సంచారములు, మయూర నాట్యములు, శార్దూల భల్లూక చమరీమృగముల స్వేచ్ఛా సంచారములు, లేళ్లు దుప్పులు మొదలుగాగల మృగముల పరువులు, వల్మీకములనుండి బయల్వెడలి పణాధరములగు సర్పము లిడు బుసబుసలు చూచువారలకు భయాందోళనములను గల్పించుచుండెను. ఇట్టి దృశ్యములుగల యా ఘోరారణ్యమున చలింపని చిత్తముతో మన బాలయోగి ప్రయాణమును సాగించుచుండెను.

బాలయోగి మనస్సు మహామంత్రజపధ్యానమున నిమగ్నమై యుండెను. అట్టి సమయమున నా బాలుని మనస్సున నొక దృశ్యము పొడకట్టినది. ఆయన కోటు బూటు సూటు హాటులను ధరించి పేము కర్రను చేతబట్టి ఠీవితో నుద్యోగము చేసిన ట్లొక దృశ్యమును గాంచిరి. ఆ దృశ్యమును మదియందుంచక శ్రీహరినామోచ్చారణ గావించుచు నా బాలయోగి ప్రయాణము సాగించుచుండెను.

## తెల్లదొరతో పరిచయమగుట

ఆ మహారణ్యమున నున్నతోద్యోగియగు నొక తెల్లదొర భృత్యులతో నయ్యడవిని 'సర్వే' చేయించుచుండెను. ఆ దొర దైవభక్తిగల పుణ్యమూర్తి. అరణ్యమార్గమున బ్రహ్మవర్చస్సుతో ప్రకాశించుచు వచ్చెడి బాలయోగిని చూచి సేవకులతో "పని నాపండి! బాలయోగి రూపములో పరధ్యానముతో మనవైపున కరుదెంచెడి యా సాధు

మూర్తి యెవరో? గమనించితిరా! పదండి ఎదురేగి నమస్కరింపుడు." దొర మాటలు వినిన వెంటనే సేవకులందరు వారి కెదురేగి ప్రణామము లర్పించిరి. ఆ భక్తశిఖామణి పాదములపై బడి ప్రణామము లర్పించిన భృత్యుల జూచి చిరునవ్వునవ్వగా! దొరవారును నమస్సు లర్పించి "స్వామీ! మా నివాసమునకు దయచేయవలయు" నని కోరిరి. బాల యోగి యందుల కియ్యకొనిరి.

దొరవారు వారిని తగురీతి సత్కరించి యమితాదరణముతో వారి నివాసమగు 'కొత్తపల్లె' గ్రామమునకు తీసికొనివచ్చిరి. తాను నివసించెడి భవనమునకు పోయి యున్నతాసనమం దాసీనుని గావించి దంపతు లిర్వురు మిగుల భక్తిశ్రద్ధలతో నర్ఘ్యపాద్యాదివిధుల పూజించి సాష్టాంగప్రణామము లర్పించిరి. బాలయోగితో తెల్లదొర ఈ విధముగ చెప్పసాగెను.

"స్వామీ! మీరు మా గృహముననే యుండవలయునని కోరు చున్నాము. మీ రేపనులు చేయనవసరము లేదు. మీకు నచ్చిన దుస్తులు వేసికొనుడు. మీ కేమి కావలయునన్నను నేను వెంటనే సమ కూర్చెదను. మీరు మమ్ముదయతో వీక్షించుడు. మాకు కష్టనష్టములు గలుగక రక్షించెడి భారము తమదే? ఇంతకు మించిన కష్టము తమరు చేయనవసరము లేదు."

తెల్లదొర వాక్యములువిని యా సాధుమూర్తి "అట్లే యొనర్చె దను. నీకు మేలుగలుగుగాక! నీ క్షేమమే నా క్షేమము. నీ యానం దమే నా యానందమ"ని చెప్పెను. దొరవారు, ధర్మపత్ని, సేవకు లందరు ఆనందసముద్రమున నీదులాడిరి. ఈ విధముగా దినమొక క్షణ ముగా కాలము గడుచుచుండెను. సాధుభావములతో కాలమును సద్వినియోగము చేయుచున్న నీ భక్తశిఖామణి యొకరోజున దొర వేసి కొన్న డ్రస్సువేసికొని బూటుతొడిగి పేముకర్రను చంకనిడి టోపీని చేతబట్టి దొరముందు ప్రత్యక్షమైరి. దొర యా క్రొత్తదొరను చూచి

దిగ్భ్రమ చెంది "తండ్రీ! దొరలపై దొరవలెనున్నావు. పుణ్యపురుషులు తమ కేమి కొదు"వనుచు పొగడిరి.

ఇట్లు కొంత కాలము గడచిన యొకనాడు దొరకు గొప్పయాపద సంభవించినది. దొరమనస్సు తారుమారై చింతించుచు తన సేవకు లంద రిని దగ్గరకు చేర్చుకొని యీ విధమున చెప్పదొడంగిరి. "నన్ను ప్రేమించు సేవకులు మీరయిన చో నాపై మీకు విశ్వాసమున్న చో నేను చెప్పిన పనిని నెరవేర్చెదమని మాటనిండ"ని యడిగిరి. వెంటనే భృత్యులందరు ఏకకంఠమున "స్వామీ! మన్న మిన్నేకమైనను మీ మాట కెదు రాడము. ఆనతీయుడు. ఇన్ని దినాలు తమ యుప్పుపులుసుదిని కష్టసమ యమున కాదనగలమా? ప్రభూ!" యని సేవకులందరు పలికిరి. సేవకుల వాక్యములువిని దొరవారు ఆతని కార్యము చక్క జేసెదరను ధైర్యముతో వారలందరిని చూచి", "ఈ క్రొత్తపల్లెనుండి యిరువది నాలుగు మైళ్ళ దూరమున నున్న 'పర్లాకిమిడి' యను పట్టణమున కీ రాత్రి 10 గంట లకు 'టెలిఫో' నందని యెడల నా యుద్యోగ మెగిరిపోవును. పదిమంది దొరలలో తీరని యవమానము. అవమానముతో జీవించుటకంటె నాత్మహత్యయే మేలు. ఈ కార్యము మీలో నెవరైన నెరవేర్చినచో నాకు పదివందలకు ప్రమోషన్. లేనిచో నా బ్రతుకు వ్యర్థము. ఇది సాయంత్రము నాలుగుగంటల సమయము. ఎప్పుడు వెళ్ళెదరో ఎన్నడు వచ్చెదరో? ఇక మీయిష్టము తదుపరి నా యదృష్టము మీరు వెళ్ళక పోయిన కష్టము చివరకు నా యుద్యోగమునకు నష్టము. తెలిసి చెప్పక యున్న దోసమునాది. పర్లాకిమిడి వెళ్లెడి మార్గము మహారణ్యము. పెద్దపెద్ద కనుమలు, కొండవాగులు దాటివెళ్ళవలయును. ఆ కనుమలలో క్రూరమృగములు స్వేచ్ఛాసంచారము లొనర్చును. సింహ శార్దూల భల్లూకముల కాలవాలము. అందులో నీనా డమా వాస్యయు దాపురించినది. కటిక చీకటిలో త్రోవకన్నులకు కాన రాకుండును. ఈ యవాంతరము లన్నిటిని దాటిన వెంటనే తెల్లని నురు

గులు గ్రక్కుచు భయంకర ధ్వనులతో "మహానది" ప్రవహించు చుండును. ఆ మహానది దాటినంత "పర్లాకిమిడి" కన్నులకు సాక్షాత్క రించును. యదార్థము వచింతి"నని దొరవారు కన్నీరు గార్చిరి.

దొర చెప్పిన వాక్యములను సేవకులందరు సావధానచిత్తులై యాలించి గడగడ వణకుచు చిత్తరులవలె నోట మాటలేక దొర ముఖ మును వీక్షించుచు లోలోన వారందరీ కార్యమును మనము నిర్వహింప లేము. "ఊపిరున్న నుప్పుగల్లమ్ముకొనెదము. ప్రాణమున్న బలుసాకైన దినవచ్చు"నని నిశ్చయించుకొని యొకరిమొఖ మొకరు చూచుకొనుచు నిండ్లదారి బట్టిరి.

## దొరమాట నెగ్గించుట

సేవకులు గృహములకు వెళ్ళుట జూచి వారిని మందలించుటకు నోరాడక తలక్రిందికి దింపి దొర మిగుల దుఃఖమును చెందుచుండిరి. ఎంద ఱటు వెళ్ళినను రాముకార్యమున నాంజనేయునివలె, దొర కార్యము నెరవేర్ప నెంచి కాలుకదపక మహాత్యాగియగు బాలయోగి మౌనమువహించి ప్రసన్నవదనముతో దొరయెదుటనే నిలువబడి యుండెను.

దుఃఖించుచున్న దొర తలపైకెత్తిచూడగా సేవకులందరు వెళ్ళి పోయిరి. గ్రహణమోక్షకాలచంద్రునివలె బాలయోగి సునిశ్చల భావ ముతో నుండుట జూచి దొరయాశ్చర్యపడి "నాయనా! నీవుమాత్రము మిగిలియుంటివా!" యన నా బాలభక్త శిఖామణి "స్వామీ! ఇన్ని రోజులు కన్నతండ్రివలె కరుణతో నాదరించితిరి. తమ కీనా డేదో యవాంతర పరిస్థితి యేర్పడినదని మిమ్ము వీడిపోవుట న్యాయమా? మానవధర్మమా? నే నీ క్షణమే వెళ్ళి తమ యాజ్ఞను పాటించి యా హెడ్డాఫీసులో టెలిఫోనిచ్చి వారి రశీదు దెచ్చి తమ కందించెదను. నిర్భయముగా నుండు"డని చెప్పెను.

దొరవారు "నాయనా! నా ముద్దుల కుమారా! స్వార్థ త్యాగీ! నీ త్యాగమునకు సంతోషించితిని. నీవు మానవోత్తముడవు. ఇందరు సేవకులు కాదని వెళ్ళిన నీ సాహసకార్యమునకు పూనుకొనెదవా! పది యారేడుల ప్రాయము. ఏ తల్లి కన్నదో ఏ తండ్రి పెంచెనో!" యని గాఢాలింగనము చేసికొని యాఫీసు కాగితములు చేతికందివ్వగా నా వీరాంజనేయమూర్తి కాగితములు తీసికొని "నాకేమియు ఫరవా లేదు మీరు ధైర్యముగా నుండుడని చెప్పి పరిటీలు గొట్టుచు సకాలమునకు చేరవలయునని "కొత్తపల్లి" గ్రామపు పొలిమేరలుదాటి "పర్లాకిమిడి" మార్గమున వాయువేగమున వెళ్ళుచు మహారణ్యసీమలో కనుమ లన్నియు దాటి మనస్సు హెడ్డాఫీసుయందు చేర్చి శ్రీహరిని ధ్యానించుచు పయనము సాగించుచుం చెను. అంతలో తెల్లని నురుగులతో ప్రళయ గర్జనలతో సుడులు తిరుగుచు ప్రవహించుచున్న మహానదిని గాంచెను.

నదినిచూచి యాలోచనతో సమీపమునకు వెళ్ళి తేరిపార చూడ పడవలువేయు బెస్తవాండ్రందరు లంగర్లువేసి తమ నివాసములకు వెళ్ళిరి. "ప్రవాహమని యీ పట్టు వదలినచో దొరవారిగుట్టు చెడును. నాకు ధర్మహాని సంభవించును. ధర్మహానికంటె ప్రాణత్యాగమే మేలు. పాంచభౌతికమైన యీ శరీర మెప్పు డే వేళ నే స్థలముననో నశించును. మాయకళేబరములో నివసించు నాత్మయే శాశ్వతమైనది, నిత్యమైనది, సత్యమైనది. ఆ యాత్మకు చావుపుట్టుకలు లేవు. ద్వంద్వముల కతీతమై వేదమూలమై వెలుగొందుననెడి వేదసూత్రములను పఠించుచు "జై గంగాభవానీ" యని గుభిల్లున దుమికెను. సాధురక్షకుడైన శ్రీమన్నా రాయణుని మహిమచే కోటిసూర్యులకాంతితో నదిలో పడవవచ్చుట గాంచి మన సాధుమూర్తి యమితోత్సాహముతో పడవలో నాసీను లైరి. పడవ యావలి గట్టునకు చేర్చ పడవనుండి వెలువడి సాధుమూర్తి నదిలో చూడ పడవ యదృశ్యమాయెను.

శ్రీహరి యపారకరుణయే నావయై తీరము చేర్చెనని తలచి పరుగులతో పదిగంటలు గొట్టకముందే 'పర్లాకిమిడి' చేరి హెడ్డాఫీసులో నార్డరు దెలిపి వారి రశీదు పుచ్చుకొని "ఆహా! ఇక ఫరవాలేదు. నా దొరకు నౌకరిపోదు. పదివందలకు ప్రమోషన్ వచ్చునను నానంద ముతో దొరకీ విషయము వెంటనే తెలియచేయవలయు"నని దగ్గర త్రోవను వెళ్ళవలయు నని కనుమత్రోవన వెళ్ళుచుండెను. భయంకర మైన యా కనుమ మధ్యలో గాండ్రు గాండ్రు మను శబ్దముతో నొక శార్దూలము నోరు దెరచి, వాడిగల కోరలు జూపుచు, నార్భాటముతో బాలునిపై బడ, పిపీలికాది బ్రహ్మపర్యంతము శ్రీహరిదప్ప వేరొండు లేదను నిశ్చయముతో రాత్రింబవళ్ళు హరినామస్మరణ చేయు నా బాల భక్తమణి ధ్యాననిష్ఠులై నంత పులి యదృశ్యమయ్యెను.

ఈ సంఘటనను గాంచిన యా యోగి "ఆహా! నా పాలిట నా శ్రీమన్నారాయణుడే గలడు. లేకున్న నీ భయంకర శార్దూల మదృశ్యమౌనా! అన్నిటికి శ్రీహరియే దిక్కు! సర్వకార్యములు హరియే నిర్వహింపగలడు. నా కేమి భయ" మనుకొని మహారణ్య మార్గమున వాయువేగమున వెళ్ళుచుండెను.

అదే సమయములో స్వగృహముననున్న తెల్లదొర మనస్సున కుందుచు నేమియు దోచక తికమకచెందుచు "నా ముద్దుల బాలయోగి యేమిచేయుచుండెనో, రశీ దెట్లు తెచ్చునో, భయంకరాటవిలో క్రూర మృగములు విచ్చలవిడిగ సంచారములు చేయునుగదా! ఏ భయంకర వ్యాఘ్రమునకు గుఱియైయుండునో? మృత్యుదేవతవలె నోరుదెరచు కొని కబళింపజూచుచు ప్రవహించు నా 'మహానది' పాలయ్యెనో? ఆ మహానదిని దాటుట సామాన్యమా! ఇంతటి ఘోరవిపత్తునకు గురి యౌనని కలనైన దలంపనైతినే?

"అయ్యో! దైవమా? ఆ బాలుని రక్షణభారము నీవు వహింప వలసినదే! చతుర్దశభువనములను నీ బొజ్జ నిడికొని చల్లగా కాపాడెడి

కరుణాస్వరూపుడవు. కుసుమకోమల హృదయుడవు. భక్తరక్షణ దుష్ట శిక్షణ చేయ సమర్థుండవు. ఓ శ్రీహరీ! నా ముద్దుల బాలయోగిని నా గృహమునకు చేర్చెడి భారము నీయందిడి నిన్నే స్మరించుచుంటిని ప్రభూ! పాలముంచినను నీటముంచినను నీదే భారము. మాటకొరకు ప్రాణము లర్పించు త్యాగమూర్తివి. ఓ నా బాలయోగీ! సత్య వాక్యపరిపాలకుడవు; సర్వలోకముల కాదర్శమూర్తివి. నిన్ను ఎప్పుడు దర్శింతునో" యను నావేదనతో కన్నీరు మున్నీరుగా నేడ్చుచు నతని రాకకై యాతురతతో కవాటము దెరచి బాలుడు వెళ్ళిన దిక్కునకు నొకే దృష్టితో చూచుచుండెను.

అది మరుసటిరోజు పదిగంటల సమయము. బాలయోగి ప్రసన్న వదనముతో ముత్యము లొలుకు మొలకనవ్వులతో శిరముపైన పాగా చిందులాడ రశీదు హస్తమున మెఱయ దొరవారి సింహద్వారము దాపునకు చేరెను. బాలయోగి ప్రాణమెచ్చటనో యంతరాంతరము లందు కాచుకొనియున్నది. శరీర మలసి సొలసి పోయినది. ముఖ మున బ్రహ్మవర్చస్సుట్టి పడుచున్నది. బాలుని రాక దొరవారును సిబ్బందియు కన్నులారగాంచి విస్మయమందిరి.

అంతలో త్యాగమూర్తియగు నా బాలయోగి రశీదు పత్రము దొరచేతికందింప దొర యపరిమితానందముతో పకపక నవ్వుచు పట్ట రాని సంతోషమున నా ముద్దులొలుకు బాలచంద్రుని యమాంతము గాఢాలింగనము చేసికొని తనివిదీర ముద్దిడుకొనుచు "తండ్రీ! నేనెంతో పుణ్యాత్ముడను. కాకున్న నీవంటి పరమ పవిత్రమూర్తి మిత్రత్వము నాకు లభించునా! ఎన్నిజన్మలకైనను తమ ఋణము తీర్చుకొనలే"న నుచు వేనోళ్ళశ్లాఘించుచు దొరవారి ప్యాంటుజేబులోనున్న రొక్కము దీసి యిరువదైదు రూప్యములు బాలుని చేతిలోనుంచి నమస్కరించెను.

బాలయోగి ఫక్కున నవ్వుచు "తండ్రీ! ఈ ధనపిశాచము బారి నుండి తప్పించుకొని ప్రశాంతముగా జీవయాత్ర సాగించుటకే భోగు

లందరు రోగులు కాకముందే మాయానిద్రనుండి మేల్కొని ప్రపంచ రాగములను వదలి విరాగులై నిస్సంగులై జీవించు సదవకాశమును జూచుకొనుచున్నారు. శాంతికాములమై నిత్యానంద పదవికై పరితపించు మముబోటి యోగుల కెందుకీ పనికిమాలిన నాణెము" లని వచించెను. బాలయోగి పలుకులను విని తెల్లదొర లోలోన నాతని మహోన్నతాదర్శసిద్ధి కచ్చెరువొందుచు పైకి నొచ్చుకొనుచు దయతో పుచ్చుకొమ్మనుచు బలవంతము చేయుచుండెను. బాలయోగి దొరవారి మనస్సు సంతోషపరుప నెంచి యిరువది ఐదు రూప్యములు స్వీకరించినవారై మరుక్షణమె బక్కచిక్కి "అన్నమో రామచంద్రా!" యని వాపోయెడి దరిద్రనారాయణులకు పంచియిచ్చెను.

## దొర బాలయోగిని తిరువళ్ళూరికి మార్చుట

"ఆహా! ఏమి యీ బాలుని సమదృష్టి. లోకోత్తర పురుషులు! వారి భావములన్నియు సద్భావములే!" ఈ విషయము దొర గుర్తించి బరబర పత్రమువ్రాసి "మీకు ప్రమోషన్ యిచ్చినాను. జీవితమానందదాయక"మ్మని చెప్పెను. అచ్చటనుండి మన బాలయోగిని తిరువళ్ళూరికి మార్చిరి. స్వామివారి యానందమునకు మేరలేదు.

సదా భక్తియోగముతో కాలము గడుపనెంచిన యీ బాలస్వామి తిరువళ్లూరి వీరరాఘవస్వామి సన్నిధి చేరుటయు నా దైవకృపయే కారణము. పరిశుద్ధమగు గంగయందే సూర్యుని బింబము ప్రతిబింబించు రీతి నిర్మలహృదయముననే భగవానుడు ప్రకాశించును. సత్యప్రవర్తన సర్వభూతదయ సాధుసేవ సమానదృష్టి గలిగిననాడే హృదయము నిర్మలమై ప్రకాశించును. దైవానుకూలములేని మానవయత్నములు నిష్ఫలములు. దైవమనుకూలించినచో యత్నింపకయే సర్వకార్యములు సిద్ధించును. ఇది స్వానుభవ సిద్ధాంతము, లోకానుభవము.

మన బాలస్వామి తిరువళ్లూరు చేరిన మరుక్షణమునుండి దొరవారు బాలయోగిపై గాఢబద్ధాను రాగముతోనున్నారు. బాలయోగి

మనస్స్పర్శిశలు శ్రీ వీరరాఘవస్వామి పాదపద్మములయందే లగ్నము చెందియుండెను. శ్రీ వీరరాఘవస్వామి మహిమను వర్ణింప నాదిశేషున కైన దరమా !

## శ్రీ వీరరాఘవస్వామి మహిమాభివర్ణన

శ్రీమత్కురు కులోద్ధారకుడైన, జనమేజయ, మహారాజు, ముని శిఖామణియైన మార్కండేయ మునిని గనుగొని "మునివరా ! చరాచర ప్రపంచమునకు లోపలను, వెలుపలను వెలుంగునట్టి శ్రీమన్నారాయణు నకు చేతనులు చేయదగిన యారాధనమును నందు ఫలమును దానికి తగిన దేశకాల వస్తు విశేషములను, వర్ణాశ్రమ విశేషములను భక్తి విశేషములను విమానములు గోపురములు మండపములు కట్టించుట వలన నగుఫలములను వేదోక్తమంత్రముల చేతను పాంచరాత్ర వైఖానసాగముల యందు విధింపబడిన తంత్రముల చేతను నీ యుభయవిధ మంత్రతంత్ర ముల చేతను వైదికారాధనము, తాంత్రికారాధనము, వైదిక తాంత్రికా రాధనము ననెడి త్రివిధారాధనముల చే నయ్యెడి ఫలవిశేషములను వారువారు చేయునట్టి కర్మములకు దగిన స్వర్గమోక్షముల నిచ్చునది యీ కర్మభూమియే యనుట నీ భారతవర్షమునందు బ్రహ్మాది దేవతలును తపోధనులైన మునులును వ్రతశీలురైన బ్రాహ్మణులును స్వర్గమోక్ష ఫలప్రదములైన వర్ణాశ్రమధర్మములను నధికారానురూపముగ నేలిన వారికి నిదియు నొక తిరువారాధన మని ఫలాపేక్ష లేక చేసి యనంత మయిన పరమపదము చెందుచుండిరనుట దేవరవారు దాసున కాన తిచ్చిరి.

"ఓ తపోధనా ! ఏ కథ వినికిచేత నే యుత్తమగతిని పొందెదరో యా పుణ్యకథ నీకు జెప్పెద నాలింపుము. పాలవంటి నీళ్ళు ప్రవహించు టచే నా నదికి పాలేరని పేరువచ్చెను. పాలేరు పెద్ద పుణ్యానది. ఆ నది యగస్త్యాశ్రమమున బుట్టి వెండికొండ నాశ్రయించి పావనములయిన సెలయేళ్ళతో సముద్రమున సంగమించు చుండును. దాని దరుల

మామిడి పొగడలు పొన్నలు సంపెంగలు లోనుగాగల వృక్షరాజములు క్రిక్కిరిసి యుండును. మానవ నిర్మితముగాని కోనేరుగలదు. ఆ కోనేటియందు స్నానము జేసినవారు సమస్త పాపములనుండి విడివడుచుండిరి. ఆ కోనేటి దరిని రమ్యమయిన యిసుకదిబ్బలమీద నిఖిల చరాచరములకు నాశ్రయుడై శ్రీ వీరరాఘవదేవు డనంతభోగశయ్యపై బవళించి యోగనిద్రా విభూతిలో నలరారుచుండును."

ఈ వీరరాఘవుని గురించి యెన్నో గాథలు గలవు. సనక సనందనాది ముని బృందములెల్ల సేవించుచుందురు. నిత్యనైవేద్య దీపారాధనలతో వెలింగెడి యా శ్రీ వీరరాఘవస్వామినే మన ముద్దుల బాలయోగి నిత్యము జపించుచు సేవించుచు దర్శించుచుండెను. ప్రతిదినము తిరువళ్ళూరి మధ్యభాగమున నున్న రథముపై పవళించెడివారు. పగలంతయు నాలయములో రాఘవేంద్రుని సేవించుచు రాత్రియగు వరకు రథములోచేరి నిద్రించుచుండెడివారు. ఎవ్వరితో మాటలాడక మౌనభావముతో నుండెడివారు. ఆ గ్రామ పౌరులందరు వీరినిచూచి "ఓహో! మనతత్వములో లేడు. వారి తత్వమేదో మనకు తెలియదను"కొనుచుండిరి. మన బాలయోగి యన్నపానీయములు వర్జించి యా రథమందే పద్మాసనాసీనులై దైవభావనతో నున్నారు. అద్భుతమగు వారి ధారణాశక్తియే యాయనకు ఊతకర్రయై నిల్చినది.

ఇట్టి వినిర్మల మనోభావముతో నుండుట పౌరులుచూచి విస్మయమందుచుండిరి. ఆ రథమందే పదమూడురోజులు అన్నపానీయములు త్యజించి మనస్సు నేకాగ్రముజేసి వీరరాఘవస్వామి పాదపద్మములను హృదయసింహాసనమునవిల్పి సర్వార్పణదృష్టితో నంతయు దైవేచ్ఛయే యను దృఢసంకల్పముతో జపించుచున్న యీ బాలుని రక్షణభారము జగజ్జనకుడైన శ్రీవీరరాఘవస్వామిపై బడినది. సాధుపోషకుడు భక్తజనవత్సలు డాపద్బాంధవు డగు స్వామివారు పరమ భక్తాగ్రేసరుని యచంచల దైవభక్తికి సంతోషించి, యర్ధరాత్రి సమయమున పెరు-

గన్నమును దెచ్చి బాలునిచే దినిపించి యదృశ్యుడగుచుండెను. గత జీవితమున నావుల దోలుకొని వెళ్ళుచు బాటసారుల కత్యంతాదరణతో భుజముపైనున్న పెరుగన్నము చద్ది నొసంగిన ఫలమే! ఈనాటి కిట్లు వీరరాఘవస్వామి స్వయముగ నన్నమును దినిపించుకృపగా పరిణమించినది.

ఇవ్విధముగ కొన్నిరోజులు గడువ నొకదినమున తెల్లదొర బాల యోగికి నలువది రూప్యము లిచ్చి మనియార్డరు చేసిరమ్మని పంపగా, పోస్టాఫీసునకు వెళ్ళి జేబువిప్ప రూపాయలు మాయమయ్యెను. ఆ వింత విషయమును విన్న తెల్లదొర యేమియు దోచక "ఏమయ్యా! మీరు సామాన్యులుకాదు, రూప్యములు మటుమాయమైనవి. కారణమేమో యూహింపలేకుంటిని! నీ జీతమున చెల్లు వేసెదవా? వీరరాఘవ స్మరణ మానుకొని మా కనుసన్నలకు తగినట్లు మెలగెదవా తండ్రీ!" యన ఆ రాఘవభక్తశిఖామణి దొరతో జీతపు డబ్బైన మానుకుండె దనుగాని రాఘవనామస్మరణ మాననని బదులు చెప్పెను.

## బాలయోగి చెన్నపట్టణమునకు మారుట

బాలయోగిని వెంటనే తిరువళ్ళూరినుండి మద్రాసునకు మార్చిరి. ఐనను దొరవారు మాత్రము బాలునిపై నఖండ విశ్వాసముతో ప్రేమ చూపుచు గౌరవించుచుండిరి. లోలోన బాలుని వైఖరిని వీక్షించుచు నాత్మీయభావముతో మెలగుచుండిరి. ఐహికవాంఛలను సమూలముగా నాశనము చేసిరి. మణిదీపమువలె ప్రశాంతితో సదా దైవభావనగలిగి వర్తింపసాగిరి. ఐనను వీరిదైవభావన సామాన్యులకు గోచరించునది కాదు. వీరి భవిష్యము మహోజ్జ్వలముగా ప్రకాశించుననుట కెట్టి సందేహము లేదని దలంచుచు గురుభావముతో మెలగుచుండిరి.

చెన్నపురమున నమ్మాళ్వార్ వీధిలో నొకరోజున దొరవారి పని నిమిత్తము వెళ్ళుచుండెడి యీ బాలభక్తశిఖామణి యొక మహాసిద్ధుని "సచ్చిదానంద పరమహంస అవధూతస్వామి"ని దర్శించిరి. ఆ మహా

సిద్ధు డంగవస్త్రమైన లేక నజగరమువలె నన్నపానీయముల్కై నెట్టి ప్రయత్నము చేయక శిలాకృతిలో పడియుండిరి. మలమూత్రములు విసర్జించు జ్ఞానమైనను లేక యోగనిద్రలో మునిగియుండిరి. ఇట్టి మహా సిద్ధునిదర్శించి దొరపనిమరచి, సిద్ధునకుహృదయ పూర్వకముగా సాష్టాంగ ప్రణామము లర్పించి కన్నీటితో వారి పాదకమలములను దివ్యాభిషేక మొనర్చి కన్నులు మూసియున్న సిద్ధుని ముఖారవిందమును దర్శింపుచు వారితో సంభాషింపవలయునను వాంఛతో వారి కెదురుగా పద్మాసనా సీనులై యిట్లు లాలోచింప దొడంగిరి.

ఈ సిద్ధమూర్తి సామాన్యుడు కాదు; లౌకికదృష్టితో బరిశీలించెడి వారికి పిచ్చివానివలె దోచెడివారు. ప్రపంచ తత్త్వములకు దూరుడై పరతత్త్వమున మనస్సును కేంద్రీకరణచేసి బ్రహ్మానందమును పొందుచు బ్రహ్మవర్చస్సుతో వెలుంగుచున్నారని గుర్తించిరి. నమ్మాళ్వార్ వీధిలో ప్రజలందరు నీ మహాసిద్ధు నొక పిచ్చివానిగా, మూగవానిగా, చెవిటివానిగా చూచుచుండిరి. పోకిరిపిల్లలందరు నీ మహాసిద్ధునిపై రాళ్లు రువ్వుట మట్టిబోయుట వారికర్ణముల దాపునకు వెళ్ళి బిగ్గరగా నరచుట వారిజడలు గడ్డమును పట్టుకొని వెనుకకు ముందునకు వూపుట మొదలగు వికారపుచేష్టల నెన్నిటినో యొనర్చుచుండిరి. ఎవరెన్ని చేసినను నీ మహాసిద్ధుడు కన్నులువిప్పి యెరుగడు, ఇట్టి వినిర్మల దైవభావముతో కదలక, మెదలక పాషాణమువలె నుండిరి. ఇట్టి భావము గలిగిన మహా సిద్ధునిముందు మన బాలయోగి త్యాగభావమూని తదేక నిష్ఠతో కన్నులుమూయక దృష్టినంతయు సిద్ధుని ముఖకమలమందే చేర్చి యుండెను. ఈ తీరుగా బాలయోగి సిద్ధమూర్తి కన్నులెప్పుడు విప్పునా యను తీవ్రవేదనతో వేచి కాచుకొనియుండెను. పట్టినపట్టు వీడుట భావ్యముకాదని మూడహోరాత్రము లన్నపానీయములు వర్జించి సిద్ధునియందే మనస్సు లగ్నముచేసి కూర్చొనియుండెను. మూడురోజులు గడచినవి. నాల్గవ దివసమున సూర్యోదయమైనంతనే యా మహాసిద్ధుడు కదలకనే కన్నులువిప్పి చూచెను.

కన్నులయెదుట మన బాలయోగి బంగారుకాంతులతో మెరయ జొచ్చెను. కన్నులువిప్పిన సిద్ధుని చూచి "ప్రభూ!" యని పిలువగా సిద్ధుడు బాలునిచూచి "ఓహో! ఈ బాలభక్తునికి మహర్దశ రానున్నది. జన్మాంతరపుణ్యఫలమువలన నవతరించిన పుణ్యమూర్తిగాని వేఱుగా"దని తలచి, బాలుని పరీక్షింపగోరి "బాలకా! ఆ కనుపించెడి స్తంభము నొద్దకు నన్ను చేర్చుము"నిరి. వెంటనే సిద్ధుని వాక్యములు వినిన ఈ బాల భక్త మహావీరు డమితోత్సాహముతో శ్రీహరిని ధ్యానించి మహా సిద్ధు నమాంతముగా భుజముపై నెత్తుకొని రెండుమూడడుగులు వేయ మహాసిద్ధుడు బాలుని త్యాగమును బరిశీలింపనెంచి కొండంత బరువు కల్పించెను. మామూలుగానున్న సిద్ధమూర్తి విపరీతపు బరువుగా నుండుట యెఱింగి బాలభక్తుడు 'ప్రాణము గాలిలో దీపమువంటిది. కీర్తి యాచంద్రార్కము చిరస్థాయిగా నుండగల'దని దలచి సిద్ధుని గమ్యము చేర్చవలెనను దృఢసంకల్పమున "శ్రీహరీ శ్రీహరీ శ్రీహరీ" యని ముమ్మారు స్మరించి సిద్ధుని స్తంభముయొద్దకు చేర్చెను.

సిద్ధుడు సంతోషించి "బాలకా! ధన్యమూర్తివి! పుణ్యమూర్తివి! నామాట నెరవేర్చితివి. నీకు నా స్పర్శవలన సిద్ధశక్తులు సంప్రాప్తమైనవి. అతీతమై యనుపమానమై యాత్మానంద మొసంగు యోగశక్తి నంతయు నీకు ధారవోయుచున్నాను. నీకీర్తి పండువెన్నెలవలె ప్రభవించును. దుష్ట శక్తులన్నియు నీ మంత్రశక్తికి తలలొగ్గి తైతక్కలాడవలసినదే! నీవు విశేషప్రతిభావంతుడవై యఖండ తేజోమయమూర్తివై వెలుగొందెదవు గాక!" యని యాశీర్వాదము చేసెను. మరుక్షణమే యావేశపూరితు డయ్యెను. ఈ బాలయోగి కావేశము కలుగుట కిదియే ప్రథమము. ఆవేశపూరితుడై సిద్ధుని సెలవుగైకొని దొరవారి భవనమునకు వేంచేసెను.

"మూడు రాత్రులనుండి యదృశ్యమై ఈ రోజు ప్రత్యక్షమైతివి. నీ కేమైన మతిపోయెనా? ఉన్మాద మావహించెనా? నీ చేష్టలు మా కయోమయముగా నున్న" వనుచు మందలించెను. అఖండప్రజ్ఞాన్వితు

లైన మన యోగానందమూర్తి దొరమాటలను వినియు వినని వానివలె మౌనము వహించెను. దొరకు వీరి ప్రవర్తన అర్థముగాలేదు. దొర వారు "ఓ స్వామీ ? మీ యిష్టమునకు తగినరీతి మెలంగుటకు వీలగున ట్లొక గది యేర్పరచెదము. ఆ గదియందు మీ భక్తియోగమును నిర్వహింపు"డన మన యోగానందమూర్తి యంగీకరించి యా గదియందే యేకాంతవాసము చేయదొడగిరి.

## దైవమెవరో నిర్ణయించుట

ఒక శుభదినమున యోగానందమూర్తి దైవము నారాధించి దైవానుభూతి పొంది యాత్మను సాక్షాత్కరింప చేసికొనవలయునని మదినెంచి దేవుని పటమునకై నమ్మాళ్వార్ వీధిలో పటముల యంగడికి వెళ్ళి "ఏమినాయనా! నాకు దేవునిపట మొకటిం" డని యడుగ, నా యంగడి వ్యాపారి "స్వామీ! మీ రడుగుట చాల వింతగా నున్న దే ? దైవముల పటములు మా యొద్ద వందలాది గలవు. నీ కే రూపము కావలయును నాయనా!"యని యోగానందు నడుగ "దైవ మొక రేగదా ? ఎందరో దైవము లని యసత్య మాడుచున్నావు. ఇది భావ్యమా ?" య నెను. వ్యాపారి 'యీ పిచ్చివానితో మన కెందుకు వాద' మని భావించి రకరకములైన దైవముల పటము లన్నియు దెచ్చి వారిముందు వైచెను. యోగానందులవారు, రామ, కృష్ణ పటములను దర్శించి యంగడివానితో "ఏమండీ! రాముని తల్లిదండ్రు లెవ"రని యడుగ, రాముని తలిదండ్రులు 'కౌసల్యాదశరథు' లని చెప్పెను. "కృష్ణుని తల్లిదండ్రు లెవరో మీకు తెలియునా నాయనా?" తెలియును దేవకీవసుదేవు"లని చెప్పెను. యోగానందు డాపావు వారి వాక్యము లాలించి "ఓహో! మీరు నుడివిన యిరువురు మనవలె యోని సంభూతు లే గదా! తల్లిదండ్రులు లేక జన్మించినవా రెవరైన నున్న వారి పట మొకటి నా కిప్పించిన నా జన్మ తరింప చేసికొనెద"నని యడిగిరి. ఆ వ్యాపారి, నృసింహస్వామి హిరణ్యకశిపుని వధించెడి దృశ్యము గల

పటమును యోగానందునకు జూపి "స్వామీ! ఈ నృసింహమూర్తికి జననీజనకులు లేరు. ఈ నృసింహమూర్తి పదుగురు చూచుచుండ గనే ఫెళఫెళమను ధ్వనులు మిన్నుముట్ట సభాభవనమున నుక్కు స్తంభమును బ్రద్దలు చేసికొని యవతరించిరి. వీరిరూపము దుష్టప్రవృత్తి గల మానవులకు భయంకరమై లోకభీకరమై వెలుగొందును. సాధు సజ్జనుల కెంతయో హాయిని చేకూర్చి పరమపదప్రాప్తిని లభింపజేసెడి ప్రసన్నరూప"మని చెప్పెను.

వినుచున్న యోగానందులవారు "అయ్యా! ఆ నరహరిపటము వెల యెంత"ని యడిగెను. వ్యాపారి "నాయనా! వెలతో పనిలేదు. తీసికొని వెళ్ళు"డనుచు నరసింహస్వామిపటమును యోగానందుని చేతి కందించెను. తీసికొనివెళ్ళి తనగదియందు ప్రవేశించి ఆ నృసింహస్వామి పటమును వీక్షించుచు తనలో తా నీవిధముగా బాలయోగి తర్కించు కొనసాగెను.

## శ్రీయోగానందమూర్తి సత్యస్వరూపమును సాక్షాత్కరింప చేసికొనుట

అన్నివిధముల దృశ్యము లహంకారాది సర్వము నసత్యముగను, వికారముగలవిగను, క్షణికములుగను గనబడుటచే సర్వము తెలియని జడములు నుండుటచే నీ యహంకారాదులును మనోరథ స్వప్న సుషుప్తు లందు పలుమరు లేనివిగ గనబడువాని వికారములును సుషుప్తియందు విడువకయుండి తెలియుటచే శ్రుతిచెప్పురీతి జన్మనాశములేక నిత్య సాక్షియై, నిర్వికారమై సదసద్విలక్షణమైయుండు అహంపదార్థ ప్రత్య గాత్మలు గావు. కావున శుక్లశోణితములచే బుట్టి మలమూత్ర పిండ మైన యీ పీనుగదేహమును ఛండాలునిరీతి దూరముగద్రోసి ఈ స్థూల మందును, బుద్ధికల్పితమగు దీని యభిమానమందును దీనియందుండు నామ, రూప, కుల, గోత్ర జాత్యాశ్రమాదులయందును నటులే లింగ దేహమందును దానియందు గల కర్తృత్వాది ధర్మములందును

నహంకారబుద్ధిని వదలి సత్యజ్ఞానానందాత్మయందు నేనను బుద్ధినుండి యేవస్తువునందు దర్పణములోని దృశ్య ప్రతిబింబమువలె నీ జగమంతయు ఛాయామాత్రముగ దోచుచున్నదో యా సర్వాధిష్ఠాన స్వయం ప్రకాశ బ్రహ్మమందు, మహాకాశమందు ఘటాకాశమువలె నాత్మను ప్రవిలాపించి 'అది నే'నని యభిన్నమై, యరూపక్రియా ద్వైతాఖండ సచ్చిదానంద స్వరూపమైన, నీ నిజరూపము ననుభవముగ దెలిసి, నటుడు తన నిజరూపమును బడసి వేషరూపమును వదలునట్లే యీ మాయా వేషధారణనువీడి, జగత్తనెడి రంగస్థల స్వరూప స్వభావముల విచారించి జ్ఞానముచే దూరముచేసి ఈ నిశ్చలాఖండభావముచే నఖండ సుఖరూప కేవల బ్రహ్మమాత్రముగ నెల్లప్పుడును ప్రశాంతచిత్తుడనై కృతకృత్యుడనై పరమశాంతి నొందుటకై ఇప్పుడే నా ఘటమును పరిశోధించెదగాక యని సంకల్పించుకొనెను.

అంతకుముందే యోగానందమూర్తి నమ్మాళ్వార్ వీధిలో నొక దుకాణమున 'పేష్‌కబ్బి' నొకదానిని తీసికొనిరి. తనలోతాను తర్కించుకొని ఆ యోగానందమూర్తి తేల్చుకున్న సారాంశమేమన, 'స్తంభమునందు విజృంభించినాడు నృసింహమూర్తి! ఏ స్తంభము! మేడ స్తంభములా? ఆలయ స్తంభములా? కాదు కాదు! దేహమే దేవాలయము. దేహములో నివాసముచేయు జీవుడే దేవుడు. జీవుడు, దేవుడు సనాతనలు. దేహాలయాంతర్గత స్తంభములో శ్రీహరి యావిర్భవించినాడు. దుష్టగుణములను రాక్షసుల నజ్ఞానమను హిరణ్యకశ్యపుని నంతమొందించినాడు. అజ్ఞానమెప్పుడు నశించినదో సుజ్ఞానమను ప్రహ్లాదునకు స్థానము లభించినది. అదేరీతి ఈ 'నర' స్తంభమును పగుల గొట్టి నారాయణుని దర్శించవలె'నను సంకల్పముతో నా క్షణమే యాయన నివాసముచేసెడి గదితలుపులకు లోగడియలు బిగించి గాలి రంధ్రములకు మూతలువేసి తన కార్యక్రమము నెవ్వరు చూడనట్లొనర్చి శ్రీ వీరనృసింహమూర్తి పటముపై దృష్టిని కేంద్రీకరింపజేసి మనస్సును

నిలకడజేసి "జాగ్రత ! నాలోనున్న భగవత్స్వరూపము నీక్షణమే సాక్షాత్కరింపచేసికొనవలయు"నని దృఢనిశ్చయముతో 'త్యాగేన మోక్షః' యను నార్యోక్తి పాటించి ఆకత్తిని కంఠముపై గురిపెట్టి "ఓ మనసా! జాగ్రత! ఇదియే నా కడసారివాక్యము. ఏమాత్రము ప్రాణవాయువు పీల్చినను నీ కత్తిని కంఠమున గ్రుచ్చెద"నని నిర్ణయించుకొని, గదిలోనున్న రాతిరోటిని తనపొట్టపైకి పొర్లించుకొని పెద్ద తిరుగలిరాళ్ళను కాళ్ళపైనిడి, పరుండి మనస్సున శ్రీహరి నామోచ్చారణగావించుచు దృష్టినంతయు శ్రీ వీరనృసింహమూర్తిపై నిలిపి తీవ్రపరితాపముతో శ్రీహరి దర్శనముకొరకు పరితపించుచు సమితావేదనను పొందుచుండినను శ్రీహరి కానరాడయ్యెను.

శ్రీ యోగానందమూర్తి "ఆహా! ఎంత వెఱ్ఱి! నేనూహించిన యూహలన్నియు వ్యర్థములేనా! దేహము దేవాలయముకాదా? సర్వాంతర్యామి యగు, శ్రీమన్నారాయణుండు నాలో లేడా? పిచ్చివాడనైతినా! ప్రత్యణువులో పరమాత్మ ప్రకాశించుచున్నాడు. ఆ పరమాత్మయే ఈ మాయాజగత్తు నాడించుచున్నది, నాలోనుండి నన్నీవిధముగా ప్రవర్తింపచేయుచున్నది, సర్వజీవుల నాడించి పాడించి యేడ్పించి నవ్వించెడివాడే దేవుడు. ఆడించెడి దేవున కధీనమై యాడెడివాడే జీవుడు. ఎవరెవరి ప్రారబ్ధముల ననుసరించి యాయా బొమ్మలాడును పాడును. ఆడించెడివాని దర్శనముకొరకు మానవుడు ప్రయత్నించవలయును. ఆ సర్వేశ్వర దర్శనమునకై తీవ్రకృషి సలుపక నీటిబుడుగులవంటి భార్యాబిడ్డలపై మమకారముంచి భవబంధములకు చిక్కువడి నశించెడి ప్రాణులకు దుర్గతియేగాని సద్గతిలేదు... సత్యమై, నిత్యమై, నిర్వికారమై, నిరంజనమై, నిగమగోచరమైన యా పరమాత్మనే దర్శించవలయునని సంకల్పించి జన్మాంతర మహాపుణ్యము వలన లభించిన యోగశక్తితో ప్రాణవాయువును సహస్రారమునకు చేర్చుచున్నంత, నెక్కడ నుండియో సర్పరాజ మొక ఛీ తెంచి

శ్రీ యోగానందుని శిరముపై ఛత్రమువలె తన పడగను విప్పి యుండెను.

ఈ మహాత్యాగి మనస్సణుమాత్రమైన చలింపలేదు. ఒకవేళ చలించిన మరుక్షణమే యీ కత్తిని కంఠమున గ్రుచ్చి శ్రీహరి కాత్మార్పణము గావించెదనని సునిశ్చలభావముతో వేచియుండెను. శ్రీ యోగానందమూర్తి త్యాగయోగభక్తి ప్రపత్తికి, సర్వాంతర్యామి సాధుజన రక్షణుడగు శ్రీహరి కోటి సూర్యుల కాంతితో శంఖచక్రగదాశార్ఙ్గములతో నభయప్రదానము చేయుచు సాక్షాత్కరించెను. ఇట్టి మహోత్కృష్టమైన శ్రీహరి సాక్షాత్కారము నొంది యాత్మానందాబ్ధిలో మునిగిరి. ఆనాటి సాయంత్రమగువరకు గది తలుపులు తెరువకయే బంధించియుండెను. ఈ విషయ మిరుగు పొరుగు నమ్మలక్కలు తెలిసికొని దొరవారికి దెలిపిరి. దొర సంభ్ర మాశ్చర్యచకితుడై బంట్రోతులతో యోగానందులున్న గది సమీపించెను. ఏ సందడియు లేక యది నిశ్శబ్దమైయుండెను. కవాటముతట్టిరి. లోపల గడియ బిగించిన కారణముచే నవి రావయ్యెను. ఏమియుదోచక దొరవారు వెంటనే జవానులతో "నీ కవాటమును పగులగొట్టుడు. శ్రీ స్వామివారిని చూడుడు. గృహ యజమానునకు మరొక కవాట మేర్పరచి బిగించవచ్చు"నని యాజ్ఞాపించిరి. 'దొర దలచిన దెబ్బలకుకొదువా' యన్నట్లు జవానులందఱేకమై, యశోకవనిని కోతులు చెల్లాచెదరుచేసినట్లు ద్వారబంధమును సమూలముగా లాగివేసిరి.

యోగముద్రలో నున్న యీ మహనీయమూర్తి యింత కోలాహలము జరుగుచున్నను హాలాహలము మ్రింగిన యపరశంకరునివలె నిండుసమాధిలో బ్రహ్మానందామృతమును గ్రోలుచుండిరి. దొరవారు బంట్రోతులు ప్రజలు గదిలో ప్రవేశించి సంభ్రమాశ్చర్యముల గొలిపెడి యీ దృశ్యమును జూచి బొమ్మలవలె నివ్వెరపాటుతో వీక్షించుచుండిరి. స్వామి పరుండి యున్నారు. వారి బొమ్మపై రాతి రోలొక

టున్నది. కాళ్లపై తిరుగలి రాళ్ళున్నవి. కంఠముపైన కత్తినిపెట్టి పిడికిటితో గట్టిగా పట్టుకొనియున్నారు. ఆయన దృష్టి కెదురుగా వీర నృసింహమూర్తి పటమున్నది. చూపు మనచూపుగాక యూర్ధ్వ ముఖమై యున్నది. సర్పరాజ మొకటి, వాని శిరస్సుపై పడగవిప్పి నాట్యము చేయుచున్నది. ఈ దృశ్యమంతయు కన్నులార గాంచిన తెల్లదొర దిగ్భ్రమ చెందెను. చూచెడివా రందరు "ఆహా ? ఇది యేమి వింత ! వీరిని సామాన్యు డనుకొంటిమే ! కాదు బాబో ! మహా మాంత్రికుడు. ఉత్తరాదివారు సామాన్యులు కారు. ఎన్నెన్నో మంత్ర తంత్రములు నేర్చియుందురు." ఈ మహనీయమూర్తి, మంత్రసిద్ధుడేయని కొందరు, తాంత్రికవిద్యలు నేర్చివచ్చిన మహామాయావి యని కొందరు, నష్టసిద్ధులుగల సిద్ధమూర్తి యని కొందరు, జన్మాంతర సుకృతముచే నవతరించిన లోకోత్తర పురుషుడని మరికొందరు తలకొకరీతి చెప్పుకొన సాగిరి. వీరి సంభాషణములను వినుచున్న తెల్లదొర మౌనముగా నుండుడని యాజ్ఞాపింప జనులెల్ల నిశ్శబ్దముగా నుండిరి. అచ్చటనున్న ప్రజలందరిని సాగనంపిరి.

దొరవారు ప్రశాంత చిత్తముతో స్వాములవారి యెదుట కొందఱు జవానులతో కలసి యాసీనులైరి. కొన్ని గంటలే గడచి పోయినవి. దొరవారి మనస్సు స్వామివారి పాదపద్మములయందే లగ్నముచేసి బ్రహ్మవర్చస్సుతో ప్రకాశించెడి వారి ముఖబింబమును దర్శించుచుండిరి.

## శ్రీ స్వామివారు మద్రాసు వీడుట

అంతలో నృసింహస్వామి దయకుపాత్రులైన శ్రీ యోగానంద మూర్తి కన్నులువిప్పి పొట్టపైనున్న రాతిరోటిని ప్రాణవాయు బలముతో పొట్టను కదలింపగా, రోలావలకు బంతివలె పడిపోయెను. కాళ్ళపైనున్న తిరుగళిరాళ్ళను జవానులు తీసివైచిరి. సర్వేదొర "ఓ ! యోగానంద వీరనృసింహస్వామీ ! మీరు నృసింహోపాసకులు,

సాక్షాత్ నృసింహస్వామివారి యపరావతారము, సందేహము లే"దని యెంతయో పొగడిరి. ఆనాటినుండియే యోగానందనామము సార్థక మయ్యెను.

వెంటనే స్వామివారు నిర్వహించెడి యుద్యోగమునకు స్వస్తి చెప్పించి దొరవారు బంట్రోతులతో వీరి జన్మస్థానమునకు బంపించి రమ్మని యాజ్ఞాపించిరి. బంట్రోతులు స్వామివారితో "తమ జన్మస్థాన మెచ్చటనో సెలవిచ్చెదరా!" యనిరి.

"నాయనలారా! నా స్వస్థానము శ్రీశైలపుణ్యభూమి సమీప మున నల్లమల మహారణ్య పరిసరప్రాంతమున 'తోకపల్లి' యను చిన్న పల్లెటూ"రని తెల్పిరి. దొర యాజ్ఞానుసారము యోగానందులను తీసికొని బంట్రోతులు ప్రయాణమై మద్రాసు వీడిరి. అప్పటికి స్వామి వారి వయస్సు సుమారు ముప్పది సంవత్సరములు. జవానులతో స్వామివారు కొన్నిరోజులు ప్రయాణము సాగించిరి. నృసింహమూర్తి సాక్షాత్కారము పొందిన మరుక్షణమునుండియే స్వామివారి భావన పూర్తిగా మారిపోయినది. దైవభావనతో చరించుచుండిరి. ఈ విష యము సామాన్యులగు బంట్రోతులు గుర్తింపజాలరైరి. బంట్రోతులు స్వామివారిని తీసికొని పల్లెలు, పట్టణములు దాటిపోవుచు మహారణ్య మార్గమున జనుచుండిరి. ఆ ఘోరారణ్యమును దర్శించినంతనే స్వామి వారి శరీర ముప్పొంగెను. నృసింహావేశపరులైన, మన యోగానంద మూర్తి "హరీ! శ్రీహరీ! నరహరీ!" యని కొండ కేకలు వేయు చుండిరి. 'రామభక్తుడగు శ్రీ వీరాంజనేయమూర్తి సముద్రమును లంఘించురీతి' నృసింహకళాస్వరూపులగు యోగానందమూర్తి భవ భయ నరకములకు మూలకారణమగు సంసారసాగరము నవలీలగా దాటి శాంతియను తీరము చేరిన కరుణామూర్తులగుటచే బంట్రోతుల కచ్చెరువు గొలుప కొండకోనలలో ప్రవేశించిరి.

వెంబడించెడి జవాను లీదృశ్యమును గాంచిరి. వారి గుండెలు దడదడ కొట్టుకొనుచుండెను. కళ్ళు గిరగిర తిరుగుచుండెను. కాళ్ళు తడబడుచుండెను. బంట్రోతులు తారుమారై త్రోవ దెలియు నుపాయము గానక కొన్ని క్షణములు చింతించి 'మనప్రాణ మెట్లు దక్కునా యను చింతతోనున్నంత' స్వామివారు పరిటీలుగొట్టుచు పాదలమధ్య నరహరీయని కేకలిడుచు సాక్షాత్కరించిరి. బంట్రోతులందరు నొకరి మొగమొకరు చూచుకొనుచు సైగలు చేసికొనుచు దీనవదనములతో తికమకచెందెడి మనస్సుతో దిక్కుతోచక "ఒరే! ఈ యోగానంద నృసింహముతో మన మెంతవరకు వెళ్ళగల"మని దలంచి దారమాట మదినెంచి తప్పదని స్వామిని జన్మస్థానమునకు చేర్చుట మనకు ముఖ్య కర్తవ్యమని కష్టములను సహించుచు స్వామి వెనువెంట ప్రయాణము సాగించిరి.

శ్రీయోగానందస్వామి కొండలన్నియు దిరుగుచు రాత్రిం బవళ్ళను భేదముమాని నిరాహారియై ప్రత్యణువున నృసింహస్వరూప మును దర్శించుచు ప్రయాణము సాగించిరి. మహారణ్యములో కనుపించు వృక్షరాజములను జూచి నరహరిశరీరముపై రోమపంక్తులని దలంచెను. ఏ వస్తువును జూచినను శ్రీహరిరూపమేగాని వేఱొండుగాదని కంద మూలాది ఫలములను భుజించుచు సెలయేటి నీళ్ళను ద్రావుచు విషము నమృతము రెండును సమానమే యను నాత్మదృష్టితో విషపుచెట్లగు యడవిజెంకులపాలు త్రావుచుండిరి. భగవదావేశపూరితుడై యమిత ముగా దుఃఖించుచు, పకపక నవ్వుచు, పర్వులుతీయుచు, చిందులు త్రొక్కుచుండెను. స్వామిపరివర్తనను గుర్తించిన బంట్రోతులు "స్వామివెంట చాలదూరము వచ్చితిమి. స్వామిస్వేచ్ఛకు భంగము గలిగించుట శ్రేయస్కరము కా"దని గుర్తించినవారై స్వామివారికి ప్రణామములొనర్చి నమితభయముతో శ్రీహరి నామోచ్చారణ గావించుచు మద్రాసుచేరి విషయమంతయు నామూలాగ్రముగ దొర కెరింగించిరి.

దొర బంట్రోతులతో "ఓరీ! ఆ మహాపురుషుని సామాన్యునిగా భావించితిరా! వారితత్త్వము గ్రహించియే నేను వారిని వదలిరమ్మని యాజ్ఞాపించితిని. ఆ మహిమాన్వితుని వదలి యెట్టులో స్వస్థానము చేరుకున్నారు. అదే పదివేలను"చు దొర సంతోషించెను.

బంట్రోతులను వదలిన శ్రీ యోగానంద నృసింహస్వామి కొండ లన్నియు దిరుగుచు రాత్రింబవళ్ళు విధివిరామములేక, ప్రయాణము సాగించిరి. ఆ మహదారణ్యములో శార్దూలభల్లూకాది క్రూరమృగములు భయమువీడి విచ్చలవిడిగా సంచారము చేయుచుండెను స్వామివారు పదేపదే బిగ్గరగా "నరసింహా! నరసింహా!" యని యడవి యంతయు మ్రోగునట్లు నామభజన చేయసాగిరి. ఆ త్యాగి మనస్సున నచంచల దృష్టితో ఘోరతపస్సుచేయ సంకల్పమాయెను. ఆ నల్లమల మహా రణ్యములో ప్రశాంత వాతావరణమున కాయన మనస్సమితోత్సా హము చెందెను. ఒకచోట పెద్ద బిలమును దర్శించి "ఆహా! ఈ స్థల మతిపవిత్రమై యానందదాయకమై విరాజిల్లుచున్నది. ఇచ్చోటనే తపోయోగము సాగించెద"నని యా మహాబిలమున ప్రవేశించిరి. బిలము లోపల ప్రవేశించినంతనే రకరకముల సుగంధపరిమళములు వచ్చుట గాంచి నరసింహయోగి సంతోషించి "ఆహా! బ్రహ్మానందమును పొందు టకు తగినచోటిదియే" యని తలంచి సమతలప్రదేశమున పద్మాసనా సీనులై ప్రాణవాయువును బంధించి సహస్రారమున కోటి సూర్యుల కాంతితో వెలింగెడి యా పరతత్త్వమును దర్శించుచు బాహ్యప్రపంచ మును మరచి నిత్యానందులై యోగానందులై వెలుంగుచుండిరి. ఇట్లు నిరాటంకముగా జితేంద్రియులై పదమూడు వత్సరములు ఘోరతపస్సు చేసి సర్వేశ్వరుని మెప్పించి యఖండమై వెలింగెడి యా పరతత్త్వమును గ్రహించి శివజీవైక్యసిద్ధిని బడసి యా బిలమునుండి వెలువడిరి.

సర్వేంద్రియములను జయించిన యఖండ ప్రజ్ఞానిధి, ఈశ్వర సమానుడైన యా యోగీశ్వరమూర్తి రూపము వర్ణనాతీతమై భాను దీప్తితో వెలుంగజొచ్చెను.



తపోయోగము నందున్న శ్రీ స్వామివారు

## ఘోరతపస్సుచేసి శివజీవైక్యసిద్ధిని బడసి బిలంబు వెలువడుట

ఈశ్వరసమానులగు నా యోగీశ్వరుని జడ లాకాశమున నెగుర జొచ్చెను. ఆ మహాత్ముని వ్రేలిగోళ్ళు బలిష్ఠములై వ్రేలికి వ్రేలంతగా పెరిగియుండెను. అవధూతగానున్న యా మహాయోగి జడలు శరీర

మంతయు వ్యాపించియుండెను. ఆయన లేచివెళ్ళగా నీడుపుమండలవలె జడలు భూమిపై పడివచ్చుచుండెడివి. ఆ జడలలో కొన్నిటినిమాత్రము తలపై ముడివేసికొనెదరు. అప్పటి దృశ్యము సాక్షాత్పరమశివుని వలె స్వామి ప్రకాశించిరి. ఆ రూపమును నాడెందరో దర్శించి యాశ్చర్య చకితులై యాయన పాదదాసులై తరించిరి. తపోదీక్ష వదలి బ్రహ్మ వర్చస్సుతో ప్రకాశించెడి యా మహనీయమూర్తి మహారణ్యా మార్గ మున వచ్చుచున్న సమయములలో నడవి జాతులవా రెంద రెందరో యి మ్మహామహుని జూచి గుంపులు గుంపులుగా నెదురేగి వినయవిధే యులై భక్తిభావముతో సాష్టాంగ వందనము లర్పించుచు నా మహా త్ముని వీడుటకు మనసొప్పక దర్శనాభిలాషులైరి. పరమ శివునివెంట ప్రమదగణమువలె నడవిజాతులవా రందరు యోగీశ్వరుని వెంటనంటి యెంతోదూరము పయనించి సెలవు తీసికొని నిల్చిపోయెడివారు. ఆ మహనీయుని పాదస్పర్శచే నా యరణ్యామార్గమంతయు పవిత్రమయ్యెను. ఆ యాటవిక జాతుల సంఘము లన్నియు సార్థకత చెందెను. ఆ యడవి దొరలందరు స్వామిని వీడి వారి స్వస్థానమునకు వెళ్ళెడితఱి వారిముందే మరల ప్రత్యక్షమై "నరసింహా" యని కేకవేసెదరు. ఆ కేకనువిన్న చెంచునాయకుల గుండెలు ఝల్లుమని వారి పాదములపై బడబోవ నదృశ్యులాదురట. "అహా! ఇదియేమి యాశ్చర్యము. ఈ కొండ లోయ చివర భాగములో వీడ్కోలుచెప్పి మన మందరము మన గూడె ముల దాపునకు చేరుకుంటిమి. మరల 'నరసింహా!' యని మనముందే సాక్షాత్కరించిరి. నమస్సులర్పించుటకై వారియొద్దకు వెళ్ళగా నదృశ్యు లైరి. ఇదంతయు మనయిలవేల్పగు నరసింహస్వామి మహిమయా! లేక సదాయోగముతో రమించు నీ యోగానంద యోగీశ్వరుని మహి మయా" యని వేనోళ్ళ పొగడుకొనిరి. యోగముద్రలో రోజులకొలది యుండుట చేతనే యోగానంద శబ్దము స్వామివారికి సార్థకమయ్యెను. ఎచ్చట చూచినను నొకేరూపమున సాక్షాత్కరించుచుండెను. దైవ

శక్తిని తనవశము చేసికొన్నట్టి యోగమూర్తి ప్రయాణము సాగించు చునే యుండిరి. వారి యద్వితీయ యోగశక్తియే పలుచోట్ల వర్తన మిచ్చున ట్లొనర్చెను. లేకున్న వారేక కాలమున పలుచోట్ల నిట్లు సాక్షాత్కరించుట సామాన్యమైన పనియా!

ఒకే స్థలమందున్న సూర్యభగవానుడు సర్వత్ర గోచరించెడి రీతి యీ సిద్ధమూర్తి నొకే స్థలమునుండియే పలుచోట్ల సాక్షాత్కరించు చుండిరి. సూర్యునిరీతిగా, వీరి హృదయాంతరాళమున జ్ఞాన భాస్కరుడు వెలుంగుచున్నాడు. ఇట్టి ధీరమూర్తిని ప్రకృతిశక్తు లెట్లెదుర్కొన గలవు? తలలొగ్గి తైతక్కలాడి జోహారొనర్ప వలసినదే! ఇట్టి యద్భుతకృత్య మొనర్పగలుగుట శ్రీ యోగానంద నరసింహయోగి వంటి యఖండాధ్యాత్మిక శక్తిసంపన్నులకే కద సాధ్యమగును.

ఆయన పరిపూర్ణ జితేంద్రియమూర్తి. యాపాదమస్తకము నాత్మవైభవము, దివ్యనైర్మల్యము! శ్రీ యోగానందుని యాధ్యాత్మిక ప్రతిభాశయమెట్టిదో యూహింపనలవిగానిది. కవుల కలాలకు చిత్రలేఖకుల కుంచియలకు చిక్కనిది. భావిభాగ్యోదయమున కాధారమైనట్టి యా యోగీశ్వరుని యోగశక్తి వర్ణనాతీతమైనది. ఎవ్వని శాసనాధీనమై వాయువు వీచునో, మేఘుడు వర్షించునో, సూర్యుడు వెలుంగునో, మృత్యువు ప్రాణులను గ్రసించునో యట్టి సర్వేశ్వరుడు భక్తవత్సలుడేగాక భక్తపరాధీనుడని మహాభక్తుల చరిత్రలు నాటికి నేటికి చాటుచున్నవి. అట్టి భగవానుని యవతారములలో నుత్తమ గణ్యమగు శ్రీలక్ష్మీనృసింహమూర్తి నిరుపమాన దివ్యానుభూతిని బడసినట్టి మన సద్గురువరేణ్యులే! శ్రీ యోగానంద నృసింహదేవుడు ఆత్మార్పణ పూర్వకమైన యఖండ తపోధ్యానాదులవలన భగవంతుడు ప్రత్యక్షమై యాక్షణముననే యంతర్ధాన మొందినట్లు మహాభక్తుల చరిత్రలలో తేటతెల్లముగా కాన్పించుచుండును. శ్రీ యోగానంద మూర్తి తన యుపాస్యదైవమును బిడ్డగా జేసికొని, తనివిదీర లాలన

పాలనముల నొనరింపగల్గె నన్నచో యదెంతటి యనన్య సామాన్య దివ్యానుభవము! ఇందలి రహస్యమే మన 'భగవంతునియెడ ప్రేమ' యనబడు నిక్కువమైన యనురాగమును బడయగల్గినచో వానిని గట్టివేయు పాశము లభించిన దన్నమాటయే యని శ్రీ యోగానంద మూర్తియే కాలక్రమమున శిష్యులకు దెలిపెడివారు. ఈ విధముగా నెందరెందరినో వారి స్పర్శ దర్శన వీక్షణములచే నుద్ధరించుచు, మహారణ్యమును దాటి జన్మభూమి యగు 'తోకపల్లి' పరిసరప్రాంతములలో సంచరించుచుండిరి.

ఆ మహనీయమూర్తి జడలు శరీరమును క్రమ్ముకొని చూచువారల కాశ్చర్యమును గొలుపుచుండును. ఇట్టి యోగీశ్వర రూపముతో నున్న యా తోకపల్లి స్వామివారిని, తోకపల్లి నివాసులగు యాదవ శ్రేష్ఠులు స్వామియందమితానురాగము గలవారు వీరయ్య, తిరిపేలు, పెదకాశిరెడ్డి మొదలగు వార లొక విచిత్ర సన్నివేశమును దర్శించిరి. వారు కట్టెలకై యరణ్యమునకు వెళ్ళగా పొదలచాటున 'నరసింహా! హరీ! నారాయణ!' యని మార్మ్రోత మ్రోగుచుండెను. ఆ ధ్వనిని, తోకపల్లి పౌరులగువారు సంభ్రమాశ్చర్యములతో వినిరి. ఎవరో హరీ! యని బిగ్గరగా నరచుచున్నారు చూతమని దిక్కులు బరిశీలింప వారి ప్రక్క పొదచాటుననే స్వామివారు 'హరీ హరీ!' యని దర్శన మిచ్చిరి. యాదవశ్రేష్ఠులు గుర్తింపలేక యెవరో తపస్సంపన్నులు నల్లమలనుండి మన ప్రాంతమునకు వేంచేసిరని దలచిరి. స్వామి బాల్యమున ఊరు విడిచి వెళ్ళిన కారణముచే వారిని గుర్తించ లేకపోయిరి.

యోగీశ్వరరూపముతో నున్న వారిముఖ కమలమును, జడలు మేఘములు సూర్యుని కప్పిన విధమున కప్పివేసెను. ఆ కారణము చేతనే వీరయ్య, తిరిపేలు స్వామికంటె వయసున పెద్దవారైనను వారి మూర్తిని గుర్తింపజాలరైరి. వెంటనే మనము వెళ్ళి మన గ్రామవాసులందర కీ విషయమును దెలిపి యందరము కలసి యరణ్యమునకు వచ్చి

స్వామివారిని ప్రార్థించియో ధ్యానించియో మొండిపట్టుతో మన గ్రామమునకు తీసుకవెళ్ళవ మని నిశ్చయము చేసికొనిరి. ఆ స్థలము వదలి తోకపల్లి చేరి గ్రామపౌరులగు, వెంగన్న, బత్తుల కోటయ్య, నాగయ్య మొదలగు వ్యక్తులందరిని గుమిగూర్చి ఇట్లు నుడివిరి:

"ఓ నాయనలారా! మనకొండ కెవరో యోగీశ్వరులు వేంచేసినారు! అణుమాత్రమైన వస్త్రము లేదు. వారి శిరోజములు జడలుగట్టి నాలుగుమూరలకు పైగా నున్నవి. వారు వెళ్లెడితటి జడ లీకుపు మండలవలె వెనుక వ్రేలాడుచు భూమిపై పడి వచ్చుచున్నవి. గోళ్ళు పులిగోరులవలెనున్నవి. మమ్ములను జూచి 'హరీ! హరీ! హరీ!' యని ముమ్మారు కేకలువేసి మేము చూచుచుండగనే యా కొండ రాళ్ళపైనుండి అమాంతముగా లోయలోనికి దూకినారు. ఆ భయంకర దృశ్యమును జూచి మా కాళ్ళుగడగడ వణకినవి. ఆ మహాత్ముని ముఖ కమలము మాదృక్కులకు గోచరింపలేదు. వారి జడలు శరీరమంతయు గ్రమ్ముకొనియున్నవ"నిచెప్పిరి. ఈ విషయమును తోకపల్లి పౌరులందరు విని "ఆహా! మనవారు దర్శించి వచ్చిన ఆ మహాత్ముని మనమందరము దర్శించి తరింతము లెండు రం"డనుచు తండోపతండములుగా కొండకు బయలుదేరిరి. యోగానందస్వామి సోదరుడగు నాగయ్య "ఆహా! ఆ స్వామిని దర్శించి జన్మచరితార్థము చేసికొనెద"నని గ్రామవాసులతో కలసి యరణ్యమునకు వెళ్ళిరి.

## శ్రీ తోకపల్లిస్వామి జన్మభూమి చేరుట

"ఏ గుట్టపై దర్శనమయ్యెదరో! ఏ లోయలో నుందురో!"యని వీరందరు గుమిగూడి చర్చించుచున్నంతలో స్వామి, వారి పైభాగ మున కొండరాతిపై నిల్చియుండిరి. తిరిపేలు, వీరన్నయను భక్తులు "అదుగో! అదుగో! స్వామి యా కొండరాతిపై నిల్చియున్నారు. మేము దర్శించి వచ్చిన యోగివర్యులువారే!" యని బిగ్గరగా బల్కిరి. తోక పల్లి ప్రజలందరు నావేశపూరితులై "చూచితిమి. సామాన్యులుకారు

కారు బాబో" యనుచు వారియొద్దకు సమీపింపవలయునని యా కొండ పైనున్న స్వామికి నలువైపుల చేరిరి. వారంద ఒక్కుమ్మడిగా స్వామిని పట్టుకొనుట కుద్యుక్తులైరి. స్వామి మౌనముగా నాసీనులైరి. ప్రజలు దాపునకు చేరులోపలనే, 'జై ! లక్ష్మీనృసింహా!' యని యా చట్టుపై నుండి యగాధముగానున్న లోయలో దుమికిరి. 'ఓయ్! బాబో' యంచు నెంతో కష్టించి కొన్ని ఘడియలకు స్వామివారున్న లోయదాపునకు చేరిరి. వీరిని చూచి లక్ష్మీనృసింహస్వామి ముద్దుబిడ్డడగు శ్రీయోగానందమూర్తి మరల "ఓం! వీరనృసింహా!" యని కొండకేకవైచి లోయలోనుండి బరబర పైకివచ్చి కొండరాతి పైకెక్కి వారిపైగా లేచి కొండరాళ్ళపై దుమికిరి. కొండరాళ్ళన్నియు జారిపోయెను. ఈ దృశ్యమును దర్శించిన తోకపల్లి పౌరు లమితాశ్చర్యమును పొందిరి. "ఆహా! మన మేమేమొ యాలోచనలు సలిపితిమి. వీరిని పట్టుకొనుట మనకు ప్రాణాంతకమే!" యని ఒకరి మొకరు పలికించుచుండిరి. వారిలో కొందరు మేధావు లొక యుపాయ మాలోచించిరి. "ఓ ఆత్మీయులారా! అపాయము నుపాయముతో సదుపాయముగా చక్కచేయవలెను. వేగిరపాటువలదు. మనమందరము వారికి దాసోహమ్మనుచు కరములుమోడ్చి వారిపాదకమలముల సన్నిధి చేరుద"మని చెప్పిరి.

శ్రీ యోగానందమూర్తి ప్రియసోదరులగు నాగయ్య వారి మాటలన్నియు విని "ఓ నాయనలారా! నేనొక విషయమును గుర్తించితిని. ఆ మహనీయమూర్తి మాటిమాటికి 'నరసింహా' యని నామస్మరణ చేయుచున్నారు. ఆ తండ్రి జపించు నామమును మన మందరము భక్తితో స్మరించుచు నాయన చెంతకు చేరుదము. మరొక విశేషమున్నది. రామాయణకాలమున శ్రీరామచంద్రమూర్తిని సుగ్రీవాంగద జాంబవంత హనుమంతాది, వానరవీరు లందరు శ్రీరామ నామస్మరణతో రామదాసులై రాముని కృపకు పాత్రులై రాము కార్యమును నెరవేర్చి యేవిధముగా మోక్షమును పొందిరో, యా

విధముగా మనమందరము నరసింహనామముతో నీ యోగమూర్తి దయను సంపాదించి యీ స్వామివారిని మనగ్రామమునకు తీసికొని పోయి నిర్మలభక్తితో వారి పాదపూజలుగావించి, వారి వేదాంత ప్రభోధామృతమును తనివిదీర పానముజేసి మన జీవితములను తరింప చేసికొందము. ఇదే సుఖప్రదమైనమార్గము ఇంతకంటె వేరుపాయము లే"దని ప్రబోధవాక్యములు పలికిరి.

నాగయ్య వాక్యములు విన్న యాదవశ్రేష్ఠులందరు భక్తితో నా యరణ్యమంతయు మారుమ్రోగునట్లు శ్రీ నారసింహా! జయ నారసింహా! యను పవిత్రనామమును స్మరించుచు నా మహనీయుని యొద్దకు చేరిరి. శ్రీరామనామమును విన్న మారుతివలె, నరసింహ నామమును విన్న యా మహాయోగి తన్మయులై నృహరి స్వరూప మును దర్శించుచు నాత్మానందులై శ్రీయోగానందులై వెలయు చుండిరి. 'ఆహా! మనము తరించితి'మను నానందముతో తోకపల్లి నివాసులైన యాదవభక్తాగ్రేసరులు, ద్వాపరయుగమున శ్రీకృష్ణ పరమాత్మను నిశ్చలమనస్సుతో నత్యంతప్రేమతో నవనీతహృదయులై నెట్లు భజించి తరించిరో యట్లే యీ కలియుగమున శ్రీ విష్ణ్వంశ సంభూతులైన యీ యోగిపుంగవు నీ యాదవులందరు నమితోత్సాహ ముతో, నత్యాదరణబుద్ధితో సేవించి తరింప కుతూహలచిత్తులై శ్రీ స్వామివారి చుట్టూచేరి నృత్యగీతములతో నా యాదవభక్తాగ్రేసరు లందరు భజించిరి. అరణ్యమంతయు నరసింహనామము ప్రతిధ్వనించెను. వారి భక్తిరసనృత్యములకు కరకుదేలిన కొండరాళ్ళన్నియు చూర్ణము లైనవి. భజనచేసెడు భక్తులలో కొందరు పెద్దలు స్వామివారెటు పోయెదరో యను భయముతో వారిపాదముల నాశ్రయించియే యుండిరి.

గ్రామపౌరుల భక్తిగీతములకు యోగానందుల మనసు స్పందించి 'జై! నారసింహా!' యని యా స్థలమును వీడి లంఘించిరి. పాదముల

యొద్ద కాచుకొనియున్న యా పదుగురు భక్తులు స్వామి లంఘించగనే మనకు స్వామియే శరణ్యమనుకొని స్వామి బాహువులను లంకించుకొనిరి. పదిమంది స్వామిని కౌగలించుకొని పట్టువీడక గట్టిగా బట్టుకొని రట్టుచెందక గుట్టుగా నరసింహ నామస్మరణ గావింప దొడంగిరి. పదిమంధితోసహా నరసింహయోగి లేచి 'జై నారసింహా!' యని కొండ లోయలో గుభిల్లున దుమికిరి. యాదవులు కపికిశోరన్యాయముగా, కదలక మెదలక స్వామిని వదలక పై ప్రాణములు పైన బోవ గ్రుడ్లు తేలవేసి గట్టిగా పట్టుకొనిరి. వీరందరు చేష్టలుడిగిన బొమ్మలవలె స్వామి నాశ్రయించుకొని మిన్నకుండిరి. స్వామివారు తన్నాశ్రయించిన పదిమందిని కసిగందనీయక కొండక్రింది భాగమునకు చేర్చిరి.

తోకపల్లి పౌరులు సంభ్రమాశ్చర్యచకితులై "నాయనా! బ్రతికితిమిరా! నూరేండ్లు నిండినవి. ఈనాటితో సరి యని యనుకున్న మనలను కసిగందక స్వామి రక్షించిరి. ఈ కరుణారసమూర్తియే దిక్కు"ని ప్రార్థించుచు స్వామివారి పాదపద్మములకు ప్రణమిల్లిరి. స్వామివారు వారిని అపారకరుణతో లేవనెత్తి గాఢాలింగనము చేసికొని "నాయనలారా! నరసింహస్వామిని భజించండి, మీకెట్టి భయములు గలుగవు. అనేక జన్మలనుండి మిమ్ము వెంబడించి యేడ్పించుచున్న పురాకృతకర్మలన్నియు బూడిదకాగలవు. మీకు భుక్తి శక్తి భవబంధ విముక్తి కలుగజేసెడి దివ్యౌషధరాజ మిది యొకటియే! ఇంతకంటె సులభమైన మార్గ మింకొకటిలేదు. భక్తియే ముక్తికి సాధనము. ప్రహ్లాద బాలుడీ మాధవ నామమును మననముచేసి ధ్యానముచేసి గానముచేసి భవబంధముల వీడి, శ్రీహరి కరుణాకటాక్షవీక్షణములకు పాత్రుడై, సర్వసుఖములతో దానవలోకమును ధర్మబుద్ధితో బరిపాలనముచేసి యంత్యమున శ్రీహరి సాయుధ్యమును పొందిరి. అదే రీతి మీరును నిర్మలమనస్కులై శ్రీహరి నామమును భక్తితో కీర్తించుడు. శ్రీహరి కథలను నాలించుడు. శ్రీహరి యాజ్ఞలను శిరసావహించుడు.

మీ జీవితములను సాధు మార్గములో నడిపించుడు. నా వాక్యములను విశ్వాసముతో పాటించు" డని ప్రబోధము చేసిరి. తోకపల్లిపౌరులు స్వామివారి యుపదేశవాక్యము లాలించి శ్రీహరినామ భజనలు చేయుచు నమితభక్తితో స్వామివారిని కొలువసాగిరి. ద్వారకానిలయు డగు నందగోపాలుడే మనల నుద్ధరించుటకై మన గ్రామమున నవత రించిరి. స్వామివారిని వదలి మనము నివసింపగలమా యను భక్తి భావములతో స్వామివారిని తీసికొని తోకపల్లి చేరిరి.

శ్రీ ద్వారాకానిలయు డగు శ్రీకృష్ణపరమాత్మను గోపకు లందరు నఖండ భక్తితో సర్వసంగపరిత్యాగులై యెట్లు సేవించి తరించిరో యదే విధముగ తోకపల్లి యాదవపౌరులందరు స్వామి నత్యంత భక్తిశ్రద్ధలతో పూజింపసాగిరి. శ్రీ యోగానందస్వామివారు భక్తితో భజనలు చేసెడి యా భక్తబృందమును కన్నులారగాంచి వారి మూఢభక్తికి సంతసించి వారికి విజ్ఞాన ప్రబోధము చేయవలయు నని సంకల్పించి వారి కీ విధముగా నాత్మప్రబోధము చేసిరి.

## శ్రీ స్వామివారు ఆత్మప్రబోధము చేయుట

"దైవాత్మ స్వరూపులగు ఓ సోదరసోదరీమణులారా! శ్రద్ధతో భక్తితో నీ వేదాంతప్రబోధమును ప్రశాంతమైన మనస్సుతో విని యశాంతిని తొలగించుకొనుడు. వినిన యుపదేశవాక్యముల నీ చోటు వీడిన మరుక్షణమే మరువక మననము చేసి యాచరణలో పెట్టుకొని జాగ్రత్త గాగ మెలంగుచు మీ జీవితమును పవిత్రవంత మొనర్చి తరింపుడు. మానవ జీవితగమ్యమును గుర్తించి మాధవనామమును మరువక జపించుచు సత్యపథగాములై కాలమును సద్వినియోగము చేయుడు. శ్రీహరి కరుణను సంపాదించి తరించు" డని దీవనలొసగి జన్మరాహిత్యమగు పరమోపదేశమును స్వామివారు వారికి ప్రబోధ మొనర్చిరి.

"వినుండు! ఎనుబది నాల్గులక్షల జీవరాసులలో మహోత్తమ మైన జన్మ యీ మానవజన్మ. ఈ జన్మయందే మోక్షమును బొంద వచ్చును. నరుడే నారాయణు డను వేదాంతసూత్రమును సార్థకము చెందించెడి సదవకాశము నాయనంతకల్యాణగుణాభరణుడు సాధుజన రక్షకుడు సర్వేశ్వరుడు కలుగజేసెను. అట్టి సదవకాశమును సార్థకత చెందింపక కాలమును వృధ చేసెడు మానవుడు మానవుడు కాడు. పశుప్రాయుడే! ఎట్టి సందేహము లేదు. మాటిమాటికి మన యిచ్ఛానుసార మీ నరజన్మ లభించినది కాదు. లభించినను శాశ్వత ముగా నుండునది కాదు. గాలిలోని దీపమువంటిది. మెఱపుకాంతివలె నాకస్మికముగా నంతరించును. నీటిపై బుడుగవలె మనకు చెప్పకయే యే క్షణమో కాలగర్భమున విలీనము కాగలదు. ఈ జన్మయందే, మానవుడు గట్టిప్రయత్నము చేసి సద్గురు కృపచే సంసారబంధముల నుండి విడివడి దైవసాన్నిధ్యము చేరుకొనవలయును...... ఈ మానవ జన్మము నూరు సంవత్సరముల కాలము జీవించు రీతిని నియమించిరి. నూరు సంవత్సరముల జీవితకాలమున సగకాల మంధకార బంధురమై రాత్రిరూపమున నిద్రచే నశించును. మిగిలిన ఏబది సంవత్సరములలో బాల్య యౌవనములలో నిరువది సంవత్సరములు నశించును. మిగిలిన ముప్పది సంవత్సరములు నింద్రియవ్యాపార మోహములచే బట్టువడి దురవగాహములయిన కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యము లను పాశములచే గట్టువడి వానిపైనుండు భ్రాంతిచే వదలిపెట్టుటకు మనస్స్పృక కామతృష్ణకు లోనై యుద్యోగవ్యాపారములలో ప్రాణ హాని యైన నంగీకరించి, భార్యాబిడ్డల గారాబు ముద్దు ముచ్చటలతో ప్రొద్దులు బుచ్చుచు కాలమంతయు వృధగ గడిపి జననీ జనకులను సకలబంధు జనములను ధనకనకవస్తువాహన సుందరములయిన మందిర ములను సుకరములయిన పశుభృత్య నికరములను వంశపరంపరా యత్తములయిన విత్తములను వర్జింపలేక సంసారమును వదలు నుపా

యము గానక సాలెగూటిలో చిక్కు పురుగులవలె గృహస్థుడు స్వయం కృత కర్మబద్ధుడై కామసుఖములకు లోనై నిజకుటుంబ పోషణ పారవశ్యమున విరక్తిమార్గము దెలియనేరక పరుల సొమ్ములను మాయోపాయములచే లాగుచు, నమ్మి వచ్చిన దాసురాండ్ర మానాపహరణము గావించుచు, లోకుల నిందించుచు, తనకు తానే పొగడుకొనుచు 'నా వారు' 'నీ వారు' 'నాది' 'నీది' యను భేదభావములతో నజ్ఞానమున గ్రుడ్డివారివలె సంచరించుచుందురు. విశ్రాంతి యెట్టులని వాపోవుచుందు రని మహాత్ము లెందరో సెలవిచ్చి యున్నారు.

"ఇంతటనైన మాయానిద్రనుండి మేల్కొని కర్తవ్యము నెరింగి పరమభాగవత ధర్మము ననుష్టింపవలయును. వృధయగు భ్రాంతులతో కాలమును వ్యర్థముచేసి కాలమృత్యువు వాడికరాళదంష్ట్రలకు గురియై కాలుని సమ్మెట పోటులచే పడరానిబాధ లనుభవించుచు శ్రీహరిని స్మరింపక మదగజమువలె కన్నుమిన్నుగానక మన్నుపై సంచరించిన ఫలము నీ నా డనుభవించుచుంటిమే దేవుడా! భగవంతుడా! యని యేడ్చిన నేమిఫలము లేదు. ముందుగనే జాగ్రత వహించి మహాత్ములను సాధుపురుషులను కులమతవర్గ విభేదములేని సత్యాత్ములను పరమ భక్తాగ్రేసరులను, భక్తితో సేవించుచు హరికథల నాలించుచు శ్రీహరి నామమును స్మరించుచు, మంచిపనులుచేయుచు సద్భావములతో సత్సంగములతో సత్యభాషణములుగలిగి సత్యదృష్టితో పవిత్రాత్ములై, సదా సద్భక్తితో మెలగుచున్న మిమ్ము శ్రీహరి తప్పక రక్షించును. సంశయము వలద" నెడి ఈ ప్రబోధామృతమును పానముచేసిన తోక పల్లి నివాసుల మనస్సులుమారి శ్రీహరి ధ్యానాసక్తులై శ్రీ యోగా నంద నరసింహస్వామియే మనకు దేశికేంద్రులని నిశ్చయించుకొని శ్రీస్వామివారి పాదకమలములను భక్తితో పూజించిరి. ఈ మహనీ యుని ప్రతిభ నలుదిక్కుల వ్యాపించెను. ఈ విధముగ కొంత కాలము గడచినది.

## శ్రీ స్వామివారు మారెళ్ళసీమకు వెళ్ళుట.

అంతలోనే మారెళ్ళసీమలో 'తిమ్మారెడ్డిపల్లె' యను గ్రామములో మహమ్మారి విజృంభించినది. కలరా స్ఫోటకాదులు తీవ్రరూపము దాల్చినవి. తిమ్మారెడ్డిపల్లె గ్రామమునసబుగారు తోకపల్లి స్వామివారి శక్తి తెలిసికొని తక్షణమే తోకపల్లి వేంచేసి స్వామివారిని దర్శించి విషయమంతయు విన్నవించుకొనిరి.

స్వామివారు కరుణాళువై వారి ప్రార్థనవిని తన సోదరుడగు నాగయ్యను తీసికొని మారెళ్ళసీమకు వెళ్ళిరి. స్వామివారికి తగు వసతులన్నియు మునసబుగారు గాఢబద్ధానురాగముతో నిర్వహించుచుండిరి. ఆ గ్రామమధ్యభాగములో నెటుజూచినను గజములోతు త్రవ్వి యందు కాష్ఠములువేసి యగ్నిని రగుల్కొల్పి యజ్ఞకుండమును మండించి యా మండుచున్న యజ్ఞకుండముపై నొక బండనువేసి యా బండపైన శ్రీ యోగానందస్వామివారు పద్మాసనాసీనులైరి. ఈ విధముగా నిరాహారులై వాయుభక్షణతో యజ్ఞదీక్షయం దుండిరి. వారం రోజులు యజ్ఞకుండము భగ్గుభగ్గున మండజొచ్చెను.

స్వామి సోదరుడగు నాగయ్య యత్యంతభక్తిశ్రద్ధలతో యోగమూర్తి సేవయే జీవితమునకు వెలుగుబాటని మదినెంచి యన్నగారికి ప్రదక్షిణములు చేయుచు నరసింహనామోచ్చారణ గావించుచు నన్నగారిని దైవమని భావించి వారియాజ్ఞలను శిరసావహించి యన్నయే దిక్కని భజింపదొడగెను.

ఆ గ్రామపౌరులు భయభక్తులతో యజ్ఞదీక్షయందున్న యోగమూర్తికి ప్రదక్షిణములు చేయసాగిరి. నేయి బుంగలుదెచ్చి యందు వేయసాగిరి. యజ్ఞాగ్ని విజృంభించెను. అగ్నిశిఖలన్నియు స్వామిచుట్టును ప్రదక్షిణములు చేయసాగెను. వందలకొలది నారికేళములను రాత్రింబవళ్ళు విసుగులేక పగులగొట్టికుండమున వేయసాగిరి. నాగయ్య యజ్ఞము

చుట్టూ నరహరి నామస్మరణతో ప్రదక్షిణములు చేయుచు భజన చేయ సాగిరి. యజ్ఞకుండము మహోజ్జ్వలముగా మండుచుండ, మధ్యభాగమున చిన్నబండ నొకదానిని వేసిరి. ఆ బండపైన స్వామివా రచంచలమైన యోగనిష్ఠలో నాసీనులై మనస్సును పరబ్రహ్మయందు చేర్చి కదలక మెదలక ప్రాణవాయువును వదలక మౌనము వహించి దర్శించెడి ప్రజలకు సంభ్రమాశ్చర్యములు గలుగ చేయుచుండిరి. వారమురోజు లదే విధము యజ్ఞాగ్ని మండసాగెను. గ్రామపౌరులెల్లరు భయకంపిత హృదయములతో నరహరి భజనలొనర్చిరి. ఈ వారమురోజులు కన్నులు విప్పకయే యజ్ఞదీక్షయం దుండిరి. ఆ సమయమున వారి ముఖబింబము బ్రహ్మవర్చస్సుతో సుప్రసన్నమై కోటిసూర్యుల కాంతితో బ్రకాశించెను.

వారమురోజులు గడచునప్పటికి కలరా యాగిపోయెను. యజ్ఞదీక్షయందున్న వీరనృసింహామూర్తిని మేల్కొలుపుటకై గ్రామవాసులందరు "జై నృసింహాస్వామికిజై, తోకపల్లిస్వామికి జై"అను నినాదములొనర్పగా నవి యాకాశమంటినవి. నాగయ్య స్వామికర్ణముల యొద్ద శంఖమును "భోం భోం"మ్మని యూదసాగిరి. జేగంటలు మంగళ వాద్యములు ప్రయోగించిరి. పూలమాలలు కుప్పతెప్పలుగా వేసిరి. స్వామివారు బాహ్యప్రకృతిని వీడి పరమాత్మయందు కేంద్రీకరణ చేసిన మనస్సు శంఖనాదమునకు బాహ్యప్రకృతి చెందదయ్యెను. నాగయ్య మఱికొందరు వ్యక్తులు స్వామివారి వద్దకుచేరి "ఓం! ఓం! ఓం!" అని ప్రణవశబ్దము నుచ్చరించిరి.

ఈ ప్రణవనాదమునకు స్వామివారు హంసను యథాస్థానమునకు చేర్చిరి. పురజనులందరు నమితానందముచెంది స్వామిని వేనోళ్ళ పొగడుచు, నందముగా పూలమాలలతో నమర్చిన తేరుబండిపై సుఖాసీనులను గావించి, మేళతాళములతో నృసింహానామ భజనలతో, నగరు ధూపములతో, కర్పూర నీరాజనములతో, నారికేళ నైవేద్యము లర్పించుచు నమితోత్సాహముతో నూరేగింపు గావించిరి.

మరునాడుదయమున స్వామివారికి పాదపూజలుచేసి యా గ్రామ మునసబుగారు భక్తితో చంద్రునకు నూలుపోగన్న సామెతగా నొక గోవు నొసంగి "ప్రేమోపాయనము స్వామీ! తప్పక తమరు స్వీకరింపవలయు"నని ప్రార్థించిరి. "గోవు ధర్మదేవత"యని వారికానందము గలిగించుటకై యా గోమాణిక్యమును స్వామివారు స్వీకరించిరి. ఆ గోవును స్వామివారివెంట నొకమనిషినిచ్చి పంపించుచు స్వామి యాదేశ ప్రకారము తోకపల్లి చేర్చిరి.

అంతలో కంభము తాలూకా "రావిపాడ"ను గ్రామమున కలరావ్యాధి విజృంభించినది. ప్రళయనాట్యము సేయుచు మహామ్మారి వికటాట్టహాసముతో జనులను తన పొట్టన బెట్టుకొనుచుండెను. కలరా వ్యాధికి గురియై అసువులను బాసిన కళేబరములను బండ్లతో తోలి గుండ్లకమ్మనదిలో దొర్లించుచుండిరి. ఆ గ్రామమంతయు దిక్కుచెడి గగ్గోలెత్తుచుండెను. రావిపాడు గ్రామమునసబు శరభారెడ్డి "కంభము" మునసబు బుసారెడ్డిని తీసికొని స్వామివారియొద్దకు వచ్చిరి. ప్రేమ పూర్వక నమస్సు లర్పించి భక్తితో సేవించి వారి యాపదను తెలియ చేసి దీనాతిదీనముగా ప్రార్థించిరి. స్వామివారు వారిని కరుణించిరి. స్వామివారిని రావిపాడు గ్రామమునకు తీసికొని వెళ్ళిరి.

స్వామివారు వెళ్ళినప్పటి కా గ్రామము భీభత్సమై చూచుటకే భయముగొల్పుచుండెను. ఏమూలజూచినా రోదనధ్వనులే! ఎవ్వరిని చూచినను విషాదముతో నుండెడివారే! ఇట్టి విషమపరిస్థితులకుగురియై దిక్కుచెడియున్న యా గ్రామవాసులనుచూచి శ్రీ యోగానందమూర్తి దయతో వెంటనే గ్రామమధ్యభాగములో యజ్ఞగుండమును త్రవ్వించిరి. కాష్ఠములువేసి యగ్నిని ముట్టింపగా మహోజ్జ్వలముగా మండుచుండెను. ఆ యజ్ఞగుండమున చిన్నబండను బరచిరి. ఆ బండపై శ్రీ యోగ నృసింహమూర్తి సుఖాసీనులైరి. అగ్నిశిఖలు ఎవ్వరిని దరిచేరనీయక యూర్ధ్వముఖమైనవి. యోగమూర్తులగు స్వామివారు అచంచలమగు

యోగనిష్ఠలో నుండిరి. గ్రామవాసులందరు నఖండభక్తితో నరహరి నామభజన యొనర్చుచు స్వామి చుట్టు ప్రదక్షిణములు చేయసాగిరి. గ్రామీణ ప్రజలు దెచ్చిన నారికేళములను నాగయ్యా తీసికొని పగుల గొట్టి యజ్ఞాగ్నికి సమర్పణ చేయుచుండిరి. ముత్తైదువులు పసుపు కుంకుమలు పూలు పాలు పండ్లు మొదలగు వస్తువులను యజ్ఞగుండమం దిడి ప్రణామము లొనర్చిరి. గ్రామాధికారియగు బుసారెడ్డిగారి ధర్మ పత్నికి కలరా సంభవించినది. ఆమెపై నాశలు వదలి నిరాశతో నిస్పృహతో పరుగుపరుగుగ యజ్ఞగుండము నొద్దకువచ్చి యజ్ఞదీక్షలో సమాధినిష్ఠలో మంటలమధ్య ఆసీనులైయున్న యోగానందమూర్తి చుట్టును ప్రదక్షిణములుచేసి ప్రార్థించిన బుసారెడ్డిని, యోగదృష్టితో గుర్తించిన యా మహాయోగి, సంకల్పమాత్రమున త్రుటికాలములో బుసారెడ్డి ధర్మపత్ని కావేసించిన కలరావ్యాధిని శాంతింపచేసెను.

స్వామివారు పదునైదు రోజులు దీక్షయందుండిరి. రోజు దీక్షను విరమించిరి. ఈ పదునాల్గురోజులు స్వామివారి కన్న పానీయములు లేవు. నిరాహారులైనను నా జితేంద్రియులు బ్రహ్మ వర్చస్సుతో ప్రకాశించిరి. పదునారవనాటి మధ్యాహ్న సమయమున నా గ్రామ మధ్యభాగమున నొక బొడ్డురాతిని బిగించి మంత్రములు చదివి యాశీర్వాదము చేసిరి. ఆ యూరిలో స్వామి యాజ్ఞప్రకార మానాటినుండి యీనాటివరకు కలరా వ్యాధులు తలయెత్తలేదు.

అది యా మహనీయుని యాజ్ఞయే! ఆనాటి సాయంత్రమున బీదల కఖండముగా నన్నదాన మొనర్చిరి. ఆ రాత్రియే స్వామివారి నమితభక్తితో నొక పీఠముపై సుఖాసీనునిచేసి మంగళవాద్యములతో నృసింహ భజనలతో స్వామివారిని పూలమాలాంకృతుని చేసి శ్రీ యోగానందమూర్తిని గ్రామమంతయు నూరేగింపు గావించిరి. గ్రామప్రజలందరు నా యుత్సవమున పాల్గొని యమితానందము పొందిరి. ఆ రావిపాడు మునసబుగారు స్వామియందు మిక్కుటమైన

భక్తి గలిగి "ఆహా! మా పాలిటి దైవమే! కాకున్న ఘోరాపదకు గురి కాబోవు నా భార్య జీవించునా! ఇదంతయు నీ యోగానంద మహర్షి యపారకృపయే! వారి అపార దయయే మమ్ము రక్షించినది. ఈ లోకోత్తర పుణ్యమూర్తిని మేమెన్నటికిమరువ"మనుచు నాసతిపతులమితానురాగముతోసేవించి స్వామివారి సంచారమునకుయోగ్యమగు భోగ్యమగు నొక మేనా బండిని తయారు చేయించిరి. ఆ మేనా బండికి చుట్టును నద్దములు నమర్చి చూచుట కెంతో యింపుసొంపుగా రమణీయముగా తయారు చేయించి స్వామివారికి ప్రేమోపహారముగ సమర్పించి ధన్యజీవులైరి ఆ మేనా బండికి జత యెద్దులను స్వామివారి కొసంగిరి. ఆహా! యేమి వారి త్యాగశీలము! స్వామివా రణువైనను కోరువారు కాదు. కోరకున్నను నా సర్వేశ్వరుడే, సర్వమును సమకూర్చుననుట కి సిద్ధమూర్తియే మనకు ప్రత్యక్ష నిదర్శనము.

ఈశ్వరుని కరుణ ప్రసరింపనినాడు కోరుకొన్నను లభించునది గాదు. ఈశ్వరకృప కలిగిననాడు మానవుడు సర్వసౌఖ్యములను పొంద గలడు. మాధవుడే సర్వకార్యభారమును వహించి నిజభక్తుని యోగ క్షేమములను చూచుకొనుచు సదా కాపాడుచుండును. రావిపాడు మునసబుగారొసంగిన యెద్దాల మేనాలో సుఖాసీనులై శ్రీ స్వామి వారు బహుగ్రామములలో చెలరేగిన కలరా వ్యాధులను హత మొనర్చిరి. అనేక జన్మలనుండి వెంబడించి యేడ్పించెడి మొండి వ్యాధులను సైతము శ్రీ యోగానందమూర్తిగారు త్రుటికాలములో సమూలముగా నాశనమొనర్చుచుండిరి. స్వామి వెనువెంట సదా నెందరెందరో భక్తు లనుసరించుచు వారి యాత్మప్రబోధములను విని పరమానందము చెందసాగిరి. పీడపిశాచమారి గణముల వలన బాధ పొందెడి మానవుల నెందరినో సంపూర్ణారోగ్యవంతులనుగా నొనర్చి రక్షించిన కరుణాస్వరూపులు శ్రీ స్వామివారు.

## శ్రీ స్వామివారు కపిలగిరికి వేంచేయుట

### శ్రీ గజారణ్య సంహితాంతర్గత శ్రీ కపిలక్షేత్రమహిమ

శ్లో. కృతయుగే గజారణ్యః త్రేతాయాం మాధవీపురీ
ద్వాపారే స్వర్గసోపానం కల్యుగే మారికాపురం॥

శ్రీ పరమపావనమైన భరతఖండములో శ్రీ మహాక్షేత్ర శ్రీశైల పుణ్యభూమి కాగ్నేయ దిగ్భాగమున మారికాపుర సమీపమున గుండికానది ప్రక్కనే కమలాగిరి యను చన్నమల గలదు. ఆ గిరికి కొలదిదూరమున 'అమ్మవారిపల్లె' యనెడి చిన్న గ్రామము కలదు. ఆ పవిత్రగిరిపై పూర్వము కృతయుగమందు మార్కండేయ మహాముని సమస్త తీర్థములు దర్శించుచు గ్రుంకులిడుచు కొద్దికాలము నివసించి ధ్యానమయులైనందున పరమశివు డుమాసహితుడై యిచ్చటికి కరుదెంచిరి. పరమ భాగవతు లెచ్చటెచ్చట నివసింతురో యచ్చటచ్చట భగవంతుడు నివసించును. ఈ పరమ పవిత్రపుణ్యస్థలమగు శ్రీ కపిలగిరియందా నాటినుండి యీ నాటివరకు ధ్యాననిష్ఠయందు సుస్థిరులైన పరమ తపోధనులకు మాత్రము దివ్యదర్శన మొసంగుచు నదృశ్యాకారుడై యున్నాడు.

మఱి కొంతకాలమునకు దేవహూతి సత్పుత్రుడైన శ్రీ కపిల మహర్షి దివ్యదృష్టితో నీ స్థలమహిమను తెలిసికొని ఇచ్చటికి యోగ మార్గమున విచ్చేసి గుండికనదీ జలములందు స్నానమాచరించి కొండపైన నివసించి యంతర్లింగారాధన చేయుచు శ్రీ మహావిష్ణునియందు మనసు చేర్చి తన్మయులైరి. అట్టి స్థితియందు శ్రీ మహావిష్ణువు మహర్షికి ప్రత్యక్షమై శ్రీ లక్ష్మీ సమేతముగా నీ గిరియందు నివసించి భక్తకోటి సంకల్పములు నెరవేర్చుచు నిప్పటికి గిరిపైన నెలకొనియుండిరి. యది మొదలీ క్షేత్రము 'కపిల క్షేత్ర' మని, కొండ సమీపగ్రామము 'కమలాపుర' మని, సన్నిధి సరస్సును కపిలతీర్థమని వాకొనుచుందురు.

త్రేతాయుగమున శ్రీ సీతారామలక్ష్మణులు ధర్మసంస్థాపన కొరకు పర్యటించుచు నీ క్షేత్రమునకు వచ్చి సరస్సులో స్నానమాచ

రించి కొండపై వెలసిన శ్రీ మహావిష్ణువు నారాధించి కొంత కాల మిచటనే నివసించిరి.

ద్వాపరయుగమందు శ్రీకృష్ణపరమాత్మ తీర్థాటనము చేయుచు నీ క్షేత్రమును దర్శించి కొనియాడి యిచ్చటనుండు దుష్టరాక్షసుల మదమడంచి దేవాగారములను క్షేత్రరూపములుగా మార్చి సమస్త ప్రజలలో దైవభక్తి యాస్తికతలను నెలకొల్పెను.

ఈ కలియుగమందు శకపురుషులచే వేనోళ్ళ కొనియాడబడు చుండగా కొంత కాలము క్రిందట దుండగీంద్రచే నీ క్షేత్రమునకు మార్పు కలిగెను.

1886 వ సంవత్సరమున మార్కాపురము తాలూకా తోక పల్లిలో కారణజన్ములై యవతరించి సుబ్రహ్మణ్యనామధేయముతో దినదినాభివృద్ధి గాంచుచు పూర్వజన్మ తపఃఫలవిశేషమున పంచదశ వత్సరప్రాయమున నిర్హేతుకముగా మద్రాసు అవధూత శ్రీ సచ్చి నంద మహామునివలన దివ్యజ్ఞానమునుపొంది ఐహికసుఖములను తృణ ప్రాయములని త్యజించి దేహాభిమానమును దిగవిడచి యీ కొండపై జితేంద్రియులై తపమాచరించి సత్యవస్తువగు పరమాత్మ సాక్షాత్కా రమును పొందుచు నరహరి రూపమును సదా దర్శించుచు తాను నరహరియై దివ్యశక్తులతో ప్రకాశించి దశదిశల వెలుగొందిరి.

కొన్ని వత్సరములే ధ్యానసమాధిలో నుండిరి. అట్టి పరమ పవిత్ర దశలో శ్రీ నృసింహస్వామి సుప్రసన్నుడై "భక్తాగ్రేసరా నా పూర్వస్వరూపము నిచట ప్రతిష్ఠచేసి నన్నారాధించుచుండిన నీకు సకల సిద్ధైశ్వర్యములు ప్రసాదింతును. దేహాంతమున నాలో నైక్య మొందెదవు. నీకు నాకు భేదములే" దని చెప్పి స్వామి తిరోహితుం డయ్యెను. అది మొదలు మన కథానాయకు లగు శ్రీ సుబ్రహ్మణ్య యోగీశ్వరమూర్తి యీ గిరిపై స్థిరనివాస మేర్పరుచుకొని శ్రీ లక్ష్మీ నరసింహ దేవాలయమును కట్టించి తన యిష్టదైవమగు శ్రీ లక్ష్మీ

నరసింహదేవుని ప్రతిష్టించి నిత్యపూజలు చేయుచు నిత్యనైవేద్య దీపారాధనలు ప్రియశిష్యులచేత చేయించుచు కొండయొద్దనున్న కపిల తీర్థమును కొండరాతితో కట్టించిరి. సద్భక్తులిచ్చు భూదానములు పరిగ్రహించి స్వామిపేరిట దఖలు చేయించుచు వచ్చు నాదాయమును శ్రీ స్వామి విభూతి కైంకర్యమునకు వినియోగించుచు శ్రీ నరసింహ యోగి యని, శ్రీ యోగానంద మహర్షి యని సాధుపురుషులచే కొనియాడబడుచుండిరి.

శ్రీ యోగానందస్వామివారు ఈ కపిలగిరికి వేంచేయువరకు కొండంతయు ముండ్లపొదలతో గచ్చకోరింద గురివెంద చెట్లతో క్రిక్కిరిసి క్రూరసర్పముల కాలవాలమైయుండెను. శ్రీస్వామివారియెడ నమితానురాగభక్తిగలిగిన వ్యక్తి మార్కాపుర నివాసులగు శ్రీ ఆకుల గురవయ్యగారు. సద్గురు స్వామి విషయము విని పరుగులతో కొండకు పోయి స్వామి యాజ్ఞానుసారము కొండపైనున్న ముండ్లపొదలను నరికివేసి రాళ్ళన్నిటిని బాగుచేసి పరిశుభ్ర మొనర్చిరి. ఈ పనిని నిర్వహించిన పిమ్మట స్వామివారిని దర్శించిరి.

కరుణమూర్తి యగు, యోగానందమూర్తి గురవయ్యను చూచి 'నాయనా! సుఖముగా నుంటివా' యని యడుగగా "స్వామీ! తమ దయ యున్నంతకాలము మాకే లోటును గలుగదు ప్రభూ!" యని విన్నవించిరి.

స్వామివారు వారి శ్రమను గుర్తించి సంతోషమున "నాయనా! పుణ్యకర్మ లన్నిటిలో సాధుసేవయే మిన్నయైనది. అట్టి మహోన్నత మగు సాధుసేవ, భగవత్కైంకర్యమునకు వీలగు నవధి నేర్పరచిరి. మీ సేవపుణ్యవంతమైన"దని ఆనందమును వెలిబుచ్చిరి.

ఆ పవిత్రస్థలమున స్వామివారు మట్టితో భగవన్మందిరము నేర్పరచి నృసింహస్వామిపటము నమర్చి దీపారాధనలు గావించి పూజాది కార్యక్రమములన్నియు సక్రమ విధానముతో నిర్వహించుచుండిరి. ఆ యోగమూర్తి నిర్వికార పరబ్రహ్మానుభవము పొందినను,

రకరకములగు మానవులు తరించుటకై ప్రప్రథమమున నాలయు స్వామిపై మనస్సు లగ్నముచేయుట సాధ్యముకావలయును. తదుపరి క్రమముగా మనస్సును స్వాధీనము చేసికొని సగుణోపాసనను త్యజించి నిర్గుణోపాసన యొనర్పవలయునను నాశయముతో నా యోగమూర్తికి విగ్రహారాధన యవసరములేకపోయినను నిజభక్తుల యోగక్షేమముల నిమిత్తమై విగ్రహారాధనను విధిగా నొనర్చిరి. నిత్యము భగవానుని ప్రార్థించి కీర్తనముచేసిరి. ఇవన్నియు తన్ను నమ్మివచ్చెడి భక్తసంఘముల నుద్ధరించుటకేగాని తన నిమిత్తముకాదు. దేహాలయమున దేవుడున్నాడను తత్త్వమును పరిశోధించి యదార్థస్వరూపమును సాక్షాత్కారము పొందిన మహనీయమూర్తి శ్రీయోగానంద మూర్తి.

భక్తులందరు కొండపై మృణ్మయమందిరములో ఆసీనులై నృసింహస్వామి భజనలు గావింపసాగిరి. నలువైపులనున్న పల్లెటూళ్ళ ప్రజలందరు నమితముగా కొండకు రాజొచ్చిరి. కలరా వ్యాధులతో, పలువిధములగు బాధలతో నలసిసొలసిన వారెందరో స్వామివారి పాదముల నాశ్రయించి స్వామి దయకు పాత్రులై యారోగ్యవంతులై యాత్మశాంతిని పొంది హాయిగా నానందముగా నృసింహ నామమును స్మరించుచు సద్గురుదేవుల యోగశక్తిని కొనియాడుచు స్వగృహములకు చేరుచుండిరి.

ఆ కొండకు వందలాది ప్రభలు కట్టుకొని కొండకు చేరి మేళతాళములతో దీపధూప నైవేద్యములతో నరహరి భజనలు చేయుచు గోవిందలు గొట్టుచు గిరికి ప్రదక్షిణములు చేయుచుండిరి. వందలకొలది కుంకుమబండ్లు వివిధాలంకరణలతో గిరిచుట్టూ తిరుగుచుండెను. కొండకు నలువైపుల నెటుజూచినా నరసింహనామభజనలే! ఎవరిని చూచినను నృసింహావేశపూరితులై 'హరీ! శ్రీహరీ!' యని కేకలు వేయువారే. ప్రజాప్రవాహముతో కొండంతయు మునిగిపోయెను. ఆ యుత్సవములు, నా భజనలు చూచితీరవలయునే గాని వ్రాయనలవికాదు. శ్రీహరి

నామోచ్చారణతో కొండంతయు ప్రతిధ్వనించినది. కొండ ప్రణవ శబ్దములతో మార్మ్రోగిత మ్రోగినది. ఆ దృశ్యములను గాంచినవారే నిజముగా ధన్యులు.

గిరిపైన నిర్మించిన మృణ్మయమందిరమున దేవుని యర్చనకై భక్తులను నియమించి జన్మభూమియగు తోకపల్లికి వేంచేసిరి. తోకపల్లి పౌరులందరు నమితానందమును చెంది "ఆహా! మనస్వామి మన గ్రామమునకే వేంచేసిరి. మన పూజలు ఫలించినవి. మన జన్మలు ధన్యవంతములైన" వని యమితానందముతో 'కమలమును చేరు తుమ్మెదల' వలె నా మహాత్ముని పాదకమలముల సన్నిధిని చేరిరి.

## శ్రీ యోగానందమూర్తి తోకపల్లిలో యజ్ఞము చేయుట

శ్రీ స్వామివారి పెదతండ్రి కుమార్తె నాగమ్మ సాధ్వి. భక్తుల సహాయ సంపత్తితో కష్టించి శ్రమకోర్చి పట్టుదలతో పనిచేసి యీ తోకపల్లిలో నొక మఠమును నిర్మించెను. ఆ మఠమందే శ్రీ యోగానంద నరసింహస్వామివారు నివసించుచుండిరి. కొన్ని రోజులు సాగిన పిమ్మట స్వామివా రా మఠము ముందుభాగమున యజ్ఞగుండమును త్రవ్వించి యథావిధిగా హోమము చేయుచుండిరి. ఈ యజ్ఞమహోత్సవమును వీక్షించుటకు చుట్టుప్రక్కల గ్రామవాసు లందరు నేతెంచుచుండిరి. తోకపల్లి యొక యాత్రాస్థలముగా మారి పోయెను.

ఏనాటి కే స్థలమున కే భోగమో! ఏనాటి కే ప్రాణి యెట్లు మారునో! ఇది యా సర్వేశ్వరునికే యెరుక. ఆహా! దైవలీల లెంత ఆశ్చర్యకరమైనవి. సామాన్యు లేమేమో యనుచుందురు. కనురెప్ప పాటు కాలమున నే ప్రాణి కేమగునో యెవ్వరికిని దెలియదు. తెలిసి కొనవలయు నన్నచో తన యాత్మను తాను సాక్షాత్కరించుకొన వలయును. దైవానుభూతిని పొందినట్టి మహనీయమూర్తి సద్గురు

శ్రీ యోగానందమూర్తి, త్రికాలవేదులు! బ్రహ్మజ్ఞాన సంపన్నులు! యోగశక్తు లన్నిటి నార్జించిన ధీశాలురు! అపరప్రహ్లాదమూర్తులు! ఆహా! సర్వశక్తి సంపన్నుడగు శ్రీమన్నారాయణుని సాక్షాత్కరింప చేసికొనుట సామాన్యమైన పనియా? ఎట్టి మనోనిశ్చలత కావలయును! వర్ణించుట బహుకష్టతరము. జన్మాంతర మహాపుణ్యమున నవతరించిన యోగమూర్తియే మన సద్గురుమూర్తి అట్టి మహనీయమూర్తిని భక్తితో పూజించి తరించవలయును. వారి యాశ్రయము పొంది వారి కృపకు పాత్రులము కావలయును. వారి మహోపదేశములను విని మరువక మననము చేసి యాచరణలో నుంచుకొని యనుభవమును పొంది సంపూర్ణ ఫలమును పొందవలయును. అట్టి ఫలమును పొందిన నాడే మనము సద్గురువు నాశ్రయించిన యాశయము సఫలమైనట్లు. లేకున్న నూసరక్షేత్రమున నాటిని విత్తనములవలె మాశ్రమయంతయు వృధాయగును. సద్గురువు నాశ్రయించుటే మోక్షప్రాప్తికి తరుణోపాయము, నుత్తమగతికి మార్గము. అట్టి యాశ్రయము లభించినచో మోక్షము కరతలామలకమగును.

శ్రీ యోగానందస్వామి కొన్నిరోజులు యోగనిష్ఠయందుండి దిగ్గునలేచి త్రినేత్రధారియై యాకాశమువంక జూచుచు "శ్రీహరీ! సూర్యనారాయణా! వేదపారాయణా! లోకరక్షామణీ! దైవచూడామణీ!" యని దోసిలొగ్గిరి ఆ దోసిలిలో సూర్యలోకమునుండి యొక 'త్రిశూలము' 'తాటియాకుల గ్రంథము' నవతరించినవి. ఈ దృశ్యమును వీక్షించెడి భక్తులందరు బొమ్మలవలె నివ్వెరపాటుతో చూడసాగిరి. ఈ మహాత్ముని ప్రతిభ పండువెన్నెలవలె ప్రకాశింప సాగినది. ఈ యోగిపుంగవుని దర్శించుటకు వేలకొలది ప్రజలు తోకపల్లికి విచ్చేయుచున్నారు.

వచ్చిన ప్రజలందరు మఠము నానుకొనియున్న దిగుడుబావిలో స్నానములుచేసి స్వామివారిని సేవింపజొచ్చిరి. ఆ దిగుడుబావి నీరే

యీ గ్రామప్రజలందరు మంచితీర్థమునకు వాడుకొనుచుందురు. దిగుడు బావిలో భక్తులందరు స్నానములు చేయుట మెండాయెను.

ఎంతటి యోగీశ్వరులైనను, బ్రహ్మజ్ఞాన సంపన్నులయినను సామాన్య ప్రజలు వారిశక్తిని తెలిసికొనలేకపోయిరి. "మంచిని తెలిసి కొనుట, సత్పాత్ములను గుర్తించుట, సాధుమార్గము నవలంబించుట, యజ్ఞానులకు బహుకష్టము. ఏదో కొంచెము విభూతి మంత్రించి తీర్థము లొసంగుచు, పాదపూజలు చేయించుకొనుచు, కానుకలు స్వీకరించుచు శక్తి లేకపోయినను భుక్తికొరకు తాత్కాలికభక్తిని ప్రదర్శించి తాంత్రికశక్తుల నుపయోగించి పంచదార పటికబెల్లములు సృష్టించిన ట్లొనర్చిన తమ కోర్కెలీడేరునని భ్రమించి మానవులెందరో వారి పాద దాసులై బ్రహ్మరథము పట్టుచున్నారు. ఎవరేమి చేయగలరు ? కలి కాల ప్రభావము వారివారి గ్రహచారము. క్షణికమైన తాంత్రికశక్తు లకే ప్రపంచము తలలొగ్గి జోహారులుచేయును. నిష్కల్మషమగు దైవ శక్తినే తన వశము చేసికొని భగవత్ప్రబోధముచేసెడి శ్రీ యోగానంద స్వామివారిని సామాన్యభక్తులు గుర్తించరైరి. దిగుడుబావియొద్ద ప్రజల యలబడి మిక్కుటమయ్యెను. ఈ యలజడినిచూచి యెవరో యజ్ఞానముతో "ఏమి యజ్ఞము ? ఏమిపూజలు ? ఏమిభజనలు ? వీని వలన భుక్తివచ్చునా ? ముక్తి లభించునా ? మన స్వామివారి యజ్ఞము వలన మన బావి నీరంతయు మలినమగుచున్నది. ఎక్కడెక్కడివా రందరు వచ్చి పనిలేక తిరుగుచు పనులుచేసికొనువారిని పాడుచేయు చున్నా"రని వారిలో వారు గుసగుసలు ప్రారంభించిరి. ఈవిషయమును స్వామివారు తెలిసికొని "మనవలన కొందరకు బాధకలిగినది. ఈ స్థాన మున నివసింపరా"దని యెంచి యాంతరంగిక విషయము నెవ్వరితో చెప్పకయే తోకపల్లి వీడి మార్కాపురమునకు ప్రయాణమైరి.

## శ్రీ స్వామివారు తోకపల్లి వీడి మార్కాపురము చేరుట

మారికాపురము చేరిన శ్రీస్వామివారు మారుతీ యాలయమున పద్మాసనాసీనులై యోగముద్ర వహించిరి. "ఎవరో మహనీయులు మన యాలయమున నున్నా"రని ప్రజలందరు మారుతీ యాలయమున ప్రవేశించి ముద్రభావముతోనున్న యోగీశ్వరమూర్తిని దర్శించి యాశ్చర్యచకితులైరి. భక్తులు స్వామివారిని వీక్షించి చుట్టును ప్రదక్షిణలొనర్చి సాష్టాంగ ప్రణామము లర్పింపసాగిరి. స్వామివారు భక్తుల యలజడిని గాంచి కన్నులు విప్పగా నచ్చట మూగిన జనులందరు "స్వామీ! మే మర్థముగాని వ్యాధులతో నలమటించి పోవుచున్నా" మని ప్రార్థించిరి. స్వామివారు వారిపై కరుణబూని "భక్తులారా! మిమ్ము శ్రీహరి రక్షించును. భయము వలదు. ఈ మంత్రతీర్థమును పుచ్చుకొనుడు. మీ మనోవ్యాధులు సమూలముగా నణగిపోవును. మీ పురాకృత దోషములన్నియు భగ్గునమండి పోగల" వని చెప్పిరి.

ప్రజలందరు నమితానందముతో అపారవిశ్వాసముతో స్వామివారొసగిన మంత్రతీర్థమును పుచ్చుకొని స్వగృహములకు చేరుచుండిరి. ఆహా! యేమి యా యోగమూర్తి దివ్యశక్తి! వర్ణనాతీతమైనది. మంత్రతీర్థమును స్వీకరించిన వారెల్లరు రోగవిముక్తులై యాత్మశాంతిని పొందుచున్నారు. పరుసవేదిని స్పృసించిన ఇనుము సువర్ణమగురీతి దగ్ధకర్ములై వారు సంతోషించుచుండిరి. ఘోరవ్యాధులకు గురియైన మానవు లెందరో శ్రీ యోగానంద నరసింహయోగీశ్వరు పాదస్పర్శచే పవిత్రులై పరిపూర్ణారోగ్యవంతు లగుచుండిరి. అనేక జన్మలనుండి వెంబడించి వేధించెడి పురాకృతకర్మలన్నియు స్వామివారి యాశీర్వాద శక్తివలన మటుమాయ మగుచుండెను.

స్వామివారేస్థలమందు నివసించిన నా స్థలము పరమపవిత్రమై కాశీ ప్రయాగలవలె పుణ్యక్షేత్రమై వెలుగొందుచుండెడిది. మఠము వీడిపోయిన క్షణమునుండి యక్కనాగమ్మగా రన్నపానీయములు వర్జించి "నా దేవుడు లేని మఠమున నేనేరీతిని నివసింపగల"నను నావేద

నాందోళనావేశములతో మార్కాపురము చేరి మారుతీ యాలయములో నున్న స్వామివారిని కన్నులార దర్శించి దిగ్భ్రమ చెందెను. "ఆహా! ఇట్టి మహనీయమూర్తిని పోగొట్టుకున్న వారెంత దురదృష్టవంతులో కదా! కొలనున కమలము నొద్దనే నివసించెడి కప్పలు కమలమధ్యమం దున్న మకరందము నెరుంగని రీతి నీ మహనీయుని శక్తి మేము తెలిసి కొనమైతిమి కదా! మాదురదృష్టమట్లున్న" దని పొంగి పొరలెడి దుఃఖమును గ్రింగుకొన జాలక స్వామివారి పాదములపై వ్రాలి కన్నీరుగార్చుచు నామె కుమిలి కుమిలి యేడువసాగెను.

శ్రీస్వామివారు, పాదములపై వ్రాలిన నాగమ్మతీరుజూచి "ఎందుల కమ్మ ఇటుల దుఃఖించెదవు! నీ వేమి యపచార మొనర్చితి" వన నాగమ్మ యంజలిఘటించి వినయవిధేయతలతో భక్తిశ్రద్ధలతో ప్రార్థించి "తండ్రీ! నే నపచారము చేయుదునా? ఎవరో తమశక్తి తెలిసికొనక యజ్ఞాన ముతో దిగుడుబావి నీరు చెడిపోవుచున్నది. స్వామి కారణముగనని యెవరో కారుకూతలు కూసిరి. వారి కర్మవారే యనుభవించెదరు. నా ప్రార్థన మాలించి తోకపల్లి మఠమునకు దయచేయవలయును. మిమ్ముపూజించి తరించెదము స్వామీ!" యని దీనాతిదీనముగా వేడు కొనెను. పాదముల యొద్దనున్న నాగమ్మతో స్వామివారు "పోనమ్మ! నీ భక్తి యచంచలమైనది. నీవు పవిత్రురాలవు. నే నెరుంగుదును. త్యజిం చిన మఠమునకు తిరిగిరాను. నామాట సత్యము ఇందులకు తిరుగు" లేదని చెప్పిరి. స్వామివాక్యముల సారాంశము గ్రహింపక యా మఠమునకు రావలయునని నాగమ్మ మొండి పట్టుపట్టెను. ఈమెను పంపివేయవలయు నను సంకల్పముతో ఈ నాగమ్మ యదృష్టము సరిగాలేక స్వామివారి నోట యప్రయత్నముగా నీ వాక్యములు వెలువడినవి. "అక్కా! మాటిమాటికి మఠమనబోకుము. ఎందులకీవ్యధ! నీ మఠముమండ! నేనురానమ్మ" స్వామివారి మనస్సును గుర్తించిన నాగమ్మ గడగడ వణకుచు "సరే! నాయనా! సెల" వనుచు తోకపల్లికి చేరెను.

శ్రీ స్వామివారు నాగమ్మతో నీ మఠముమండ యను సమయ మందే తోకపల్లిలో మఠము భగ్గునమండి భస్మమయ్యెను. ఈ దృశ్య మును గాంచి "ఆహా! స్వామివారిని శంకించినఫలమే మనమందర మను భవించుచున్నాము. ఈ క్షణమే వెళ్ళి క్షమాభిక్ష కోరుకొంద"మని తోకపల్లి గ్రామవాసులందరు స్వామివారి పాదసన్నిధిచేరి ప్రార్థించి "తప్పులు సైరింపుము ప్రభో!" యని పలుమరు భక్తితో ప్రార్థించిరి.

శ్రీ స్వామివారు 'దాసుల తప్పు దండముతోసరి' యని మది నెంచి కరుణతో "మీకు శుభము లొదవుగాక !" యని దీవించిరి. ఆ యోగమూర్తి దీవనలందుకొని వారలు పరమానందముతో తోకపల్లి చేరి సుఖముగా జీవయాత్ర సాగించుచుండిరి.

## మార్కాపురమున కలరావ్యాధి సంభవము

మార్కాపురము పరీధావినామసంవత్సరమునకు సరియగు 1912 వ సంవత్సరమున మారి విజృంభించినది. కలరావ్యాధి విపరీతమై వందల కొలది ప్రజలను తన పొట్టన బెట్టుకొనుచుండెను. మహామ్మారి ప్రళయనాట్యము చేయుచుండెను. కొన్నిరోజు లిటులే యీ వ్యాధి విజృంభించిన శ్మశానముగా మారునని యా గ్రామవాసులందరు దిక్కు చెడి మ్రొక్కుటకు పాలుపోక ఇంటనుండుటకు మనస్కొప్పక తికమక లాడుచు తిక్కెత్తినవారివలె తిరుగుచు దిక్కులేని పక్షులవలె నాకాశమువంక జూచుచుండిరి. ఇంతలో నొకవ్యక్తి పరుగులుదీయుచు నీ సమూహముమధ్య ప్రవేశించి "ఓ బాబయ్యలారా ! ఈ రోజుదయ మున నే మన యాంజనేయస్వామి యాలయములో నొక యతీశ్వరుని దర్శించినాను. వారి కంగవస్త్రమైనను లేదు. వారి జడలే శరీర మంతయు గ్రమ్ముకొనియున్నవి. వారిచుట్టును మూగియున్న ప్రజలను చూచి 'నాయనలారా ! ఈ యోగిపుంగవు లెవ' రని ప్రశ్నింప వారిలో నొకరు 'ఓహో ! వీరి పేరే వినలేదా ? తోకపల్లి స్వాములవారయ్యా వారమురోజులనుండి వీరీ యాలయములో నున్నారు. వీరి

యనంతము. వీరు సాక్షాద్వీర నృసింహ స్వరూపులు. వీరి యమృత హస్తముతో మహాపాపులను స్పృశించిన నెంతటి ఘోరపాపములైన నశ్లే మటుమాయమగును. ఇది పరమసత్యం' మని చెప్పిరి. విని నే నానందముతో మీ యొద్దకు పరిటీలుగొట్టుచు వచ్చి విన్నవించితిని. ఆ స్వామి మనపాలిటి ప్రత్యక్షదైవము. సందేహము వల"దనెను. దప్పితో బాధపడువారికి మధుర రసము లభించురీతి నాతని మాటలు ప్రజల కెంతో యానందము చేకూర్చినవి.

గ్రామపెద్దలందరు నొకేనిర్ణయముతో మేళతాళములు నారికేళ నైవేద్యములు నగరుధూపములు గైకొని హరిభజనలు చేయుచు నాంజనేయస్వామి యాలయమును బ్రవేశించిరి. బ్రహ్మవర్చస్సుతో బ్రకాశించెడి యోగానందమూర్తిని దర్శించి నారికేళనైవేద్యములు సమర్పణచేసి నీరాజనములొసగి ప్రణామము లర్పించి యేక కంఠముతో "ఓ తోకపల్లిస్వామీ ! ఈ గ్రామవాసులను రక్షించుభారము తమదే! మా యదృష్టముచే తోకపల్లివీడి ఈ మారుతీ యాలయమునకు వేంచేసితిరి. దుష్టశక్తులను తరిమివేయసమర్థులు తమరే"యని దీనాతిదీనముగా ప్రార్థనలు సల్పిరి.

దుష్టశక్తులను ధ్వంసము చేయుటకే యవతరించిన మహనీయమూర్తి యగుటచే వారిప్రార్థన లాలించి పద్మాసనమువీడి త్రిశూలము చేత ధరించి 'నరసింహ !' యని మిన్నుముట్ట కేకవేసి వీరాంజనేయుని వలె కుప్పిగంతులు వైచుచు శ్రీ లక్ష్మీచెన్నకేశ్వరుని గాలిగోపురముపై ప్రత్యక్షమైరి. మారికాపురవాసు లీ దృశ్యమును వీక్షించి యమితాశ్చర్యమును పొందిరి. పురప్రజలందరు నీ మహాత్ముని దర్శించుటకు గాలిగోపురము చుట్టును క్రిక్కిరిసియుండిరి. అంతవరకు మారికి గురియై మరణించిన వారి పీనుగులను మోయువారులేక బండ్లపై తీసికొనిపోయి గుండ్లకమ్మలో దొర్లించుచుండిరి. 'ఇట్టి విపరీత దారుణమరణములకు లోనుగాకుండునట్లు రక్షించుటకై శ్రీ లక్ష్మీచెన్నకేశ్వరులే

యీ మహాయోగి రూపముతో వేంచేసి' రని పెద్దలందరు తలపోయు చుండిరి. శ్రీ యోగానంద వీరనృసింహమూర్తి గాలిగోపురముపై నిలచి శూలము పైకెత్తి "నరసింహా! ప్రళయకాల వీరావతార! ప్రచండదీప్తరూపాయ! శ్రీ దైత్యరాజసభాస్తంభ విజృంభమాణ గంభీర నరకంఠీరవాకారా! పాహిమా"మ్మని కేకలువేయగా గ్రామ వాసుల హృదయములలో నావరించిన భయపిశాచము తొలగిపోయి నది. నరసింహా! యని స్వామి కేక వేసినప్పటి దృశ్యము, సాక్షాద్వీర నృసింహావతారమువలె కానుపించెను. ఆ వీరరూపమును దర్శించిన ప్రజలెల్ల నరసింహనామ భజనలు సేయదొడంగిరి.

గాలిగోపురము పైనున్న శ్రీ యోగానంద వీరనృసింహమూర్తి ఆవేశపూరితులై తేరుముందున్న స్థలమున నెగిరిగంతులువేసిరి. ఆ విజృంభణమునకు ప్రజలా యోగపురుషుని దాపునకు వెళ్ళుటకే భయ పడుచుండిరి. స్వామివారు చెన్నకేశ్వరుని వైపునకు మరలి శూలము పైకెత్తి 'నరసింహా!' యని కేక వేసిరి. అప్పటి రూపము ప్రళయకాల రుద్రునివలె జడలన్నియు నాకాశములో నల్లల్లాడుచు గోచరించెను. ప్రళయాగ్నులతో చెన్నుని జూచుచు "ఓ చెన్నుడా! ఆలయమున ఉన్నావా? లేక దుష్టశక్తులకు భయపడి యే మారుమూలనైన దాగి తివా? మూలస్థానము వీడి పారిపోయితివా? సృష్టిస్థితిలయముల కధి నాథుండవై జగన్నియంతవై సర్వప్రాణులను కాపాడెడి కన్నతండ్రివి. నీ వీవిధమున కన్నులుమూసుకొని మౌనముద్ర వహించి కూర్చుండుట న్యాయమా? ఇదినీకు సహజమా! నీలో ప్రాణశక్తి జీర్ణించిపోయెనా? కదలక మెదలక పాషాణమువలెనే పడియుండెదవా ప్రభూ! నీ విట్లే మౌనముద్ర వహించిన నీ దీనుల నిమిత్తమై నా ప్రాణములను నీ ముందే యర్పించెదను. నా కండరములన్నియు కోసి నీ ముందు హోమము చేయుదును. ఏ మనెద"వనిరి. మహోజ్జ్వలమైన వీరనృసింహావేశముతో కేకలిడుచు చెంగున రథము పైకిబోయి గాలిగోపురము ముందు

దుముకగా, నాలయముననున్న శ్రీ లక్ష్మీ చెన్న కేశ్వరులు మూలస్థానము వీడి నృసింహస్వామిముందు ప్రత్యక్షమైరి. నృసింహమూర్తి ప్రళయ గర్జనలకు, చెన్న కేశవస్వామి నృసింహస్వామి మధ్యలో నురుములు మెరుపులు విజృభించెను. నరహరి కేకవేయగా చెన్నుని రూపము నృసింహరూపములో నంతర్లీనమయ్యెను. వెంటనే శ్రీ యోగానంద నరసింహమూర్తి పటపట పండ్లునూరుచు మృత్యుదేవత గుండెలపై నొక్కతన్ను తన్నెను. మృత్యుదేవత గజగజలాడుచు నృసింహ మూర్తికి దాసోహమ్మని "ఇచ్చట స్థానములేదు బాబో"యని పారి పోయినది.

సూర్యోదయమగు సరికి దుష్టశక్తు లన్నియు నశించినవి. కలరా యాగిపోయెను. పురవాసుల కష్టములు తీరిపోయెను. "ఆహా! ఏమి ఆ తోకపల్లి స్వామివారి మహిమాతిశయ"మని గ్రామవాసులందరు వేవోళ్ళ పొగడసాగిరి.

## శ్రీ స్వామివారికి మార్కాపురములో మహోత్సవము చేయుట

శ్రీ స్వామివారిని తేరుబండిపై నాసీనుని గావించి పుష్పమాలాం కృతునిచేసి మేళతాళములతో వేనకువేలు నారికేళము లర్పించుచు ముత్తైదువులందరు పరమానందముతో మంచితీర్థపు బిందెలు వారులు బోయుచుండిరి. గుగ్గిలము సాంబ్రాణి ధూపము వీధులనిండా క్రమ్ము కొనియెను. ఫిరంగీలను మ్రోయించుచుండిరి. హరీ! శ్రీహరీ! యని భక్తులమితోత్సాహముతో మిన్నుముట్ట కేకలువేయసాగిరి. తేరు నలు వైపుల జనులు తండోపతండములుగా రాజొచ్చిరి. భక్తులందరు తన్మ యులై "నరసింహా - జయనరసింహా-తోకపల్లి సద్గురు నరసింహా"యని భజనలు గావింపుచు నృత్యముల లొనర్చుచు నఖండమైభవముతో నా పట్టణమంతయు నూరేగింపు గావించిరి. ఆనాటి మహోత్సవము కన్ను లారాగాంచి తరించినవారు ధన్యులు. అయ్యది వర్ణించుట కలవిగానిది. స్వామివారిని, మారికాపుర పౌరులందరు వినయవిధేయతలతో భక్తి

శ్రద్ధలలో సంపూర్ణ వాత్సల్యముతో భవబంధ విముక్తికై యిట్లు ప్రార్థించిరి.

"ఓ స్వామీ తమ రిచ్చోటనే నివసింపవలయును. తమ కరుణా ప్రబోధమును వినవలయునని తహతహ లాడుచున్నాము. మమ్ము కృపతో రక్షించవలయును ప్రభూ! మే మందరము కలిసి తమకు పవిత్రాశ్రమము నిర్మించెదము. మా కోరిక మన్నింపవలయును ప్రభూ!" యని వేడిరి.

శ్రీ యోగానందస్వామివారు ప్రసన్నవదనముతో "భక్తులారా! మీ కోరిక ప్రశంసనీయమైనది. మీ రిచ్చట నాశ్రమము నిర్మింప బనిలేదు. మీ గ్రామమునకు సమీపమున ప్రవహించెడి కుండికానది ప్రక్క కొండపై నొక మందిరము నేర్పరచితిమి. ఆ కొండ చాలా పురాతనమైనది. అతి పవిత్రమైనది. ఆత్మానందమును పొందుటకు సరియైనది. ఆ కొండపై మందిరమున నిత్యనైవేద్య దీపారాధనాది కార్యక్రమము లన్నియు యథావిధిగా జరుగుచున్నవి. నేనా గిరిపై నివాసము చేసెదను. మీ రందరు భక్తితో భగవంతు నారాధింప వచ్చు" నని యానతీయగా మారికాపుర నివాసులు పరమానంద భరితులైరి.

మారికాపురనివాసులు శ్రీ యోగానందస్వామివారిని మేనా బండిలో నాసీనుల గావించి శ్రీహరి భజనలు గావింపుచు కపిలగిరికి చేరిరి. భక్తులందరు కుండికనదీజలముల స్నానములుచేసి నూతనవస్త్ర ధారులై విమలోర్ధ్వపుండ్ర నామములు మేనెల్ల ధరించి తులసిపేరులు మెడయందు దాల్చి హరినామాసక్తులై కొండ పైభాగమున చేరి శ్రీ యోగానంద నరసింహస్వామివారికి ప్రణామము లొనర్చిరి. ఆనాటి సమయము పరమపవిత్రమైనది. ప్రశాంతమైనది. ఆ యోగ నృసింహమూర్తికి నలువైపుల నాశీనులై భక్తులందరు యాకాశ మంటునట్లు కరతాళరవములు చెలంగ లక్ష్మీనృసింహస్వామి మందిర

మున భజనలు గావించుచుండిరి. ఆ దృశ్యము సాక్షాత్తుగ శ్రీ వైకుంఠ ములో వేంచేసియున్న శ్రీమన్నారాయణుని కొల్చెడి దేవబృందము వలె ప్రకాశించినది. ఏ ప్రక్క చూచినను పీతాంబరములు ధరించి శరీర మంతట విమలోర్ధ్వపుండ్రనామములతో తులసిపేరులు దాల్చి కాళ్ళ గజ్జియలు ఘల్లుఘల్లుమన నరసింహనామ భజనలతో నృత్యమొనరించు వారే! భక్తిపారవశ్యమున మేనులు మరచి మౌనులవలె హరినామ ధ్యానమును చేయుచుండిరి. కొండంతయు "శ్రీ నారసింహా! జయ నారసింహా! ప్రహ్లాదవరదా! ప్రభునారసింహా!" యని మార్మ్రోత మ్రోగెను. జేగంటలు కొట్టుచున్నారు, శంఖముల నూదుచున్నారు, నృత్యములు చేయుచున్నారు. కొందరావేశపూరితులై 'నరసింహా!' యని తన్మయులై కేకలు వేయుచున్నారు. కొండ పైభాగమునుండి క్రిందికి పొరలుచు దొరలుచున్నారు. కర్పూరపుముద్దల నగ్నికి ముట్టించి మ్రింగుచున్నారు. ఆహాహా! ఏమి వారిగురుభక్తి! సద్గురుదేవుని యనంతశక్తియే! భక్తులందరి నెట్టి బాధలు గలుగనీయక కంటికి రెప్పవలె కాచి రక్షించినది. ఈ విధమగు భక్తిభావములతో మెలం గెడి తన ముద్దుబిడ్డల త్యాగశీలాదులకు శ్రీ యోగానంద నృసింహ స్వామివారు ముసిముసినవ్వులతో నుండిరి. భక్తులందరు ప్రశాంత భావము లుప్పొంగ స్వామివారితో "ఓ దేవాదిదేవా! సద్గురుదేవ! మహానుభావ! తమ యాత్మప్రబోధము నీనాడు వీనులవిందుగా విన వలయునని కోర్కె గలిగిన"దని మనవి చేసుకొనిరి. వారి ప్రార్థనలను మన్నించి స్వామివా రీవిధముగా ప్రబోధము చేసిరి.

## ౖ సద్గురు సందేశము

"ఓ దైవాత్మ స్వరూపులగు నాత్మీయులారా! ప్రశాంత చిత్త ముతో శ్రద్ధతో విని తరించుడు. ఈ ప్రపంచములో కవి పండితు లైనను వేదవేదాంగములు సాంగోపాంగముగ నధ్యయనము చేసి, సర్వజనులచేత నఖండముగా సన్మానములు చేయించుకొన్నను, మహా

మేధావులైనను, తాంత్రికశక్తులతో ముల్లోకములను వశముచేసికొనిన తాంత్రికులైనను, రాళ్ళను కలకండగా, ఇసుకను పంచదారగా మార్చ గల యక్షిణీవిద్యలు సంపాదించిన వారైనను, సామ్రాజ్యాధిపతియైనను గాయక శిఖామణులైనను సద్గురువుల పాదసేవలు చేసి వారిదయ సంపాదింపనిచో 'సర్వాభరణ శోభితమైన శవమువలె' సర్వశక్తు లార్జించినను వ్యర్థములగును. ఎన్ని జన్మలకైనను సద్గురుని సేవింపక మోక్షమును పొందలేరు. సద్గురు ప్రబోధమే మోక్షమునకు సూటి బాట! సద్గురువు నెట్లు భావనచేయవలెనో సద్గురువులన నెట్టివారో చెప్పెద నాలకింపుడు—

శ్లో. గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః.

గురువే బ్రహ్మము, గురువే విష్ణువు, గురువే మహేశ్వరుడు, గురువే సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపుడు. అనగా త్రిమూర్తులకు కారణ స్వరూపుడు. తాను ఒక్కడే మూడు రూపముల దాల్చి యున్నాడు. త్రిమూర్తులు నొకొక్క రొక్కొక్క కార్యమును మాత్రమే చేయుచున్నారు. బ్రహ్మ ప్రపంచమును సృష్టి చేయు చున్నాడు. విష్ణువు బ్రహ్మ సృజించిన ప్రపంచమును పోషింపు చున్నాడు. శివుడు దానిని లయింపజేయుచున్నాడు. త్రిమూర్తులు చేయు పనులను ఇచ్చట గురుమూర్తి యొక్కడే చేయుచున్నాడు. ఎట్లనిన– శిష్యునియందు విజ్ఞానమును సృష్టించుచున్నాడు. తనవైరాగ్య ప్రబోధ మనెడి పాలుపోసి జ్ఞానమును పోషింపుచున్నాడు. అజ్ఞాన మును లయింపచేయుచున్నాడు. ఈ ప్రపంచ సృష్టి స్థితి లయముల వలన ఎవ్వని కెట్టి నుపకారము లేదు. మీదుమిక్కిలి అనేక అనర్థములే వాటిల్లుచున్నవి. ఈ సృష్టి రహస్యమేమొ! తెలియచేయ వలెనని నారదమహర్షి బ్రహ్మదేవు నీ విధముగా ప్రశ్నించెను—

శా. నాకుంజూడగ నీవు రాజ వనుచున్నాడన్ యదార్థస్థితిన్
నీకంటెన్ ఘను డొక్కరాజు గలడో ? నీ వంతటన్ రాజవో
నీకే లాభము రాదలంచి జగముల్ నిర్మించె దీ చేతనా
నీకంటెందు జనించుచుండు నడగున్ నిక్కంబు భాషింపుమా !
(ఆంధ్రభాగవతమునుండి)

## సృష్టిక్రమమును నారదునకు బ్రహ్మ తెలియచెప్పుట

"సృష్టికి పూర్వమంతయు జలార్ణవముగానుండెను. ఆ నీటిమధ్యమున కమలము పుట్టెను. దానియందు నేను పుట్టితిని. నేను కన్నులు తెరిచి చూడగనే నీరుదప్ప మరేమియు గనుపించలేదు. ఏమిచేయుటకు తోచకయున్న సమయమున నీటిమీద 'తప తప తప' యను శబ్దము వినవచ్చెను. భగవంతుడు నన్ను తపస్సు చేయుమని యాజ్ఞాపించినాడని యెంచి, నూరు దివ్యసంవత్సరములు తపస్సుచేయగా భగవంతుడు ప్రత్యక్షమాయెను. 'నన్ను సృజించిన కారణమేమి నేనేమి చేయవలయును తెలుపవలసిన' దని వేడుకొనగా 'ప్రపంచమును సృష్టించుటకు నిన్ను పుట్టించితిని. కాన నా యాజ్ఞను పాలించవలసిన' దని చెప్పి అంతర్ధానమయ్యెను. అంత నేను బొమ్మలను సృష్టించుచున్నాను. కాని యవి కదలక మెదలక యుండెను. మరల నేను భగవంతునిగూర్చి తపస్సుచేయగా ప్రత్యక్షమై సమాచారము తెలుసుకొని 'సూత్రాత్మను నేనై యున్నాను. ప్రాణశక్తి నా యందున్నది. నీ వుపాధులను మాత్రమే సృజించుటకు హక్కుగలిగి యున్నావు. మిగిలిన కార్యము నావలన జరగవలయు'నని యంతర్ధానమయ్యెను. బ్రహ్మకు ప్రపంచసృష్టి యందు స్వతంత్రశక్తిలేదు. సర్వశక్తులకు నతీతమైనశక్తి పరమాత్మయే. అట్టి పరమాత్మయందు మనస్సును యేకీభవించి బ్రహ్మానందము పొందు సద్గురువులే శ్రేష్ఠులు. త్రిమూర్తులైనను ప్రళయమున నశింతురు కాన వారును సామాన్యులని తెలిసికొనవలయును. గురువన్న నో త్రిమూర్తుల కంటె నతీతుడని చెప్పవలెను.

క॥ గురుడనగా పరమాత్ముడు
పరగంగా శిష్యుడనిన బటు జీవుడగున్
గురుశిష్య జీవసంపద
గురుతరముగ గూర్చువాడు గురువగు వేమా!

"గురువనగా పరమాత్ముడు, శిష్యుడు జీవుడు, జీవబ్రహ్మైక్యము గావించువాడే గురువు. దానిని బట్టియే యాలయముల కేగునప్పుడు కర్పూర మగ్నినిచేర్చి వెలిగింతురు. కర్పూరము జీవరూపము, అగ్నిదైవ స్వరూపము. కర్పూర మగ్నిలో నంతర్లీన మైనటులే యీ జీవతత్త్వము దైవతత్త్వమున నేకీభవించిననాడే మానవునకు సంసారబంధ విముక్తి కైవల్యప్రాప్తి! అట్లుయత్నింపక, యెన్ని శాస్త్రములు వల్లించినను, నెన్ని యాత్రలు సేవించినను, నెన్నిపూజలు గావించినను వృథాప్రయాస చేకూరునేగాని బంధవిముక్తి గలుగదు. 'కొందరు రామనామమే శ్రేష్టము, ముక్తికి సోపానమనీ; కొందరు శివనామమే శ్రేష్టము, మోక్షమునకు మార్గమనీ; కొందరు అల్లానామమే శ్రేష్టముగాన సాయుజ్యము పొందవచ్చుననీ; మఱికొందరు ఓహో! ఏసుక్రీస్తు నామమే కీర్తింపదగినది, తక్కిననామములన్నియు నీ నామమునకు సాటిరా'వని యిట్లు తలకొక విధమున చెప్పుచు, నజ్ఞానుల నమాయకులను గందరగోళములు చేయుచు కాలమును వ్యర్థము చేయుచున్నారు. ఎవరెన్ని పేరులతో పిలిచినను రకరకములుగా వర్ణించినను, నున్నది యొకటే! సత్యమైనది, నిత్యమైనది, నిశ్చలమైనది, పరమానందమును గలిగించునది పరమాత్మ యొకటియే!

శ్లో॥ సువర్ణ మేకం బహుభూషణాని, మృత్పిండ మేకం బహుభాండ రూపమ్
గోక్షీర మేకం బహుధేను జాతం, ఏకంపరాత్మా బహుదేహవర్తీ!

"రకరకముల పేరులతో పిలువబడుచు నందమైన రూపములతో విలసిల్లుచున్న వస్తువు బంగారమే! పలువిధములగు నామములతో పిలువబడు (కుండ, కూజా, ముంత, బాన) మొదలగునవి మట్టియే గదా! తెలుపు, నలుపు, ఎరుపు రంగులు గల యావులపాలన్నియు

తెలుపేగదా! అటులే బహుదేహములతో విరాజిల్లెడి యాత్మయొక టియే! మనకు నచ్చిన వచ్చిన పేర్లతో పిలువబడుచున్న దైవము లందరిలో నుండి ప్రకాశించెడి పరంజ్యోతి స్వరూప మొకటే! ఆ పరతత్త్వమును చేరుటకెన్నో మార్గములు గలవు. ఎవరేమార్గము ననుసరించిన నందరు నొకేగమ్యమునకు చేరగలరు. కొన్ని మార్గములు కంటకావృతములు, కొన్ని సుఖాన్వితములు. మనము ముందే యోచించి మంచి మార్గము ననుసరించు నిమిత్తము బాధగురువుల చెంతకుబోక బోధ గురువుల నాశ్రయించి వారి యాత్మప్రబోధములను విని, మననముచేసి యాచరణ యందుంచి ఫలమును బొందవలయును. ఆచరణలేక, శుష్కవేదాంతములతో, శూన్యహస్తములతో నభావవైరాగ్యములతో స్వభావమును మార్చుకొనలేక కాలమంతయు వృథచేసి రచ్చబండలపై చేరి లేనిపోని కాలక్షేపములతో, ఔనుకాదను వాదోపవాదములతో విసుగు విరామములేక యనేకులు కాలమును వ్యర్థము చేయుచున్నారు.

"తీరిక సమయములలో సద్గోష్టిలో పాల్గొనవలయును. పవిత్ర స్థలములలో భగవత్కాలక్షేపములు జరుగుసమయములలో ప్రశాంత భావములతో వినక పనికిమాలిన లోకాభిరామాయణమును ప్రారంభమునుచేసి సద్గోష్టికి భంగము కలిగింపరాదు. భంగము కలిగించిన మానవులు మరుజన్మలో క్షుద్రజంతువులుగ జన్మించి వోంద్రపెట్ట వలసిన కర్మపట్టునని మహాత్ములు సెలవిచ్చియున్నారు. ముందుగనే జాగ్రత వహించి భగవానుని కార్యక్రమముల సమయములందు వృథాకాలక్షేపములు చేయక స్థిరచిత్తులై సద్గోష్టిని విజయవంత మొనర్పవలెను. ఈ విషయమును సదాజ్ఞప్తినుంచుకొనుడు. ఒక్కవిఘడియనైన యనవసరముగా వ్యర్థము చేయరాదు. మనకు తెలియకనే మనయాయువు నశించుచున్నది. మానవ జీవిత పరమావధిని మరచి, యనిత్యమగు సంసారముపై భ్రాంతిచే మాయలో దగుల్కొని విడివడు నుపాయము గానక యీజీవుడు కృంగికృశించి నశించుచున్నాడు.

"మానవుడు మాధవుని యందైక్యము చెందువరకు, దరిలేని జననమరణ ప్రవాహమున బడికొట్టుకొని పోవలసినదే! వారివారి కర్మానుగుణముగా, మరుజన్మలో మృగముగనో, పక్షిగనో, జలచరముగనో, వృక్షముగనో, తృణముగనో యెన్నెన్నో రకములగు యోనుల యందు జననమొందుచు జనన మరణ చక్రమున పరిభ్రమణ చేయు చుండవలసినదే! అందుచేతనే మహాత్ములు 'ఈ జన్మ మిక దుర్లభ మురా! ఓరి! సాజన్మ సాకార సద్గురుని గనరా?' యని ప్రబోధము చేసియున్నారు.

ఎన్నివేల సంవత్సరములకైనను మనకీ మానవజన్మము లభింప గల దనుకొనుట వెఱ్ఱితనము. కావున నమూల్యము నత్యుత్తమము నైన యీ నరజన్మమందే నారాయణుని సాక్షాత్కరించుకొను నుపాయమును జాగ్రతతో సద్గురువు నాశ్రయించి వారి సదుపదేశములను శిరసావహించి జననమరణ హేతువగు సంసారబంధమును త్రెంచివేయ వలయును. సంసార సముద్రమును దాటి మోక్షమను తీరముచేరి ప్రాణులందరికి స్వస్థానమగు పరతత్త్వమున నైక్యమొందుటయే కర్తవ్యము. ఇట్టిదశనే కైవల్యమని, మోక్షమని, పరలోకమని, సిద్ధిచెందిరని, చాటుకువెళ్ళినారని, జీవరాహిత్యమని, జన్మరాహిత్యమని, జీవసమాధి, మహానిర్వాణమని, మహాప్రస్థానమని మొదలగు నామములతో చెప్పబడునని" చెప్పిరి.

ఈ ప్రబోధము వినిన భక్తబృందములవా రంద రమితానందమును పొంది "ఓ యోగానంద నృసింహదేవా! ఈ రూపములో నున్నట్టి మీరు సామాన్యులా! భగవదవతారము. అస్ఖలితబ్రహ్మచర్య దీక్షాదురంధరులు. మహోగ్రమూర్తి యగు నృసింహుని స్వస్వరూపమును దర్శించిన అద్భుతమూర్తులు. శ్రీ శంకరాచార్యులు, శ్రీ రామానుజాచార్యులు, శ్రీమధ్వాచార్యులను మహనీయు లద్వైత,

విశిష్టాద్వైత, ద్వైత మతములను స్థాపించిరి. మతకర్తలు ప్రచారము చేసిన పవిత్రాశయములలో నిమిడియున్న పరమసత్యమును, తమ జీవిత ఘట్టములలో సాక్షాత్కరింపచేసిరి. మతము లన్నిటి తత్త్వము నొక్కటే! సమ్మతమునకు మించిన మతము, సద్గురువుకంటె వేఱుదైవ మీ ప్రపంచమున పలుమారులు వెదకినను లభింపరని ప్రబోధము చేసిరి. తమ ప్రబోధము విను సదవకాశము లభించినది. నేడు మహానంద సంధాయకమైన పర్వదినము. మాకీనాడే తమరు జ్ఞానోపదేశము చేయవలసినది. ముల్లోకములు వెదకినను తమ్ము బోలిన సద్గురూత్త ములు లభించుట దుర్లభ"మని యెంతయో పొగడుచు భక్తులందరు స్వామివారి పాదకమలములపై ప్రణమిల్లిరి.

సద్గురు సార్వభౌములు వారిని లేవనెత్తి "నాయనలారా! భయము వలదు. మీ భవబంధములు తెగి విముక్తులగు సమయ మాసన్నమైనది. ఆ యోగము మీకుండుటచేతచే ఈ భక్తియోగము మీకు లభించినది. ఈనాడే మీకు జ్ఞానోపదేశమొసగెద" నని స్వామి సెలవిచ్చిరి. సద్గురు వాక్యములు వినిన భక్తు లమితానందమును పొందిరి.

శ్రీ యోగానంద సద్గురుమూర్తివలన నుపదేశమొందిన భక్తుల జీవితములు సార్థకత చెందినవి. ఈ యోగపురుషుని ప్రతిభ నలుదిక్కుల వ్యాపించినది. భక్తులందరాలోచించి మందిరమును శాశ్వతముగా నుండునట్లు రాతిస్తంభములతో నొక నృసింహాలయమును కట్టింప నిశ్చయించిరి. భక్తుల సహాయసంపత్తితో నా కపిలగిరిపై నందముగా నాలయ నిర్మాణము గావించిరి. ఈ కొండ లోపలిభాగమున నొక శివలింగమున్నదని శ్రీ సద్గురుదేవులు యోగదృష్టితో తెలిసికొనిరి. శ్రీ యోగానందమహర్షి ప్రియశిష్యుని ద్వారా శ్రీ లక్ష్మీనృసింహ పటమును మద్రాసునుండి తెప్పించి యాలయమం దుంచిరి. ఆలయ స్వామివారికి, నిత్యనైవేద్య దీపారాధనలు జరిపించుచుండిరి.

## శ్రీ యోగానందమూర్తి సర్వస్థలములలో ప్రత్యక్షమగుట

శ్రీ యోగానందస్వామి శక్తి వర్ణనాతీతమైనది. మహారణ్యములో మంచిగంధపు వృక్షమువలె స్వామి ప్రతిభ నలుదిక్కుల వ్యాపించినది. స్వామివా రొకనాడు నల్లమల మహారణ్యమునకు వెళ్ళిరి. ఆ మహారణ్యసంచారమున నొక బిలమును గాంచిరి. 'ఈ బిల మెంత వరకున్నదో పరిశీలింపవలయు' నని యెంచి లోపలకు ప్రవేశించి వెళ్ళు చున్నతఱి విశాలమార్గము సూక్ష్మమై యొప్పెను. వెళ్ళుటకావంతయు నవకాశము లేదయ్యెను. పట్టినపట్టు వీడని ధీరనరసింహామూర్తి యా రంధ్రమునందే తలదూర్చి మూడుదివసము లుండిరి. నాల్గవరోజు బిలము వెలువడి నృసింహావేశమున కొండలన్నిటిని దాటుచు సర్వము భగవన్మయమని దెలిసికొని నదీతీరములనున్న ఇసుకను పంచదారవలె తినుచు నడవిజెంకుల పాలన్నియు మధురక్షీరములవలె పానముచేయుచు :స్థానమగు కపిలగిరికి వేంచేసిరి.

స్వామివారు వచ్చిన పయమును గుర్తించిన భక్తులందరు వందలకొలది కుంకుమబండ్లు కట్టుకొని గిరికి వేంచేసిరి. కొంతమంది భక్తులు ప్రభలు కట్టుకొని హరిభజనలు గావింపుచు మంగళ వాయుద్య ములతో గిరికిచేరిరి. ప్రభలు బండ్లు గిరిచుట్టు ప్రదక్షిణములు చేయు చుండెను. అట్టిసమయమున శ్రీ యోగానందమూర్తి ప్రతిశకటమందును ప్రత్యక్షమైరి. ఎవరికివారు ప్రక్కవారిని చూడకయే "ఆహా! ఏమి మనభాగ్యము; శ్రీ సద్గురు స్వామివారు మనయందు కరుణబూని మనబండిలోనే ఆసీనులైనారు. మననోములు ఫలించినవి. మనపై స్వామివారి కెంతోదయ" యనుచు నానందము పట్టజాలక యెచ్చటి వారచ్చటనే స్వామిచుట్టుమ నృత్యములు చేయుచుండిరి.

అదే సమయమున స్వామివారు నృసింహాలయమున భక్తులకు వేదాంతప్రబోధము చేయుచుండిరి. ఆ సమయముననే తోకపల్లిలో మఠము నానుకొనియున్న దిగుడుబావిలో స్నానము చేయుచుండిరి.

మార్కాపురమున మారుతీ యాలయమున ప్రత్యక్షమై భక్తులతో సంభాషించుచుండిరి. కొండకు వేంచేయు భక్తులమధ్య కుండికనదిలో స్నానము చేయుచున్నట్లు కనుపింప భక్తులందరు "ఓహో! స్వామివారిచ్చోటనే యున్నారు. మన మందరము ప్రశాంతముగా దర్శింపవచ్చును. వీరిని వీడి కొండకు వెళ్ళుట యెందులకు? స్వామి వెంటనే వెళ్ళవచ్చు" ననుచు వెనువెంటవచ్చు మిత్రులతో "త్వరగా రండు! స్వామివారు నదిలో స్నానము చేయుచున్నారు; ప్రశాంతముగా దర్శనము లభించు"ననుచు వారలను బిగ్గరగా పిలచిరి. వారు స్వామివైపునకు మరలగా, స్వామివారు నదీజలములలో లేరు. వారందరు "ఇదియేమి ఆశ్చర్యము! స్వామివారు మా కన్నులకు సాక్షాత్కరించి యదృశ్యులైనారు. ఈ మహాత్ముని మహిమయే మనల నిట్లు భ్రమింపచేసెను. స్వామివారు కొండపైననే యున్నారు. వెళ్ళుదము పదం" డనుచు పరుగుపరుగున కొండకుచేరి నృసింహాలయమునకు వెళ్ళిచూడగా శ్రీ సద్గురుదేవులు సుఖాసీనులై యున్నారు. ప్రియశిష్యు లెల్లరు పాదకమలముయొద్దనే నాసీనులై స్వామివారి యమూల్యములగు నుపదేశములను వినుచున్నారు. ఆకసమంటునటుల భక్తులు, భక్తురాండ్రు శ్రీహరి నామమును కీర్తించుచున్నారు.

కుండికానదిలో స్నానము చేయుచున్నటుల దర్శించిన భక్తులెల్లరు నివ్వెరపాటుతో రెప్పలార్పక యోగనృసింహస్వామివారిని ంపసాగిరి. వారు వారి కన్నులనే నమ్మజాలక మోసపోవుచు యదార్థ మర్థముగాక యచ్చటనున్న పెద్దలతో స్వామివారు మాకు గుండికలో దర్శనమిచ్చిరి ఇచ్చటికి వచ్చువర కిందేయున్నారని యడుగ వారు వీరితో "సోదరులారా! సద్గురుదేవునిశక్తి మీరు గుర్తించలేదు. నిత్యము మనతో తిరుగువారే! ప్రతిదినము మనతో సంభాషించువారే! మనతోపాటు హలమును ధరించి క్షేత్రములను దున్నుచు పంటలను పండించువారే!" యని యెంచి యా మహిమా

న్వితుని సమీపమున దిరుగుచు నాయన యాత్మతత్త్వమును గుర్తింప రైరి. వారు సామాన్యులు గాదు. శ్రీ వీరనృసింహస్వామి కళావతారము! సందేహము లేదు. వారు మనస్సులో సంకల్పించినట్లైన దోమను ఏనుగగా మార్చగలరు. కొండలను పిండి చేయగలరు. గులకరాళ్ళను రత్నములుగా మార్చగలరు. అజ్ఞానులను జ్ఞానులుగా చేసెదరు. విషమును అమృతముగా మార్చెదరు. ఒకటేమి? ఎట్టి ఘోరవిపత్కరపరిస్థితినైనను క్షణకాలములో మటుమాయమొనర్చి మూఢఃపూలారు కాయలుగ ఫలింప చేసెదరు. వారి యోగశక్తి వర్ణనాతీతమైనది. సూర్యభగవాను డొకే స్థలములో ప్రకాశింపుచు, సర్వస్థలములయందెచ్చట చూచువారి కచ్చటనే గోచరించునటుల నీ జ్ఞానభాస్కరుడు, మన సద్గురుమూర్తి నిచ్చోటనే సుఖాసీనులై యెచ్చటెచ్చటనో యున్న పరమభక్తులకు దర్శనమిచ్చుచున్నారు. వీరి యోగశక్తియే మీకావిధముగ గోచరించి భ్రమింప చేసిన" దని చెప్పిరి. వినినవారంద రాశ్చర్యముతో స్వామియందు దృష్టి నిల్పి తనివిదీర దర్శించి పాదాభివందనము లొనర్చిరి.

## శ్రీ సద్గురు ప్రబోధము

శ్రీ స్వామివారి ప్రబోధము వినవలయునని యొకరికంటె నొకరు ముందు కూర్చొనవలయునని, స్వామి పాదములపై పుష్పము లర్పించవలెనని కొందరు భక్తులు ముందుముందుగా వెళ్ళుచు సభ్యతలేక గందరగోళము చేయుచు క్రిక్కిరిసియున్న ప్రజలమధ్య త్రొక్కిసలాడుచుండుట స్వామివారు వీక్షించి "ఓ మాతా పితృలారా! భక్తిలేని పూజ పత్రి చేటు! మానవ హృదయములలో గల సద్గుణములను పుష్పములను పెద్దలకు సమర్పణ చేయవలయును. లాంఛనప్రాయమగు ఈ పూల పూజకొరకు మీరందరు సోదరభావములు వదలి ముందుగా పూజచేయవలయునను సంకల్పముతో నశాంతిని పొందుచున్నారు. మీరు పొందవలసినది ప్రశాంతి. చెందవలసినది దైవభావన. మీరు

దర్శింపవలసినది సర్వభూతాంతరాళములయందు ప్రకాశించెడి స్వయం జ్యోతి ప్రకాశమగు పరమాత్మను. జలబుద్బుదమగు నీ పాంచభౌతిక శరీరమును కా''దని గురుమూర్తి ప్రబోధము చేసిరి. సద్గురు ప్రబోధము వినిన వెంటనే, యెచ్చట వారచ్చట సుఖాసీనులై ప్రశాంతిగా స్థిరచిత్తులై యుండిరి.

వారి మానవత్వమునకు శ్రీ స్వామివారు సంతోషించి "నాయన లారా! మానవత్వమనగా నిదియే. ఇంతకుముందు చేసినది దాన వత్వము. ఇక మీరు కాంక్షింపవలసినది మాధవత్వము. శ్రద్ధతో వినుడు. ఈ ప్రపంచమున జాతు లెన్నో కలవు. జాతము లనగా పుట్టినవి. మనమందరము యోనీ సంభూతులమే! అయోనీ సంభూతమైన వస్తువునే దైవమని భావన చేసెదము. మనమందరము నొకే జాతి వారము. వారివారి గుణకర్మముల ననుసరించియే యిన్ని తెగలేర్పడినవి. మన పరమపవిత్ర వేదధర్మము లెట్లున్నవో గ్రహింపుడు—

శ్లో. బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్ర శ్చండాల ఏవచ
దృఢాభ్యాస కరో నిత్యం, పునర్జన్మ నవిద్యతే.

"బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర ఛండాలాది జాతులవా రెవ్వరైనను భగవన్నిష్ట దృఢాభ్యాసము సతతము చేసినట్లైన జన్మరాహిత్యమగు నని శ్రుతులు చెప్పుచున్నవి. కాన నాలుగు వర్ణములవారికి భగవదోపాసనకు వేదపారాయణము చేయుటకు నధి కారముగలదు. కావున మీరు చింతింప నవసరము లేదు.

"విశ్వం నారాయణం దేవం' భగవంతు డాది విరాట్టు గనుక నీ ప్రపంచమే యాయనకు శరీర మాయెను. శరీరమునకు ముఖము ప్రధాన మగుటచే నుత్తమమనియును, భుజములు మధ్యములనియును, తొడలధములనియును, పాదము లధమాధమములనియును జెప్పబడెను. అందుచే నీశ్వరసృష్టియైన మానవులకు, శాంతశమదమాది సద్గుణంబులు గలిగి బ్రహ్మనిష్ఠగలవా రుత్తములనియు, నందు వివేకజ్ఞానము గల్గినవారు

మధ్యములనియు, నంతకు తక్కువజ్ఞానము గల్గినవారధములనియు, వివేక శూన్యు లధమాధములనియు జెప్పబడిరి. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రు లనబడు చతుర్వర్ణములు బ్రహ్మకు నాలుగవయవములుగా నిర్మింపచేయుటయేగాని, ముఖము బాహువు నూరువు పాదములందు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు బుట్టిరని నర్థ మొనర్చుటను చేయరాదు.

"ఇదియునుగాక నింకొక ఇతిహాసముకలదు. బ్రాహ్మణ-శూద్రులనగా జ్ఞానాజ్ఞానంబు లని యెఱుగడు.

కం. అజ్ఞానమె శూద్రత్వము
సుజ్ఞానమె బ్రహ్మమనెడి శ్రుతులను వినరా
అజ్ఞాన ముడిగి వాల్మీకి
సుజ్ఞానపు బ్రహ్మమందె చూడర వేమా !

గీ॥ పాపవర్తనుండు బ్రాహ్మణుం డయ్యును
నిజము శూద్రుకంటె నీచతముడు
సూనృతవ్రతుండు శూద్రు డయ్యును గూడ
నతడె ద్విజుడ యంచు నందు రవని.

"కావున శూద్రత్వంబునకు, సత్యశౌచ శాంతశమదమాది ధర్మములచేత నొప్పిభక్తిచే నివృత్తిగలిగి బ్రాహ్మణత్వము సిద్ధించునని కృష్ణ పరమాత్మ యర్జునునకు బోధించెను.

శ్లో॥ జ్ఞానవిజ్ఞాన సంపన్నాః సంస్కృతో వేదపారగః
విప్రోభవతి ధర్మాత్మా క్షత్రియః స్వేనకర్మణాః

"మానవుడుగా జన్మించిన వాడెవడైనను, జ్ఞానవిజ్ఞాన సంపన్నుడై వేదపారంగతుడైనచో బ్రాహ్మణుడని చెప్పబడును. పై నుదదహరించిన గుణములతో గూడిన క్షత్రియుడైనను బ్రాహ్మణుడనబడును.

శ్లో॥ ఏతైఃకర్మఫలైర్దేవి న్యూనజాతి కులోద్భవః
శూద్రోఽప్యాగమ సంపన్నో ద్విజోభవతి సంస్కృతః॥

"పైన చెప్పిన పుణ్యకర్మలే బ్రాహ్మణత్వమునకు కారణములు గాని వేరువిధమునగాదు. పరిశుద్ధహృదయము గలవాడై జ్ఞానసంపన్నుడైనచో శూద్రుడును బ్రాహ్మణు డనబడును.

శ్లో॥ బ్రహ్మభేదన జనాతి సముక్తిం నోపపద్యతే
సమానం సర్వజంతునాం బ్రహ్మసూత్రేణ కథ్యతే॥

"ఎవడు పరమాత్మను భేదబుద్ధితో జూచునో వాడు మోక్షమును పొందజాలడు. బ్రహ్మము సర్వజీవులందును సమానముగా నున్నదనియును బ్రహ్మసూత్రముచే బాదరాయణ మునీంద్రుడు తెల్పెను.

శ్లో॥ నచర్మణో న రక్తస్యన మాంసస్యన చాస్థినః,
న జాతి రాత్మనో జాతిర్వ్యవహారః ప్రకల్పితః॥

"సర్వభూతస్థమగు నాత్మకు జాతిభేదములేదు. మరియు చర్మమునకును నస్థికిని వేరులేదు. జాతియనునది వ్యవహారకల్పితమే గాని మరియేమియు గాదని తేజోబిందూపనిషత్తు చెప్పుచున్నది.

శ్లో॥ న శూద్రా భగవద్భక్తాః విప్రాభాగవతాః స్మృతాః
సర్వవర్ణే శ్రుతాశ్శూద్రా యేహ్యభక్తా జనార్ధనే॥

"శూద్రయోనియందు జన్మించిన వారైనను భగవద్భక్తులు శూద్రులుకారు. భాగవతోత్తములగు విప్రోత్తములని వేదసమ్మతము. పరమాత్మయందు భక్తిలేని వారేవర్ణమందు జన్మించినను వారే శూద్రులని శ్రుతిసమ్మతము. స్త్రీలలో మైత్రేయ, సులభ, గార్గీ, శాండిలి, తపస్విని, మొదలగు నాడువారును, నంత్యజాతియం దుద్భవించిన యనేకులు జ్ఞాననిష్ఠబొంది ముక్తులైరి. మరియు మనుస్మృతియందు జెప్పిన వారింగూడ చెప్పెదను వినుడు.

శ్లో॥ ఋష్యశృంగో మృగాజ్జాతః కౌశికో గాధినందనః।
జంబుకో జంబుకోత్పత్తిః గౌతమో గౌత సంభవః।
వాల్మీకి వ్వల్మికోత్పత్తిః అగస్త్యః కుంభసంభవః
వ్యాసోలుబ్ధక సంభూతో, వసిష్ఠఊర్వసీసుతః
నారదో రజకీపుత్రః కౌండిన్యో ముండకీసుతః
సాంఖ్య, స్సర్పరసంభూతః శౌనకాది మహర్షయః।

"మహర్షుల కాలమందు గుణముల ననుసరించియే జాతికలదనుట కిదే దృష్టాంతము. ఎట్లనిన — ఋష్యశృంగ మహర్షి లేడియందును, విశ్వామిత్ర మహర్షి క్షత్రియకులమందును, జంబుకముని నక్కయందును, గౌతమమహాముని కుందేటియందును, వాల్మీక ముని పుట్టయందును, అగస్త్యమహాముని కుండయందును, శ్రీవేదవ్యాసమహార్షి చంబడ స్త్రీయందును, వశిష్ఠమహార్షి వేశ్యయందును, నారదమహర్షి రజక స్త్రీ యందును, మాండవ్యముని కప్పయందును, సాంఖ్యముని చండాల స్త్రీ యందును, గార్గేయమహాముని గాడిదయందును, శౌనకాది మహాశ్రేష్ఠులు కుక్కయందును నవతరించిరని మనుస్మృతియందే కలదు. వీరందరు పరమతపోనిధులుగదా! ఇట్లు శ్రుతులు స్మృతులు ఘోషింపుచుండ, జాతిభేదము దేహసంబంధమై యెట్లుండునో మీర లాలోచింపుడు.

"ఇదియునుగాక ప్రపంచమున సద్బ్రాహ్మణు లనియు, కర్మబ్రాహ్మణులనియు, వేషబ్రాహ్మణులనియు, మూడువిధములుగా గనుపించుచున్నవి. (1) వేషబ్రాహ్మణుడనగా, రాత్రియందు నాట్యశాలలో వేషములు ధరించి, బ్రాహ్మణ చిహ్నములు గనుపరచి, తెల్లవారు నుదయమున నెప్పటివలె శూద్రుడై యుండు వేషధారిని బోలినవాడే వేషబ్రాహ్మణు డనబడును. (2) కర్మబ్రాహ్మణు డనగా, నింద్రజాలమైన యీ జగత్తున కర్మములు చేసికొనుచు పైకి బ్రాహ్మణ చిహ్నములు గనుబరచి జ్ఞానమయిన సహజావస్థయందు బ్రాహ్మణ్యము లేక జన్మాదులెత్తుచు తాముచేసినది స్మరణకు తెచ్చుకొనలేక యితరులుచేయు భక్తిప్రవృత్తులుచూచి సహింపలేక 'మీకు వేదాధ్యయనమున కధికారములేదు, మీరు భగవన్నిష్ఠ సల్పితిరేని పాప మనుభవించెదరు. మేము వేదాధ్యయనము చేయుకాలములో శూద్రులు వినగూడదు. వింటిరిపో రౌరవాది నరకము లనుభవించెద'రని భయపెట్టుచు, పరమాత్మనునమ్మి మోక్షేచ్ఛచే పూజించువారి మోక్ష

ప్రయత్నములు విఘ్నములు జేయుచు దేహవర్ణాభిమానులై యెదుటి వారల ననేకవిధముల నిందించుచు పరుల విద్వత్ శక్తులను పనికిమాలిన వని దలపోయుచు దమతప్పులను తామెరుంగక యితరుల తప్పులకై వెదకుచుండెడివారే కర్మబ్రాహ్మణు లనబడుదురు. (3) బ్రహ్మమును మననము చేయువారును నజపగాయత్రినే సూత్రముగా ధరించి యెవరు స్వయంప్రకాశులై నిత్యానందులై వెలయుచుందురో వారే సద్బ్రాహ్మణులని బ్రహ్మోపనిషత్తులో చెప్పబడియున్నది.

శ్లో॥ జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః
వేదపాఠేన, విప్రస్స్యాత్ బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః॥

"ఎవరయినను జననమందిన సమయములో శూద్రుడుగా నుండును. ఆత్మసంస్కారాది కర్మములచే ద్విజుడగును. వేదాధ్యయనముచే విప్రుడగును. బ్రహ్మజ్ఞానము గలుగునప్పుడు బ్రాహ్మణుడగుచున్నాడు. పూర్వజన్మ ఫలవిశేషమును బట్టి క్రమక్రమమున బ్రహ్మము నెరిగిన వారలే సద్బ్రాహ్మణు లనియు నున్నది. కాన కులము ప్రధానమైనది కాదు. సర్వకాలసర్వావస్థలయం దేజాతివారైనను పరబ్రహ్మము నందు మనస్సునిల్పి తపము చేయుచున్నచో నా తపమే బ్రాహ్మణ్యత నొసగును. ఇట్టి తపము చేయుటవలననే సూతునకు బ్రహ్మ తనపీఠము నిచ్చి సర్వధర్మంబులను ప్రబోధము చేసెను. మరియు బ్రాహ్మణులనెడి నామమెట్లు కల్గినదో పరికింతము.

విష్ణువు నుపాసించువారికి వైష్ణవులనియు, శివు నుపాసించువారికి శైవు లనియు, గణపతి నుపాసించువారికి గాణాపత్యులనియు, శక్తి నుపాసించువారికి శాక్తేయులనియును, నెట్లు నామములు గలిగెనో అటులే భక్తి జ్ఞాన వైరాగ్యములు గలిగి పరబ్రహ్మము నెరింగినవారికి బ్రాహ్మణు లని నామము గలిగెను. కాన సచ్చిదానంద పరబ్రహ్మమే నిత్యమైనది సత్యమైనది. బ్రాహ్మణ శూద్రాది వర్ణము లనిత్యములు. సర్వజనులకు వేదపారాయణము చేయుటకును మంత్రాధికారంబును

గలదు. సర్వమానవులకు భగవదోపాసనచే మోక్షము లభించగలద''ని స్వామివారు చెప్పిరి.

భక్తులెల్లరు పరమానందము చెంది "స్వామీ! తమరు మాకు సద్గురువులు. ఈ పవిత్ర దివసమందే మాకు జ్ఞానోపదేశము చేయ వలయు'' నని కోరిరి. యోగానందస్వామి వారి వారి హృదయ పరివర్తనలను గుర్తెరిగి జ్ఞానోపదేశ మొసగిరి.

శ్రీనృసింహమూర్తి యపరావతారులైన శ్రీయోగానందమూర్తి యీ గిరికి వేంచేసిన మరుక్షణమునుండి మార్కాపుర నివాసినియగు చెప్పలి రంగమ్మయను భక్తురాలు నిష్కళంకమగు హృదయముతో నపారమైన ప్రేమతో ప్రతిదినమున వేకువజామున లేచి కాలకృత్య ములు నెరవేర్చుకొని గోక్షీరమును తీసికొని కపిలగిరికి వేంచేసి యోగ మూర్తి యగు తోకపల్లి స్వామివారికిచ్చి వెళ్ళుచుండెను. ఈ విధ ముగా స్వామివారికి చాలకాలము క్షీరము నొసగి మహనీయమూర్తి యగు సద్గురు కృపకు పాత్రురాలయ్యెను. మహనీయుల కొసంగిన వస్తు వణువైనను బ్రహ్మాండమై వృద్ధిచెంది జన్మరాహిత్యమగు మోక్షము నొసంగును.

బ్రహ్మజ్ఞాన సంపన్నులు శ్రీ యోగానంద నృసింహమూర్తి పరతత్త్వమును దర్శించిన పిదప కపిలగిరికి వేంచేసిరి. స్వామి వేంచేసిన మరుక్షణముననే మారికాపుర భక్తులు కొందరు వేంచేసి స్వామి యపారకరుణకు పాత్రులైరి. వారిభాగ్య మేమనవచ్చును. స్వామి కనుగాములై స్వామి యాజ్ఞను జవదాటి యెరుగని ప్రథమశిష్యులు శ్రీ దొడ్డా సుబ్బారెడ్డి, చెంచు సుబ్బారాయుడు, చీమలమర్రి చెన్నయ్య, ఆకుల గురవయ్య, మంగలి రామయ్య యను వారలు. వీరత్యంత భక్తిశ్రద్ధలు గలవారై జీవితాంతము వరకును చలించని గురుభక్తితో శ్రీ స్వామివారిని నమ్మి సేవించిరి.

శ్రీ యోగానందమూర్తి దృష్టి సర్వమానవసౌభ్రాతృత్వమును చాటుచున్నది. ఎట్టి వారినైన నపారకరుణతో నాదరించెడి కరుణారసమూర్తి, యోగమూర్తి. యమృతోపమానమగు విజ్ఞాన ప్రబోధమును వినిన భక్తులందరు మరచెదమన్నను, మరపురాని యా మహాత్ముని దివ్యవాక్కులను మనస్సున స్మరించుచు వారి చరిత్రనంతయు మిత్రులతో బంధువర్గములతో చెప్పదొడంగిరి. స్వామి శక్తిని విన్న ప్రతిమానవుడు నా క్షణమందే గురుదేవుని దర్శించి వారివారి జీవితములను సార్థకము చేసికొనవలయునను నుత్సాహావేశములతో వేలకొలది ప్రజలు కొండకు విచ్చేయుచుండిరి. కొండకు వచ్చు ప్రజలలో కొందరు ఘోరవ్యాధులతో పురాకృత కర్మలతో మనశ్శాంతిలేక పిశాచ బాధలకు గురియైనవా రెందరో గలరు. వారందరు నా మహనీయ మూర్తిని దర్శించినచో కర్మలన్నియు దగ్ధమైపోయి తమ హృదయములకు, శాంతి చేకూరగలదను నాశాభావములతో నుండిరి. కొండకు వచ్చిన ప్రజలందరు యోగానందమూర్తి పాదపద్మములకు ప్రణతులొనర్చుచుండిరి.

## శ్రీ యోగానందమూర్తి పూర్వకర్మలను పోగొట్టుట

శ్రీ స్వామివారి పాదస్పర్శచే పవిత్రులై పరిపూర్ణారోగ్యములను పొందుచుండిరి. దుష్టగ్రహ పీడితులగు వారందరు కొండ కేకలువేయుచు వికారచేష్టలతో పొరలాడుచుండిరి. ఆ కోలాహలమును దర్శించెడి భక్తులందరు సంభ్రమాశ్చర్యములతో వీక్షించుచుండిరి.

మహోగ్రమూర్తియగు వీరనృసింహమూర్తిని మనస్సున దలపగా నా మహాశక్తి సద్గురు శ్రీయోగానంద స్వామిలో నేకీభవించెను. స్వామివారు పిశాచావేశ పూరితులను "జై వీరనృసింహా" యని వారి వీపులపై చరచగా నా దుష్టగ్రహములన్నియు "ఇచ్చట మనకు స్థానములేదు బాబో"యని వారిని వదలి పలాయనమొందినవి. శ్రీ యోగానందుని వాక్కులు దైవవాక్కులు! మనకర్మల ననుసరించియే

యా మహిమాన్వితుని నోటినుండి యట్టి వాక్యములు వెలువడుచుండును. వారివాక్యములు రామబాణములకంటె సునిశితములైనవి. స్వామివారి మహిమ ప్రశంసనీయమైనది. ప్రహ్లాదునివలె నఖండమైన భగవత్ప్రేమచే బాహ్యప్రకృతిని మరచి యాత్మానందముతో మెలంగెడి వారి నడవడిని చూచి యాశ్చర్యము చెందని మానవు లుండరనుట యతిశయోక్తిగాదు.

శ్రీ యోగానందమూర్తి వడసిన యాదివ్యప్రేమోన్మాదము, పరమభాగవతోత్తమ స్థితియనుట స్పష్టము. వేలకొలది ప్రజల కరతాళభజనలతో హరినామస్మరణలతో నాకొండ దివ్యక్షేత్రమై ప్రకాశించెను. మహోత్సవములు విధివిరామములేక సాగుచుండెను. గ్రామీణప్రజలు రేయింబవళ్ళు స్వామిచరిత్రనే చెప్పుకొనసాగిరి. నిండుకుండ తొణకదు. అల్పప్రజ్ఞావంతునకే యహంభావము మెండు. జీవించి యున్నంతవరకు పారమార్థికచింతనతో సునిశ్చల భావముతో సాధుపురుషుల సేవించుచు, ధర్మకార్యములు నిర్వహించుచు, చెడు సంకల్పముల నణుమాత్రమేని మనస్సున చొరనీయక సద్గ్రంథముల పఠన మొనర్చుచు, సత్సంగియై సాధుభావములు గలిగి సద్గురు మహామంత్రమును జపించుచు, భవబంధ విముక్తికై తపించుచు, దైవదర్శనము కొరకు పరితపించుచు, నోటితో నీతులు చెప్పక యాచరణ యొనర్చుచు సర్వమానవ సోదరభావముతో సర్వభూతములలో పరమాత్మనే దర్శించుచు సమత్వదృష్టితో కాలమును సద్వినియోగము చేయవలయునని, శ్రీయోగానందమూర్తి వచించె నన్నచో, నమ్మహాత్ముని వినయసంపద యెట్టిదో విశదము కాగలదు. ఆమహనీయుడెంతటి యాధ్యాత్మిక ప్రజ్ఞాధురీణుడో యంతటి సహజవినయ సంశోభితుడు.

ఆ మహాత్ముడు తనను దర్శించుటకువచ్చు వారిని చూడగనే వారల హృదయములందు నెలకొనియున్న మనోభావములను గుర్తించి వారలకు తగురీతిగా ప్రబోధము చేయుచుండెడివారు. తననుగూర్చి వారే

మనుకొందురో యని కాని వారు తనను సమాదరింతురో లేదోయని
కాని యణుమాత్రము తలంపరు. తీవ్రచర్చలతో వాదోపవాదములతో



శ్రీ నృసింహాలయమున శ్రీ సద్గురు దేవులున్న దృశ్యము

తేలకుండిన తాత్త్వికసమస్య లన్నియు నృసింహ ప్రేరితమైన తన సమా
ధానములచే పరిష్కృతమగుననియు, శ్రీయోగానందమూర్తి ముఖ్య

శిష్యులకు తెలుపుచుండెడివారు. ఆ యోగానందమూర్తి నోరువిప్పితే చాలును. వేదవేదాంగముల సారమంతయు నొకటి రెండువాక్యము లలో నొక్కివక్కాణించెదరు. భారత రామాయణ భాగవతాది గ్రంథములలో గల కథాభాగము లన్నిటికి నాత్మపరముగా నర్థమగు రీతి నరటి పండొలిచిన తెరగున విప్పి చెప్పెడివారు. వారు ప్రవచించెడి యాత్మభావతత్త్వ విమర్శనలు విని పండితులైనను నాశ్చర్య చకితు లయ్యెడివారు.

## ఆత్మప్రబోధము

ఆ కరుణారసమూర్తి ప్రియశిష్యులకు, నిజభక్తులకు ప్రబోధము చేయు సమయములలో పలుమారు లీ పవిత్రశ్లోకమును వల్లించెదరు. సర్వవేదాంత సారస్వతమంతయు నీ శ్లోకములో నిమిడియున్న దేమొ! ఆ యోగనృసింహమూర్తి ప్రబోధముచేసెడి శ్లోకమిదియే! జాగ్రతగా విని మననముచేసి యనుభూతిని పొందుడు. మనస్సును వశముచేసుకొని మాధవదర్శనమును పొందుడు. సర్వవ్యాపియగు శ్రీహరి మానవ హృదయకుహరమున సూక్ష్మాతిసూక్ష్మమై స్వయంజ్యోతియై వెలుగు చున్నాడు. హృదయపద్మమున ప్రకాశించెడి శ్రీమన్నారాయణ మూర్తిని నేను దర్శించితిని. సందేహము లేదు. నేను దర్శించిన జ్యోతిర్మయమూర్తిని మీరు దర్శింపుడు. పురుషప్రయత్నము చేసినచో కార్యము సిద్ధించునని ప్రబోధముచేయుచు పలుమారులు చదివెడి శ్లోక మిదియే!

శ్లో. దేహో దేవాలయ ప్రోక్తో జీవో దేవ స్సనాతనః
త్యజే దజ్ఞాన నిర్మాల్యం సోఽహం భావేన పూజయేత్.

బ్రహ్మైక్యానుసంధాన పరులగు జ్ఞానులు శరీరమునే దేవాలయ ముగా భావింతురు. వీ రజ్ఞానమనెడి మాయను పారద్రోలి సోఽహ మ్మనెడి జపము చేయుచు బ్రహ్మనిష్ఠయం దుందురు. ఇట్టివారు జరా మృత్యుభయ రహితులై నిత్యముక్తులై యుండి కడపట, పునరావృత్తి

రహితమగు మోక్షమును బొందుచున్నారు. దేహమే దేవాలయము. ఈ దేవాలయములో నివసించెడి యాత్మయే దైవస్వరూపము. చావు పుట్టుకలులేనిది. యుక్తివాదముల కందనిది. జాతిమత భేదములకు చిక్కనిది, ధనధాన్యములకు దక్కనిది, తన్నుదా తెలిసి తత్వమున దలసి సహస్రారచక్రమున కోటిసూర్యులకాంతితో వెలుంగు నా పరంజ్యోతిలో చేరునంతవరకు జననమరణ ప్రవాహమునబడి ఈదులాడ వలసినదే! శాస్త్రములన్నియు వల్లెవేసినను, తీర్థయాత్ర లన్నిటిని సేవించినను, గంగానదులలో బుడకోళ్ళవలె మునుగుచున్నను, సత్రశాలలు నిర్మించి సప్తాహము లొనరించినను, నీశ్వరునకు కోటి పత్రి పూజలు గావించినను, నాలయములపై సువర్ణాక్షరములతో పేర్లను చెక్కించినను, కాషాయంబరములదాల్చి, దండ కమండలములబూని జటాధారులై మెడకు బరువయ్యెడురీతి తులసిపేరులను దాల్చినను ప్రయోజనములేదు. తనలో వెలింగెడు పరంజ్యోతిని దర్శించునంత దనుక నీ జీవునకుజన్మరాహిత్యము లేదు,సంసారబంధవిముక్తియును లేదు.

మనలో వెలింగెడు సత్యవస్తువును గోచరింపచేయుటకై పూర్వు లాలయ ప్రాకార మంటపాదుల నేర్పరచి నిత్య నైవేద్య దీపారాధన మహోత్సవములు సాగించిరి. అయ్యో! ఏమిప్రయోజనము! పూర్వులు చేసిన మేలంతయు కలిప్రేరణచే నజ్ఞానులకుమాత్రము కీడుగా పరిణమించినది. ఈ యనర్థములకు కారణము విరివిగా సద్గురువులు లేకపోవుట. నున్ననువారియందలక్ష్యభావముతో మెలంగుట, అర్థాపేక్షచే పరమార్థమును విస్మరించుట, కామినీకాంచనములకుదాసులై తైతక్కలాడుట, వాచా వేదాంతులెక్కువై సత్యము నసత్యమనియు, నసత్యమును సత్యమనియు, యుక్తివాదములతో ఋజువుచేసి అమాయకులను మోసగించి జీవయాత్ర గడుపుట మొదలగు కార్యములే ప్రబల కారణములు. ప్రత్యక్షనిదర్శనములు. పెద్దల వాక్యములు లౌకికదృష్టికి గోచరించునవికావు.

మరియు నింకొక విశేషము చెప్పెదను ఆలింపుడు.

బెల్లముకొండ దేవరకొండ పెట్టుడు పేర్లండి
బెల్లములేదు దేవర లేడు మీ పిచ్చి వదలండి
గొడ్డురాలు కెప్పుడు బిడ్డపుట్ట బోదండి
పుట్టినదనుచు తెల్పేవారికి బుద్ధియె లేదండి.

బెల్లముకొండ దేవరకొండ అని నుడువుచున్నారేకాని, యీ కొండలో బెల్లము లేదు, దేవరకొండలో దేవర లేడు, గొడ్రాలికి బిడ్డలు కలుగరు. అట్లే వినిర్మలహృదమున విషయవాంఛ లంకురింపవు. అన్నిట నొకేశక్తి ప్రకాశింపుచున్నది. జాతి మత లింగ భేదములను విసర్జించి ప్రతిప్రాణిలో భగవానుని దర్శించవలయును. అట్టి యుత్తమ స్థితి నొందిననాడే జ్ఞాని యనబడును. లేకున్న 'అ' చేర్చవలయును. ఇచ్చట కొన్ని ప్రమాణములను చేర్చుచున్నాను.

మఱియు కాశీక్షేత్రమందు శ్రీ శంకరాచార్య భగవత్పాదులకు గల జాతి భేదాభిమానములను బోగొట్టవలయుననెడి తలంపుతో పరమ శివుడు పంచమవేషధారియై వచ్చి యీ విధముగా చెప్పుచున్నాడు.

శ్లో. ఇహ ఖలు పరమకారుణికో భగవాన్ పరమ శివః
అనర్థమ కరా, కారే, సంసారసాగరే నిమగ్నం లోక
ముద్ధిధీర్షుః కదాచి త్కాశీం ప్రతి గచ్ఛంత మాచా
ర్యం, ప్రతిచండాల వేషధారీ, మహేశ్వర స్సమాజగామ
తతో జగాద భగవానాచార్యః, హే చండాలాధమ
ఇతోగచ్ఛగచ్ఛేతి, తతశ్చండాల, వేషమండితః శివః ప్రత్యాహ.

జలజంతువులు సముద్రమునందు మునిగియుండునటుల ననర్థమైన సంసారమనెడి సముద్రములో మునిగియున్న ప్రాణులను తరింపజేయ వలయు ననెడి తలంపుతో పరమకారుణికోత్తముడును భగవంతుడును నగు పరమశివుడొకానొకనాడు మాలవాని వేషముతో కాశీపట్టణ మందు శ్రీ శంకరాచార్యులు పోవుమార్గమున వారి కభిముఖముగా వచ్చుచుండెను. ఎదురుగా వచ్చుచున్న చండాలుని జూచి శ్రీ శంకరా చార్యులు జెప్పుచున్నాడు. "ఓ చండాలాధమా! నా యెదురుగా

వచ్చుచున్నావా? ఛీ! ఛీ! దూరముగా బొమ్మని గద్దించెను. అందులకు చండాలవేషధారి యగు పరమేశ్వరు డిట్లు చెప్పుచున్నాడు.

శ్లో. అన్నమయా దన్నమయ మథవా చైతన్యమేవ చైతన్యాత్
యతివర దూరీకర్తుం వాంఛసి కిం బ్రూహి గచ్ఛ గచ్ఛేతి,
హే! యతివర! అత్ర బ్రూహి కిమన్నమయాత్ శరీరాత్ అన్నమయం
శరీరం గచ్ఛగచ్ఛేతి దూరీకర్తుం వాంఛసి అథవా చైతన్యాత్
చైతన్య మేవ గచ్ఛగచ్ఛేతి వాంఛసి.

ఓ యతీశ్వరా! అన్నమయమగు నా దేహము, నన్నమయ మగు నీ దేహమునకు దూరముగా తొలగిపొమ్మనెదవా? లేక నా శరీరములో గల చైతన్యస్వరూపుండగు జీవాత్మను, నీ శరీరమందున్న జీవాత్మకు దగులకుండునటుల దూరముగా తొలగిపొమ్మనెదవా?

"ఉభయో రప్యన్న కార్యత్వే నైకత్వాత్॥"

మన యుభయులయొక్క శరీరములు నన్నమయకోశమునందుండియేకదా పుట్టినది. అట్లు పుట్టిన మనయిరువురియొక్క శరీరములకును గల భేదమేమి? నీ శరీర మాచారము, నా శరీర మనాచారమైనదియా యేమి! నీ శరీరమెట్టిదో నా శరీరమునునట్టిదే! ఈ శరీరమును జూచి యెందులకు దూరముగా తొలగిపొమ్మనెదవు.

"శ్రూయతే హి శరీరస్య అన్నకార్యత్వం
సవాఏష పురుషోన్నరసమయ ఇతి॥

అన్నరసమునుండియే శరీరము లుత్పన్నమగుచున్నవి. కావున నిట్టి శరీరమునకు భేదమెంతమాత్రము నెంచరాదు. నీ శరీరమునందును నా శరీరమునందును పరమాత్మయొక్కడే వ్యాపించియున్నాడు. కనుక నన్ను దూరముగా తొలగిపొమ్మని చెప్పుట నీకు న్యాయముగాదు. మఱియు—

"చైతన్యస్య సర్వాత్మైక రూపత్వాత్
ఏకోదేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ।
సర్వభూతాంతరాత్మా ఇతిశ్రుతేః॥"

చైతన్య స్వరూపుడగు పరమాత్మను యెల్లప్పుడును నొకే రూపముగా నుండియున్నాడు. సర్వభూతములయందును నీ యొక్క పరమాత్మయే గూఢముగాను సాక్షీమాత్రుడుగాను నిలచియున్నాడు.

"అణోరణీయాన్ మహతో మహీయాన్
ఆత్మాఽస్య జంతోర్నిహితో గుహాయాం॥"

[నారాయణోపనిషత్తు]

కంటికి కానరాని చిన్నచిన్న యణువులు మొదలగు వానియందును, ఏనుగువంటి మిక్కిలి గొప్పగొప్ప జంతువులయందును పరబ్రహ్మమగునాత్మ నొకే విధముగా నివశించుచున్నాడు. అనగా – పెద్దపెద్ద జంతువులయందు పెద్దదిగాను చిన్న జంతువులయందు చిన్నదిగాను నాత్మయుండక యన్నిటియందు నొకేవిధముగా నుండునని భావము.

"యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహమృత్యోస్సమృత్యు
మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి॥"

[కఠోపనిషత్తు]

అంతటా నిండియుండు నొక్కయాకాశమే భాండములో నున్నందున భాండాకాశమని నామము గలిగెను భాండమున కుపాధిగానుండు పెంకుపగిలిన వెంటనే, భాండాకాశము మహాకాశములో గలియునట్లేశరీరమునందున్న జీవాత్మ శరీరము నశించిన వెంటనే పరమాత్మలో కలియుచున్నది. కావున పరమాత్మయే జీవాత్మయై వ్యాపించియున్నాడు.

అహంకారమునకు దూరస్థుడవై యుండి ప్రత్యగాత్మయందు గలసియుంటివేని యప్పు డలలులేని సముద్రమెటులుండునో యటువలెనే నీవు బ్రహ్మానంద సముద్రమున ప్రశాంతనిశ్చలుడవై యుందువు. అట్టి సమయమున విప్రుడనియు ఛండాలుడనియు భేదభావముండునా! యుండనేరదు. గంగానదియందుండు జలమునందును, మాలవీధియందుండు బావియందును ప్రతిబింబించుచుండు సూర్యునకు భేదములేనట్లు, ఛండాలుడ నగు నాయందును, యతీశ్వరుండ వగు నీయందును ప్రకాశించు

చుండు ప్రత్యగాత్మకు భేదములేదు. కాన మన యిరువురియందును భేదములేదని తెలిసికొనుమని" చండాలవేషధారియగు పరమశివుడు శ్రీ శంకరునకు జెప్పిరి. శంకరుడు విజ్ఞానిగనుక పరమేశ్వరుని వాక్యములు విని మనస్సుమార్చుకొని యిక జాతిభేదము లేదని తలంచి ముముక్షువుల తరుణోపాయమునకై తన స్వానుభవమును తెలిపియున్నాడు.

శ్లో. జాగ్రత్స్వప్న సుషుప్తిషు స్ఫుటతరా యా సంవి దుజ్జృంభతే
యా బ్రహ్మాది పిపీలికాంత తనుషు ప్రోతా జగత్సాక్షిణీ
సైవాహం నచ దృశ్యవస్త్వితి దృఢ ప్రజ్ఞాఽపి యస్యాస్తి చేత్
చండాలోఽస్తు సతు ద్విజోఽస్తు గురురి త్యేషా మనీషామమ.

ఏది జగత్సాక్షిగా నుండునో యేది బ్రహ్మాది పిపీలికాంతముగ సర్వశరీరముల యందును వ్యాపించి, జాగ్రత స్వప్న సుషుప్తి యను మూడవస్థలయందును తనంతట తాను ప్రకాశించుచు సాక్షియై యుండునో యా వస్తువే నేననియు, కంటికి కనబడు వస్తువేదియు నేను కాదని యెవ్వడు దెలిసికొనునో యట్టివాడు కడజాతివాడైనను బ్రాహ్మణుడైనను నాతడే నాకు గురువగుచున్నాడు అని శ్రీ శంకరాచార్యులు జెప్పియున్నారు. ఎట్టివాడు జీవన్ముక్తుడో మన వేదప్రమాణములను శ్రద్ధగా విని మననము చేయుము. తదుపరి మహాత్ముల సేవజేసి వారి యపారకరుణకు పాత్రులై జీవన్ముక్తులు కండు.

శ్రుతి. క్రియా నాశాద్భవేత్ చింతానాశో తస్మా ద్వాసనాక్షయః
వాసనా ప్రక్షయో మోక్షః సా జీవన్ముక్తి రిష్యతే.
[అధ్యాత్మికోపనిషత్తు]

'జీవుడు ముక్తిబొందదలచిన యెడల తనకున్న సకల మనోవ్యాపారములను నశింపచేయవలయును. అట్లు మనోవ్యాపారములను నశింప జేసిన యెడల నే తలంపులును గలుగజాలవు. తలంపులు లేకున్నచో సంచితము ప్రారబ్ధము ఆగామి యనెడి మూడు వాసనలయొక్క కర్మములు నశించును. ఇవి యన్నియు నశించిన వెనుక జీవుడు ముక్తిని బొందుచున్నాడు, అని ప్రబోధము చేసెడి సద్గురువరేణ్యులు మహాత్తర

భగవదనుభూతిని వడసిన జ్ఞానమూర్తు లని వేరుగా ప్రశంసింప పని లేదు. సద్గురు ప్రబోధము విన్న భక్తులందరు, "ఆహా! ఏమి వీరి ప్రతిభాశక్తి సర్వమతముల సారాంశమును సామాన్యుల కర్థమయ్యేడు రీతి ప్రబోధము గావించిరి" అని యాశ్చర్యపడెదరు.

వీరి ప్రబోధమును సాత్వికదృష్టితో పరిశీలించిన మన సంశయము లన్నియు పటాపంచలౌను. "సత్యమైన బ్రహ్మపదార్థమే, సర్వభూతములలో నిండియున్నది. అందు నిందు వ్యాపించి శ్రీహరి వెలుంగుచున్నాడు" యని చెప్పినట్టి పరమభాగవతమూర్తి ప్రహ్లాదుడే! మన సుకృతవిశేషమున నీ మహాయోగి రూపమున నవతరించి ఇట్టి పరిపూర్ణ బ్రహ్మజ్ఞానమును మనకు ప్రబోధము చేసిరి. లేకున్న యీ యాత్మ ప్రబోధమును మన కంద చేయుట సామాన్యవిషయమా?

భగవత్సాక్షాత్కార హేతుభూతము, శాశ్వతానంద సంధాయకము నగు బ్రహ్మవిద్యయే తనకు పరమావలంబనీయ మని మన సద్గురులగు శ్రీ యోగానంద నృసింహస్వామివారు నిశ్చయము చేసికొనిరి. స్వామివా రెచ్చట నివసించెదరో యా భూమియే పుణ్యభూమియై శాంతిశ్రీలతో వెలుగొందును. ఆ మహాముని ప్రతిభాశక్తి వర్ణనాతీతమై జగత్ప్రసిద్ధమై సుప్రసన్నమై ప్రకాశించెను. సద్గురు దేవుల శక్తి విన్నవారందరు స్వామిపై గాఢమైన భక్తిగలిగి స్వామిదర్శనము చేసికొని తరించుటకై కొండకు వచ్చుచుండిరి.

శ్రీ కపిలగిరి దివ్యక్షేత్రముగామారి మహోత్సవములు జరుగుచుండెను. స్వామికీర్తి నలుదిక్కుల ప్రసరింప గ్రామీణ ప్రజలందరు మహోత్సవములలో పాల్గొని రాత్రింబవళ్ళు నృహరినామమును స్మరించుచు జాగరణలు గావింపుచు శ్రీ యోగానంద నరసింహమూర్తి ప్రతిభను పలుమారు పొగడుచుండిరి.

శ్రీ నృసింహస్వామివారు యేప్రాణిని వీక్షించిన నాప్రాణి పూర్వజన్మ సంస్కారముల నరటిపండ్లొలిచినరీతి విప్పిచెప్పెడివారు. స్వామి

వారు చెప్పెడి ప్రత్యక్షప్రమాణములను గుర్తించిన పరమభక్తులు, వేద వేదాంగపారంగతులు సాధు సజ్జనబృందములవారెల్లరు విస్మయమంద సాగిరి. "ఆహా! మనపాలిటి పెన్నిధి ప్రమధగణముల పరిపాలించెడి లోకకల్యాణమూర్తి యీ మహేశ్వరుడే యిచట మనకు సాక్షాత్క రించిరి. లేకున్న నింతటి ప్రత్యక్ష నిదర్శనములను ప్రదర్శించు టెట్లు" లని వారెల్ల రనుకొనిరి.

లోకోత్తర పుణ్యమూర్తి నమ్మి కొలిచెడి భక్తులకు ముంగొంగు బంగారము! ఎట్టి సందేహము లేదని వారందరు నిశ్చయము చేసి కొనిరి. ఈ విధముగా దిన మొక క్షణముగ గడువసాగెను. శ్రీ యోగానంద నరసింహయోగీశ్వరమూర్తి సమాధి యోగములో, నగ్రగణ్యులు, యోగముద్ర నుపాసించి యఖండ విజయమును పొందిన యపరశంకరులు.

శ్రీ స్వామివారు భక్తులు వీక్షించు సమయములందే నాసికా రంధ్రముల తిరిగెడు హంస నూర్ధ్వమునకు లాగి కుంభించెదరు. కుంభించిన ప్రాణవాయువును, గంటలకొలది నిలిపి వేసెదరు. కొన్ని దినములే యోగనిష్ఠయం దుండెదరు. వారి ప్రాణవాయువు నధోముఖముగా ప్రసారము చేయవలెనన్నచో వారి కర్ణ రంధ్రములయొద్ద గంటలు జేగంటలు శంఖములు మ్రోగించెదరు. కరతాళధ్వనులు గావించెదరు. ప్రణవమును బిగ్గరగా గానముచేయుట మొదలగు కార్యక్రమము లెన్నో చేసినచో, హంస యూర్ధ్వమునుండి యధోముఖమునకు ప్రసారమగును.

వర్ణనాతీతమైన యీ మహత్తర యోగశక్తిచేతనే ప్రాణుల భవిష్యత్తంతయు వారి కన్నులముందు నాట్యము సేయును. నిరా డంబరులై మణిదీపికవలె ప్రకాశించెడి మహనీయమూర్తి! వారు పరిపూర్ణజితేంద్రియు లా మహాత్ముని యదార్థతత్వమును గుర్తించుట దుర్లభము. వారిని నమ్మి కొలిచెడి శిష్యులలో నే కొద్దిమంది మాత్రమే వారి యదార్థ స్వరూపమును గుర్తింపగలిగిరి. యదార్థ

సత్యమును గుర్తించిన శిష్యులనే ... పరిటీలను గొట్టించెదరు. ఇక సామాన్యుల మా...

మహనీయు లెవ్వరైనను నిరాడంబర జీవితములనే గడుపుచుందురు. స్వానుభవము లేక గ్రంథపరిజ్ఞానముతో సర్వము తెలిసిన వారివలె ప్రవర్తించెడి దైవదూరులే యాడంబరములతో నట్టహాసములతో నఖండ సన్మానములను పొందుచుందురు. ఇది కాలమహిమ! నిజమును నీటగలిపి యభావమునే స్వభావమని ప్రవర్తించెడి కపట సన్న్యాసులకే లోకము తలలొగ్గుచున్నది. కానీ బహుకాలము జరుగదు. తాత్కాలిక భోగము లనుభవించినను రోగముల పాల్గాక విరాగులు కానేరరు. భోగరాగాదులే రోగములకు మూలము. విరాగముపై ననురాగము గలిగిననాడే నిజమైన సాధువులు కాగలరు. అట్టి సాధు పుంగవులను మానవులు గ్రహింపగలరు. సర్వమానవ సౌభ్రాతృత్వ మంకురించిననాడే సర్వగతుడైన యా సర్వేశ్వరు డానందించగలడు. మానవుల కనులలో మసిచల్లి జగజ్జనకుని సత్యదృష్టికి దుష్టులవలె ప్రవర్తించిన మరుక్షణమే మిన్నులోనో మన్నులోనో కలియుక తప్పదు.

## ఉత్తమ జీవిత విధానము

సర్వత్ర భగవంతుడు వ్యాపించి యున్నాడని, యేమరుపాటుననైన యజ్ఞాన కార్యములు చేయరాదు. చేయుటకై సంకల్పించరాదు. 'చేసికొన్నవారికి చేసికొన్నంత మహాదేవ' యను సామెతరీతి నెట్టివారైనను చేసినకర్మల ననుభవించక తప్పదు. అనుభవించునాడు వాపోవుటకంటె ముందుగనే మేల్కాని జాగ్రత వహించుట యుత్తమ లక్షణము. పొరపాటుననో గ్రహపాటుననో యజ్ఞాన కార్యములు జేసి తనతప్పు తాను తెలిసికొని, పశ్చాత్తాపమును బొంది సుజ్ఞానముతో ప్రవర్తించుట మధ్యమలక్షణము. అజ్ఞాన కార్యములు చేయుచు సమర్థించుకొనుచు సంతోషపడు మూర్ఖుని లక్షణమే యధమలక్షణము. ఈ యధముని కెచ్చటను శాంతిలేదు, అశాంతితో వంతరింపవలసినదే.

ఉత్తములగువారు మనసుయొక్క బహిఃప్రవృత్తి నరికట్టి ప్రజ్ఞానఘన మగు నాత్మస్థితిని బొందుటకై, మనస్సు నంతర్ముఖము చేయుటయే యుత్తమ జీవితవిధానము. మనోనిగ్రహమున కిదియే సరియైనమార్గము. స్వానుభవము వలనను బరుల యనుభవము వలనను గుణపాఠములను గ్రహించి విషయాసక్తిని నిగ్రహించి మనస్సును దాని బారి బడనీయ కుండుటయే వైరాగ్యము. విషయేచ్ఛలు నీకు వశమై యుండవలయునే కాని, నీవు విషయేచ్ఛలకు వశుడవై యుండరాదు. ఇట్టి మనోబలమే వైరాగ్యమనబడును. వైరాగ్యమునకు మించిన మోక్షసాధనము మఱియొకటిలేదు.

వాయుపుత్రు డగు శ్రీ వీరాంజనేయమూర్తియే మన కాదర్శ పురుషుడు. జితేంద్రియ చక్రవర్తియు, నద్వితీయ ధీశాలియునగు నాతడు రామనామమందలి యఖండ భక్తిచే ప్రాణభీతిని విడనాడి యొక్క దుముకులో సముద్రము నెట్లు లఘించెనో పరికింపుడు.

భగవానుని సేవలో పాల్గొని మనజీవితములను సార్థకము చేసి కొనుటకు యత్నింపని మానవుని జీవితము ముమ్మాటికి వ్యర్థము. సమస్త సంశయములను ద్రోసిపుచ్చి సద్గురువరేణ్యుల యాజ్ఞలను బాలింప గంకణము గట్టుకొనుడు. అస్ఖలిత బ్రహ్మచర్యము నవలంబిం పుడు. ఇదియే పారమార్థిక జీవనరహస్యము. వేఱుమార్గము లేదు. ధీమంతుడైన హనుమంతుని గనుడు. అతడెట్టి భగవత్సేవకుడో ఆదర్శ మూర్తియో! తన యఖండ బాహుబలముచే నద్వితీయ పరాక్రమము లచే, రావణుని రాక్షస సైన్యములను హాహాకార మెత్తింపగలిగిన మహావీరు డాతడు. రామచంద్రుని సేవించుట రామాజ్ఞను బరిపాలిం చుటయే యాతని జీవితేచ్ఛ! అందులకై యాతడు తన జీవితమును ధారవోసి కల్యాణ రామునికృపకు పాత్రుడై మృత్యువును జయించి స్వేచ్ఛాజీవియై సూర్యచంద్రులవలె ప్రకాశించుచున్నాడు.

మానవులు స్వార్థమునకై అనేక త్యాగములు చేయుచున్నారు. కాని, మహర్షుల సేవకుగాని, భగవదారాధన కొరకుగాని, తోటిమానవుని గౌరవించుటలో గాని త్యాగమొనర్పలేరు. శుష్క ప్రియములతో ప్రొద్దులు బుచ్చుచుందురేగాని కాసైనను వ్యయమొనర్పరు. ఆహా! మాయ యెంతటివారినైనను మోసగించి భ్రష్టులను చేయునుగదా? ఆ మాయను జయించిన మానవుడే మాధవుని కరుణకు పాత్రుడు కాగలడు. లేకున్న కాలుని పాశములచే కట్టువడి యంతులేని యావేదనతో నంతమగుచున్నాడు. దృశ్యప్రపంచమునుజూచి భ్రమించి ఇదంతయు 'నాది నాది' యను మమకారముతో మాయా మోహితుడగుచున్నాడు. ఇదంతయు నీశ్వర విలాస మని మదినెంచడుగదా! మాయా ప్రభావమెంత యాశ్చర్యకరమైనదో పరికింపుడు.

'నేను, నాది' యన్నహంకృతి మానవులందు, మృగములందు, యత్యల్ప క్రిమికీటకములందును గూడ గోచరించుచున్నది. నరునిబట్టి గోళ్ళతో చీల్చివేసి వేడినెత్తురు త్రావు పులి తన పిల్లలను రక్షించుకొనుటకై ప్రాణము లర్పించుచున్నది. జంకును గొంకును లేక సోదర మానవులను జంపు హంతకుడు పస్తుండియున్న తన యాలుబిడ్డలను గాపాడుకొను యత్నమున నిస్సంకోచముగా బ్రాణము లర్పించుచున్నాడు. పిపీలికాదిబ్రహ్మపర్యంతము లోకమున స్వార్థమునకే జీవితములను జనులు బలిచేయుచున్నారు. మురిపించి ముచ్చటలు దీర్చి క్షణకాలములో విడిపోవు భార్యాబిడ్డల నిమిత్తమే శక్తినంతయు వినియోగించి మెట్టి సంకోచమునులేక బొంకులతో తోటివారిని మోసగించుచు నన్యాయముగా నక్రమముగా నసత్యముతో నార్జించిన ధనముతో అష్టభోగముల ననుభవించుచు తృప్తియనునదిలేక మాటిమాటికి ననుభవించిన దానినే యనుభవించుచు చూచిన దానినే జూచుచు తినినదానినే తినుచు విరక్తిచెందక విముక్తిగానక కైవల్యమును కాంక్షింపక కాలమృత్యుకరాళదంష్ట్రలకు చిక్కి చెప్పశక్యముగాని బాధలకు గురియగుచున్నారు.

రత్నమును త్రొక్కుచు, కాసులకొరకేడ్చెడి యంధునిచంద మున దేహాలయమున ప్రకాశించెడి భగవంతుని గానక తీర్థయాత్రలని రామేశ్వరమని కాశీ ప్రయాగలని, యెన్నాళ్లన్వేషించినను పరమ సత్యము గోచరించదు. మేకపిల్లను చంకనిడికొని మేడంతయు వెదకెడి మూర్ఖుని చందాన తనలోనున్న తత్త్వమును గుర్తింపనేరక పరతత్త్వ మెచటో దర్శింపవలెనని బాధగురువుల వలలోబడి తికమక చెంది తిక్కెత్తితిరిగెడి తల్లులు తండ్రులు నెందరోగలరు. వారి యజాగ్రత్తయే వారు చెడిపోవుటకు కారణము. మన వేషభాషలు చూచువారలను ముగ్ధులను చేయుచున్నవి. మన నడవడి నెవరు గుర్తించగలరను గర్వముతో నీచప్రవృత్తికి పాల్పడి చేయరాని కార్యములు చేయుచు రెంటికి చెడిన రేవడి చందంబున కష్టనష్టములకు గురియై భ్రష్టులై చెడిపోయెదరు.

'గురుసేవ' యనగా సామాన్యమా! దీర్ఘరోగి ప్రశస్తమగు నౌషధము సేవించినప్పటికి పథ్యమును పాటింపనిచో రోగము కుదురక పోగా ఉధృతమై ప్రాణాపాయము గలిగించును. సద్గురుమూర్తి సేవ లొనర్చి పేరుప్రతిష్ఠలు సంపాదించినను, భక్తి జ్ఞాన వైరాగ్యములను విడనాడి సత్యము ధర్మము నిర్మలభక్తి సర్వభూతదయను పోనాడినవారు యెట్టివారైనను గుట్టుచెడి గురు కరుణకు దూరులై ఘోరవ్యాధులకు గురియై జీవచ్ఛవముల పగిదికృశించి నశించుచుందురు.

అంతరాత్మ ప్రబోధమున కనుగుణముగా ప్రవర్తించెడి వారికెన్ని యిక్కట్లు సంభవించినను కారుమేఘములవలె విడిపోవుచుండును. సద్గురు ప్రభావమును వర్ణించుట కాదిశేషునకేని దరమా! శ్రీ యోగా నంద వీరనృసింహమూర్తి కోటిసూర్యుల కాంతితో ప్రకాశించుచు నమ్మికొలిచెడి భక్తుల ప్రియశిష్యుల యోగక్షేమములను తానేచూచు కొనుచు కంటికి రెప్పవలె కాపాడుచుండిరి. కరుణాస్వరూపులగు శ్రీ యోగానంద మహర్షి వారిప్రతిభ దూరదూరములకు వ్యాపింపదొడగెను.

---

# ద్వితీయ ఖండము

## శ్రీ గద్దె నరసింహదాసు చరిత్ర

గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాకు చెందిన పాకాల పాడను గ్రామమున కమ్మవంశమున జన్మించి పేరుప్రతిష్టలు గలిగి భక్తి జ్ఞానవైరాగ్యములతో సద్గ్రంథములను పఠన మొనర్చుకాలము గడిపెడి సద్భక్తుడు గద్దె నరసింహదాసు. వీరు బాల్యమునుండియు సద్గోష్ఠిలో పాల్గొనుచు సాధుజన మైత్రితో కాలమును సద్వినియోగ మొనర్చుచుండిరి.

వీరి అక్కగారగు హనుమాయమ్మను సమీపగ్రామమగు అబ్బూరులో నివసించెడి తక్కెళ్ళపాటి లక్ష్మయ్య గారికిచ్చి పరిణయము గావించిరి. కొన్ని సంవత్సరముల కక్కరలుదీర్చి యత్తవారింటికి బంపించిరి. ఆ యుత్తమ యిల్లాలు అత్తమామల యాజ్ఞశిరసావహించి పతిని దైవముగా పూజించుచు సంసారయాత్ర సాగించుచుండెను. అంతలో విధివశమున హనుమాయమ్మ తొడయందు చిన్నకురుపులేచి పెద్దదియై గడ్డగా పరిణమించి తీవ్రబాధ గలిగింప నారంభించెను. సామాన్య వైద్యములు చేయించిరి. కాని ప్రయోజనము లేక విసిగి వేసారిరి.

ఘనవైద్యుల రావించి వారికి విన్నవింప వారు "ఇదొక లెక్కయా! ఘడియలో మటుమాయము చేసెద"మని విషపూరితమైన మలాములు తయారుచేసి గడ్డకంటించిరి. నానాటికి గడ్డ యణుమాత్రమేనితగ్గక తీవ్రరూపముదాల్చెను. బాధయమితమయ్యెను. ఘనవైద్యు లాశ్చర్యము చెంది మందుల వలనగాదని యెంచి, రాళ్ళనైనను కరగించెడి పసరు పూతలువేసిరి. కాని ప్రయోజనము లేదయ్యెను. రోజులు గడచుకొలది బాధయమితము గాజొచ్చెను. హనుమాయమ్మయా బాధకు తాళలేక కొండకేకలు వేయసాగెను. అక్కయ్య బాధను

చూచుచున్న సోదరుడు బ్రహ్మయ్యగా రిచ్చట లాభములేదని దలంచి, 'యీ కర్మమెట్లు తీరునా' యని యావేదన చెందుచుండిరి. పలురకముల చికిత్సలొనర్చిరి. ఎంతధనము వ్యయమైనను నరసింహ దాసు లెక్క చేయక ఖర్చుచేయుచుండెను. కాని యామెకర్మ ఖర్చు పడలేదు. ఆ కారణముచే నెన్నిరోజులు గడచినను వ్రణబాధ యుప శమింపలేదు. ఆమె నిద్రాహారములుమాని రోజొక యుగముగా గడుప సాగెను.

సోదరుడగు బ్రహ్మయ్య మనస్సువిసిగి వేసారినది. ఈమెను హింసించుట తప్ప వ్రణబాధ తీరునట్లు తనకు దోచుటలేదు. హను మాయమ్మ శరీరము శుష్కించి పోయెను. కాని వ్రణబాధ తగ్గక బాధింపదొడగెను. ఈమె సోదరులకు తెలిసినవా రబ్బూరు నివాసులు శ్రీ కొమ్మూరి గుణకయ్యను మిత్రుడొకరోజున నేదోపనిమీద పాకాల పాడువచ్చి మిత్రుడగు బ్రహ్మయ్యగారి గృహమునకు చూచిపోవచ్చిరి.

ఇంటిలోనున్న హనుమాయమ్మ కాలుకదపలేక 'అలో లక్ష్మణా' యని యరచుచు దుఃఖసముద్రమున మునిగి తేలుచుండెను. అట్టి విషమ స్థితిలోనున్న యీ సాధ్విని గుణకయ్యచూచి జాలినొంది మిత్రుడగు బ్రహ్మయ్యను సమీపించి గత చరిత్రనంతయు తెలిసికొని యమితాశ్చ ర్యమును పొందెను.

ఆహా! కాలమహిమను కర్మమహిమను సామాన్యులు గుర్తింప లేరు. చిన్నకురుపు వ్రణమై తీరనిబాధ కలిగించుచుండెనని యచ్చెరు వొందుచున్న బ్రహ్మయ్య ప్రియమిత్రుడగు గుణకయ్యగారితో "నాయనా! గుణకయ్యా, మా చెల్లెలు వ్రణబాధ తగ్గు నుపాయము దోచకున్నది. మేమీ దుఃఖసముద్రము నెట్లు దాటగలమో! చెప్పుము తండ్రీ!" యని యడిగెను.

వీరి కర్మ నశించెడి సమయమాసన్నమయ్యెను. గుణకయ్యగారు ఆహా! ఈమె బాధ నా ధన్వంతరి వేంచేసిన తీసివేయునేమోకాని!

సామాన్యులకు కానిపని యని మనసులో తలచెను. "నాయనా బ్రహ్మయ్యా! ఒక విషయమును వింటిని. ఆ విషయము యదార్థమైనచో మీ యిక్కట్లు గట్టెక్కినట్లే" యనెను. వినుచున్న బ్రహ్మయ్య ఎంతయో యూహ్యాయతతో నావేదనతో "చెప్పుడు వెంటనే చెప్పుడు ఎంతటి కష్టమైనను సహించి నెరవేర్చెద"ననినాడు.

గుణకయ్యగారు "నష్టము లేదు కష్టము లేదు. ఆ మహనీయుని యిష్టముతప్ప ఇంతకంటె మార్గ మింకొకటి లేదు. ఆ మహనీయ మూర్తిని నేను దర్శింపలేదు. వారి యోగశక్తిని గురించి వింటిని నాయనా" యని చెప్పసాగిరి.

"కర్నూలుజిల్లా మార్కాపురముతాలూకా తోకపల్లె యను గ్రామమున నవతరించి యతిబాల్యమునందే స్వస్థలమును వీడి తెల్లదొర వెంట పయనమై సర్వే నౌకరికి కుదిరి దొర నివాసమగు పర్లాకిమిడి చేరి కొంత కాలమునకు పరతత్త్వమును గుర్తించి త్యాగయోగములతో భగవత్సాక్షాత్కారమును పొంది స్వగ్రామసీమ చేరి మహిమలను ప్రదర్శనముచేసి మార్కాపురసమీపముననున్న కపిలగిరిపై నివసించుచు పురాకృతకర్మల ననుభవించుచు మానవుల నారోగ్యవంతులనుగా నొనర్చుచుండిరి. వారి యోగశక్తితో నెంతటి ఘోరవిపత్తునైనను మసి చేయగలరను వదంతి నేను వింటిని. దిక్కుచెడిన దీనుల నుద్ధరించుటకు ధర్మకంకణము దాల్చినారట. ఆ యోగానందమూర్తిని మన గ్రామమున కాహ్వానించి వారి పాదసేవ లొనర్చిన మన యాపదను త్రుటికాలములో మటుమాయము చేయగలరు నిస్సందేహ" మని గుణకయ్య మిత్రుని కెరింగించెను. బ్రహ్మయ్య "ఓ మిత్రరత్నమా! నీకంటె నాప్తబంధువు లింకెవరు! ఆ మహాత్ముని తీసికొనివచ్చుటకు నీవు దప్ప సమర్థు లెవ్వ"రని ప్రార్థించిరి.

సజ్జన గరిష్ఠుడగు గుణకయ్యగారు "మహాభాగ్యము. ఆ మహనీయుని పేరు విన్నది మొదలు స్వాతికార్తె చినుకులకు ముత్యపుచిప్ప

కాచుకొన్నవిధాన నిరీక్షించుచుంటిని. ఇంతలో మీ విపత్తు కన్నులార గాంచితిని. ఆలస్య మమృతం విషమ"న్నారు పెద్దలు. ఈ క్షణమే యీ మహాత్ముని తీసికొని వత్తమని చెప్పిరి. బ్రహ్మయ్య "సరే ప్రయాణమునకు సిద్ధము క"మ్మనిరి.

## శ్రీ గుణకయ్యగారు శ్రీ యోగానందమూర్తి యొద్దకు వెళ్ళుట

గుణకయ్యగారు స్వామిదర్శనమునకు తహతహలాడుచు నంబూరు నుండి మార్కాపురమునకు వెళ్ళి సమీపమున ప్రకాశించెడి కపిల గిరిపై నివసించెడి శ్రీ యోగానందమూర్తిని దర్శించి వారి పాదములకు మ్రొక్కి పరమానందమును పొందిరి. స్వామివారి పాద స్పర్శచే గుణకయ్యగారి హృదయముప్పొంగి పోయెను.

శ్రీ స్వామివారు పాదములపై వ్రాలిన భక్తుని జూచి క్షేమము లడుగ భక్తి యుక్తి శక్తి గలిగిన గుణకయ్య "ఓ స్వామీ! తమ దర్శనభాగ్యముచేత మా జన్మలు తరించినవి. తమరు మా గ్రామమునకు దయచేయవలయును! స్వామీ ఆపదలోనున్న హనుమాయమ్మ తమరే దిక్కని రాత్రింబవళ్ళు తమ నామస్మరణ చేయుచున్నది. మా ప్రార్థన మన్నించి మమ్ము కరుణింపవలెను. తమ కార్యభారమంతయు మేమే నిర్వహించెదము. రక్షించు భారము తమదే" యని ప్రార్థించిరి. గుణకయ్యగారి వెనువెంట వెళ్ళిన బ్రహ్మయ్య మొదలగువారును దీనముగా వేడుకొనిరి.

కరుణార్ద్రహృదయులగు శ్రీ యోగానందమహర్షి వారి భక్తి ...కు సంతోషించి 'సరే' యని యియ్యకొనిరి. గుణకయ్య తదితర మిత్రులు పరమాహ్లాదముతో శ్రీ స్వామివారిని తీసికొని బ్రహ్మయ్య గారి స్వగ్రామమగు పాకాలపాడునకు ది 1917 వ సంవత్సరమున వేంచేసిరి. శ్రీ స్వామివారి నఖండ గౌరవముతో సన్మానించిరి. ఆ మహాపురుషుని దర్శించిన వారెల్లరు విస్మయమందుచుండిరి. వారి

శిరోజములే వారిని కప్పివేసినవి. ఆ యోగానందమహర్షి నున్నతాసన మం దాసీనుని గావించి పూజ లొనర్చిరి.

వ్రణబాధతో వణకిపోవుచున్న హనుమాయమ్మగారిని చూపించి గతచరిత్ర నంతయు పూసగ్రుచ్చినట్లు మనవి చేసికొనిరి. వెంటనే శ్రీ స్వామివారు యోగదీక్షలో ఆసీనులై సర్వము గుర్తెరిగి నృసింహ మహామంత్రమును స్మరించి గోరంత విభూతిని మంత్రించి కృశించి నశించుచున్న హనుమమ్మగారిని జూచి యా విభూతి నామె వ్రణముపై చల్లి తీర్థ మొసంగిరి.

పాకాలపాటి ప్రజలు స్వామివారికి ప్రత్యేకమందిర మేర్పాటు చేసిరి. స్వామియందు నిర్మలమైన భక్తి ప్రేమలతో మెలగుచుండిరి. ఆ యేకాంతమందిరమున శ్రీ స్వామివారు ధ్యాననిమగ్నులై యుండిరి. స్వామివారిని దర్శించుటకై ప్రజలు వేనవేలుగ వచ్చుచుండిరి.

మరునాటి యుదయముననే హనుమమ్మగారికి వ్రణబాధ తగ్గిపోయి మనశ్శాంతి లభించినది. హనుమమ్మ "ఆహా! మా పాలిటి పెన్నిధి. మమ్మ రక్షించుటకు వేంచేసిన దైవమూర్తి! లేకున్న నింతలో నీ బాధ తీరిపోవుట సామాన్యమా!" యని స్వామిశక్తిని కొనియాడదొడగెను. స్వామివారు యథావిధిగా మూడు రోజులు విభూతిని మంత్రించి వ్రణముపై చల్లుచు మంత్రతీర్థ మొసంగిరి.

మూడవనాటి సాయంత్రమునకు వ్రణబాధ యణుమాత్రమైనను లేక యుపశమించెను. నాల్గవరోజు నుదయమున హనుమమ్మ తదితర బంధువర్గముతో స్వామివారి పాదపద్మములకు ప్రణమిల్లి ప్రార్థించి "స్వామీ! తమ కరుణాప్రసారముచే మా హనుమమ్మ తిరిగి జన్మించి నట్లయ్యెను. తమ యపార కరుణాదృష్టి నెన్ని జన్మములకును మరువలేము. తమశక్తి వర్ణనాతీతమైనది, గణనీయమైన"దని బహు విధముల కొనియాడిరి,

అంతలో కొమ్మూరి గుణకయ్య శ్రీ యోగానందస్వామితో "అయ్యా! మాకీ ప్రపంచమంతయు వెదకినను తమవంటి స్వార్థ త్యాగులు వీరనృసింహకళావతార స్వరూపులు లభింపరు. జన్మాంతర సుకృతముచే తమవంటి పుణ్యమూర్తులు లభించిరి. ఇట్టి యపూర్వ సదవకాశమును పోగొట్టుకొను నవివేకులముగాము. తమరే మాకు సద్గురువు" లని పాదములపై వ్రాలిరి.

గుణకయ్య గుణ విశేషమునకు స్వామివారు మెచ్చుకొని "నాయనా గుణకయ్యా! నీ వాంఛ గుర్తించితిని, నీ యావేదనంతయు జ్ఞానోపదేశమునకేగదా! ఆవేదనతోనున్న హృదయక్షేత్రమున జ్ఞానబీజమునాటిన మొలకెత్తి వృద్ధిచెందును. నీకీనాడే జ్ఞానోపదేశము గావించెద"నని చెప్పిరి. గుణకయ్య పట్టరాని యానందముతో గంతులువేయుచు స్వామిచుట్టు ప్రదక్షిణములు చేయుచు "తండ్రీ! తమకు తెలియనిదేమున్నది. సర్వజ్ఞులు, సర్వమానవ హృదయాంతరాళములయందు గుప్తముగానున్న మనోభావములను తమరు గుర్తింపగలరు. తమదయ నాదేమున్నది స్వామీ!" యని చేతులుమోడ్చి నుతించెను. ఆనాడే శ్రీయోగానందమూర్తి గుణకయ్యకు జ్ఞానోపదేశము గావించిరి. గుణకయ్య యమితానందమున స్వామిని వేనోళ్ళ నుతించెను. శిష్యులకు ప్రీతికరముగ పాకాలపాటియందు కొన్నిదినములు గడపి శ్రీస్వామివారు కపిలగిరి కేతెంచిరి.

## శ్రీ స్వామివారు పాకాలపాటినుండి కపిలగిరికి వేంచేయుట

శ్రీయోగానందమూర్తి కపిలగిరికి వేంచేసిరను వార్త వినిన వెంటనే చుట్టుప్రక్కల పల్లెటూళ్ళ ప్రజలందరు స్వామిదర్శనమునకై కపిలగిరికి వచ్చుచుండిరి. స్వామివారు వచించెడి వేదసూత్రములను విని భక్తులెల్లరు పరమానందమును పొంది స్వగృహములకు చేరుచుండిరి. ఈ విధముగా కొన్ని సంవత్సరములు గడచినవి.

శ్రీ యోగానందమహర్షి శిష్యుడగు గుణకయ్యగారు అబ్బూరు నందు నివసించుచు శ్రీ యోగానందమహర్షినే హృదయపీఠమున నెలకొల్పి పూజింపసాగిరి. గుణకయ్యగారి మనస్సు సద్గురుపాదములపై లగ్నమైయుండెను. గురుదేవుని దర్శనమునకై యారాటపడుచుండెను. ఇచ్చట స్వామివార దేసమయమున గుణకయ్యను చూచిరావలయునని సంకల్పించుకొనిరి. శిష్యుని మనోవేదనయే సద్గురుకృపకు ముఖ్య కారణముగదా!

గుణకయ్యగారు నివసించెడి అబ్బూరుగ్రామమున మానుకొండ గంగయ్యను భక్తున కర్థముగాని జబ్బేర్పడెను. ఆ జబ్బును వైద్యు లెందరో చూచి వ్యాధినిర్ణయము చేయలేకపోయిరి. గంగయ్యగారి కుమారులు కోటయ్య, నాగభూషణ మనువారలు సజ్జనమిత్రుడగు గుణకయ్య యొద్దకుం జని దుఃఖముతో తండ్రి చరిత్రనంతయు విన్నవించిరి.

శ్రీ సద్గురుదర్శనమునకై తపించెడి గుణకయ్యగారు "నాయనలారా! మీ తండ్రి వ్యాధివిషయమును మా సద్గురుదేవులగు యోగానంద స్వామి విప్పి చెప్పెదరు. సందేహమేలేదు. ప్రయాణమునకు సిద్ధముగా నున్నాను. మీరును నా వెంట రం"డని చెప్పిరి. గంగయ్యగారి పుత్రు లిర్వురు బయలుదేరి గుణకయ్యగారితో కలసి మారికాపుర సమీప స్థలమున నెలకొనియున్న కపిలగిరికి చేరి శ్రీ యోగానందమూర్తిని దర్శించి వచ్చినపని దెలిపి పాదములపై వ్రాలిరి.

## శ్రీ సద్గురుదేవులను గుణకయ్య అబ్బూరు తీసికొని వెళ్ళుట

పాదములపై వ్రాలిన భక్తులనుగాంచి యోగానందమూర్తి "నాయనా! గుణకయ్యా! నీవు సద్గుణముల ఖనివి. నేను నిన్ను చూచు టకై బయలుదేరుచుండగా నీవే వచ్చితివి. ఎంతో సంతోషము! అబ్బూరు వెళ్ళుదము నాయనా" యని సెలవిచ్చిరి. ఆనందాశ్రువులు రాల్చుచు "స్వామీ! మహాభాగ్యము! అంతకంటె కావలసిన దేమున్న" దనుచు సద్గురు సార్వభౌములను తీసికొని అబ్బూరు చేరిరి.

గుణకయ్య పరిపూర్ణభక్తితో గురుదేవుని పూజించి నమస్సు లర్పించి "దేవా! గంగయ్యను భక్తుని కర్మముగానికర్మ యావేశించినది. వాని కర్మ మెట్లున్నదో తమరు సెలవీయవలయు" నని ప్రార్థించెను. "సరే నాయనా! గంగయ్యను చూతము పద" యని స్వామి యాన తిచ్చిరి. గుణకయ్య గురుసార్వభౌములను గంగయ్యగారి గృహమునకు తీసికొనివెళ్ళి సుఖాసీనుల గావించిరి.

యోగమూర్తి రోగిని చూచి నిమీలితనేత్రులై గంగయ్య భవితవ్యమును గుర్తించి వెంటనే "ఓయీ గుణకయ్యా! గంగయ్య జీవించుటకల్ల. ఎవరేమి చేయగల"రని సెలవిచ్చిరి. కోటయ్య, నాగ భూషణము అమితావేదనతో సద్గురుదేవుల పాదములపై వ్రాలి ప్రార్థించిరి. దయార్ద్రహృదయులగు స్వామి "నాయనా! భగవదాజ్ఞ యట్లున్నది. ఆ యోగమును మీకు గుర్తింపజేసితిని." గురువాక్యములు విన్నంత దుఃఖాశ్రువులు రాల్చుచు "స్వామీ! జరుగనున్న కార్యము జరుగకపోదు! మాకు మీరే దిక్కు. దైవస్వరూపులు మా రక్షణ భారము తమదే" యని అమితముగా దుఃఖించిరి.

శ్రీ స్వామివారు వారి దుఃఖోపశమనము గావింప "నాయన లారా! మీ కోరికేదో నాకు తెలియచేయు"డనిరి. కోటయ్య, నాగ భూషణ మంజలి ఘటించి "ప్రభూ! మీరు మా గృహమందేయుండి మమ్ము రక్షింపవలయును. ఇంతకంటె మాకు ఇంకేమియు వల"దని మనవి చేసిరి. శ్రీ యోగానందమూర్తి పాదములచెంతనున్న గుణక య్యతో "ఓయీ గుణకయ్యా! వీరి భయకారణమేమొ గుర్తించితివా?" యని యడిగిరి. "స్వామీ! వీరి కితరు లెవ్వరో తాంత్రికప్రయోగము చేసినారని యనుమానము. ఆ యనుమాన పిశాచముతో తారుమా రౌచున్నారు. వారి భయమును బాపి భద్రమొసంగెడి మహాత్ములు తమరుగాక యింకెవరు తండ్రీ"యని గుణకయ్య స్వామివారితో రోగిని గూర్చియు, బంధువులను గూర్చియు దీనముగా వేడుకొనెను.

శ్రీ స్వామివారు భక్తులను రక్షింపనెంచి కోటయ్య, నాగభూషణము లేర్పరచిన యేకాంతగృహమందు చేరిరి. ఆగృహమున శ్రీలక్ష్మీ నృసింహామూర్తి పటమునుంచి పూజలు గావించుచుండిరి. స్వామివారిని దర్శించుటకై ఎందరెందరో వచ్చిరి. స్వామివారి ప్రతిభాశక్తిని భక్తులెల్లరు తెలిసికొని స్వామి దర్శనముచేసి తమ జన్మలను తరింప చేయవలయు నను సంకల్పములతో పరగ్రామముల నుండి ప్రజలు తండోపతండములుగ వచ్చుచుండిరి.

## అబ్బూరులో భూమఠాలయ నిర్మాణము

గురుభక్తి వెల్లివిరియ గుణకయ్యాగా రిట్లూహించిరి. "నా సద్గురు దేవునకు భూమఠాలయమును కట్టింపవలయునను సంకల్పమున్నది. నా సంకల్పమును నా గురుదేవులే సంపూర్తి చేయగల"రను దృఢ నిశ్చయముతో గురుమంత్రమును నిష్ఠతో జపించుచుండిరి.

గురుశక్తిని వర్ణించుట సామాన్యమా! గురుదేవులకు వాస యోగ్యమగు మఠమును నిర్మాణము చేయవలయునను సంకల్పముతో మనస్సు పరవళ్ళుత్రొక్కుచున్నంతలో గుణకయ్యగారి సంకల్పమున కనుగుణముగ నొక సంఘటన తటస్థమయ్యెను.

అబ్బూరు నివాసుడగు ముత్వా నరసయ్యగారి యల్లుడగు పొన్నకంటి వెంకయ్యగారికి తలమోద సంభవించి ప్రమాదస్థితిలో నుండెను. ఆ తలమోద నిమిత్త మెన్నోచోట్ల తిరిగితిరిగి తుదకు నిరాశ చెంది భగవంతుని ప్రార్థించుచుండిరి.

శ్రీ యోగానందమూర్తి మహిమను విని మనకష్టము రూపుమాపెడి మంత్రసిద్ధుడు యోగానందమూర్తియే యనినమ్మి సద్గురు పాదముల నాశ్రయించిరి.

శ్రీ వీరనృసింహ కళావతార స్వరూపులగు శ్రీ యోగానంద సద్గురుదేవులు వారిని రక్షింపనెంచి మంత్రవిభూతినిచ్చి తీర్థమునొసంగిరి. వారమురోజులలో తలమోద రూపుమాసి పోయెను.

అల్లుడగు వెంకయ్యగారి కారోగ్యము చేకూరగనే మామగారు సంతోషముతో "ఆహా ! నా విచారమును బాపినదైవము శ్రీ యోగానందమహర్షి. వారి నిమిత్తము నా సంపదనెల్ల యర్పించెదను. నా జీవితమునే యర్పించెద" నని యుప్పొంగిపోయెను.

శ్రీ స్వామివారియందు గాఢబద్ధానురాగముతో మెలంగెడి గుణకయ్యగారు సహృదయులగు ముప్పా నరసయ్య, పెరుమాళ్ళ గురవయ్య, తక్కెళ్ళపాటి లక్ష్మయ్య, మానుకొండ కోటయ్యను వారలు స్వామియం దపారమైన భక్తిగలిగి భూమతాలయ నిర్మాణ సంకల్పముతో స్వామివారి యొద్దకువెళ్ళి పాదాభివందనము లర్పించి "ఓ యోగానంద వీరనృశింహా! తమకే స్థలమున మఠాలయము నిర్మాణము చేయవలెనో యాదేశించిన వో మేమందరము తమ యాజ్ఞలను శిరసావహించెదము ప్రభూ" యని లేచినిల్చి మిన్నకుండిరి.

శ్రీ యోగానంద మహర్షి శిష్యులప్రార్థన నాలించి దిగ్గునలేచి "నా వెనువెంట రం"డనుచు, గ్రామముచుట్టు తిరిగి గ్రామమునకు పశ్చిమమున నిలువబడిరి. వెనువెంట వచ్చిన భక్తులతో "నాయనలారా ! ఈ స్థలము వాసయోగ్యముగానుండు"నని స్వామి సెలవీయ భక్తులెల్లరు సంతోష స్వాంతులైరి.

శ్రీ మానుకొండ కనకయ్యగారి ధర్మపత్నియగు అచ్చమ్మగారు శ్రీ స్వామివారికి పరిశుద్ధ హృదయముతో త్యాగబుద్ధితో బ్రహ్మార్పణముగా ఒక యెకరము పదునాలుగు సెంట్ల భూమిని సమర్పించి యుత్తరక్షణమే వారివశము గావించెను. గ్రామపౌరుల సహాయముతో రమణీయముగా మఠనిర్మాణము గావించిరి.

మఠనిర్మాణము పూర్తిగావించిన వెంటనే త్యాగహృదయులు గురుభక్తితో శ్రీ ముప్పా నరసయ్యగారు భూమతాలయ గురుపీఠమునకు ఆరు యకరముల భూమిని సమర్పించిరి. మఠాలయముపైన శ్రీ లక్ష్మీ

నృసింహాలయమును నిర్మాణము గావించిరి. శ్రీ లక్ష్మీనృసింహస్వామి వారికి మానుకొండ నాగభూషణముగారి ప్రియపుత్రుడగు నరసింహా రావుగారు రెండెకరముల భూమిని సమర్పించిరి. తదుపరి అచ్చంపేట గ్రామ నివాసిని యాత్మకూరి నాగమ్మను భక్తురాలు స్వామివారి పవిత్ర స్థలమున నొక సత్రము కట్టించి రెండెకరముల భూమిని సమర్పించినది. తదుపరి నంబూరి లక్ష్మీనరసమ్మ శ్రీ లక్ష్మీనృసింహస్వామికి ముక్కోటి కైంకర్యములకై యొక యకరము భూమిని సమర్పించినది. భక్తజనుల భజనలతో విధివిరామము లేక యా మఠ మభివృద్ధి గాంచెను.

## గుణకయ్యతో శ్రీ స్వామివారు సంభాషించుట

"నాయనా గుణకయ్యా! నీ కెందరు కుమారులు గలర"ని యడుగ "ఓ గురుదేవా! నాకు నారాయణ, వెంకటేశ్వర్లను నిర్వురు కుమారులు గల"రని చెప్పగా స్వామివా రమిత వాత్సల్యముతో "ఓయీ గుణకయ్యా! నీ కుమారులను చూడవలయునను కాంక్షయున్నద"ని చెప్పిరి. గుణకయ్య "చిత్తము ప్రభూ! కుమారులను తీసికొనివచ్చెద"నని స్వామి వాక్యము వేదవాక్యము. నాచింత తీరిపోయినదని యెంచి సమీపగ్రామ ములోనున్న పెద్దకుమారుడగు నారాయణ కొక లేఖ యిట్లు వ్రాసిరి.

"కుమారా! నారాయణా! మన కారాధ్యదైవమగు శ్రీ తోకపల్లి స్వామివారు మన గ్రామమునకు వేంచేసిరి. మన యదృష్టవశమున నే యిట్టి మహనీయుని పాదకమల సేవాభాగ్యము లభించినది. వారితో నీ విషయము విన్నవించుకొంటిని. దయార్ద్రహృదయులగు గురుదేవులు నిన్ను చూడవలయునని కోరగా నీ నిమిత్తమై యిట్లు లేఖవ్రాసిపంపితిని. నీవు వెంటనే అబ్బూరు రావలయును. ఇట్లు నీ క్షేమాభిలాషి గుణకయ్య."

నారాయణ కా లేఖ నివ్వగా లేఖను విప్పి చదువుకున్న నారాయణ, "మా నాయనా వట్టి యమాయకపు బ్రహ్మ! ఎట్టి వారిని చూచినను వెంటనే నమ్మి యర్చించి పూజించెద" రని తలచి తనకు

బంపిన లేఖపైననే బాలుడగు నారాయణ "ఓహో! ఇట్టి స్వాములను చాలమందిని చూచినాములే" యని వ్రాసి యా లేఖ దెచ్చినవాని కిచ్చి జాగ్రత్తగ నిమ్మని చెప్పి పంపించినాడు.

ఆ లేఖను తీసుకొని అబ్బూరు చేరి స్వామి పాదములచెంతనే కాచుకొనియున్న గుణకయ్యగారి కివ్వగా, "ఆహా! నేను బంపిన లేఖనే తిరిగి బంపించినాడు పుణ్యాత్ముడు. అనుకున్న పని పూర్తిచేసినా" డని లేఖను విప్పి కుమారుని వ్రాత చూచి తొట్రుపాటు మనస్సుతో లేఖలోనున్న వాక్యమును చదువుటకు తడబడుచున్నతఱి సద్గురు స్వామి శిష్యుని యా వేదన గమనించి "చదువు గుణకయ్య పరవాలే"దని యాజ్ఞ యిడిరి. "స్వామీ! ఎట్లు చదివెదను; నోరాడకున్నది. 'ఇటువంటి స్వాములను చాలమందిని చూచినాములే' యని వ్రాసినాడ"ని గుణకయ్యగారు కన్నీరు గార్చినాడు. స్వామివారు శిష్యుని గురుభక్తికి సంతోషించి యోదార్చి "ఎందులకటుల బాధనొందెదవు? నీ కుమారుడే నాకు తగిన శిష్యుడు. వానిని చూడవలయునని నాకు కోరిక యున్నది. రేపుదయమున మనయొద్దకు వాడే స్వయముగా రాగల"డని చెప్పిరి. సద్గురు సత్యవాణిని వినిన గుణకయ్యగారి మనస్సు శాంతి నొందెను.

## శ్రీ నారాయణదాసు శ్రీ యోగానందుని దర్శించుట

మరునాటి యుదయ మూరుగంటలకు నారాయణ అబ్బూరు చేరి స్వగృహమున బ్రవేశించెను. బాలుని రాకకు మాతృదేవి పరమానంద మొందినది. పెద్ద కుమారుడగు నారాయణుని, చిన్న కుమారుడగు వెంకటేశ్వరుని వెంటనిడుకొని శ్రీ యోగానందమూర్తిని దర్శించుటకై వెళ్ళెను.

సద్గురు దేవులకు సీతమ్మగారు సాష్టాంగనమస్కారము లొనర్చెను. గురుదేవులు సీతమ్మ వినయసౌశీల్యాదులకు సంతోషించిరి. తల్లి వెంట నరుదెంచిన నారాయణ స్వామివారిని దర్శించి నమస్సు లర్పించక యే

స్వామివారి కెదురుగా కూర్చొని తదేకదృష్టితో స్వామిని పరికింపుచు మౌనముద్ర వహించెను.

పడకకుర్చీలో పరుండి బ్రహ్మవర్చస్సుతో ప్రకాశించెడి యోగానందమూర్తి పాదములచెంతనున్న బాలభక్త నారాయణుని పట్టుదలను పరీక్షింపనెంచి సాయంత్రము నాలుగుగంటలవరకు బాలుని పలుకరింపక యుండిరి. పాదములచెంతనున్న నారాయణ తలయెత్తక యోగమూర్తి పాదములనే దర్శింపుచు గురుదేవులు పలుకరించినపుడే పలుకవలయు నని పట్టుదలతో మిన్నకుండెను.

గురుదేవులు బాలుని దృఢనిశ్చయమునకు మెచ్చుకొని "నాకు నచ్చిన శిష్యుడు వీడే" యని 'నాయనా!' యని సంబోధింప గురుని కంఠధ్వని విన్న మరుక్షణమే పాదములపై వ్రాలి లేవకున్నంత, శ్రీ యోగానంద వీరనృసింహదేవులు "నాయనా! నారాయణదాస"ని యాప్యాయతతో బిలిచి లేవనెత్తి కౌగిటగుచ్చి "నారాయణదాసు! నీ కోరికయేమో చెప్పు"మని యడుగగా నా బాలుడు మారుమాటాడక నెమ్మదిగా భయభక్తులతో 'మీదయ'యని మౌనము వహించెను.

బాలుని హృదయస్థితిని చూచి గురుదేవులు "నారాయణదాసు! నీకీనాడే జ్ఞానోపదేశ మొసంగెద"నన, "సరేస్వామీ"! యని బదులు చెప్పెను. స్వగృహమున కరుదెంచి స్వామికేమి తీసికొని వెళ్ళవలయు నని యోచించి "ఓహో! నా స్వామి ధరించిన కౌపీనము జీర్ణస్థితిలో నున్నది. సరియైనది సమర్పించవలయు"నని పడమటింటిలోనున్న ట్రంకు పెట్టెను తెరచిచూడ నందు పట్టుపంచయొకటి కనుపించెను. ఆ పట్టు పంచను తీసికొని పరువులు దీయుచు స్వామియొద్ద కరుదెంచి గురుదేవులకు తానే ధరింపజేసి నమస్సు లర్పించెను.

ఆ బాలుని యద్వితీయ గురుభక్తి కచ్చెరువొంది యానాటి సాయంత్రము, 1928వ సంవత్సరమునకు సరియగు విభవనామ సంవత్సర వైశాఖశుద్ధ దశమి ఆదివారము సాయంత్రమున నారాయణదాసునకు

హస్తమస్తక సంయోగపూర్వకముగా స్వామి జ్ఞానోపదేశ మొనర్చిరి. ఈ నారాయణదాసునం దత్యంత భక్తిశ్రద్ధలు గలిగి ప్రవర్తించెడి సోదరుడగు వెంకటేశ్వర్లుఅన్నగారు జ్ఞానోపదేశమును పొందిన విషయమును తెలిసి పరుగులు దీయుచు వచ్చి యన్నపాదములపై వ్రాలెను.

నారాయణదాసుగారు తమ్ముని గాఢాలింగనము చేసికొని "నాయనా! నీకును జ్ఞానోపదేశము గురుదేవునిచే యిప్పించెద"నని గురుదేవులయొద్దకు తీసికొనిపోయి, విషయమును విన్నవించిరి.

## శ్రీ సద్గురుదేవులు నారాయణదాసు సోదరునకు భవిష్యమును జెప్పుట

నారాయణదాసు సోదరుడగు వెంకటేశ్వర్లునకు శ్రీయోగానంద మూర్తి జ్ఞానోపదేశము చేయవలయునని బాలుని యరచేతిలో శుద్ధ గంగనిడి జ్యోతి వెలిగించగా చిటచిటమని యరిచేతిలోనే యారిపోయెను. మంత్రముపదేశించి యోగదృష్టితో నా బాలుని భవిష్యమును గుర్తించి ముద్దులకుమారుని నారాయణునిదగ్గరకు బిలచి "నారాయణా! నీ సోదరున కారుమాసములలో మృత్యువావేశించునని చెప్పిరి. శిష్యులగు గుణకయ్య, నారాయణదాసు దైవవిధి కెవరేమి చేయగలరు స్వామి! యని చేతులు మోడ్చిరి. యోగానందస్వామి యాదేశించిన వాక్యానుసార మారుమాసములు పూర్తిచెందగనే యా వెంకటేశ్వర్లను బాలుడు మృత్యుదేవత నిశితకరాళదంష్ట్రాగ్నులకాహుతియయ్యెను. ఈ సంఘటనను గుర్తించిన అబ్బూరు పురవాసులెల్లరు నబ్బురము చెందిరి. శ్రీ స్వామియందు శ్రద్ధాభక్తులు గలిగి మెలగుచుండిరి.

## అచ్చమ్మగారి గృహమున అగ్ని ప్రజ్వలించుట

స్వామి శక్తి నంతయు నామూలాగ్రముగ తెలిసికొన్న త్యాగశీల యగు మానుకొండ అచ్చమ్మగారు స్వామివారికి సేవలొనర్చి

వారిచే జ్ఞానోపదేశమును పొంది ధన్యజీవి యయ్యెను. స్వామివారిని తన గృహమున కాహ్వానించి యున్నతాసనమం దాసీనుని గావించి పూలపూజ లొనర్చి తరించినది.

శ్రీ యోగనృసింహమూర్తి నృసింహాస్తవ మొనర్చి సుదర్శన మంత్రమును నుచ్చారణ చేయుచున్న సమయమున నా మంత్రపటిమచే భక్తులెల్ల దిగ్భ్రమచెంద అచ్చమ్మగా రొసగిన పూజాగృహమున భగ్గు భగ్గున నగ్ని ప్రజల్వించెను. ఈ మహత్తర దృశ్యమును వీక్షించెడి భక్తులందరు దిగ్గునలేచి గగ్గోలు పడసాగిరి. సద్గురుదేవులు శిష్యులను భక్తులను వీక్షించి "బిడ్డలారా! మీకేమియును భయమువలదు. సుదర్శన మంత్రశక్తి యనంతమైనది. ఆ యగ్నిని నాలోనే నైక్యము చేసికొనెద"నని కన్నులు మూసికొని యాదివిరాట్టును ధ్యానింప భగ్గున మండెడి మంటలన్నియు నదృశ్యమయ్యెను.

భక్తులందరు తత్తరముచెంది "ఆహాహా! శ్రీ యోగానంద మూర్తి యఖండ భగవదనుభూతిని పొందిన పరమ తపోధనులు. వారి శక్తియే మనకు జ్ఞానోదయమును గలిగించిన" దని నమస్సు లర్పించిరి. ముద్వా నరసయ్య, మానుకొండ అచ్చమ్మగారు మొదలగు భక్తులు త్యాగముతో నరలక్ష రూపాయలు వెచ్చించి శ్రీ యోగానందమూర్తి పేరిట భూమతాలయము సంపూర్తి గావించి ధన్యజీవులైరి.

కుంచెనపల్లి నరసింహయ్యగారి చరిత్ర

అబ్బూరు గ్రామ సమీపముననున్న బయ్యవరము గ్రామ నివాసులగు శ్రీ కుంచెనపల్లి నరసింహయ్యగారు ధర్మపత్నియగు శాయమ్మను తీసికొని స్వామివారి దర్శనమునకై అబ్బూరు గ్రామమునకువెళ్ళి మానుకొండ అచ్చమ్మగారి గృహమును జేరిరి. అట ప్రకాశించెడి యోగనృసింహమూర్తిని దర్శించి యా దంపతులిర్వురు సాష్టాంగ నమస్కృతు లొనర్చి స్వామివారి వేదాంత ప్రవచనములను భక్తితో నాలించుచు సుఖాసీనులైరి.

స్వామిశక్తి నంతయు నెరింగినవారై "మా జీవితములను తరింప జేసెడి పుణ్యమూర్తులు వీరే"యని నిశ్చయము చేసికొనిరి.

ఈ నరసింహయ్యగారికి సంతానము లేదు. సంతానము లేదను సంతాపముతో నీ మహాత్ముని దర్శించిరి. ధర్మపత్నియగు శాయమ్మగారీమహనీయుని సేవాభాగ్యమే మా కానందదాయక మని మదినమ్మి "స్వామివారి పాదములపై వ్రాలినంత నామె హృదయమున నణగి మణగియున్న దుఃఖమును నిగ్రహింప శక్తిజాలక యమితముగా దుఃఖించి కన్నీటితో స్వామివారి పాదముల నభిషేకము గావించి దీన ముగా గద్గదకంఠముతో "స్వామీ! సర్వమెరింగిన సాధుమూర్తులు. మాకు వంశము నిలుచు యోగమున్నదో లేదో తమరానతీయవలయు" నని ప్రార్థించెను.

ఆ క్షణముననే శ్రీ యోగానంద సద్గురు మహారాజులు యోగ దృష్టిచే తెలిసికొని "అమ్మా! నీకు సంతానభాగ్యమున్నది. కానీ నిష్ఫలము, ప్రయోజనము లేదు. సంతానము కాంక్షించితివి. సంతాన ముతోపాటు సంతాపము నిన్ను పెనవేసుకొనియున్నది. కష్టసముద్ర ములో మునకలు వేయగలవు. చివరకు దుఃఖములనుండి విడివడి భగవ త్సేవలో భాగవతసేవలో నీ జీవితమును సార్థకత చెందించెదవు. దైవ భక్తియే నీకు శరణ్యమని చెప్పి మహోపదేశమును గావించిరి.

శాయమ్మగారు 'చిత్తము ప్రభూ!' యని సెలవుగైకొని భర్తను తీసికొని స్వగ్రామము చేరిరి. ఆ దంపతులిర్వురు సత్కాలక్షేపములతో కాలము గడుపుచు గురుదేవుని స్మరించుచుండిరి.

కొంత కాలమునకు గురుదేవుల వాక్యానుసారముగ శాయమ్మ గర్భవతియైనది. నవమాసములు నిండినవి. అంతలో పిడుగుపాటుగా శాయమ్మగారి భర్త మరణించిరి. ఆమె కష్టసముద్రములో మునుకలు వేయుచున్నతటి యొక దివసమున కుమారుడు కలిగినాడు. ఆ బాలు

డొక సంవత్సరము పెరిగి మరణించెను. ఆమె దుఃఖమునకు పరిమితి లేదు. ఈ విషమసంఘటనలకు గురియైన ఆ తల్లికి ప్రపంచముపై విరక్తి గలిగి "ఛీ ఛీ! ఎందులకు నా జీవిత" మని నిరాశ చెంది నిస్పృహతో క్రుంగి కృశించి నశించనున్నది.

ఆ సమయమున శాయమ్మగారి హృదయమున సద్గురుస్వామి పొడకట్టెను. "ఆహా! ఆనాడు స్వామి మానుకొండ అచ్చమ్మగారి గృహమున నా కాదేశించిన భవిష్యమంతయు యథావిధిగా జరుగుచునే యున్నది. నా జీవితము నా మహాత్ముని సేవలో వినియోగించి నా జన్మను చరితార్థ మొనరించెదను. నా గురుదేవులే నాకు దిక్కని మది నమ్మి ధీరత్వముతో సర్వమును త్యజించి 1930 వ సంవత్సరమున శాయమ్మ గారు స్వగ్రామమగు బయ్యారము వదలి శ్రీస్వామి నివాసస్థలమగు కపిలగిరికి వచ్చి సద్గురుపాదసేవ లొనర్చుచు శ్రీ లక్ష్మీనృసింహస్వామికి పూజలు గావించుచు నాశ్రమ కార్యక్రమములు నిర్వహింపుచు భక్తితో నెట్టి కష్టములనైనను తృణప్రాయముగా నెంచి గురుసేవలో జీవిత సర్వస్వము నంకితము చేయ సంకల్పించుకొనియెను.

శ్రీ సద్గురుసార్వభౌముని దర్శించుటకు వచ్చెడి వేలకొలది భక్తులకు, భక్తురాండ్రకు, శిష్యకోటికి మాతృమూర్తివలె అన్నపూర్ణాదేవివలె నత్యాదరమున గౌరవించుచు లాలించుచు ప్రేమించుచు వారలకు తగురీతి సౌకర్యము లొనర్చుచు శ్రమించి వారికి తృప్తికరమగు భోజనమిడుచు గురుదేవులను సాక్షాద్వీర నృసింహమూర్తి యని యెంచి సకలవిధ శుశ్రూష లొనర్చుచు వారి తత్త్వోపదేశములను విని మనస్సును పరిశుద్ధ మొనర్చుకొని, ప్రశాంతజీవనము చేయుచుండెను.

## గద్దె నరసింహదాసునకు స్వామివారు మంత్రోపదేశము చేయుట

శ్రీ యోగానందమూర్తి ప్రతిభ విని మారెళ్ళసీమలో నివసించెడు నొక భక్తురాలు సుబ్బమ్మ యను నామె స్వామివారి

యాశ్రమము చేరి స్వామికి సేవలొనర్చి యాశ్రమ కార్యక్రమముల నిర్వహించుచు శ్రీ యోగమూర్తి యపారకరుణకు పాత్రురాలై సాధుజీవనముతో తన జన్మను సార్థకత చెందించి యంత్యమున శ్రీహరి సాయుజ్యము పొందగలిగెను.

శ్రీ యోగానందసద్గురుదేవులు ప్రియశిష్యులను చూడవలయునని అబ్బూరు వెళ్ళిరి. స్వామిరాక వినిన తక్షణమే ప్రియభక్తులగు గుణకయ్య మొదలగు వారందరు స్వామి దర్శనమునకు వచ్చిరి.

స్వామివారు అబ్బూరు వచ్చిరను వార్త విని పాకాలపాడులో నివసించెడు గద్దె నరసింహదాసు పరుగులుతీయుచు అబ్బూరు చేరి స్వామివారికి పాదాభివందనము లొనర్చి ఆసీనులైరి.

నరసింహ దాసుమనస్సున నిట్లూహించెను. 'ఎంతభక్తియున్నను నెంతశక్తియున్నను సద్గురువులచే జ్ఞానోపదేశము నొందనియెడల మానవునకు బంధవిముక్తి గలుగదని మన శాస్త్రములు శాసించు చున్నవి. సద్గురువులు లభించుటే యరుదు; లభించిన సమయమున నశ్రద్ధచేయుట యజ్ఞానముగాక మరేమి యనవలయును. ఈ క్షణమందే స్వామికృపకు పాత్రుడనయ్యెద' నని నిశ్చయించెను. దిగ్గునలేచి స్వామిపాదములపై వ్రాలి "తండ్రీ! నాకీనాడే జ్ఞానోపదేశము చేయ వలయు"నని యావేశ పూరితులై యానందాశ్రువులను రాల్చిరి.

పవిత్రమూర్తియగు నృసింహమూర్తి "ఓహో! ఈ బాలునకు పరిపక్వస్థితి యేర్పడినది. 'క్షేత్ర మెరిగి విత్తనము-పాత్ర యెరిగిదాన' మనినట్లు వీని హృదయక్షేత్రము భక్తిజల్లులచే తడిసి మెత్తనై పరిపక్వ దశకు వచ్చినది. వీనికీనాడే జ్ఞానోపదేశము చేయవలయునని సంకల్పించి 'సరే! నాయనా! సంతోష'మని సెలవిచ్చిరి. స్వామివారు 1930వ సంవత్సరమున డిశెంబరు 8 వ తేదీన గద్దె నరసింహదాసునకు జ్ఞానోపదేశము గావించిరి.

## కుచేలయ్య కోటిదాసులకు జ్ఞానోపదేశము చేయుట

అబ్బూరునకు సమీపగ్రామము లగడపాడు. అందు నివసించెడు కుచేలయ్య యను నుత్తమవ్యక్తి స్వామివారి విషయమును విని తరించవలెనను నాశతో అబ్బూరుచేరి స్వామివారిని దర్శించి వినయవిధేయత, భక్తిభావములు గలిగి యమితముగా ప్రార్థించిన స్వామివారు కరుణబూని కుచేలయ్యకు జ్ఞానోపదేశ మొసంగి "నాయనా! మానవజీవితము నొడిదుడుకులులేక సక్రమ విధానముతో అక్రమమార్గములు వదలి భగవత్కృపకు పాత్రుడవగుటకు ప్రయత్నమొనర్పు"మని ప్రబోధముచేసిరి.

శ్రీ యోగానంద సద్గురుదేవుల ప్రతిభ దూరదూరములకు వ్యాపించినది. వినుకొండపుర నివాసుడగు కోటిదాసను భక్తుడు యోగానందమహర్షి శక్తివిని వారిదయను సంపాదింపవలెనను సంకల్పముతో అబ్బూరు గ్రామముచేరి సద్గురుపాదపద్మములపై వ్రాలి యావేదనతో నాతడు స్వామివారిని ప్రార్థించగా కరుణానిలయుడగు సద్గురుదేవులు "నాయనా! భయమువీడి శ్రీహరిని స్మరింపుము. నిన్ను సదా రక్షించును. సత్యస్వరూపుడగు సర్వేశ్వరుని సత్యదృష్టితో దర్శించుచు సత్యమునే యనుష్ఠింపుము. సత్యమార్గమునుండి దిగజారితివో యధః పతనమే! పైకి రాజాల"వని ప్రబోధముచేసి యానాడే జ్ఞానోపదేశము గావించిరి.

## అబ్బూరులో శ్రీ స్వామివారు యజ్ఞమును చేయుట

అబ్బూరు గ్రామమున భూమతాలయావరణలో ప్రియభక్తుల కోరికపై శ్రీ యోగానంద వీరనృసింహమూర్తి ది 27-2-1933 న, యొక మహాయజ్ఞమును ప్రారంభముచేసిరి. యజ్ఞగుండము నిండుగా గంధపు చెక్కలను పేర్చిరి. ఈ యజ్ఞగుండమెవ్వరు వెలిగించకయే తొమ్మిది రోజులకు భగ్గునమండగలదు. అదృశ్యరూపిణియైన యాది మహాశక్తి యోంకారనాదముతో ప్రత్యక్షమై యగ్నిని ముట్టించగలదని స్వామివారు చెప్పిరి.




అబ్బూరులో శ్రీ స్వామివారు యజ్ఞమును చేయుట

శ్రీ స్వామివారు మౌనదీక్షతో పద్మాసనాశీనులై పరమాత్మపై మనస్సును కేంద్రీకరింపచేసి యోగదీక్షలో నుండిరి. ముఖ్యశిష్యులు నల్వురు గురుదేవుని మనస్సున ధ్యానించుచు స్మరించుచు నీ మహా యజ్ఞ మెటుల పరిణమించునో యని గురుదేవుని యాజ్ఞానుసారము

కార్యక్రమములను పట్టుదలతో స్వామిభక్తితో దీక్షతో నొనర్చుచుండిరి.

శ్రీ సద్గురుస్వామివా రన్నపానీయముల వర్జించి త్యాగయోగముతో నచంచలబ్రహ్మనిష్ఠలో మునిగిపోయిరి.

ఆ మహాత్ముని బ్రహ్మవర్చస్సును చూచినవా రందరు విస్మయ మందసాగిరి. నలుదిక్కుల ప్రజలందరు నీ యజ్ఞవిషయమును తెలిసికొని యాబాలగోపాలము ప్రయాణమై అబ్బూరునకు చేరి దీక్షాకంకణులైన యోగానందస్వామిని రెప్పలార్పక వీక్షించుచుండిరి. యజ్ఞమును వీక్షించుటకై గ్రామీణప్రజలందరు తండోపతండములుగా వచ్చుచుండిరి. యజ్ఞకుండము నలుప్రక్కల బ్రాహ్మణు లాసీనులై వేదోక్త విధి ననుసరించుచుండిరి. యజ్ఞము చుట్టును మిన్నుముట్టునట్లు నృసింహ నామ భజనలు గావించుచుండిరి. యజ్ఞదీక్షలోనున్న యోగమూర్తికి భక్తితో పూజలు గావించుచు కర్పూరహారతు లొసగుచుండిరి.

శ్రీ నారాయణదాసు, నరసింహయ్య, కుచేలయ్య, కోటిదాసు లనెడి శిష్యులు నల్వురు నాశాపాశములుకోసి స్వామిసేవలో ప్రాణములను తృణప్రాయముగా నెంచి యన్ని బాధ్యతలు నిర్వహించుచు శ్రీ సద్గురు మహారాజును నమ్మికొనియుండిరి.

యజ్ఞప్రదేశము చుట్టును డేరా కట్టించిరి. బ్రహ్మాండముగా హోమగుండమున కలపలన్నిటిని చేర్చిరి. మంత్రాంగమును విధిగా జరిపించిరి. గుండ మెప్పుడు మండునో దర్శించవలయు నని తహతహ లాడుచు దాని వైపునకే దృక్కులను నిల్పి ప్రజలందరు గుంపులు గుంపులై చూచుచుండిరి.

వరుసగా నెనిమిదిరోజులు గడచిపోయినవి. శ్రీ యోగానంద మహర్షి యచంచలమైన యోగనిష్ఠలో పరబ్రహ్మముపై మనస్సును లగ్నముచేసి బ్రహ్మవర్చస్సుతో వెలుంగుచుండిరి. తెల్లవారినచో తొమ్మిదవరోజు. "నిప్పు నంటించకయే యజ్ఞగుండము భగ్గున మండ

గల" దని తోకపల్లి స్వామివారు సెలవిచ్చిరి. "వారివాక్యములు కల్లలౌనా!" యని కొందరు, "మనము సంశయగ్రస్తులము. వారిని గుఱించియు సంశయించు చున్నాము. ఈ సంశయమునకు మనహృదయమున నావరించిన కటికిచీకటియే కారణ" మని కొందఱు, "తోకపల్లిలో నవతరించి భూతలమంతయు దిరిగి కొండకోనలలో ఘోరతపస్సు చేసి శ్రీహరిని మెప్పించి మహత్తర వరములను పొందినారట! సామాన్యులు గాదోయి బాబయ్యలారా!" యని కొందరనుచుండిరి. ఏయూరినుండి వచ్చినారో కాని వారిమాట గట్టిగా నమ్మిరి మన గుణకయ్యగారు.

మన నారాయణదాసుగారు, నరసింహయ్య, కుచేలయ్య, కోటిదాసు, మానుకొండ అచ్చమ్మ, నాగభూషణము మొదలగు వారందరు గంతులువేయుచు పరమోత్సాహముతో నీ మహాకార్యమును తలపెట్టినారు! వారిమాట వీరిమాట స్వామి యేమి చేస్తాడో యని కొందఱు, యోగానందస్వామివారి యోగశక్తులన్నియు నీయజ్ఞముతో తేలిపోవును. తెల్లవారు దనుక నోపికబట్టి స్వామివారిశక్తిని కన్నులార దర్శించియే వెళ్ళవచ్చునని కొందరు, కుండమును మండించెదనని హస్తమున కంకణము ధరించి చలనరహితుడై యన్నపానీయముల వర్జించి చూచెడివారలు మెచ్చుకొనవలెనని మౌనము వహించి యున్నాడని తెలిసీతెలియని వదరుబోతులు కొందఱు తలకొకరీతి సంభాషించుచుండిరి. అందరు నెనిమిదవనాటి రాత్రియంతయు జాగరణ సలిపిరి.

తెల్లవారుసరికి స్వామివారి యోగాగ్నిచే యజ్ఞకుండము మండ గలదను వదంతి దేశమున ప్రాకిపోవుటచే యీ దృశ్యమును చూచియే తీరవలయునని బహుగ్రామములనుండి వేలకొలది ప్రజలు అబ్బూరు గ్రామమునకు వచ్చిరి.

ఈ ప్రజాప్రవాహమును కన్నులార గాంచిన స్వామి శిష్యులు నల్వురు ప్రాణము లరచేతబట్టుకొని దిక్కుతోచక స్వామివంక చూచుచు నేల్మియు పాలుపోక యాకాశమువంక చూచుచు మనస్సు నిలువక

ప్రజలను పరికింపుచు తొట్రుపాటుతో సద్గురుమంత్రమును ధ్యానించుచు 'యజ్ఞకుండ మెప్పుడు మండునా' యని వారిదృష్టినంతయు యజ్ఞకుండ ముపై నిల్పి మనస్సులను సద్గురుపాద నీరేజములపై చేర్చియుంచిరి.

తెల్లవాఱినది. భాను డుదయింపలేదు. రెండు ఘడియలలో ఉదయించును. 'యజ్ఞకుండము మండలేదే ఇదేమి'టని ప్రజలందరు గగ్గోలుపడుచుండిరి. శ్రీ స్వామివారు కన్నులు తెరువక యచంచల యోగనిష్ఠలో నుండిరి. సద్గురుదేవులు సమయముమించెనని జగదీశ్వరిని ప్రార్థించి "ఓ మహాశక్తీ! యజ్ఞకుండమును మండించవా! నన్నే పరీక్షింపఁ బూనితివా? చూడు మాతా నా ప్రజ్ఞ "యని ప్రాణవాయువును ఆధార స్వాధిష్ఠ మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞేయ చక్రములవరకు లాగి కుంభించినవారై "తల్లీ! జగజ్జననీ! నిన్నే నమ్మికొని యీ మహాయజ్ఞమును ప్రారంభము చేసితిని; నా వాక్యములు కల్లలయిన నీవు కల్లయేకదా? సర్వాంతర్యామినివి! సాధుజన పోషిణివి! సృష్టి స్థితి సంహారిణివి. త్రిమూర్తులను కన్నట్టి మహాశక్తివి నీవు తలంచినచో యీ కార్యమొక లెక్కయా? మండించక యుపేక్షతో మౌనముద్ర వహించి నన్ను పరీక్షింపబూనితివా? ఇదిగో చూడు"మని ఆజ్ఞేయచక్ర మందున్న ప్రాణవాయువును సహస్రారమునకు లాగి బ్రహ్మరంధ్రమున ప్రాణమును వదలుటకై ప్రయత్నింప నంత, సాధుజన పోషిణి లోకమాత, మహేశ్వరి యోగానందునిపై కరుణబూని భాను డుదయించక ముందే యదృశ్యరూపిణియై యజ్ఞగుండమున నగ్ని నంటింప ప్రజలు దిగ్భ్రమ చెందునట్లా యజ్ఞకుండ మొకేసారి భగ్గున మండినది. సహస్ర జ్వాలలతో నగ్ని వెలింగెను.

శ్రీ యోగానంద సద్గురుదేవులు ప్రాణవాయువును యథాస్థానమునకు చేర్చి కన్నులువిప్పి మండుచున్న యజ్ఞమును హాహాకారములతో చెలంగెడి భక్తసంఘములను, యజ్ఞకుండమును కాచుకొనియున్న ప్రియ శిష్యులను నల్వురను కన్నులార గాంచి, బ్రహ్మానందమును పొందిరి.

మండుచున్న యజ్ఞకుండము మధ్యభాగమున నొక చిన్నబండను బరచిరి. ఆ బండపై వీరనృసింహ కళావతారులగు మన సద్గురుదేవులు సుఖాసీనులైరి. యోగమూర్తి హృదయకుండమున ప్రజ్వలించెడి యోగాగ్నిముందీ యజ్ఞాగ్ని యేమి చేయలేకపోయెను.

భక్తులందరు భక్తితో దెచ్చిన నేతికడవ లన్నియు యజ్ఞకుండమున కర్పించిరి. ఆ నేయినంతయు నగ్నిదేవు డారగించెను. ఆయన ధర్మపత్నియగు స్వాహాదేవి సంతృప్తి చెందెను.

యజ్ఞకుండము మధ్యభాగమున నాసీనులైన స్వామివారిచుట్టు నగ్నిశిఖలు ప్రదక్షిణములు చేయుచున్నవి. స్వామివారు ప్రసన్న వదనముతో నిండుచందురునివలె కళకళలాడుచుండెను. స్వామివారిని దర్శించిన ప్రజలందరు చిత్తరువులవలె నిల్చిపోయిరి. ఆమహత్తర యజ్ఞకుండ దృశ్యమును ఫొటోలు తీసిరి. ఈదృశ్యములన్నిటిని వీక్షించెడి అబ్బూరు పురవాసు లబ్బురముచెందిరి. భక్తులెల్లరు నానందాబ్ధిలో నోలలాడిరి.

శ్రీ యోగానంద స్వామికి పూజలు గావించిరి. ఆరోజంతయు పేదలకు, భక్తులకు నఖండముగా నన్నదాన మొనరించిరి. స్వామివారు పరమానందభరితులై యజ్ఞమును నిర్వహించిన ప్రియశిష్యుల నల్వురను జూచి ప్రియమార "ఓ నారాయణా! నరసింహదాసు, కుచేలయ్య, కోటిదాసూ, మీరు నా యందే భారముంచి యీ మహాయజ్ఞమును నిర్వహించితిరి. నా భారమంతయు సర్వశక్తి నిలయుడగు శ్రీమన్నారాయణమూర్తియే నిర్వహించి యఖండ విజయమొనగూర్చిర"ని నుడివిరి. ఈ మహత్తరయజ్ఞ దృశ్యమును వీక్షించిన నారాయణదాసు హృదయము పొంగిపోయెను. "ఆహా! నా గురుదేవులు సామాన్యులుకాదు. మానవరూపముతోనున్న మాధవుడే! ఈ మహనీయుని నడవడి గుర్తించుట బహుకష్టసాధ్యము. పిచ్చివానితో పిచ్చివానివలెనే సంభాషించుచుండును. పండితునితో పండితునివలె, తత్త్వవేత్తతో తత్త్వవేత్తవలె, యోగితో యోగివలె, పసిపిల్లలుకానెడి బాలురతో బాలునివలె

ముచ్చటించెడివారు. ఎవరేభావములతో వెళ్ళినను, శ్రీ స్వామివారు ముందేగుర్తించి వారివారి భావములకు తగినరీతిగా సంభాషించుచుండెడి వారు. ఆ కారణముచే సామాన్యులు వారిని సామాన్యుడనియే భావన చేసి వారి పరిపూర్ణ తత్త్వమును గుర్తింపలేరైరి.

"మా సుకృతమున నిట్టి యాదర్శ ఋషిపుంగవులు మాకు సద్గురువులుగా లభించిరి. వీరేనాకు ప్రత్యక్షదైవము. వీరే నా జీవితపరమావధి. వీరి వాక్యములు వేదప్రమాణములు. నా రక్షణభారము నా సద్గురునిదే యని ధృఢసంకల్పముతో స్థితప్రజ్ఞ నవలంబించి గురుదేవునకు సకలవిధ శుశ్రూషలొనర్చుచు గురుదేవు లేపనిచేసినను తక్షణమే యాపనిని తానొనర్చుచు వారితోనే తిరుగుచు త్యాగముతో శరీర భ్రాంతిని వీడి గురుదేవుడు దప్ప వేరేమియు లేదని కంటికి గోచరించెడి ప్రతిపదార్థము సద్గురుస్వరూపమే" యని భావనచేయుచు, నారాయణదాసు యోగసాధన ప్రారంభించిరి.

ప్రియశిష్యుడగు నారాయణుని నడవడిని చూచి, నాకు సత్కీర్తి ఘటించెడి బిడ్డలలో ఘనుడు ఈతడేయని లోలోన యానందమొందుచుండెడివారు.

శ్రీసద్గురు స్వామి బోధ వినవలయునని భక్తులందరైహిక బాధలకు స్వస్తిచెప్పి స్వామివారి యొద్దకు వెళ్ళి "ప్రభూ! ఈ పవిత్ర దివసమున తమదివ్య బోధవిని మాబాధలను తుద ముట్టజేయ సంకల్పించి తమ పాదసన్నిధికిచేరి ప్రార్థించుచుంటి"మని నమస్సు లర్పించిరి. స్వామివారు కరుణాళువులై యిట్లు ప్రబోధము చేసిరి.

## శ్రీ యోగానందమూర్తి దివ్యప్రబోధము

శ్రుతి॥ ఏకో నారాయణో నద్వితీయోఽస్తి కశ్చిత్
ఏక ఏవ శివో నిత్యస్తతోఽన్య త్సకలం మృషా
బహునాఽత్రకి ముక్తేన సర్వం బ్రహ్మమయం జగత్
అనేక భేద భిన్నస్తు క్రీడతే పరమేశ్వరః॥

తా॥ నారాయణుం డొక్కడే. ద్వితీయమైన దేదియు లేదు. ఆ నారాయణుడే నిత్యమైన శివుడు. దాని కన్యమైనదంతయు నసత్యము అనగా నశించునది. వేయేల ఈ జగమంతయు బ్రహ్మమే. ఆ బ్రహ్మమగు పరమేశ్వరు డనేకవిధములుగా నవతరించి క్రీడించుచున్నాడు.

శ్రుతి॥ ఏకోవశీ సర్వభూతాంత రాత్మా
ఏకం రూపం బహుధాయః కరోతి
తమాత్మస్థం యేఽను పశ్యంతి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేత రేషామ్॥

తా॥ ఏకమై సర్వజగత్తులను తన వశమునం దుంచినవాడై సమస్త భూతాంతర్యామియై యేక రూపము ననేక రూపములుగా జేయువాడగు పరమాత్మ నాత్మయందే విజ్ఞులు దర్శింతురో, వారు శాశ్వతమైన సుఖమును పొందుదురు. భేదబుద్ధులగువారికి మోక్షము సిద్ధింపదు. పరమాత్మను పొందవలయు నన్నచో సత్యము, తపస్సు, జ్ఞానము, నిత్యబ్రహ్మనిష్ఠ యొనర్పవలయును. ఆ పరమాత్మ శరీరాంతర్భాగమైన హృదయపుండరీకమునందు పరిశుద్ధుడై జ్యోతిర్మయుడై యుండును. అట్లున్న పరమాత్మను రాగద్వేషాది సర్వదోషములు నశించిన యతీశ్వరులు దర్శింతురు. ఈ విషయమే వేదములందు, నుపనిషత్తులందు, శాస్త్రములందు, పురాణేతిహాసములయందు చెప్ప బడియున్నది.

అయోధ్యలో వెలసిన శ్రీరామచంద్రమూర్తియు, ద్వారకానగర మున వెలసిన శ్రీకృష్ణపరమాత్మయు, కపిలవస్తుపురమున వెలసిన శ్రీబుద్ధ దేవులు, పాశ్చాత్య దేశములకు వెలుగునిచ్చిన శ్రీ యేసుక్రీస్తుప్రభువు యును, అరేబియా దేశమున శ్రీ మహమ్మదు ప్రవక్తయు, కేరళ రాష్ట్రములో శ్రీ శంకరభగవత్పాదులు, ద్రావిడదేశమున శ్రీ రామా నుజాచార్యులు, కర్ణాటదేశములో మధ్వాచార్యులు, పాంచాల దేశమున శ్రీ గురునానక్, ఆర్యావర్తమున రామకృష్ణ, చైతన్య

ప్రభువులును, పరమపవిత్రమగు భారతదేశమున శ్రీ మహాత్మాగాంధీగా రవతరించిరి. వీరందరు సర్వమానవ హృదయములలో శాంతి జ్యోతులను వెలిగించి విజ్ఞానజ్యోతులను నలుమూలల విరజిమ్మిరి. ఈ మహనీయులందరు లోకసంరక్షణార్థమై యవతరించిరి. వీరే ప్రాంతములయందవతరించినను నొకే స్వరూపమగు పరబ్రహ్మశక్తియే గాని మరి యేమియునుగాదు.

ఈ పరమరహస్యము సాధారణ మనుజులకు గోచరము కాదు. కొందరడిగెదరు : "మీరు చెప్పిన ప్రవక్తలు, మహాపురుషులు మొదలగువారందఱు యోనిసంభవులేకద! శాస్త్రములు నేర్చినవారు వారల యవతారములను గురించి రకరకములుగా చెప్పి వప్పించెదరు. సామాన్యులు మాటలు నేర్చినవారికి బదులుచెప్పలేక తప్పక సందేహముతో తల నూపుటతప్ప మరేమియుకాదని కొందరి యూహ. వారి యవతారములు లోకకల్యాణమునకై యావిర్భవించినవని సదా జ్ఞప్తి నుంచుకొనుడు. ప్రత్యవతారమును గురించియు నజ్ఞానులకు మూల విషయము బోధపడక యనుమానము కలుగుచునే యుండును. విషయ మెఱింగిన వారి కెవ్వరికి సందేహము కలుగదు

వీరనృసింహస్వామి నిండుసభలో సభాస్తంభమున ప్రళయకాల ధ్వనులతో నవతరించి మదమత్తుడగు దుష్టదానవుని హిరణ్యాకశ్యపుని పొట్టచీల్చి మహాభక్త ప్రహ్లాదునకు రక్షణ చేకూర్చిన విషయము జగద్విదితమేకదా! ఈ సంఘటన కేమైన సందేహము స్ఫురించునా? పాపము కలుగుట కవకాశము లేదు. అవకాశమును సృష్టించలేరు. కాబట్టి దైవశక్తి యనంతము. ఊహాతీతము. ఎచ్చటనైన నే కాలమందైన నా మహాశక్తి యావిర్భవించగలదు. అందులకే మీరందరు వ్యర్థమగు వాదములతో పవిత్రమగు కాలమును దుర్వినియోగము చేయక బుద్ధితో యోచించి సద్గురువుల నాశ్రయించి వారియాత్మ ప్రబోధములను శిరసావహించి జీవితములకు సార్థకతను గల్పింపుడు.

పురుషప్రయత్న మొనర్పవలయును. ప్రయత్నించుటకు మన స్స్వప్పక పరిశ్రమచేయక జప తప యోగ ధ్యానాదులవలన నేమి ప్రయోజనము. సద్గురువు లెచ్చట గలరయ్యా! వారు మాత్రము మన వంటివారు కారా! భగవానుని చూచినవారున్నారా! అంతయు హుళక్కి. లేనిపోని కల్లబొల్లి మాటలతో పొట్టపోసికొనుచు కాలమును హాయిగా గడుపుకొనువారలే కాని దేవుని దర్శించి యుండరని యజ్ఞానులనుచుందురు. వారిదృష్టికి సత్యమసత్యముగాను నసత్యము సత్యముగాను గోచరించును. వారికర్మకు వారేమి చేయగలరు.

ఎవరెవరి హృదయాంతరాళముల నేయే భావములు కాపురము చేయునో అట్టివారికి ప్రకృతియంతయు వానిభావముల కనుగుణముగా పొడకట్టును. అజ్ఞానులు, అహంకారపరులు, కామినీకాంచనాశక్తులు లాడెడి వాక్యములను వదలి సుజ్ఞానముతో సూక్ష్మదృష్టితో భగవంతుని కనుగొనుటకు బ్రయత్నింపుము. భగవంతునికై పరితపింపుము. జీవితమునే త్యాగమొనర్పుము. ధనధాన్యములను తృణమువలె పరిత్యజింపుము. భగవంతుని నిమిత్తము సర్వము త్యాగమొనర్పుము.

కామినీ కాంచనములపై భ్రాంతిని వదలలేక భగవంతునికి నానాటికి దూరమై పోవుచున్నావా? మూర్ఖమానవుడా! పరమసత్యమును గుర్తించుటలేదా? నీ తెలివి తేటలన్నియు క్షణికములగు భోగములకు వ్యయమొనరింప బూనితివి. ఆహా! మాయను జయించుట యెంత కష్టమైనపని. ప్రతిదినము మాయాప్రభావములను తిలకించుచునే యున్నాము. దాని యదార్థ తత్త్వమును గుర్తించమైతిమి.

నూతనసంవత్సరమున ప్రకృతియంతయు నెంతయో రమణీయమై మనోహరమై నూతన కాంతులతో కళకళలాడుచు తళతళలాడుచు కన్నులకు మిరుమిట్లు గొలుపుచున్నది. కొన్నిమాసములకు పూలతో పిందెలతో కాయలతో శోభాయమానముగా ప్రకాశించుచున్నది. హాయిగా చెట్లనీడలందు విశ్రమింపవచ్చును. నానారకములగు ఫలము

లను భుజింపవచ్చును. ఇట్లు కొంతకాలము గడచును. చివరిదశలో పండ్లన్నియు రాలిపోవును. ఒక యాకైన నుండక దాని స్వస్వరూపము బయల్పడును.

నూతన సంవత్సరమున పొందిన యానందమును సంవత్సరాంతమున పొందజాలకున్నాము. అప్పటి శోభ యిప్పటి దీనదశను గుర్తించి మనము యోచించినచో యదార్థము గోచరించును. ప్రకృతి మన కెంతో గుణపాఠమును బోధించుచున్నది.

అనుదినము నుదయించెడి బాలభానుని చూడుడు. ప్రాతఃకాలమున నెంతయో శోభాయమానముగా తనకిరణముల విరజిమ్ముచు ప్రాణుల కానంద మొనగూర్చును. ఆ బాలభానుడే మధ్యాహ్న సమయములో చండకిరణుడై చూచుటకే కష్టసాధ్యుడై ప్రకాశించును. సాయంత్ర సమయమున నా చండభానుడు చల్లనై నిట్టూర్పుతో పశ్చిమశైలమున గ్రుంకులిడును. ప్రకృతియే మనకు మహత్తర గుణపాఠమును బోధింపుచున్నది.

మానవుడు లేబ్రాయమున నల్లారు ముద్దారుగా పెరిగి పెద్దవాడై సంసారబంధమును కంఠమునకు తగిలించుకొని భార్యాబిడ్డలపై మమకారముచే తన యాకారమునే మార్చుకొని వారి ప్రేమకు దాసుడై సర్వభోగము లనుభవించుచు నేమరుపాటుననైన భగవంతుని దలపక యంత్యదశయగు వృద్ధాప్యము సంప్రాప్తమైన, రూపవిహీనుడై జవసత్వదూరుడై కదలలేక, మెదలలేక 'జీవితమంతయు మీ కొరకే వినియోగించితినే బిడ్డలారా! ముద్దులభార్యవని మురిసిపోయితినే! ఇప్పుడు నామాట మీలో నొక్కరైనను పాటించుటలేదే? వయసులో మిమ్ము దైవముగా భావించి మీరే నాప్రాణమని యెన్నెన్నో మోసములు చేసి యసత్యములతో, నన్యాయములతో నార్జించిన ధనమంతయు మీ కొఱకు వినియోగించితిని! కించిత్తయినను ధర్మకార్యక్రమములకు వినియోగించలేదే ? ఎన్నడైన నొక్క మహాత్మునకేనియు

భక్తితో నొక్క ఫలమైనను నర్పింపనైతినే! రాత్రింబవళ్లు సంసార వ్యాసంగములతో సతమతమైతినిగాని తీరికసమయములలో సద్గ్రంథ ముల పఠింపనైతినే! పవిత్రాశ్రమములకు వెళ్ళి మహనీయమూర్తులను దర్శింపనైతినే! నేను వెళ్ళకపోగా నన్నే దైవమని నమ్మి సేవించెడి నా ధర్మపత్నినైన ధర్మకార్యములు చేయనివ్వకపోతినే భగవంతుడా' యని వాపోవుచు చుట్టునున్నవారిని దూషించుచు తనకుతానే తిట్టు కొనుచు, జీవితమునే యేవగించుకొనుచు గత జీవిత ఘట్టములను దలంచుకొని కుమిలికుమిలి యేడ్చుచు గతిలేక మతిలేని మాటలతో జగత్పతి ప్రార్థన మాని భ్రాంతిని వీడలేక కుమారులను దగ్గరకు బిలిపించుకొని గాఢాలింగనము చేసికొని 'నాయనలారా! సంసారము జాగ్రత! జాగ్రత!' యని వాపోవునుగాని వానిగతి యేదో చూచు కొనడు. ఆహా! ప్రకృతిశక్తి యెంత ఘనమైనదోచూడుడు.

పుట్టినది మొదలు మరణపర్యంతము భార్యాబిడ్డల నిమిత్తమే జీవితము నర్పించి మరణసమయమందైనను భగవంతుని ప్రార్థించుటకు ప్రయత్నింపడు. శక్తియున్నపుడే భక్తితో భగవానుని కీర్తింప వలయును. శక్తి నశించినపిమ్మట చింతించిన ప్రయోజనము లేదు. నోటితో నూరుధర్మములు వల్లించుటకంటె చేతులతో పాత్ర యెరిగి యొకధర్మ మొనర్చుట మిగుల శ్రేయస్కరము. వాదములుమాని సద్గురు వాక్యముల నొదలదాల్చి జీవితములకు సార్థకతను గల్పింపుడు. ఆచరణలేని వాచా వేదాంతమువలన వృధాగా కాలము గడిచిపోవుట తప్ప యణుమాత్రమైనను లాభములేదు. 'శుష్కవేదాంతములతో తోటివారిని మోసగించుచున్నాను. నా యుచ్చులలో నందఱు పడు చుండిరి. నా మోసము నెవరు గుర్తించగల' రను పిచ్చియూహాలతో తన యాత్మను తానే మోసగించుకొని యంతరాత్మకు ద్రోహ మొనగూర్చుచున్నాడు. యట్టివా డాత్మవంచకుడు.

తనతప్పు తాను తెలిసికొని తన్ను చక్కగా దిద్దుకొని సత్పథ గామి యైనచో లోకమునకు మహోపకార మొనర్చిన త్యాగి కాగలడు. ఈ వేదాంతసూత్రములను మరువక జపించుచు నాచరించి నచో ముక్తి మీకు కరతలామలకము. ఎట్టి సందేహమువలదు. కాల కూట విషముకంటె విషయవాంఛలు బహుక్రూరములైనవి. మఱ్ఱి యూడ ప్రారంభమున సూక్ష్మముగానుండియు రోజులు గడచుకొలది యా యూడయే పెద్దదియై చెట్టుకంటె మిక్కుటమగునట్లు, విషయ వాంఛలు ప్రథమమున హృదయమున నంకురించి బలమై వదలించు కొనుటకు వీలులేక బహుక్రూరములై ఘోరాపదల పాల్సేయును. వానిని ప్రారంభదశలోనే సమూలముగా నాశన మొనరింపవలయును. విషయవాంఛలు గలిగినప్పుడుపేక్షభావముతో మిన్నకుండినవానినే భ్రష్టుని చేయును.

ఎట్టి పండితులైనను, వేదాంతులైనను విషయసుఖములకు లొంగి నచో వారు చేసెడి భక్తి జ్ఞాన భజనాదు లన్నియు బూదిలో పోసిన పన్నీరువలె వ్యర్థములై పోవును. అట్టి వారిని భగవంతుడు క్షమింపడు. చేసినకర్మ ననుభవింపక తప్పదు. ఈ జన్మలో పుణ్యాత్ముడై ధర్మ కార్యము లొనరించినను గతజన్మలో చేసిన పాపఫలితము ననుభవింపక తప్పదు. ఈ జన్మలో పాపకార్యములు చేయుచున్నను, గతజన్మలో పుణ్యము చేసినచో నది ఫలమునకు వచ్చి సుఖముల ననుభవింప చేయును. గతజన్మ పుణ్యము క్షయమైన పిదప, వీడీ జన్మలో చేసిన పాప ఫలితము పక్వమై యనుభవమునకు వచ్చి యమయాతనల నిచ్చుటనే యనుభవించును.

కష్టమైనను సుఖమైనను వారి వారి ప్రారబ్ధము ననుసరించియే సంప్రాప్తమగును. ఈ కర్మరహస్యము బహువిచిత్రము. ఈ సంవత్స రము సేద్యము చేయక పొలమును బీడుబెట్టి విచ్చలవిడిగా తిరుగుచు హాయిగా అర్థమును అనర్థములకు వెచ్చించుచు సుఖముగా జీవించు

వాడు క్రిందటి సంవత్సరమున పండిన పంటను నిల్వచేసికొని యాఫల మునే విచ్చలవిడిగా ఖర్చు పెట్టుకొనుచున్నాడు. రానున్న సంవత్స రములో వీడు గచాట్లకు లోనౌను.

మఱియొకడు క్రిందటి సంవత్సరమున శక్తికిమించిన వ్యయము చేసి గొప్ప ఋణము చేసినాడు. ఈ సంవత్సరమున బాగుగా శ్రమచేసి పూర్తిపంటను పండించినాడు. పాపము! కళ్ళమునకు పంటరాగానే వారి బాకీదారులొచ్చి వీడొనరించిన యప్పుక్రింద నా ధాన్యమంతయు తీసికొనివెళ్ళిరి. పంట పండించియు ప్రయోజనము లేకపోయెను. తినుటకు సాదములేక బికారియై వారులొసంగిన ప్రసాదముతో కాలమును వెళ్ళబుచ్చెను. పండించినవానికి పూర్వకర్మవలన నీగతి పట్టెను. మొదటివానికి పంట పండకపోయినను హాయిగా జీవించెను. కర్మరహస్యమంతయు నిట్లే జరుగుచుండును.

విషయ వాంఛలు బహు క్రూరములైనవి. విషయ వాంఛలను విషము లని భావించి, నిశ్చలమగు మనస్సుతో మీ గమ్యమగు పరమాత్మను పొందుటకు ప్రయత్నింపుడు. కాల మమూల్యమైనది. ఒకక్షణమేని వృధచేయక భగవత్సాక్షాత్కారమునకై బరితపింపుడు. సర్వప్రాణులకు తండ్రియగు పరమాత్మను దర్శించిననాడే ఈ జీవులకు సంసారబంధవిముక్తి చేకూరగలదు. పరమాత్మ దర్శనమును పొందుట కత్యావశ్యకమార్గములు. శ్రద్ధతో నాచరింపుడు. సత్యదృష్టితో సత్య మార్గమున ప్రయాణము సాగించి పరిశీలించి సద్గురువుల పజ్జ చేరుట, వారు ఆదేశించిన ధర్మసూత్రములను విని మననముచేసి జీవితాంతము వర కాచరణలో నుంచుట, సర్వమతజాతివర్గవిభేదమును పోనాడి సర్వ భూతములయందును సత్యజ్యోతి యగు పరమాత్మను దర్శించుట. సత్య స్వరూపమగు దేవుడు సత్యమార్గమున పయనించెడి సాధుమూర్తు లకు మాత్రమే తన స్వరూపమును సాక్షాత్కరింపచేయును.

ప్రతి వ్యక్తియు పరమాత్మని చేరుటకు పురుష ప్రయత్న మొనర్పవలయును. మమత్వదృష్టిని పోనాడి సమత్వదృష్టితో మెలగ వలయును. సమత్వదృష్టితో మెలగనివాడు సర్వకర్మలు నిరర్థకమౌను. మమత్వ సమత్వములు కర్థమేదో తెలియక ప్రతి వ్యక్తియు వ్యాగ్రూప మున "సమత్వము సమత్వ"మని వాకొనుచుందురు. సమత్వదృష్టి యేదో మమత్వదృష్టి యేదో సజ్జనులు గుర్తించి సత్యదృష్టితో మెలగు దురుగాక! మమత్వసమత్వముల సమన్వయమేదో గుర్తింపుడు!

## మమత్వము - సమత్వము

మమత్వముతో జీవనము చేయువాడు రాక్షసుడు. సమత్వ ముతో జీవనము చేయువాడు మానవుడు. మమత్వమనగా నేమి? మమ = అంతయు నాదే. అందరిసొత్తు నా యొద్దకు చేరకపోయెనే, అందరికంటె మిన్నయై యష్టభోగముల తులతూగకపోతినే, అంతయు నాదే, సర్వాధికారిని నేనే, నా తెలివియే తెలివి, నా శక్తియే శక్తి, నా భక్తియే భక్తి, నా దైవమే దైవము, అంతయు నాదే, నాయనెడి యీ వేదనాందోళనలతో నహంకార మమకారములతో సత్యదృష్టికి సర్వేశ్వరభక్తికిదూరుడై యేమఱుపాటుననైనను, రామా యనియో, అల్లాయనియో, యెహోవా యనియో, ధ్యానించెడి తోటిమానవులను పరిహసించుచు, ఓహోహో! యిదియొక భక్తియా? యుదరపోషణ కొరకు ప్రార్థించెడి ప్రార్థనలు. ఏపనిచేయుటకు శక్తిలేక యమాయకు లను దరికి చేర్చుకొని ప్రబోధములు చేయుచు వారి పైసాలతో తన సమస్యలను పరిష్కరించుకొనుచు హాయిగా జీవనోపాధి నేర్పరచుకొను చున్నారనెడి ధోరణియే మమత్వమునకు సమన్వయముసమాధానము. ఇట్టి మమత్వదృష్టిగలిగి చరించెడివాడే నరరూపరాక్షసుడు. అనగా పాపి యని భావము. మమత్వమే సర్వనాశనహేతువనుమాట సత్యము.

సమత్వ మనగా సాధుదృష్టి. సర్వమానవ హృదయాంతరాళము లలో వెలింగెడి పరమాత్మయొకటే! సర్వమతములు సర్వశాస్త్రములు

నాదేశించినది ప్రబోధించినది యొకటే! శ్రీకృష్ణప్రబోధితమై వ్యాప్తి 'చెందిన భగవద్గీత' శ్రీ మహమ్మద్ చే బోధితమైన 'ఖురాన్' శ్రీ యేసు క్రీస్తుప్రభువుచే వ్యాప్తి చెందిన 'బైబిలు' నొకటే! అణుమాత్రమేని భేదము లేదు. భూత భవిష్యద్వర్తమాన కాలములలో నేకాలమందు ప్రబోధమొనరించినను పరమసత్య మొకటే! శ్లోకములతో కూడినను, సూక్తులతో కూడినను, వాక్యములతో కూడినను నొకటే! ఆలయము మసీదు చర్చి యనెడి నామములతో పిలువబడినను నొకటే! బైబిల్ తెరచి వాక్యముల దలచి పలుమఱు గానమొనర్చి పరలోకమందుండెడి ప్రభువును చేరుటయు నొకటే! ఒకటే! ఒకటే!

సర్వగతమైన పరమాత్మ యొకటియే సర్వప్రాణులకాధారము. సర్వలోకములకు సదాశ్రయము, సర్వశక్తికి నిలయము. ఒకటిని కాదని రెంటిచేరినవారి కిహము లేదు పరమును లేదు. సర్వవ్యాపకమైన పరబ్రహ్మవస్తువు ఒకటైనప్పుడు రెండను కొనుటయే చిత్తచాంచల్యము. చిత్తశుద్ధిలేక యెచ్చటుండినను, నెచ్చోట దిరిగినను, నేవేషము వేసినను, నేపాటపాడినను, నేయాట యాడినను నిష్ప్రయోజనము. చిత్తశుద్ధి గల్గిన మానవునకు ఆలయము మసీదు చర్చిలలో నేదైన నొకటే! తన తలలో జనించెడి తలపులను రూపుమాపి సునిశ్చల భావముతో మెలగుటకు వాసయోగ్యమగు స్థానమే 'ఆలయమై' యలరారును. మానవ హృదయములో గూడుకట్టుకొని యానాటినుండి యీనాటి వరకు తికమకతో తిక్కెత్తించెడి "నీ-నా" భావములను తరతమ భేదములను సమూలముగా మసిచేసి నిత్యశాంతి నొసగి పరమ సత్యమును గుర్తింపచేసెడి స్థానమే మసీదై యొప్పును.

నీ మతము-నా మతము నీ కులము-నా కులము నీ బొట్టు-నాబొట్టు నీ దైవము-నా దైవము అనెడి చర్చలనుమాని తనను తాను చర్చించుకొని తనలో ప్రతిధ్వనించెడి వాక్యమును పొందింపచేయుశక్తి నొసగెడి స్థానమే "చర్చి"యై యొప్పుచున్నది.

ఆదికాలమున నొక్కటైయుండెను. అద్దానినే 'పరబ్రహ్మ' మని 'పరమాత్మ' యని 'స్వయంజ్యోతి' యని 'మూలవిరాట్ట'ని 'శబ్ద బ్రహ్మ' యని అనాదికి పునాదియైన యద్దానినే 'వాక్య' మని 'సూక్తి' యని మహనీయు లందరు పేర్కొనిరి. ఆ శబ్దమే దశవిధ ములై వెలుగొందుచున్నది. అంతయు 'ఓం' కారమునే మారు మ్రోగించు చున్నది. ఆత్మదృష్టితో విచారము చేసిన ప్రతివ్యక్తికి పరమసత్యము వ్యక్తమౌను. మీలోమీరు వాదములుమాని పరిశీలన చేయుడు. గంగాతరంగిణి సదామాతృ స్థానమును పొందుట కహర్నిశలు కష్టములోర్చి నష్టమును భరించి పాపులను పావనుల గావించు మ శుభా శుభములకు వినమ్రురాలై తనగమ్య గమనమును మహావేగముతో ప్రణవోపాసనతో తలదాల్చుచున్నది. పంచభూతములు నీ విధముగానే ప్రణవమును యెలుగెత్తి చాటుచున్నవి. ఆకాశములో 'ఓం' మ్మను శబ్దమే వాయువువీచు సమయమున మనము వినునాదము. అగ్నిలో ప్రతి ధ్వనించెడి నాదము 'ఓం' కారమే! భూమిలో గలిగెడి నాదము 'ఓం' కారమే! ఈ ప్రణవమగు 'ఓం' కారమునే ప్రకృతి సదా గానమొన రించుచున్నది. నిత్యకృత్యములలో మానవుడు "అనేది వినేది కనేది" యా ఓంకారమునే. ఓ రామయ్యా! ఓ యేసయ్యా! ఓ ఆదమూ! యని పిలువ బడుటయు మీరు వినలేదా! పౌరుషములతో నుచ్ఛ రించు నీ–నా శబ్దములలో నీ ఓంకారమే యంతర్లీనమై యున్నది. మానవజాతి మనుగడకు ప్రధానమగు నక్షరాభ్యాస సమయమునందును నధ్యాపకులు విద్యార్థులకు ఓం న మః శి వా య యనెడి పంచాక్షరిలో గల ప్రథమాక్షర మీ 'ఓం' కారమే. ఇది యానాటి యాచారము. ఈనాటి విద్యార్థులకు తెలియదు. పూర్వాచార పరాయణు లక్క డక్కడ నొకరిద్ద రుండినను పదిమంది పాడినపాటలో వారిగానము విని పింపదు. ఆ గానమేనాటి విద్యాక్రమమునకు నాంది. "తల–వల–కల" యీ మాటలే నేటి విద్యారంభకులకు శ్రీకారము. అయ్యా! యీ

భావములు ప్రత్యక్షానుభవములే! సమసించుటయందును సమన్వయించు కొనుటయందును సంపత్తియుండును. ప్రతి మానవుడు, తన "తల"ను తప్పక సంసారణ్యమున దూర్చవలసినదే! దూర్చిన తదుపరి యా సంసారమే కోర్కెలకు బానిసలనుచేసి "వల"యై బంధించును. సంసారమను నుచ్చుల దగుల్కొని విముక్తికై యన్వేషించక స్వార్థ భోగాసక్తితో నశించును. చిట్టచివర కీదృశ్య ప్రపంచమంతయు "కల"గా మారును. ఈనాటి విద్యాక్రమము సహితము విజ్ఞులకు వైరాగ్యమునే బోధించుచున్నది.

భక్తులారా! ఈ స్థలము వీడిన మఱుక్షణమే సద్గురు బోధను మరచి, మీ మానవత్వమునకు మంగళహారతు లివ్వక సదా జాగరూకత గలిగి మానవజీవితాశయ కర్తవ్యమును దీక్షతో నిర్వహింపుడు. త్రిమతాచార్యులు దేశ కాల పాత్రములననుసరించి వేఱువేఱు మతములను స్థాపించి ప్రచారము చేసిన భావములలోని సత్యదృష్టి సమానత్వమునే సూచించుచున్నది.

మానవుడు మోక్షమును పొందవలయు ననెడి కోరిక యుండిన, సాధనచతుష్టయ మవసరమైయున్నది. సాధనచతుష్టయ సంపత్తి లేనిదే మోక్షమున కర్హుడుకాడు. సాధనచతుష్టయ వివరమిట్లున్నది.

**సాధనములు:** 1. నిత్యానిత్యవస్తువివేకము. 2. ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము. 3. శమాదిషట్కసంపత్తి. 4. ముముక్షుత్వము అని నాలుగువిధములుగ మహాత్ములచే జెప్పబడియున్నవి. ఆ యధికారి కివి యుండిననే బ్రహ్మనిష్ఠ సిద్ధించును.

**ఈ సాధనచతుష్టయమందు:** 1. బ్రహ్మమే సత్యము. జగత్తు మిథ్య-యను నిశ్చయమే నిత్యానిత్యవస్తువివేకము. 2. దేహాది బ్రహ్మపర్యంతముగనుండు ననిత్యభోగవస్తువుల యనిత్య దుఃఖదోషములను ప్రత్యక్షముగ జూచుటచేతను శాస్త్రముల వినుటచేతను వానియం దొకనికి

గల్గు వైరాగ్యమే ఇహా ముత్రార్థ ఫలభోగ విరాగ మనబడును.
3. (1) విషయదోషములను పలుమఱు దలచి చూచుటచే వానియందు విరక్తి చెంది మనస్సును తన లక్ష్యమందు నిలుపుట "శమము" (2) విషయముల ప్రచారముసేయు జ్ఞానకర్మేంద్రియముల వెనుకకు ద్రిప్పి వానిని తమ తమ స్థానములందు నిలువజేయుట "దమము". (3) మనస్సు పూర్వవాసనలచే బాహ్యవిషయముల దలచక తన లక్ష్యమందే స్థిరముగ నిలువజేసి ఇతర కర్మముల వదలి పెట్టుట "ఉపరతి". (4) ఎన్ని దుఃఖములు లేక కష్టములు కలిగినను వాని నడ్డగింపక యవి కలిగెనని చింతింపక ధైర్యముతో వానిని సహించుట "తితిక్ష". (5) వేదాంతశాస్త్రమును సద్గురు వాక్యమును సత్యమనుకొను నిశ్చయమే-బ్రహ్మసాక్షాత్కారమునకు హేతువైన "శ్రద్ధ". (6) సర్వప్రయత్నములు జేసి, చంచల స్వభావము గల చిత్తమును పరిశుద్ధ బ్రహ్మమునందే స్థిరముగ నుంచుట సమాధానము గాని లాలించుట గాదు. ఈ యాఱును గూడి "శమాదిషట్క సంపత్తి".
4. అనాది యజ్ఞానముచే గలిగిన యహంకారాది దేహాంతముగ గల బంధమును స్వాత్మజ్ఞానముచే బోగొట్టుకొన వలయునను నిచ్ఛయే ముముక్షుత్వమని తెలియదగును.

ఓ విజ్ఞానులారా! 'పనికిమాలిన బ్రహ్మజ్ఞానము పలికితె బ్రహ్మంబా నటరా!' పనిచేయుటకు చేతగాక నోటితో బ్రహ్మ జ్ఞానము బ్రహ్మజ్ఞాన మని ఎన్ని జన్మ లిట్లు సంభాషించినను ప్రయోజనము మాత్రము లేదు.

శ్లో. బ్రహ్మవిద్యా పరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరం భవేత్.

శాస్త్రరీత్యా సర్వులకు బ్రహ్మజ్ఞాన మవసరము. పృధివ్యాపస్తేజోవాయురాకాశాది పంచభూతములు బ్రహ్మజ్ఞానమునకు మూలవిరాట్టయిన 'ఓం' కారమునే బోధించుచున్నవి.

అంతర్ముఖ దృష్టి గలుగనివారికి ప్రణవోపాసన యుపయోగపడదు. అంతర్ముఖదృష్టి సిద్ధించుటకు వృత్తిరహితము గావలెను. వృత్తిరాహిత్యము గావలెనన్న మనోనైర్మల్యము ముఖ్యావసరము. కావున మాయను దాటుటకు మనోవృత్తుల బరిమార్చవలెను. సులభోపాయము మనస్సు చెప్పినట్లు నీవు చేయుకుండుటే. ఏ వేదములు బోధించినను, నే యుపనిషత్తులు చెప్పినను, నే శాస్త్రములు ఘోషించినను, మనస్సు నరికట్టుటే ! ధ్యాననిష్ఠకు మనస్సైకాగ్రత నొందుటే ముఖ్యము. ప్రణవమే జీవులకు ప్రాణము. ప్రణవమహిమను గూర్చి వర్ణించుట కడు కష్టము. ప్రణవములేని మంత్రము ప్రాణములేని శరీరమువంటిది.

"ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రక్షసాం
కురు ఘంటారవం తత్ర దేవతాహ్వాన లాంచనమ్॥

దేవతల నాహ్వానించుటకు రాక్షసులను వెడల గొట్టుటకును దేవతాహ్వాన పూర్వక లాంఛనమే యీ ఘంటప్రయోగించుట. ఇదే నాదబ్రహ్మము. అనగా 'ఓం' కారనాదము. ఉపనిషదాది సర్వ వేదాంతములలో నీ ప్రణవమహిమయే వర్ణితమైనది. అకార ఉకార మకారముల కలయిక వలన బ్రహ్మవిష్ణు మహేశ్వరులగు త్రిమూర్త్యాత్మక సంబంధమైనదే యీ 'ఓం' కారము.

ప్రణవశ్ఛంద సామ్యహం ... ... ... ... (గీత)
ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ ... ... ... ... (ధ్యానబిందూపనిషత్)
ప్రణవం హ్యేశ్వరం విద్యాత్సర్వస్యహృది సంస్థితః
(మాండూక్యోపనిషత్)

ఇత్యాది శ్రుతిప్రమాణముల మూలమున సర్వవేదములకు మూలాధారమైనది. 'ఓం' ఇది సమస్తమైన వారల హృదయములలో జీవాత్మ స్వరూపముగ వెలుగుచున్నది. 'ఓం' పరమాత్మని ఛందస్సుగా గలిగినది. 'ఓం' సమస్తప్రాణుల హృదయములనుండి సహస్రారమ్ము వరకు సోహంభావనతో వెలుగుచున్నది. 'ఓం' అట్టి ఓంకార

మును ధ్యానించువాడు, మనస్సును ఓంకారము నందు చేర్చవలెను. పరమాత్మ స్వరూపమైన 'ఓం' కారము నెల్లప్పుడు ధ్యానించువారికి నెచ్చోటను భయములేదు. భయము కలుగదు. భయపడ నవసరము లేదు. నిర్గుణోపాసకులు 'ఓం' కారధ్యానమును, సుగుణోపాసకులు 'ఓం' కారముతో కూడిన యిష్టదేవతోపాసన చేయుట ముఖ్యము. సుగుణోపాసనలేనిది నిర్గుణోపాసన దరిజేరదు. సుగుణోపాసన, ఇష్ట దేవతామూర్తిని ధ్యానించి కీర్తించి జపించుటే లక్షణము.

శ్లో॥ తిష్ఠతా గచ్ఛతా వాపి। స్వపతో జాగ్రతోపి వా
శయనో నోప విష్టేన। జప్యో నారాయణ స్సదా.

కూర్చున్నప్పుడును, వెళ్ళుచున్నప్పుడును, పరుండు నపుడును, జాగ్రదవస్థయందును, స్వప్నావస్థయందును, సుషుప్త్యావస్థయందును, నిద్దురనుండి లేచినప్పుడును, నింతేల సర్వకాల సర్వావస్థలయందును తైలధారవలె నారాయణ నామమును జపించుటే, తలంచుటే, విధిగా నాలోచించుటే సుగుణోపాసన. అట్టి సుగుణోపాసన చేయువారే నిజముగా ధన్యులని శ్రీ యోగానంద నరసింహస్వామివారు ప్రబోధము చేసిరి.

శ్రీసద్గురు ప్రబోధము నేకాగ్రచిత్తముతో వినిన ప్రియశిష్యుడైన నారాయణదాసు "ఓ సద్గురుప్రభూ! నాకొక సందేహము స్ఫురించినది. 'సంచితము – ప్రారబ్ధము – ఆగామి' యనెడి కర్మలే మనకు కారణమని తమ రప్పుడప్పుడు చెప్పెదరు. వాని పూర్ణస్వరూపము మాకు తెలియ చేయువలయు"నని వేడిరి. సద్గురుస్వామి! "నాయనా! నారాయణా! నీ వడిగినప్రశ్న సర్వులకు కాలసినదే! ప్రశాంతముగా విని, భక్తులకు ప్రబోధము చేసి వారి సంశయములను రూపుమాపి చిత్తశాంతిని ప్రసాదింపు" మని యీ విధముగా నుడివిరి.

"ఒక్కొక జన్మమునందు, చేయుచు వచ్చెడి, పుణ్య పాపము లన్నియు పర్వతమువలె పెరుగుచు వచ్చెడి కర్మములే 'సంచిత' మన బడును. ఈ సంచిత కర్మవలన, ప్రారబ్ధము వచ్చి దుఃఖ మనుభవించు

నపు డీశ్వరుని దూషించుచున్నారు. ఆ యా జీవులు చేయుచు వచ్చె కర్మఫలములకు దగినయట్లు దుఃఖ మనుభవించునపు డివి యన్నియు తన కర్మానుసారముగా వచ్చినవని యెఱుంగక 'బ్రహ్మదేవు డిట్లు చేయుచున్నా'డని తలచి వానిని దూషించు మూఢులు నరక ప్రాప్తులగుదురు.

**ప్రారబ్ధము** అనగా ముందు చెప్పిన సంచితమునందుండివారు వారు చేసిన కర్మానుసారముగా పుణ్యాపాపముల ననుభవించుటకుగాను తల్లి గర్భమున శిశువుగా నుండునపుడే, సృష్టికర్తవలన పంచిపెట్టి పంపబడిన పుణ్యాపాపములను మఱుజన్మమున ననుభవించుచు వచ్చునదే 'ప్రారబ్ధ' మని చెప్పబడుచున్నది.

**ఆగామి** అనగా స్త్రీ పురుషులు జన్మించినది మొదలు మరణించు నంతవరకును, ప్రతిదినము చేయుచుండెడి పుణ్య పాపకర్మములకు 'ఆగామి' కర్మమని యనెదరు. సంచిత ప్రారబ్ధాగామికర్మల పూర్ణ స్వరూప మిదియే యని స్వామివారు ప్రబోధము చేసిరి.

ప్రశాంతముగా సద్గురు బోధామృతమును తనివిదీర పానము చేసిన నారాయణుడు "ఓ యోగానంద సద్గురుదేవా! తమ దివ్య ప్రబోధము మా సంశయ పిశాచమును హిమాలయముల యవ్వలి గట్టునకు తరిమివేసినది.

"ఓ స్వామీ! మానవ దేహాలయముననే పరమాత్మ నివసించుచున్నాడని మహాత్ము లందరు నాదేశించిరి. తమ స్వానుభవములనే మాకు ప్రబోధము చేసి సంశయనివృత్తులను చేయుచున్నారు. మానవాలయమున పరమాత్మ నివసించెడి స్థానమును తెలియచేయుడు స్వామీ" యని వేడిరి. శ్రీ యోగానందమహర్షి, సూక్ష్మదృష్టితో గుర్తించెడి నారాయణునకు పరమాత్మ స్థానము నిటుల బోధించిరి.

"బ్రహ్మరంధ్రే భ్రువోర్మధ్యే హృదయే చిత్రగం హరిం,
గోపీ చందన మాలిఖ్య తత్రధియా త్వాప్నుయాత్ పరం."

[వాసుదేవోపనిషత్తు]

"మహర్షుల స్వానుభవమే వేదవేదాంగములలో నున్నది. పరమాత్మ యుండు మొదటి స్థానము హృదయకమలము. దీని ననుసరించి భ్రూమధ్యమందును బ్రహ్మకపాలమునందును నాత్మనివసించు చున్నది. బ్రహ్మకపాలము, భ్రూమధ్యము, హృదయకమల మీమూడు స్థలములయందును పరమాత్మ నివసించుటవలన నాయా తావులలో నాదర్శముగ గోపీచందనముగాని, లేక విభూతి శ్రీచూర్ణముగాని యుంచవలయు నని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. హృదయకమలము భ్రూమధ్యము బ్రహ్మకపాల మీ మూడు స్థలములయందును పరమాత్మ యుండుటవలన పూర్వాచారపరాయణు లీనాటికి నాలయముల కేగిన సమయములయందు, ప్రథమమున హృదయమునకు సరిగా నుంచి మ్రొక్కి యటుపిమ్మట నా జోడించిన చేతులను, భ్రూమధ్యముననుంచి మ్రొక్కి తదుపరి శిరస్సు మీదునం దుంచి మ్రొక్కి చూపించిరి. ఆ కారణమును గుర్తించకపోయినను, నీనాటికి నదొక పూర్వాచార మని మ్రొక్కుచున్నారు. ప్రతి స్వల్పవిషయమును భగవత్కృపను పొందిన సద్గురువు లెల్లరు చేసి చూపించిరి. పెద్దలు చేసిన సత్కర్మా నుష్ఠానము నీనాడాచారమని పేర్కొనుచున్నారు.

"ఆచార మనగా నంతరార్థమేమొ! ఆ పదములోనే యంతర్లీ నమైయున్నది. ఆత్మవిచారముతో నైహికవిచారములను రూపుమాపి, విచ్చలవిడిగా సంచారమొనర్చెడి మనస్సు నొకచోట యుంచుటయే యాచార మనబడును. ఈ యాచారము సిద్ధించుటకే బాహ్యాచారము లన్నిటిని సృష్టించుకొనిరి. ఏ సదాశయములతో కుల మతాచారము లన్నియు సృష్టించుకొనినారో యా సత్యాశయదీక్షను మరచిపోయి మందమతులై యాశయశూన్యులై కర్మనుమాత్రమే గట్టిగా నమ్ముకొని నానాటికి సమత్వమును పోనాడి మమత్వముతో కాలగర్భములో కలసిపోవుచుంటిమి. ఆహా! ఎంత చదివినను చదువులన్నిటిలో గల పరమసత్యమును గుర్తించుటకు ప్రయత్నించక శతగ్రంథకర్త నుద్దండ

పండితుడ నను నహంకారముతో నిజాకారమును గుర్తించుట లేదు. ఇదియే ప్రకృతి పురుషుని లక్షణము."



శ్రీ నారాయణస్వామివారు

శ్రీ యోగానందమహర్షి ప్రబోధము చేసిన సర్వవేదాంతసార మును సూక్ష్మబుద్ధితో గ్రహించిన శ్రీ నారాయణదాసు "ఆహా!

నా సద్గురు దేవుని యాచరణ వేదాంతసారము నంతయు నా చరణాలో నుంచి యాత్మానందమును పొంది శ్రీ సద్గురు సత్యస్వరూపదర్శనము పొందవలెనను కాంక్షతో తీవ్రముముక్షుత్వమును పొంది 'అమరావతి'కి సమీపమున వెలుగొందెడి శ్రీవైకుంఠపుర క్షేత్రపర్వతమునందు దీక్షతో కొంత కాలము తపమొనరించి సద్గురు సత్యస్వరూపమును దర్శించిరి.

అబ్బూరు గ్రామమున శ్రీ లక్ష్మీనారాయణ మందిరమును కట్టించి నిత్య నైవేద్య దీపారాధనాది కార్యక్రమములను స్వయముగా నిర్వహించుచు బ్రహ్మచర్యముతో నృసింహు నారాధించుచు సద్గురు స్వామివలె త్యాగయోగము లొనర్చుచు సర్వస్థలములయందును సద్గురు స్వస్వరూపమును దర్శించుచు సద్గురుశక్తియే జీవితరక్షయని మదినెంచి సర్వకార్యధురంధరులై పురజనులందరకు నభిమానపాత్రుడై యాదర్శ మార్గదర్శకుడై దైవప్రబోధము లొనర్చుచు నజ్ఞానులను సుజ్ఞానులుగా మార్చి ధర్మపథగాముల చేసిరి.

శ్రీసద్గురు దేవులను సాక్షాన్నృసింహస్వామి యని పూజించుచు సకలోపచారము లొనర్చి యోగరహస్యములను తెలిసికొని యోగిగా మారిరి. శ్రీయోగానందమహర్షి తనతత్త్వజ్ఞానము నంతయు ప్రియ శిష్యుడగు నారాయణస్వామి కవగత మొనర్చిరి. ప్రియ శిష్యుని త్యాగ యోగ దీక్షానిరతి వీక్షించి "నాయనా! నాయంత వాడవైతివి. పరతత్త్వవిషయము లన్నియు నీకు కరతలామలకములైనవి. నా యనంతరము బ్రహ్మవిద్యాధ్యయనము నీ వొనర్చి సద్గురు సన్యాశిస్సును వాడ వాడ చాటెదవు. నా జీవసమాధి నిష్ఠను నీవు కన్నులపండువుగా దర్శించెదవు. నా జీవసమాధి నిర్మాణాది మహాకార్యము లన్నియు నా దివ్యశక్తి ప్రసారముతో నీ త్యాగదీక్షానిరతితో నవలీలగా సంపూర్తిగావించెదవు నా స్థానము ముందుముందు దివ్యతిరుపతియై వెలుగొందును. నా సన్నిధిచేరి నన్నే కొలిచెదవు

నా జీవితచరిత్రను నా సమాధి నిష్ఠానంతరము నా శిష్యులలోనే నా నామమునకు చెందినవ్యక్తి ప్రజ్ఞావంతుడగు నా బిడ్డడు వ్యయ ప్రయాసలకోర్చి ప్రకృతి విపత్కర పరిస్థితుల నెదుర్కొని సర్వవిషయ ముల నా మూలాగ్రముగ రచించి మీ వీనులకు వినిపించి మీ హృదయముల కమితానందమును చేకూర్చును. నీకు భావికాలమున జరుగనున్న వానిని వెల్లడించుచు నే బల్కిన వాక్యము లన్నియును కార్యరూపమున సత్యములై కన్పట్టును గాన నీవు కాలక్రమమున వానినెల్ల దర్శించెదవని నుడివిరి.

# తృతీయ ఖండము

## శ్రీ చేవూరి మహాలక్ష్మిదేవి జీవిత చరిత్ర

శ్రీ లక్ష్మీనృసింహస్వామి కళావతారమూర్తియగు సద్గురు శ్రీ యోగానందమూర్తి నాత్మసాక్షాత్కార మొనర్చుకొని యైహిక వాంఛల విడనాడి సర్వసంగ పరిత్యాగినియై సద్గురు కరుణకు పాత్రురాలై కన్నకొమరుని సర్వార్పణ దృష్టితో సద్గురువుల కొసంగి బ్రహ్మోపదేశ మును బొందింది సద్గురుపదేశముల సారము గ్రహించి ప్రియపుత్రుని మహా యోగి కావలెనని దీవించి తపమునకై స్వయముగా పుత్రుని శ్రీయల్ల మందల కోటేశ్వరుని కొండకు తీసికొనిపోయి శివదర్శనమును చేయించి "నాయనా వెంకటేశ్వరా! పిపీలికాది బ్రహ్మపర్యంతము వ్యాపించిన యీ కోటేశ్వరస్వామియే నీకుశరణ్యము. సర్వస్వమూ ఈశ్వరుడేనని నమ్మి భజించి తరింపుము నా తండ్రీ!"యని ప్రబోధముచేసి ఈశ్వరున, కర్పించి తిరిగి స్వగృహము చేరిన మహాయోగిని జీవితచరిత్ర నిచ్చట చేర్చుడమైనది. ఆ మహాలక్ష్మిదేవి వంశచరిత్ర యిట్టిది.

గుంటూరు జిల్లాలో వినుకొండకు సమీపమున నుత్తుంగ తరంగ హస్తములతో పొంగులువారుచు గుండికానది ప్రవహించుచుండును. ఆ నది యొడ్డున పెరుమాళ్ళపల్లె యను గ్రామము కలదు. ఆ గ్రామమున వైశ్యకులమందు జన్మించిన కోటరత్నమను పేరుగల నొక సద్భక్తుడు గలడు. ఇతడు సదాచార సంపన్నుడు. దైవమునందు, నాచార్యులందు, పెద్దలయెడ నపారమైన భక్తిగలిగి వర్తించు చుండెడివాడు.

యుక్తవయస్సు వచ్చినవెంటనే మాతాపితలు రత్నమువలె ప్రకాశించెడి పుత్రరత్నమునకు నరసమ్మయను కన్యకామణిని పాణి గ్రహణము చేయించిరి. తల్లిదండ్రులు నరసమ్మయను బాలికామణి నత్తవారింటికి బంపించిరి. ఆమె పతిని దైవముగా భావించి భక్తితో

పూజించుచు పతియాజ్ఞలను శిరసావహించుచు పతిచేసెడి గురుదేవ పూజలలో పాల్గొనుచు కాలము గడుపుచుండెను.



చేవూరి మహాలక్ష్మీదేవి

రత్నమను సజ్జనమూర్తి కులవృత్తిని చేయుచు సత్యము న్యాయము దప్పక నడచుచు హెచ్చుతగ్గులు చూడక పురజనులంద

రితో సోదరభావమున మెలంగుచు సత్కీర్తిని గాంచెను. హరినామ గానము చేయుచు సద్గురువుల దయకు పాత్రుడ కావలెనను సద్వాంఛతో సమయమున కెదురుచూచుచుండెను. శ్రీహరి కరుణచే గోనెపూడి రామయోగీంద్రులవలన నాయన జ్ఞానోపదేశ మొందిరి.

ఆ దంపతు లాదర్శ గృహస్థులుగా పరిగణింపబడిరి. కొంతకాలమునకు నరసమాంబ గర్భవతియై పతిచెప్పెడి సదుపదేశములను, మహనీయుల జీవితపరిణామ విషయములను, పరమపతివ్రతల చరిత్రలను తనివిదీర నాకర్ణించుచు నానందించుచుండెను. అంతతో నవమాసములు నిండినవి. ఒక శుభదివసమున ననగా నందన నామసంవత్సర శ్రావణ మాసమున శుక్లపక్షమున ప్రథమశుక్రవారమున శ్రీ మహాలక్ష్మ్యంశతో నా పుణ్యదంపతులకొక పుత్రికారత్నము జన్మించెను. ఇరుగుపొరుగు ముత్తైదువులందరు ముక్కుపై వ్రేళ్ళిడుకొని "ఆహా! నరసమాంబ భాగ్యమే భాగ్యము. శ్రావణ శుక్రవారమున బాలికామణిని గాంచినది. సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మియేగాని వేరుకా"దని ముత్తైదువులందరు వేనోళ్ళ పొగడసాగిరి. ముత్తైదువులు పేర్కొనిన యా పవిత్రనామమునే మాతా పితలా బాలికామణికి జాతకర్మాదివిధుల నిర్వర్తించి పదునొకొండవనాడు భూసురోత్తములకు దానము లొసంగి బంధుమిత్రులను గౌరవించి 'శ్రీ మహాలక్ష్మి' యని నామకరణము చేయించిరి. ఆ బాలిక దినదినప్రవర్థమానయై ముద్దులొలుకుచు తల్లిదండ్రులకు పరమానందము చేకూర్చుచుండెను.

తదుపరి కొంతకాలమునకు శ్రీహరి కరుణచే నరసమాంబ గర్భవతియై నవమాసములు నిండిన యొక శుభలగ్నమున మన్మథ సంవత్సరమున నొకబాలుని గాంచెను. ఆ బాలునకు జాతకర్మాదివిధుల నిర్వర్తించి పదునొకొండవనాడు నామకరణ మహోత్సవము గావించి 'కోటయ్య' యను పేరు పెట్టిరి. కోటయ్య యను బాలుడు పెరిగి పెద్ద యగుచుండెను. హరి కృపచే నా పుణ్యదంపతులు వరుసగా ముగ్గురు కుమార్తెలను గాంచిరి.

కోటయ్య మౌనభావముతో తల్లిదండ్రులయందు, నక్కగారియెడ నమితభక్తిగలిగి వర్తించెడివాడు. శ్రీ మహాలక్ష్మిదేవి సోదరుడగు కోటయ్యను లాలించి పాలించుచు ముద్దులాడుచుండెడిది. మాతాపిత లొనర్చు భగవదారాధన సమయములయందు తమ్ముని దగ్గరకు చేర్చుకొని శ్రీ మహాలక్ష్మి యను బాలికామణి తదేకదృష్టితో భగవదారాధనయందే మనస్సు లగ్నముచేసి భజనచేయుచుండును. మాతాపితలు పూజచేయు సమయములందు సోదరీసోదరు లిర్వురు రెప్పలార్పక చూచుచు నానందమును పొందుచుండెడివారు. అతిబాల్యముననే యిట్టి భక్తి భావములు సంప్రాప్తమగుట వారి గత జన్మల సుకృత ఫల విశేషము కాబోలు. రత్నముగారు పుత్రీపుత్రుల భక్తిభావములను జూచి తనలో తాను సంతోషించుచుండెడివారు.

ముప్వురు బాలికలు తల్లిదండ్రులయందును నక్కయ్యయెడ నన్నయెడ నమితభక్తిగలిగి యత్యాదరమున మెలగుచుండిరి. పెద్దవారి యాజ్ఞల ననుసరించి యా ముప్వురు బాలికలు విసుగువిరామము లేక యింటిపను లన్నియు చక్కగా నిర్వహించెడివారు.

కొంతకాలము గడిచిపోయినది. నరసమాంబ గర్భవతియై నవ మాసములు నిండిన వెనుక నొక శుభముహూర్తమున కీలకనామ సంవత్సర మార్గశిర శుద్ధైకాదశినాడు ద్వైపీముహూర్తమున నొకపురుష శిశువు జన్మించెను. ఆ బాలునకు జాతకర్మాదివిధుల నిర్వర్తించి పదునొకొండవ దినమున భూసురులకు వస్త్రదానము లొసగి బంధువర్గములను గౌరవించి పవిత్రమగు శ్రీ లక్ష్మీనారాయణ యని నామకరణము చేయించిరి. ప్రథమమున శ్రీ లక్ష్మీనామమును, పిమ్మట నారాయణ నామము సార్థకము చేసిరి.

భగవద్భక్తితో మెలగెడి యా పవిత్ర పుణ్యదంపతు లిరువురు నలువుర కుమార్తెలను, నిరువురు కుమారులనుగాంచి పరమానందము నొందుచుండిరి. "అంతయు శ్రీహరి లీలావిలాసము. ఆ తండ్రి దయ

వలన మన కే కొదువయు లేదు. శ్రీమన్నారాయణమూర్తియే సర్వ కార్యములను నిర్వహింపగలడు. మనము మాత్రము శ్రీహరిని సదా ధ్యానించుచు ధర్మజీవనము చేయుచు ధర్మమార్గమున మెలగవలయు" నని భర్త ధర్మపత్నితో నెల్లవేళల చెప్పెడివారు.

శ్రీ మహాలక్ష్మికి పదేండ్లప్రాయము నిండెను. ఆ లేబ్రాయము ననే యామె దైవభక్తిగలిగి శ్రీతులసిని పెంచుచు ప్రతి దినమును తులసికోటకు భక్తితో పూజలొనర్చుచు దీపారాధనలు గావించుచు భజనచేయు చుండెడిది. ఆ గ్రామమధ్యమున ప్రకాశించెడి రామమంది రమున కేగి రామభజనలు చేయుచు నమితాసక్తితో పూజలుగావించు చుండెడిది.

శ్రీమహాలక్ష్మి భక్తిభజనలు గాంచిన జననీజనకులు లోలోన నానందమొందుచు "ఈ తల్లి సక్కుబాయివలె నగునేమో లేకున్న యీ వయస్సున నింతదీక్షతో భక్తితో భగవంతు నర్చనగావించుట సామాన్యమైన పనియా!" యని మనస్సున దలచుచుండెడివారు.

సాధుసజ్జనమూర్తియగు పతితో ధర్మపత్నియగు నరసమాంబ "చూచితిరా మన బాలికలు ముప్వుర ప్రవర్తన మఱియొక విధము. ముప్వురు బాలిక లింటిపనులన్నియు చక్కగా నిర్వహించి మనకు శ్రమలేకుండ చేయుచున్నారు. బాలురు ఇర్వురు మనమహాలక్ష్మిదేవియు సదా భక్తిభావముతో భజనలొనర్చుచు మన యాత్మకు శాంతిని చేకూర్చుచున్నారు. ఆ హరికరుణచే నైహికచింత యాముష్మికచింత సరిసమానముగా నున్న"వని యనినది. రత్నముగారు "ఓ వెఱ్ఱిదానా! మన కోరికల ననుసరించి భవితవ్యము జరుగునని దలంపకుము. ఎవరెవరి జన్మాంతర సంస్కారము వారిది. వారివారి ఫలముల ననుసరించియే వారలు మెలగుచుందు"రని చెప్పిరి.

పతివాక్యములు వినిన సతి "స్వామి! మీరు వచించిన వాక్య ములు యదార్థమే! మన వంశమునకు సత్కీర్తిగణించి యామె జీవి

తమును సార్థకకత చెందించుకొని పవిత్రజీవితము గడపెడి సాధుభావములు మన శ్రీ మహాలక్ష్మియందు ప్రకాశించుచున్నవి. ఆమె భావి జీవితమెటుల పరిణమించునో యా శ్రీహరికే యెరుక" ని చెప్పినది.

## శ్రీ మహాలక్ష్మిదేవి వివాహమహోత్సవము

త్రిపురాపురమున నివసించెడి చెల్లెలి కుమారులలో పెద్దవాడగు హనుమయ్యకు రత్నముగారు సుగుణముల రాశియగు తన కుమార్తెను శ్రీమహాలక్ష్మిదేవినిచ్చి వివాహమహోత్సవము గావించిరి. పెద్దకుమార్తెకు మాతృదేవియగు నరసమాంబ యుత్తమ పతివ్రతామణుల చరిత్రలను వీనులవిందుగా వినిపింపచేసినది. సతికి పతియే ప్రత్యక్షదైవము. అత్తమామల యాజ్ఞల శిరసావహించి యున్నదానితో తృప్తిపడి పుట్టినింటి కత్తవారింటికి సత్కీర్తి గణించి దైవభక్తితో నీ జీవితమును ధన్యమొనరింపుమని తల్లిదండ్రులు ప్రేమతో బోధించి యామె నత్తవారింటికి బంపించిరి.

శ్రీమహాలక్ష్మిదేవి యత్తవారిల్లు చేరినది మొదలు జననీజనకుల ప్రబోధవాక్యములనే మననము చేయుచు నత్తమామలకు సేవలొనర్చుచు పతిని దైవముగా పూజించుచు వారి యాజ్ఞానువర్తినియై ప్రతిదినము కృష్ణవిగ్రహమును పూజించుచు సద్గ్రంథపఠన మొనర్చుచు హరినామమును మరువక జపించుచు సంసారయాత్ర సాగించుచుండెను.

రత్నముగారు పెద్దకుమారుడగు కోటయ్యకు వివాహమహోత్సవము గావించిరి. వరుసగా ముగ్గురు కుమార్తెలను గౌరవనీయులకిచ్చి వివాహములు గావించి కన్యాదాన మహాఫలము నొందిరి. కొంత కాలము గడచినది. రత్నముగారు మోక్షసామ్రాజ్య మలంకరించిరి. అందరికంటె చిన్నవాడగు లక్ష్మినారాయణునకు పెండ్లివయస్సు వచ్చినది. తండ్రిలేని కొరతంతయు చేకూరినది. ఈ కడపటి బాలుని రక్షణ భారము శ్రీమన్నారాయణునిపై బడినది. ఏప్రాణినెట్లు మార్చవలయునో

యా శ్రీహరికే యెరుక. ఎవరెవరి కర్మానుగుణ్యముగా వారల స్థితి గతులు మారుచుండును.

ఇంతలో నొక సంఘటన తటస్థించినది. రత్నముగారి పినతండ్రి కుమారుడు రామయ్యను మేధావి కొండాయపాలెము గ్రామములో నివాసము చేయుచుండెడివాడు. ఆ రామయ్యశ్రేష్టికి ఒకడే సుపుత్రుడు. ఆ బాలుడు హనుమయ్యను పేరుతో విరాజిల్లుచు తల్లిదండ్రులయందు భక్తిగలిగి గ్రామవాసులకు తలలోనాల్కవలె మెలంగుచు భాగవతాది గ్రంథములు పెద్దలకు చదివి చెప్పెడివాడు. పరిణయమైన కొన్ని సంవత్సములకే హనుమయ్య భార్య మరణించెను. తండ్రియగు రామయ్య తనయునకు ద్వితీయ వివాహము గావించెను. అది జరిగిన కొన్ని మాసములకే హనుమయ్య పరలోకమందెను.

సుపుత్రుని కోల్పోయిన రామయ్యశ్రేష్టి వంశము నిల్పుకొనుటకై యన్నకుమారుని దత్తత దెచ్చుకొనవలయునని సంకల్పించుకొని వెంటనే పెరుమాళ్ళపల్లెకు వచ్చి వదినగారగు నరసమాంబకడ పుత్రవియోగ దుఃఖము నెల్ల క్రుమ్మరించెను. ఉత్తమురాలగు నరసమాంబ "నాయనా! రామయ్యశ్రేష్టి! ఏల యిట్లు దుఃఖించెదవు. కష్టములను లెక్కింపక నిలువద్రొక్కుకొని జీవించుటయే యుత్తమ మానవలక్షణము. విధిని దాటవశమా! నీ కోరికేదో తెలుపుము నెరవేర్చెద" నని యోదార్చినది. రామయ్యశ్రేష్టి దుఃఖమును మ్రింగుకొని "అమ్మా! నీ చిన్న కుమారుడు లక్ష్మినారాయణుని నా కిమ్ము. కన్నకుమారునికన్న వేయిరెట్లు శ్రద్ధతో చూచుకొనెద" నని విన్నవించినాడు. నరసమాంబ ప్రేమతోను యాతని యిష్టమును దీర్చుట కియ్యకొనినది. శుభ లగ్నమున భూసురులెల్ల మంత్రములు చదువుచుండ మంగళధ్వనులు మిన్నుముట్టగా, రామయ్యశ్రేష్టి లక్ష్మినారాయణుని దత్తత చేసికొని పరమానందము నొందెను.

లక్ష్మీనారాయణ, పాలకపితయైన రామయ్య శ్రేష్టిని ప్రియముతో 'నాయనా! నాయనా!' యని పిలుచుచు వణకువతో మెలంగుచు పితృవాక్యపరిపాలనమే జీవితమునకు వెలుగుబాట యని మదినమ్మి సేవించుచుండెను.

రామయ్య శ్రేష్టి "ఆహా! నేను పూర్వజన్మమున నెట్టి తప మొనరించితినో నా మనస్సునకు నచ్చిన బాలుడు లభించినాడు నా కదే పదివే" లనుచు లోలోన మురిసిపోవుచు కుమారుని శ్రద్ధాప్రేమలతో చూచుకొనుచుండెను.

## మహాలక్ష్మీదేవి సంసారమున సాధుమార్గమున మెలంగుట

లక్ష్మీనారాయణుని పెదక్కగా రయిన శ్రీ మహాలక్ష్మీదేవి తామరాకుపై నీటిబిందువువలె సంసారమున దైవభావముతో మెలం గుచు పతిసేవాపరాయణయై యొకచేతిని భగవంతుని పాదారవింద ములపై, రెండవచేతిని సంసారకృత్యములపై నిడి సర్వార్పణబుద్ధితో త్యాగశీలములతో భగవన్నామమును స్మరించుచు శ్రీకృష్ణవిగ్రహమును పూజించుచు భక్తిప్రపత్తులతో మెలగుచుండెను.

శ్రీ మహాలక్ష్మి శ్రీహరి యపారకృపచే నిర్వురు పుత్రులను, యిరువురు పుత్రికలను గాంచెను. పెద్దకుమారునకు కోటయ్య, ద్వితీయ పుత్రునకు వెంకటేశ్వర్లు, పెద్దకుమార్తెకు బాలమ్మ, చిన్నకుమార్తెకు రామాంజమ్మ యని నామకరణమొనర్చిరి. ఈ విధముగా వారికి కుటుంబభారము భారమైనది. హనుమయ్య యను నావైశ్యపుంగవుడు వ్యాపారములలో నపజయమును బొందెను. "ఆహా! దైవమా! త్రిపురాపురమున నివసించుట యెట్లు? నా కుటుంబపోషణను నిర్వహిం చుట యె"ట్లని యోచించి చేయునది లేక సంసారముతో, సమీపమం దున్న వినుకొండ చేరి యేదో దైవము లభింపచేసిన వృత్తి నవలంబించి యాయన సంసారయాత్రను సాగింపదొడగెను.

సాధ్వీలలామ శ్రీ మహాలక్ష్మీదేవి వినుకొండ చేరుసరికి పెద్ద కుమారుడైన కోటయ్యకెనిమిదివత్సరముల వయస్సు; పెద్ద కుమార్తె బాలమ్మకైదువత్సరముల వయస్సు. భావికాల బ్రహ్మచర్య మహోదయమూర్తియు ద్వితీయపుత్రుడునగు వెంకటేశ్వర్లను బాలభానునకు మూడుసంవత్సముల ప్రాయము. చిన్నకుమార్తెయగు రామాంజమ్మ కారుమాసము లైనను పూర్తికాలేదు. వినుకొండ చేరినపిమ్మట కొంత కాలము గడచినది. శ్రీ మహాలక్ష్మీదేవి గర్భవతియై నవమాసములు నిండినవెనుక నొక శుభముహూర్తమున మొగబిడ్డ నొకనిని గనినది. ముద్దులొలుకు నవమోహనమూర్తియగు నా బాలునకు జాతకర్మాది విధులు నిర్వర్తించి పదునొకండవనాడు నామకరణ మహోత్సవము గావించి సత్యనారాయణ యని పేరుపెట్టిరి.

కుటుంబభారము పెరిగినది. బిడ్డలనెట్లు కాపాడవలయునని నెడి సంతాపముతో హనుమయ్యశ్రేష్ఠి మౌనభావముతో నాలోచనలు చేయుచున్నతఱి ధర్మపత్నియగు శ్రీ మహాలక్ష్మీదేవి "స్వామీ! ఎందులకు చింతించెదరు? పూర్వజన్మమున నేమిఫల మొనరించితిమో! ఈ జన్మమున నా ఫలము ననుభవించిక తప్పునా? పూర్వకాలమున భక్త కుచేలుడను సద్బ్రాహ్మణోత్తముడు గలడు. ఆ పరమభక్తశిఖామణి వామాక్షి యను భార్యతో సంసారము చేయుచు నిరువదేడ్గురు పిల్లలను గాంచిరి. కటికిపేదరికము వారిని ప్రేమతో వరించినది. ఆ దారిద్ర్య బాధకు గురియైన సంతానము 'ఆకలి! ఆకలి! అమ్మా ఆకలి!' యని పలవరించుచు కలవరించుచు 'నీ ఢాక కాగలేము బాబూ' యని విలపించుచు దుఃఖాశ్రువులు రాల్చెడు పుత్రపుత్రికా సంతానముల వీక్షించి పరమ పవిత్రమూర్తి యగు భక్త కుచేలుడు సాధు భావముతో వామాక్షిని జూచి 'ఓహో! ఎంత వెఱ్ఱిదానవు! నీవు కన్నీరు గార్చుచుంటివా? ప్రేయసీ! దుఃఖాబ్ధి దాటుటకు శ్రీహరినామస్మరణ యను నావదప్ప వేరొకటి గలదా? సర్వాంతర్యామి సాధుజనరక్షకుడు

ద్వారకానివాసి శ్రీకృష్ణపరమాత్మగలడు. సర్వమాతడే నిర్వహించును సందేహము వలదు. మనము నిష్కామకర్మ చేయుచు హరిభజనతో కాలమును సద్వినియోగము చేయుద' మని ప్రబోధము చేసెను.

"వామాక్షి దుఃఖము నుపశమింపచేసుకొని పతియాజ్ఞయే సతి కిహపరసాధన మని నమ్మి భర్త ననుసరించె" నని చెప్పెను. హను మయ్యశ్రేష్ఠి "ఔను! నీవు వచించినది యదార్థమే. యేది యెట్లు జరుగవలయునో అట్లే జరుగు"నని నిశ్చయించుకొనెను.

శ్రీ మహాలక్ష్మిదేవి ప్రతి శనివారము నొక్కప్రొద్దులు చెల్లించుచు నిర్మలభక్తితో జాగరణలు సలుపుచు హరినామమునే స్మరించుచుండెను.

ఆమె యాదర్శజీవితమును చూచినవారెల్లరు విస్మయము చెందుచుండెడివారు. ఇరుగు పొరుగు ముత్తైదువులందరు నొకదివసమున వీరి గృహమున కరుదెంచిరి. ఆ రోజు శనివారము. శ్రీమహాలక్ష్మిదేవి వెంకటేశ్వరస్వామికి పూజగావించి నైవేద్యము స్వామివారి కర్పణముచేసి భక్తితో భజన చేయదొడగెను. ముత్తైదువులు వేచి కాచికొని భజన పూర్తియగువరకు నోపికతోనుండిరి. ఆ యుత్తమసాధ్వి భజన పూర్తి గావించి స్వామిప్రసాదము నింటికరుదెంచిన భక్తులకు భక్తురాండ్రకు సమముగా పంచియిచ్చెను. ఆ స్వామిప్రసాదమును స్వీకరించి యామె నిర్మలభక్తిభావముల కచ్చెరువొంది "తల్లీ! ఎంతకాలమునుండి వెంకటేశ్వరుని భజనలు చేయుచుంటి"వనిరి. "తల్లులారా! నాద్వితీయ పుత్రుని గాంచుటకు గర్భవతిగా నున్నప్పుడు నా మనస్సు విరక్తిచెంది యోగినిగా జీవింపవలయునను సత్సంకల్పము గలిగినది. ఐదవమాసము గర్భవతిగానున్న సమయమున కుటుంబసహితముగా శ్రీ తిరుపతియాత్రకు వెళ్ళి వేంకటేశ్వరుని దర్శించినమరుక్షణమే, యా సర్వాంతర్యామి సాధుజనపోషకుడు నా కావేశమయ్యెను. ఆనాటినుండి యీనాటివరకు శ్రీ స్వామివారు నాలో ప్రవేశించి నన్ను కాపాడసాగిరి.

"ఆ స్వామి దయాప్రసారముచే నుద్భవమైన బిడ్డడని నా ద్వితీయ పుత్రునకు వెంకటేశ్వర్లను నామకరణము గావించితి" నని చెప్పెను. వినుచున్న భక్తులందరు సంభ్రమాశ్చర్యములను పొందిరి.

ఈ మహాసాధ్వి గుణములు వర్ణనీయములైనవి. ప్రతి శుక్రవారము పాండురంగని భజనలు గావింపుచు శ్రీ కృష్ణ విగ్రహమును పూజామందిరమున నెలకొల్పి రాత్రింబవళ్ళు భగవత్పూజలు చేయుచు తులసికోట కత్యంతభక్తితో ప్రతినిత్యము పూజలుగావింపుచు నిత్య దీపారాధన నైవేద్యములతో నర్చించుచుండెను. ఈమె పూజా మందిరమున మధురభక్తితో నేకాంతముగా తంబుర మీటుచు చిఱుకలు వేయుచు కాళ్ళకు గజ్జలుధరించి శరీరమును మరచి కృష్ణ నామముతో నృత్య మొనరించుచుండెను.

ఈ దృశ్యమును వీక్షించువారు "ఆహా! ఏమి యీ వినిర్మల భక్తిభావములు; పండరి భక్తురాండ్రలో మిన్నయై సంసారబంధముల వీడి భగవత్పాదారవిందములను హృదయపీఠిపై స్థాపించి సగుణారాధన గావించి తరించిన మహాభక్తురాలు సక్కుబాయి జ్ఞప్తికి వచ్చుచున్నది. ఈ మహాతల్లి భవిష్యమెట్లున్నదో యా పరమేశ్వరునకే యెరుక యనుకొన దొడంగిరి.

ఈ మహాసాధ్వి యొక పవిత్రదివసమున బావినీరు తోడుకొని దెచ్చి తొట్టిలో బోయగా నామెకు తెలియకనే తాబేలువచ్చి ప్రత్యక్షమైనది. తొట్టిలో తిరిగెడి తాబేటిని తీసికొనిపోయి మహాలక్ష్మీదేవియే స్వయముగా బావిలో జారవిడిచినది. రెండవసారియు నట్లే మరల తాబేలు తెలియకనే తొట్టి లోపల ప్రవేశించినది. మరల తీసికొని పోయి బావిలో జారవిడచినది. మూడవసారి మరలవచ్చినది. ఈమె పూజలోనున్న సమయమున నారాధ్యదైవమగు శ్రీరామచంద్ర మూర్తి యామె కావేశమై తాబేటిరూపముతో మీ గృహమున కరుదెంచితిని. మీ గృహము పావనమైనది; నీ పూజఫలించినది. నీ

జన్మ చరితార్థమైన"దను దైవవాణి యామెనోటినుండియే వెలువడినది. ఆ వాక్యములు వినినవారందరు శ్రీ మహాలక్ష్మీదేవి బాహ్యప్రకృతి చెందగనే విన్నవించిరి. ఆమె విని ఇదంతయు భగవన్మాయ యని యానందము చెంది, యా కూర్మావతారమును చాలకాల మా తొట్టి యందే నివసింపజేసి తగిన యాహారమును సమకూర్చుచు సంతోష ముతో కాలమును గడపిరి.

## బాల భక్తమణి వెంకటేశ్వరుని బాల్యజీవితము

శ్రీ మహాలక్ష్మీదేవి ద్వితీయపుత్రుడు వెంకటేశ్వర్లను బాల భానుడు సామాన్యుడు కాదు. జన్మాంతర మహాపుణ్యముతో నవత రించిన లోకోత్తర పుణ్యమూర్తి. ధ్రువునిరీతి నతిబాల్యముననే భగవన్నామమును స్మరించుచు నెక్కువకాలము కన్నులు మూసికొని మౌనభావముతో యోగివలె కాలమును గడుపుచుండెరి. భక్తితో కాలమును సద్వినియోగము చేయుచున్నతఱి, మాతృదేవి ప్రియ పుత్రుని మనోభావమును గ్రహించి భావికాలమున నా పుత్రుని మన స్సెటుల పరిణమించునో యను నావేదనతో తాని ట్లూహించెను.

"ఈ ప్రపంచమున నెంతకాలము జీవించిన, నొకనాడు సర్వమును త్యజించవలసినదే. జీవితమంతయు భుక్తికై వినియోగించి భక్తిని విడనాడి ముక్తిని కాంక్షింపక సంసార వ్యామోహములో చిక్కువడి విడివడు జ్ఞానములేక యజ్ఞానాంబుధిలో మునుగుచు దిక్కుదోచక తపించెడివారే! ఈ బాలుని ప్రవర్తన భావికాల మహోదయమునకు నాంది కాబోలు" నని మాతృదేవి లోలోన యానందము చెందు చుండెను.

మాతాపితరులను వెంకటేశ్వరమూర్తి దైవసములని భావించి తోడిబాలురతో నాటపాటలు మాని హరినామమునే గానము చేయుచు మాతృదేవి పూజాసమయమున పద్మాసనాసీనులై మనస్సంతయు పూజయందే నిల్పి హరిభజన చేయుచుండును,

అతిబాల్యముననే వీనిసౌమ్యము ప్రశంశనీయమైనది. శ్రీ మహాలక్ష్మీదేవి కుమారులు ముప్వురు త్రిమూర్తులవలె నొప్పుచు నైక్యభావముతో గలసిమెలసి సంచరించుచుండురు. బాలురను పాఠశాలయందు చేర్చిరి. గురువులయందు శ్రద్ధాభక్తులుగలిగి విద్యనభ్యసించుచుండిరి. ద్వితీయపుత్రుడగు వెంకటేశ్వరుని గుణగణముల కుపాధ్యాయులే యచ్చెరువొందుచు "ఆహా! ఏమి వీని వినయసంపద, గురుభక్తి. వీని లగ్నఫలిత మెట్టిదో తెలుసుకొనవలయు"నని వాని మాతాపితరుల నడుగగా వా రీవిధముగా చెప్పిరి.

"స్వామీ మా ద్వితీయకుమారుడు జన్మించినది. ది 19-11-1916 న ఉపాధ్యాయు లా తేదీ ననుసరించి లగ్నమును నిర్ణయించి శ్రీమహాలక్ష్మీదేవితో "అమ్మా! నీవెంతో పుణ్యాత్మురాలవు. ఈ వెంకటేశ్వరుని భావిజీవితము స్వచ్ఛందమై వినిర్మల బ్రహ్మజ్ఞానముతో ప్రకాశించును. సంసారసముద్రమునబడి దరిగానక దుఃఖించెడి దీనజనుల నెందరినో యుద్ధరింపగలడు. సర్వవేదాంత రహస్యములను బహిరంగమొనర్చి పండితులనే యాశ్చర్యచకితుల గావింపగలడు. వీనికి సంసారయోగము లేదు. సంసారము సారహీనమైనదని యెంచి సంసారమును త్యజించి పరమపదప్రాప్తిని సిద్ధింపచేయు యోగమునే యుపాసించెద"రని చెప్పిరి.

ఉపాధ్యాయులు చెప్పిన వాక్యముల సారమును గ్రహించి "ఆహా! నా కుమారరత్నమగు వెంకటేశ్వరమూర్తి భక్తిసంపదను గుర్తించి నే నూహించినవిషయమే యుపాధ్యాయులు సెలవిచ్చిరి. సాధుభావములతో ప్రకాశించెడి నా నవమోహనమూర్తి యీ వెంకటేశ్వరమూర్తి! ఏ కొండలకేగునో? నా ముద్దుకుమారుని యెడబాటు కోర్వగలనా" యనెడి యావేదనయు, నా కుమారుడు బాలబ్రహ్మచారియై సద్గురువులదయకు పాత్రుడై యోగీశ్వరుడై పవిత్ర జీవితము గడుపుచు వేదాంతప్రబోధము చేయగలడను నానందమును, నా తల్లికి కలుగుచుండెడివి.

"సర్వ మీశ్వరేచ్ఛ ఏది యెట్లు జరుగవలయునో యట్లేజరుగు" నని నిశ్చయము చేసికొని ప్రశాంతితో నామె పవిత్రజీవితము గడుప సాగెను.

శ్రీ హనుమయ్య యొక పవిత్రదివసమున నొక సద్గ్రంథము దెచ్చి ధర్మపత్నితో "చూచితివా! ఈ సద్గ్రంథమున మహర్షు లేమి వ్రాసిరో; నేనీ యుత్తమ గ్రంథమంతయు చదివితిని. యతీశ్వరుని గన్నటువంటిస్త్రీ మరుజన్మమున నుత్తమపురుషుడై జన్మించును. యతీశ్వరులు జన్మించునంతవరకు నాస్త్రీ యెన్నిమారులు జన్మించినను స్త్రీరూపముతోనే జన్మించునని యిందున్న"దని చెప్పిరి. ధర్మపత్ని యగు శ్రీ మహాలక్ష్మీదేవి, "స్వామీ! అంతటి మహాద్భాగ్యము మనకు లభించునా!" యని యావేదన చెందుచున్న సమయమందే ద్వితీయ పుత్రరత్నమగు శ్రీ వెంకటేశ్వరమూర్తి "అమ్మా! అమ్మా! నేను యోగి నయ్యెద" నని పలుమారులు చెప్పగా పితృదేవులు గాఢాలింగన మొనరించుకొని "నాయనా! యోగియగుట సామాన్యమా?" యనిరి. భవిష్యజ్జీవితము తెలియకముందే యా బాలుని నోటినుండి పరమసత్యము వెలువడినది.

కొండాయపాలెము గ్రామమున నివాసముచేయు సజ్జనమూర్తి యగు శ్రీ లక్ష్మీనారాయణ వినుకొండకేగి పండ్లు ఫలహారములు తీసికొని బావగారగు హనుమయ్యగారి గృహమున ప్రవేశించిరి. ఉదార స్వరూపులగు హనుమయ్య అత్యంతాదరమున "ఏమిరా లక్ష్మీనారాయణ! యందరు క్షేమమేగదా" యని యడుగ 'అందరము శ్రీహరి దయచే క్షేమ'మని చెప్పిరి. లక్ష్మీనారాయణ, అక్కయ్యను దర్శించవలెనని పూజామందిరమున కేగెను. ఆమె శ్రీకృష్ణవిగ్రహము ముందు పూజ లొనర్చుచు సాక్షాత్కరించెను. సోదరు డక్కయ్య పాదపద్మములకు నమస్సు లర్పించి ఫలములు సమర్పించెను.

శ్రీ మహాలక్ష్మీదేవి పూజముగించి తమ్ము కొసగిన పండ్లను ఇంటికి వచ్చిన బాలురకు పంచి యిచ్చునంతలో కన్నబిడ్డలు పాఠశాల నుండి వచ్చిరి. మాతృదేవి కుమారులకు పండ్లీయ బోగా వెంకటేశ్వరమూర్తి "అమ్మా! ముందా బీదబాలురకు పంచి మిగిలిన పండ్లను మాకిమ్ము" ననెను.

మాతృదేవి, లక్ష్మీనారాయణ యచ్చెరువొంది "ఆహా! అతి బాల్యముననే సర్వమానవ సమానత్వదృష్టి లభించినది. జన్మాంతర సుకృతఫలవిశేషము గాక సామాన్యమా!" యని యబ్బురపడిరి.

వెంకటేశ్వరమూర్తి బాల్యమాదిగా మితభాషి. పదివాక్యముల భావము నొకే వాక్యములో వ్యక్తమగునట్లు సంభాషించుచుండును. ఉపాధ్యాయు లధ్యయనము చేయించిన పాఠములు వెంటనే యొప్ప చెప్పెడివాడు. తోడిబాలురతో సోదరభావము గలిగి మెలగుచుండెడి వాడు. ఆయన తల్లిదండ్రులయాజ్ఞ జవదాటని ధర్మమూర్తి! ఆయన నిత్యము తులసికోటను పూజించుచు నందు శుద్ధగంగ నిడి ముమ్మారు ప్రదక్షిణములు గావించుచు తులసికోటలోని మృత్తికను దీసి నొసట నిడుకొనుచు నపారప్రేమతో తులసిదళములు కర్ణములయందు దాల్చి హరినామమును స్మరించెడి భక్తమూర్తి! ఆయన మాతృదేవియగు శ్రీ మహాలక్ష్మీదేవి పూజామందిరమున తంబుర మీటుచు చిటుకలు వేయుచు హరినామగానము చేయుచున్నతరి లక్ష్మీనారాయణ అక్కయ్య చేసెడి భజనయందే మనస్సు లగ్నముచేసి భక్తితో హరి నామ భజనచేయ దొడంగిరి. ముగ్గురు కుమారులు, నిర్వురు కుమార్తె లును మాతృదేవిచేయు భజనలో పాల్గొనుచుండెడివారు.

కన్నకుమారుని నాలుకపై బీజాక్షరములను వ్రాయుట.

శ్రీ మహాలక్ష్మీదేవి బాహ్యప్రకృతిని వీడి ద్వితీయపుత్రుని దగ్గరకు చేరదీసికొని, పూర్వకాలమున యశోదాదేవి నందగోపాలుని

"మన్ను తింటివా ? కృష్ణా ! నోరు తెరువు" మనురీతి "నోరు తెరువు" మనెను. ఆ బాలభక్తమూర్తి మాతృదేవిముందే నోరు తెరువగా బాహ్యప్రకృతిలేని యా మహాలక్ష్మీదేవి కుమారుని నాలుకపై కుడిచేతి చూపుడువ్రేలితో "యోగి-జోగి, యోగి-జోగి, యోగి-జోగి" యని ముమ్మారు లిఖించెను. వెంటనే బాహ్యప్రకృతిచెంది చుట్టును జట్టుగా చేరిన భక్తులను చూచి "ఎందులకీ నివ్వెరపాట"ని అడుగ సోదరుడగు లక్ష్మీనారాయణ జరిగిపోయిన విషయమంతయు నామూలాగ్రముగా తెలియజేసెను.

శ్రీ మహాలక్ష్మీదేవి "ఆహా ! యేమి ఈ దైవసంఘటన నాకు తెలియకనే నాకుమారుని యోగిగా మార్చుటకు సంకల్పించుచుంటినా! నా యనుంగుబిడ్డడు యోగికావలసినదేకదా ? ఇదంతయు ఈశ్వరలీల. ఏది యెట్లు జరుగవలయునో యటులే జరుగు"నని యనంత కళ్యాణ సుగుణాభిరాముని శ్రీమన్నారాయణుని గొనియాడుచు విధివిరామము లేక శ్రీకృష్ణుని పూజింపసాగెను.

హనుమయ్య, ప్రియపుత్రుడగు వెంకటేశ్వరునకు "మైరావణ" హరికథపుస్తకము నిచ్చిరి. ఆనాటిసాయంత్రమునకే కంఠస్థముచేసి పెద్దలందరకు శ్రావ్యముగా కమ్మనికంఠముతో గానముచేసి వెంకటేశ్వరు లానందము చేకూర్చెను.

షోడశవర్షప్రాయమున బాలభక్తమణియగు వెంకటేశ్వరమూర్తి భక్తమార్కండేయునివలె ప్రకాశింపజొచ్చెను. కన్నులు మూసి కొనినను తెరచినను నీ బాలభక్తాగ్రేసరునకు శ్రీకృష్ణదర్శన మగు చుండెడిది.

శ్రీ మహాలక్ష్మీదేవి పెద్దతమ్ముడగు కోటయ్యయును నిష్కల్మష భక్తితో కాలము గడిపెడివాడు. ప్రతినిత్యము వేకువజామున నాలుగు గంటలకే లేచి, కాలకృత్యములు దీర్చికొని కుండికానదికివెళ్ళి స్నాన మాచరించి మంచితీర్థపు బిందెలను, కావడియందు నిడి హరినామమునే

స్మరించుచు స్వగృహముచేరి దేవతార్చన నెరవేర్చి, భగవంతుని కీర్తించుచు రాగతాళ నృత్యములతో మేనుమరచి హరినామ సంకీర్తన చేయుచు దినమొక క్షణముగ గడిపెడి భక్తమూర్తి కోటయ్య!

శ్రీ మహాలక్ష్మిదేవి చిన్నతమ్ముడగు లక్ష్మీనారాయణ రామయ్య శ్రేష్ఠికి సకలోపచారములు చేయుచు వారిమనస్సు నానందింపచేయు చుండిరి. రామయ్యశ్రేష్ఠి కుమారుడగు లక్ష్మీనారాయణ సౌశీల్యమును మెచ్చుకొని కలసిన సంబంధమున కొచ్చర్లగ్రామ నివాసియగు శ్రీ కాకుమాను మల్లయ్యశ్రేష్ఠి కుమార్తె వెంకమ్మ యను బాలికా మణి నిచ్చి వివాహముచేసి యత్తవారింటికి బంపిరి. అణకువ గలిగి వర్తింపుచు పతియాజ్ఞల ననుసరించి ప్రవర్తించుచుండెను. శ్రీహరి దయా ప్రసారమున వెంకమ్మ గర్భవతియైనది. నవమాసములు నిండినవి. తల్లి దండ్రులు వెంకమ్మను కొచ్చర్ల తీసికొనిపోయిరి.

## గ్రంథకర్త సుబ్బారావు జననము

శ్రీ కోట రామయ్యశ్రేష్ఠి సుగుణములఖనియగు కుమార రత్నము నొద్దకు చేర్చుకొని "నాయనా! లక్ష్మీనారాయణా! నీ సేవ వలన నా కన్నకుమారుని మరచిపోయితిని. ఇక నాకే చింతయులేదు. శ్రీ హరినామ స్మరణయే ముక్తికి మార్గమని యెంచి నిరంతరము హరినామస్మరణ 'వించుచున్నాను. ఒక మనుమని ప్రసాదించిన కన్నులారగాంచి వాని ముద్దుముచ్చటలు చూచి యానందింపవలయునని పెద్ద కోరిక యున్న"దని యాప్యాయముగ చెప్పిరి.

ప్రియపుత్రుడగు శ్రీ లక్ష్మీనారాయణ లోలో నవ్వుకొని గాఢ బద్ధానురాగమున "ఎందులకీ మమకారము మాపైనున్న 'ప్రేమచే నీ మనసా వేదన 'చెందుచున్నది. నీకు మనుమలపై భ్రాంతియేల? స్వయంకృషితో భుక్తికి లోటులేక, మేము భక్తితో మెలగుటకు సదవకాశము నేర్పరచితివి. అన్ని చింతలను వదలి దైవచింతనతో నుండవలసిన పవిత్రసమయ మిది. భగవన్నామమును భక్తితో

స్మరింపుము ! రక్తితో కీర్తింపుము ! ముక్తిని కాంక్షింపుము తండ్రీ!" యని ప్రబోధము చేసెను. ప్రియపుత్రుని వేదాంతవాక్యముల కెంతయో సంతసమంది "లక్ష్మీనారాయణుడవు, నాకు పుత్రుడవుగా లభించితివి ఇక నాకే చింతలు లే"వని పరమానందముతో నుప్పాంగి రామయ్య శ్రేష్ఠి సమాధానమిడిరి.



శ్రీ కోట రామయ్య శ్రేష్ఠి గారు

వెంకమ్మ యొక శుభలగ్నమున, ప్రజోత్పత్తి నామసంవత్సర శ్రావణ బహుళ ఏకాదశి రోజున పునర్వసు నక్షత్రము మూడవపాదము మంగళవారము సాయంత్ర సమయమున నొక బాలుని ప్రసవించినది.

ఈ శుభవార్త విన్న మేనమామలగు కానుమాను నరసింహయ్య, రాఘవయ్య యనువారలు సంతోషస్వాంతులై "ఆహా! మా కోర్కెలు ఫలించినవి. ప్రప్రథమమున మాకు మేనల్లుడే సాక్షాత్కరించినా"డని తలపోసిరి. నరసింహయ్య మిక్కిలి యుదార స్వభావము గలవ్యక్తి. రాఘవయ్య సదా మౌనముతో లోలోన నానందము చెందెడువ్యక్తి. ఆ బాలునకు సుబ్బారావు అని నామకరణము చేసిరి. భూసురులాదిగా పెద్దలందరు మంగళాశీర్వాదము లొనర్చి మంత్రాక్షతలు చల్లిరి.

సుబ్బారావు దినదిన ప్రవర్థమానుడగుచు తల్లిదండ్రుల మనస్సుల నానందింప చేయుచుండెను. వెంకమ్మను ఆమె బిడ్డని నత్తవారింటికి పంపిరి.

## శ్రీ మహాలక్ష్మీదేవి సద్గురు కృపకై పరితపించుట

శ్రీ మహాలక్ష్మీదేవి రాత్రింబవళ్ళు భగవన్నిష్ఠ యందే మనసును లగ్నముచేసి, సద్గురువు లభించినచో జ్ఞానోపదేశమును పొందవలయు నను సంకల్పము గలిగి హృదయమధనము చేయ నారంభించెను.

ఇరుగుపొరుగు నమ్మలక్కలందరు నామె వినయ సౌశీల్యాదులకు భగవద్భజనలకు, భక్తిభావములకు నిత్యాన్నదానముల కచ్చెరు వొందుచు, "ఏమితల్లీ! ఇట్టి విసిర్మలభక్తిని ఉపాసించుచున్నావు. మీ దంపతు లిర్వురు జ్ఞానోపదేశము నొందుడ"నిరి. 'ఇతరు లెరుగకున్న నీశ్వరు డెరుగడా!' యను సామెతగా నా ఈశ్వరుడే వారిలోచేరి మహాలక్ష్మీదేవికి సాధుమార్గమును ప్రబోధము చేయుచున్నారు.

శ్రీ మహాలక్ష్మీదేవికి జ్ఞానోపదేశ మొందవలయునని వాంఛ యున్నది. సద్గురువు లభించని కారణముచేత సమయము సమీపించ లేదని గుర్తించెను.

మన హృదయము పరిపక్వస్థితిని పొందిన ఆహరియే సద్గురువును మనకు లభింపచేయును. 'నమ్మి చెడినవారు–నమ్మక బాగుపడినవారు లే' రను సామెతను మది దలచి మౌనభావముతో పరమభక్తుల పవిత్ర జీవితాదర్శములనే మననము చేయుచుండెను.

## శ్రీ కోటయ్య దివ్యదర్శనము నొందుట

ఒకరోజున శ్రీ మహాలక్ష్మీదేవి శ్రీ మన్నారాయణునకు పూజ లొనర్చి నైవేద్యము సమర్పించి హారతు లొసగి యాప్రసాదమును తన ఇంటిలోనున్నవారికి పంచి శ్రీ హరి భజనచేయుచున్నతరి నా మహా సాధ్వి జ్యేష్ఠపుత్రుడగు కోటయ్యకు కారణము లేకయే కన్నులు మూత

పడిపోయినవి. మరుక్షణమే యా బాలుడు "అమ్మా! అదిగో! దివ్య సుందర విగ్రహము కోటిసూర్యులకాంతితో నిడుపైన గోళ్ళతో శిరమున జడలు మెరయుచు విమలోర్ధ్వపుండ్రనామములు ధరించి పీతాంబర ధారియై పావుకోళ్ళు వేసికొని మన గృహమున బ్రవేశించి"రని చెప్పి స్మృతితప్పి పడిపోయెను.

ఈ దృశ్యమును గాంచిన మాతృదేవి పరవశత్వంలోనున్న కుమారునకు కర్పూరహారతి నిచ్చి నమస్సులర్పించెను. వెంటనే లేచి తన తల్లి వలన జరిగిపోయిన విషయమును గ్రహించి యానందముతో "అమ్మా! నేడే మనగృహము పావనమైనది. నేడో రేపో నా యోగి పుంగవులు మనగృహమునకు తప్పక యరుదెంచెదరు. సందేహము లేదు. నా వాక్యములు యదార్థము"లని నొక్కి చెప్పెను. కన్నతల్లి యానందభాష్పములు రాల్చుచు "నాయనా! నీ వాక్యములు యదార్థమైనచో కావలసిన దేమున్నది? నా నోములు ఫలించినట్లే" యని చెప్పెను. ఆహా! ఏమి వారిభాగ్యము! మాతాసుతు లనుకొనినరీతి మరుసటి దివసమున వీరి ముఖ్యబంధువు మార్కాపుర నివాసియు శ్రీ యోగానంద నరసింహ యోగీశ్వరుల శిష్యులగు శ్రీ జక్కా కనకయ్యను వ్యక్తి వ్యాపారనిమిత్తము వినుకొండకువచ్చి శ్రీ మహాలక్ష్మీదేవిగారిని దర్శింప వారి భవనమున కేతెంచిరి.

వచ్చిన బంధువును యోగక్షేమము లడుగగా నా కనకయ్యగారు "ఏమితల్లీ! మేమందరము క్షేమమే. కాని మహత్తరవిషయ మొకటి విన్నవించెదను. అమ్మా! మా గ్రామమునకు కొద్దిదూరమున కుండికానది ప్రవహించుచున్నది. మీకు దెలియునా"యని అడిగెను. కనకయ్యతో, మహాలక్ష్మీదేవి సద్గురువుల విషయము చెప్పెద"రను నాశతో "ఆఁ! ఆనది ప్రవహించుచున్నది. తదుపరి విషయము త్వరగా చెప్పు"డని యాదుర్దాగా నడుగసాగెను.

యీ మహాసాధ్వి యాతురతలో నెంతో భావ మిమిడియున్నది. 'ఆలస్యం, అమృతం విష'మను సామెత జ్ఞప్తికి వచ్చినది కాబోలు! లేక ఈ సంసారసాగరమునబడి, దారి తెలియక, దరిగానక ఈదు లాడుచు తీరమును చేరు నుపాయము గానక యపాయమునకు గురియై యాపదలపా లగుదురేమో" యనెడి భయముతో సద్గురువుల దయ పొంది శాంతి యను నావలో నాశీనులమై ప్రశాంతి నిలయమగు భగవంతుని కాలయమై ప్రకాశించు స్వయంజ్యోతియందు చేరవలయు నను వాంఛయే యీ మహాతల్లి ఆతురతకు కారణము.

కనకయ్య "సావధానముగా వినుడు. మా యూరి నానుకొని ప్రవహించెడి కుండికానదికి సమీపమున కపిలగిరి యను కొండగలదు. ఆ కొండశిఖరమున శ్రీ లక్ష్మీనృసింహస్వామి నుపాసించుచున్న శ్రీ యోగానంద నరసింహ మహర్షి గలరు. ఆ మహనీయమూర్తిని సేవించెడి భాగ్యము మనకు కోటిజన్మలకైనను లభింపదు. వారి ఛాయా చిత్రమును మీకు దర్శింపచేయవలెనని నా వెంట తెచ్చితిని ఆ సంచిలో నున్న"దని కనకయ్య లేచినాడు.

శ్రీమహాలక్ష్మిదేవి క్షణకాలమేనియు నా దివ్యపురుషుని సందర్శన భాగ్యమునకై యెడబాటు నోర్వజాలక దిగ్గునలేచి పరువులు తీయుచు పూజామందిరములో నున్న సంచిని తీసికొని, మిక్కిలి తత్తరముతో సంచిలోనున్న సద్గురు పటమును లాగి వారి దివ్యభవ్యనవ్య స్వరూప మును దర్శించి వారి పాదకమలములను మున్మారు కన్నుల కద్దుకొని కరవుదీర నా యోగానంద నృసింహదేవుని రూపమును నామె హృదయమునకు హత్తుకొని శరీరస్మృతి వీడి పడిపోయెను.

ఆహా! ఆ మహాతల్లి హృదయము సద్గురు దర్శనముకొర కెట్లు పరితపించెనో, యీ సంఘటనయే నిదర్శన మని భక్తు లందరు గమనించెదరుగాక.

కనకయ్య "ఓ తల్లీ! ఆ మహనీయమూర్తి స్వరూపమును దర్శించియే, యిట్టి భావపరవశత్వమును పొందితివి. ఆ మహాత్ముని ప్రబోధామృతమును పానముచేసెడి వేళలం దింకెట్టి యనుభూతిని పొందెదవోకదా! ఆ యోగానందమూర్తి చరిత్ర యత్యంత రమణీయమై యానందదాయకమై విరాజిల్లుచుండు"నని వారి చరిత్ర నంతయు పూసగ్రుచ్చినటుల విన్నవించిరి. శ్రీ మహాలక్ష్మీదేవి పుత్ర పుత్రికారత్నము లెల్లరు సద్గురువుల చరిత్ర విని పరమానందమును పొందిరి. శ్రీ యోగానందమూర్తిని దర్శింపకముందే వారి ఛాయా చిత్రమును దర్శించియే యీ కుటుంబములోని వారందరి మనస్సులు నా మూర్తిరూపముపై లగ్నమైనవి.

శ్రీ మహాలక్ష్మీదేవి పెద్దకుమారుడు కోటయ్య శ్రీ యోగమూర్తి ఫొటోను శ్రీ ఆంగీరసనామ సంవత్సర పుష్య శుద్ధఏకాదశి ముక్కోటి పర్వదివసమున దర్శించిరి. ఇదే వారికి ప్రథమదర్శనము! ఆ నాటి నుండియే శ్రీ యోగానందమూర్తి కోటయ్య హృదయదర్పణమున ప్రత్యక్షమై ప్రకాశింపజొచ్చిరి. కోటయ్య కన్నులు మూతవడి నిశ్చేష్టుడై యా మహనీయమూర్తి దివ్యసుందర స్వరూపమును నెన్నియో మారులు దర్శించుచుండెడివాడు.

పూర్వజన్మ పుణ్యఫలమున కోటయ్య యను నుదారస్వరూపున కప్రయత్నముగా శ్రీ యోగానందమహర్షి దివ్యదర్శనభాగ్యము లభించినది. సద్గురుదేవుల నిర్హేతుక జాయమాన కటాక్ష వీక్షణము సంప్రాప్తమైనది. ఈ కోటయ్య క్రిందటి జన్మమున నెట్టి పూజ లొనర్చెనో! శ్రీ సద్గురు దివ్యదర్శనభాగ్యము లభించినది. ఇట్టి మహద్భాగ్యము కోరినను లభించునది కాదు.

ఆ సద్గురు శక్తిప్రభావమేమో! స్వామి, కోటయ్య హృదయమున చేరి ప్రాణుల భవిష్యత్తంతయు చెప్పించుచుండెను. కోటయ్య కా బాల్యమిత్రులు ప్రేమపాత్రులు స్వగ్రామనివాసులగు శ్రీ గంగిశెట్టి

గురునాథము, కనమర్లపూడి మల్లిఖార్జునము అను వారు, కోటయ్య భక్తి పరవశత్వమున బాహ్యప్రకృతి వీడి దైవసందేశములను వ్యక్తము చేయుచుండగా సహృదయులగు నీమిత్రు లిర్వురు జ్ఞప్తితో, కోటయ్య బాహ్యప్రకృతి చెందగనే, పూసగ్రుచ్చినటుల చెప్పెడివారు. ఆ మహత్తర సందేశములను విని, కోటయ్య మిత్రులను గాఢాలింగన మొనరించుకొని "సహృదయులగు మిత్రరత్నములారా! నేను చెప్పెడి భవిష్యద్వాక్యము లన్నియు మేము పటమున దర్శించిన మహనీయ మూర్తియే నా హృదయమున చేరి, నా ద్వారా చెప్పించుచున్నారు. మన జీవితములను తరింపచేయు నుపాయ మా మహనీయుని పాద సేవయే"యని చెప్పిరి. మిత్రు లిరువురు, "నీకును మాకును నా మహనీయమూర్తియే సద్గురువు లని నిశ్చయము చేసికొంటి" మనిరి.

సద్గురు శ్రీ యోగానందమహర్షి దివ్యదర్శనమును పొందినరోజు నుండి కోటయ్య యను నీ పుణ్యమూర్తి మూడురోజులు కనుపించిన ప్రతిప్రాణి భూతభవిష్యముల నన్నిటిని విప్పి చెప్పుచుండిరి. 'ఇదంతయు నస్ఖలిత బ్రహ్మచర్య దీక్షాధురంధరులగు, శ్రీ తోకపల్లిస్వామివారి తపశ్శక్తియేగాని వేరేమియు గా'దని యెల్లరు గుర్తించిరి.

## శ్రీ వేంకటేశ్వరయోగికి పితృదేవులు భగవద్గీత నొసంగుట

శ్రీ కోటయ్య సోదరుడగు వెంకటేశ్వర్లను భక్తాగ్రేసరునకు పితృదేవులగు శ్రీ హనుమయ్య తన కుమారుని గుణసంపద కృష్ణదర్శన మాది భక్తిభావములు వీక్షించి పవిత్రగ్రంథరాజము, 'భగవద్గీత'ను దెచ్చియిచ్చిరి. పితృవాక్యపరిపాలనాసక్తుడై యా భగవద్గీతను నిత్యము భక్తితో పూజించుచు, నైదు శ్లోకములు పారాయణ మొనర్చుచు నా శ్లోకభావములనే మననము చేయసాగిరి. ఈ నాటి భగవద్గీత శ్లోక పారాయణ ఫలితమే! కాలక్రమమున వారిచే మహత్తర గీతాప్రబోధ మును చేయించి గీతారచనకే దోహద మొనరించినది. ఈ బాల్యదశలో భక్తితో నొనర్చిన గీతాశ్లోక పారాయణ ఫలితమే! ఆ బాలభక్తుని

హృదయమున చేరి పవిత్ర మొనరించినది. గీతా శ్లోక పారాయణ ఫలితమున కీ బాలభక్తుని భావిజీవితమహర్దశయే సత్యమైన నిదర్శనము.

ఈశ్వరకృప ఏ నరునిపై ప్రసరించునో యా నరుడే నారాయణ మూర్తియై, ప్రకాశించునను బాలభక్తుడగు వెంకటేశ్వరుని భావి జీవితమే మనకు ప్రత్యక్షనిదర్శనము. ఈ విధముగా హనుమయ్యగారి కుటుంబము పవిత్రవంతములగు సాధుభావములతో, భగవద్భజనలతో, పురాణకాలక్షేపములతో దీపించుచుండెను.

శ్రీ హనుమయ్యగారి హృదయము నిత్యానందమయము. వారు నిష్కపటహృదయులు. ప్రతి వాక్యము నిండు మనస్సుతో పరిపూర్ణ వాత్సల్యమున పలికెడివారు. వారు లోపల వెలుపల నొకేభావము గలిగి ప్రవర్తించెడివారు. బంధువులను మిత్రులను వీక్షించిన పట్టరాని సంతోషముతో క్షేమసమాచారములు విచారించెడివారు. శ్రీ హనుమయ్యగారి చిన్నకుమారుడగు శ్రీ సత్యనారాయణ మాతా పితరులందు సోదర సోదరీమణులయెడ నఖండగౌరవము గలిగి ప్రవర్తించెడి పుణ్యమూర్తి. ప్రతి విషయమును చర్చించి సారాంశమును గుర్తించి సంతోషము నొందెడి స్వార్థత్యాగి. గ్రామపాఠశాలయందు విద్యాభ్యాస మొనర్చుచు గురువులు దైవసములని భావించి క్రమశిక్షణతో విద్యాభ్యాసమును సాగించెడివారు.

వీరు తోడిబాలురకన్న మిన్నయై మాతాపితరుల మనస్సుల నానందింపచేయుచు దైవభక్తి గలిగి మెలగుచు కాలమును సద్వినియోగము చేసెడి సజ్జనమూర్తి.

శ్రీ హనుమయ్య ధర్మపత్నితో "చూచితివా! మన పుత్రులను. మువ్వురును రత్నములే! ద్వితీయ పుత్రరత్నమగు వెంకటేశ్వరమూర్తి నడవడి నా కాశ్చర్యమగుచున్నది. ఈ లేత వయస్సున తోడిబాలురతో నాటపాటలుమాని హరిభజనలు గావించుచు తదేకధ్యానచిత్తుడై మౌనభావముతో మెలగుచు భగవద్గీత దివ్యగ్రంథమునే సదాపఠించుచు

మననము చేయుచున్నాడు. నీవు తెలియక 'యోగి - జోగి' యని నాలుకపై లిఖించితివి. నేను తెలిసియే భగవద్గీత సద్గ్రంథము దెచ్చి యిచ్చితిని. అగ్నికి వాయువు తోడన్నట్లుగా నీవు వ్రాసిన వ్రాతలకు - నేను చేసిన చేతలకు సరిపోయినది. ఇప్పు డనుకున్న ప్రయోజనము లేదు. మన యూహ ఫలించి యోగీశ్వరు డయ్యేనేని మన వంశమే తరించు"నని చెప్పి మహదానందమును పొందెను.

ఈ ప్రపంచమున నే తల్లియైనను నే తండ్రియైనను కొడుకు పుట్టినచో, సంతోషమును వెలిబుచ్చలేరు. పుత్రుడు పుట్టినచో మహా నందమును పొందెదరు. కొడుకునకు - పుత్రునకు నెంతో వ్యత్యాసము!

కొడుకుల స్వరూపము : జననమాదిగా కొంటెపనులతో కోతి చేష్టలతో, ఔనన్న కాదనుచు, కాదన్న ఔననుచు, వాదములతో, క్రోధములతో, ప్రియజనకుని హృదయమునకు పరితాపము చేకూర్చుచు, తల్లిదండ్రుల యాజ్ఞలను త్రోసిపుచ్చుచు, విద్యాబుద్ధుల విడచి యవివేకపు వాక్యములతో, నహంకారపు నడవడితో, పూర్వార్జితమును స్వార్థభోగములకు దుర్వినియోగము చేసి, తనకు నచ్చినకన్యను వరించి దీనితో నా జన్మ తరించునని కన్నవారిని కాలదన్ని, కాపురమును రెండు చేసి, భార్యానుకూలుడై, భయభక్తిశూన్యుడై అన్యాయములకు నక్రమములకు లోనై, దౌర్జన్య హింసాకాండ ప్రవర్తనుడై జీవితాంతమువరకు తన ప్రవర్తనను మార్చుకొనక వృద్ధులగు జననీ జనకులను కన్నెత్తియైనను చూడక తన సతియే దైవము, తన కడుపే కైలాసమని చరించెడివాడే కొడుకు.

పుత్రుల స్వరూపము : బాల్యమాదిగా వినయవిధేయతలు గలిగి జననీజనకులను దైవసములని పూజించుచు తన తోడివారితో సభ్యత గలిగి వర్తింపుచు గురువులయెడ పెద్దలయెడ భక్తిప్రపత్తులు గలిగి వినయశీలుడై సత్పథగామియై, పురజనులకు తలలోనినాల్కయై సర్వ విధ సంశోభితుడై 'పరోపకారాయ పుణ్యాయ - పాపాయ పరపీడనం'

అనెడి ధర్మోక్తి ననుసరించి తన్ను నమ్మివచ్చిన సతికి సద్గతి గల్పించి, కష్టసుఖములలో నిర్వురు భాగస్వాములై సర్వకాలసర్వావస్థలయందు ఓర్పుతో నేర్పుతో సంసారయాత్రను సాగించుచు సంసారమును స్వర్గ తుల్యము చేసి, యాదర్శ గృహస్థజీవనముతో శ్రీహరి స్మరణచేయుచు శక్తికొలది దానధర్మము లొనర్చుచు కుటుంబభారము వహించి తన జన్మకు కారణభూతులగు తల్లిదండ్రులకు చేదోడు వాదోడుగా మసలుచు వారి హృదయములకు ప్రశాంతి నెలకొల్పెడి కార్యక్రమములను జాగరూకులై నిర్వహించి వారి కాధ్యాత్మిక విభూతి చేకూర్చెడివారే పుత్రులు.

## శ్రీ యోగానందస్వామి భక్తురాలి పూజలు యోగదృష్టితో తెలిసికొనుట

శ్రీ యోగానందస్వామివారు అబ్బూరులో మహాయజ్ఞము నిర్వహించి వారి యోగశక్తితో ఘోరవ్యాధులను సైతము మటు మాయ మొనర్చుచు యోగదీక్షలో నుండిరి. సదా త్యాగయోగముల నుపాసించుటచేతనే యా మహాతపస్వికి 'యోగానందు' లను సార్థక నామము గలిగినది. ఆ యోగానంద నరసింహస్వామివారు యోగ దీక్షలో నుండియే వినుకొండ పురమున శ్రీ చేవూరి హనుమయ్య ధర్మపత్ని శ్రీ మహాలక్ష్మిదేవి సర్వార్పణదృష్టితో చేసెడి దైవ కార్యము లాత్మపూజాదులు మొదలగు విషయములన్నియు గుర్తించి పట్టరాని సంతోషమును పొందిరి.

శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారిని నిండుభక్తితో సిద్దయ్య యెట్లు సేవించి తరించెనో, యదేవిధముగా శ్రీ సద్గురు యోగానందమహర్షిని, అబ్బూరు నివాసియగు శ్రీ నారాయణదాసను భక్తమూర్తి సేవించుచు కీర్తించుచు ధ్యానించుచుండిరి. నిష్కల్మషహృదయుని, సూక్ష్మదృష్టి గలిగిన నారాయణదాసును జూచి సద్గురుదేవులు "నారాయణదాసా! వినుకొండలో నా భక్తులు నాయందే మనస్సునిల్పి, వినిర్మలభక్తితో

నా దర్శనమునకై పండువెన్నెలకై నిరీక్షించెడి చకోరములవలె పరితపించుచున్నారు. ఆ సహృదయులను చూడక క్షణమేని యిందుండ జాల"నని చెప్పి

శ్రీ సద్గురు పాదములయొద్ద కాచుకొనియున్న ముఖ్యశిష్యులగు నారాయణస్వామి, నరసింహయ్య, కుచేలయ్య యనువార లత్యంతభక్తి శ్రద్ధలతో "స్వామీ! తమ కోరికను పాటించుటయే మా జీవిత పరమావధికి సూటిబాట! తమ యాదేశానుసార మీ క్షణమే వినుకొండపురమునకు వెళ్ళుద" మని చెప్పిరి. గురువునకు తగిన శిష్యులనిన నిట్టివారై యుండవలయును.

ముచ్చటగా ముువ్వురు శిష్యులను వెంటతీసుకొని సద్గురుస్వామి అబ్బూరు వీడిరి. గురుశక్తి ప్రభావముచే శ్రీ మహాలక్ష్మిదేవితో ప్రియసుతుడగు కోటయ్య కన్నులు మూసుకొని "అమ్మా! దివ్య పురుషులు మనయింటి కరుదెంచుచున్నారు. ఈనాటి యుదయమే వేంచేసెద"రని చెప్పెను. కన్నతల్లి నాతనిమాట వేదవాక్యమని మది నమ్మి కుమారులతో సహృదయులగు గురునాధము మల్లిఖార్జునులతో కలసి రైలుస్టేషనుయొద్దకు చేరి సద్గురు దర్శనమునకై వేచి కాచుకొని యుండిరి.

శుభసమయ మాసన్నమైనటుల పదిగంటలరైలులో శ్రీయోగానంద నరసింహ యోగీశ్వరమూర్తి ముువ్వుర శిష్యులతో, భక్తులానంద మొంద సాక్షాత్కరించిరి. నిడుపైనగోళ్లు పొడవైన జడలు గలిగి బ్రహ్మవర్చస్సుతో ప్రకాశించెడి శ్రీ యోగానంద సద్గురు దేవులను దర్శించిన తక్షణమే తపించెడి హృదయముతో శ్రీ మహాలక్ష్మిదేవి సాష్టాంగనమస్కృతు లొనర్చి యానందబాష్పములతో స్వామివారికి పాదాభిషేక మొనర్చి అనిర్వాచనీయమైన యానంద తన్మయత్వము నొందెను.

## శ్రీ స్వామివారు కోటిదాసు తోటయందు ప్రవేశించుట

శ్రీ సద్గురు దేవులగు శ్రీ యోగానందస్వామివారిని శ్రీ మహాలక్ష్మీదేవి తదితర భక్తులందరు నిండుభక్తితో ప్రశాంత వాతావరణమునకు స్థానమగు కోటిదాసు తోటకు ఆహ్వానముచేసి ఉన్నతాసనమందు సుఖాశీనుని గావించి సకలవిధ శుశ్రూష లొనర్చిరి. పూర్వకాలమున శ్రీ రామచంద్రమూర్తిని దర్శించిన భక్తశబరి యెట్టి ఆనందావేశములను పొందెనో అదేవిధముగా, శ్రీ మహాలక్ష్మీదేవియు పరితప్తహృదయముతో సద్గురు దేవులను దర్శించుచుండెను. మకరందమును గ్రోలుటకై తుమ్మెద కమలములను ఆశ్రయించిన భంగి శ్రీ మహాలక్ష్మీదేవియు సద్గురు పాదకమలముల నాశ్రయించెను.

పాద పద్మములపై వ్రాలిన శ్రీ మహాలక్ష్మీదేవిని సద్గురు శ్రీ యోగానందమూర్తి అపారకరుణాపూరితుడై, "తల్లీ! నీ వినిర్మల భక్తిభావములకు సంతసించితిని. నీ కోరికలన్నియు ఆమూలాగ్రమున శ్రీ లక్ష్మీనృసింహస్వామి నెరవేర్చెదరు. నీ జీవితాంతమువరకు నీ కెట్టి కొరంతయు లే"దని బ్రహ్మానందముతో ఆశీర్వాదము చేసిరి. దివ్యపురుషుల ఆశీర్వాదశక్తి విరాట్రూపుడగు శ్రీ మహావిష్ణు సుదర్శన శక్తివంటిది. సందేహము లేదు.

శ్రీ మహాలక్ష్మీదేవి శ్రీ సద్గురు పాదకమలముల ముమ్మారు కన్నులకద్దుకొని "స్వామీ! తమ దర్శనభాగ్యముచే మేము కృతార్థుల మైతిమి. మా రక్షణభారము తమదే నని ప్రార్థించుచున్నాను ప్రభూ!" యని విన్నవించెను. సద్గురుస్వామి కరుణాప్రపూర్ణులు వీరనృసింహమూర్తి కళావతారము. యోగసిద్ధులను పొందిన మహనీయమూర్తిని సామాన్యులు గుర్తించుట బహుకష్ట సాధ్యము. ఏమియు తెలియని వానివలె సంచరించును. సంభాషించును. వేదవేదాంగ రహస్యములన్నియు వారి త్యాగయోగశక్తికి కరతలామలకము. స్వామివారు క్షీరమును మాత్రమే గ్రోలెడివారు. దగ్గరనున్న ముప్పొరు శిష్యులు క్షీర

మునే గ్రోలెవరు. ఆ సద్గురు స్వరూపమును ఎన్ని కల్పములు పర్కించినను తనివితీరదు. ఈ పరమ రహస్యము బ్రహ్మానుసంధాను పరులగు యోగ మూర్తులకు మాత్రమే గోచరించును. శ్రీ యోగానంద మహర్షి యోగ దృష్టితో బరికీలించిన, ప్రతిజీవి పూర్వజన్మ స్మృతులు వారికి ప్రత్యక్ష మగుచుండును. మృత్యుదేవత చర్యలనే అరికట్టగల ప్రజ్ఞాధురీణులు, ఈ యోగమూర్తి. మహత్తర దైవశక్తి సదా పరిచర్యలుచేయు పాద సేవకులు తెలిసికొనుటే బహుకష్టసాధ్యము. అందుచేత భక్తిలేక భక్తికై ప్రాకులాడెడి సామాన్యులేమి తెలిసికొనగలరు. వారు సామాన్యులను అవివేక శిఖామణులను, ధనావేశ పిశాచ మదోన్మత్తు లను, స్వార్థభోగపరాయణులను, కామినీకాంచన ప్రియులను శుష్క వేదాంతులను, వేషభాషలతో తిరిగెడి ఉదరపోషకులను ఆకర్షింపక వినిర్మల భక్తిగలిగిన త్యాగమూర్తులను మాత్రమే వారిపాదసన్నిధికి చేర్చుకొనుచుండిరి.

వినిర్మల హృదయులను పరిపూర్ణ వాత్సల్యము ప్రకటించి జగజ్జన కుని చందమున రక్షించుచుందురు. అట్టి పవిత్రమూర్తి దయకు పాత్రు లమై వారిపాదపూజలొనర్చి వారిదివ్య సందేశములను వినవలయు నన్నచో అనేకజన్మ సముపార్జిత పుణ్యఫలము వలనగాని సిద్ధింపదు.

శ్రీ మహాలక్ష్మీదేవి సన్నిధి లభించిన పేదచందమున నిత్యము దైవముహూర్తమున లేచి, కాలకృత్యములు నెరవేర్చుకొని, భగవదా రాధన గావించి పాలుపండ్లు తీసికొని తోటలో ప్రవేశించి బ్రహ్మవర్చ స్సుతో అపర శంకరునివలె ప్రకాశించెడి సద్గురు శ్రీ యోగానంద మూర్తికి వారి ప్రియశిష్యులకు నిచ్చుచుండును. సద్గురుదేవుని దర్శింప వలయునని దూరదూరములనుండి భక్తులు విచ్చేయుచుండిరి. స్వామి దర్శనమునకై వచ్చిన భక్తులందరు ఫలహారములు తీసికొనువారికి ఫల హారములు, భోజనములు చేయువారికి భోజనములు శ్రీ మహాలక్ష్మీ దేవియే సమకూర్చెను. వచ్చిన భక్తులందరు స్వామివారిని సేవించుచు

మహాలక్ష్మీదేవిగారి నిస్వార్థసేవను అచ్చెరువొందుచు ఆనందింపసాగిరి. "సాక్షాత్ శ్రీ అన్నపూర్ణాదేవియే ఇట్లు అవతరించె"నని అనుకొనుచుండిరి. ఆ మహాతల్లి సద్గురుదేవులకై, సర్వము త్యజించుటకైనను సంసిద్ధయై యిట్టి సమారాధన గావింపసాగెను. ఈమె త్యాగశీలాదులను భర్తగారగు హనుమయ్య తిలకించి మనవంశమునే పవిత్రమొనర్చు మహాకార్యమును కొనసాగింపుచున్నది. నాకు కావలసినదేమున్నది? అంతయు ఈశ్వరేచ్ఛ"యని ప్రశాంతచిత్తముతో వీక్షించుచుండిరి.

ఈ పుణ్యదంపతుల పుత్రులు ముగ్గురు, ఇద్దరుపుత్రికలు స్వామిసేవాకార్యములందే నిమగ్నులైరి. వీరి ఆదర్శకుటుంబమును వీక్షించి సద్గురువరేణ్యులు లోలోన ఆనందమును పొందుచుండిరి. ఈనాటి సద్గురు ఆనందమే శ్రీమహాలక్ష్మీదేవి కుటుంబము సర్వసౌఖ్యములకు ఆలవాలమై ప్రశాంతిని పొందుటకు స్థానమేర్పరచినది. సద్గురుదేవుని మనస్సును ఆనందింప చేయుటచే, భావికాలములో శ్రీ మహాలక్ష్మీదేవి భగవదానందముతో నెట్టికొరతయు లేక కోరినపనులన్నియు, కొంగుబంగారమై వెలుగొందుటకు కారణమై యొప్పెను.

కోటిమందికి అన్నదానము చేసినఫలము ఒక యోగిపుంగవుని మనస్సు, ఆనంద మొందించిన ఫలములో సహస్రాంశమునకు సరిపోదని మనశాస్త్రములు ప్రబోధము చేయుచున్నవి. శ్రీ మహాలక్ష్మీదేవి భగవదానందముతో నే కొరతయు లేక రాత్రి మూడు గంటలకు లేచి యింటిపనులన్నియు దీర్చిదిద్ది కాలకృత్యములు నెరవేర్చి భగవదారాధన గావించి సద్గురుదేవులకు క్షీరమును తీసికొని తోటకు వెళ్ళుచుండును. ఈ మహాసాధ్వి స్వగృహము వీడి తోటకువెళ్ళెడి మార్గమధ్యమున, ఒక పిచ్చివాడు కేకలు వేయుచు త్రోవ కెదురుగా నిలిచి రాళ్ళు రువ్వుచుండెడివాడు. ఆ తల్లి వానిని చూచి సర్వమున గురుదేవులు ప్రకాశింతురు. నా కేమిటను భయమని మనస్సున గురుదేవుని ప్రార్థింప ఆ పిచ్చివాడు రాళ్ళురువ్వుట మాని వహాసముగా తలవంచు

కొని పోవుచుండెడివాడు. సర్వభూతాంతరాళములయందు ప్రకాశించెడి వస్తు వొకటే! ఆమె మనస్సు సద్గురు పాదములయందు ఎప్పుడు లగ్నమైనదో అన్ని ఆటంకములు తొలగిపోయినవి. ఈ ధర్మసూత్రములకన్నిటికి ఆదర్శగృహిణీమణి యగు శ్రీ మహాలక్ష్మీదేవి జీవిత సంఘటనలే మనకు ప్రత్యక్ష ప్రమాణములు. ఈ విధముగా కొన్ని రోజులు గురుదేవునకు పాలు పండ్లు సమర్పణ గావించి సద్గురు పాద పద్మములను పూజింపసాగెను.

## శ్రీ మహాలక్ష్మీదేవి సద్గురు కటాక్షమును బడయుట

అంతలో అతిపవిత్ర దివస మాసన్నమయ్యెను. ఆ రోజు శ్రీముఖ సంవత్సర చైత్రమాసమున శుక్ల పక్షమందలి పాడ్యమి. అనగా సంవత్సరమునకు ఆది. శ్రీ మహాలక్ష్మీదేవి జీవితము పవిత్రవంతమై ప్రకాశించుటకు పునాది. ఆమె హృదయ తాపత్రయము లన్నిటికి సమాధి. ఆహా హా! ఏమి శుభసమయము! ఆ మహాతల్లి మనస్సున ఒక సుసంకల్పము కలిగినది. ఈనాడే సద్గురు శ్రీ యోగానందమూర్తి చే జ్ఞానోపదేశమును పొంది తన జీవితమును ధన్యమొనరింప వలయునని తలచి ఆనాడే శ్రీ మహాలక్ష్మీదేవి, హనుమయ్య, ముగ్గురు కుమారులు కలసి సద్గురు దేవులను తమ స్వగృహమునకు ఆహ్వానముచేసి అఖండముగా గౌరవించి సద్గురు మహారాజునకు పాదపూజలుచేసి వారిచే తీర్థ ప్రసాదములను భక్తితో స్వీకరించిరి.

ఈ దృశ్యమంతయు వీక్షించెడి కరుణాస్వరూపులు సద్గురు దేవులు "ఓహో! ఈ దాసురాలి హృదయము సత్కర్మానుష్ఠానముచే పరిపక్వస్థితి పొందినది. ఈమె హృదయక్షేత్రమున విజ్ఞానబీజము నాటినచో భక్తిగంగచే మొలకలెత్తి రెమ్మలతో, కొమ్మలతో, పూలతో, పిందెలతో, కాయలతో, ఫలములతో నిండి శాఖోపశాఖలై మహా వృక్షమై బాటసారులకు మార్గాయాసము బాపుచు ప్రశాంతిని చేకూర్చు" నని తలంచిరి.

మానవహృదయమున వినిర్మలభక్తి యెప్పుడు సంప్రాప్తమౌనో ఆనాడు మాధవుడే మానవరూపముతో సాక్షాత్కరించి ధన్యులను చేయు నను సద్వాక్యమునకు ఈ మహాతల్లియే నిదర్శనము. ఆనాడు శ్రీ చేప్రూరి హనుమయ్య వారిధర్మపత్ని మహాలక్ష్మిదేవి జ్ఞానోపదేశమును బొందిరి. మరుక్షణమే నిష్కల్మషహృదయుడగు కోటయ్యా జ్ఞానోపదేశమును పొందెను.

శ్రీ మహాలక్ష్మిదేవి స్వామివారితో "సద్గురుప్రభో! మీరు మా గ్రామమునకు దయచేయకపూర్వమే మాకు అపరోక్షముగా దర్శనభాగ్యము చేకూర్చిరి. ఆ మహత్తర సంఘటనయే, మా కుటుంబమును మీ పాదదాసులుగా మార్చినది. తమరు ఏనాడు మాకు అపరోక్షానుభూతి గల్పించి తమ దివ్యస్వరూపమును దర్శింపచేసిరో ఆనాడే మీరు మాకు ఆవేశమై నా రెండవ కుమారుని 'యోగి-జోగి' అని శాసించినారో ఆనాడే నిష్కల్మష హృదయముతో నా ద్వితీయ రత్నమగు వెంకటేశ్వర బాలభానుని తమకు అర్పణము గావించుకొంటిని. ఆ కారణముచే ఈ బాలుని మీ కిచ్చుచుంటిని. వీనికి బ్రహ్మచర్యము అనుగ్రహించి మా వంశమును పవిత్రమొనర్చి మమ్ము ధన్యులను గావింపుడని వేడుచుంటిని స్వామీ!

"సంసారబంధముల విడనాడి మోహపాశముల్ద్రెంచి మీ పాదముల పజ్జచేరిన, నా వెంకటేశ్వరుని భారమంతయు తమదే! తల్లి తండ్రి గురువు దైవము సర్వస్వము తమరే"నని గురుపాదపద్మములపై ప్రియపుత్రుని ప్రణమిల్లజేసెను.

ఈ మహత్తరత్యాగమునకు భర్తగారు ఆప్తబంధువులు సహృదయులగు గురునాథము మల్లికార్జునుడు మొదలగు వ్యక్తులందరు సంభ్రమాశ్చర్యచకితులైరి. సద్గురుమూర్తి శిష్యురాలి సత్యవాక్యపరిపాలనమునకు మెచ్చుకొని "ఏమమ్మా! నీవు ధన్యురాలవు. శ్రీ లక్ష్మి

నృసింహస్వామి అనంతశక్తి మిమ్మెల్లరను సదా కాపాడుచుండును. సద్గురు పీఠము మీ గృహముననే వర్ధిల్లును! ఈ వెంకటేశ్వర బాల భక్తశిఖామణియే గురుపీఠమును అలంకరించు" నని ఆశీర్వాదముచేసి ఇట్లు నుడివిరి—

"ఓ మహాలక్ష్మీదేవి! నీ త్యాగశక్తి వర్ణనాతీతమైనది! త్రేతా యుగమున వశిష్ఠమహర్షి యాగరక్షణార్థమై అయోధ్యకు జని రఘు వంశ ప్రతిష్ఠాపరిపాలకు డగు దశరథమహారాజును దర్శించి 'ఓ రాజా! నీ కుమారుడు లోకకల్యాణమూర్తి. నా యాగమును దుష్టరాక్షసులు విఘ్నమొనరించుచున్నారు. వారి మద మణంచుటకు చాలిన మహా వీరుడు శ్రీరామచంద్రమూర్తియే! నీ పుత్రుని నా వెంట బంప వలయు' నని కోరగా, కౌసల్యా దశరథులు మిగుల దుఃఖించిరి. తదుపరి, మహర్షి ధర్మోపదేశములుచేసిరి. అంత కౌసల్యా దశరథులు నగ్నసత్యమును గుర్తించి మహర్షి వెంట రామచంద్రుని బంపుటకు సమ్మతించిరి.

"ఈనాడు నీవు చింతింపక నేను అడుగకముందే 'ఓ స్వామీ! నా కన్నకొమరుని నీ కిచ్చెద' నని వాగ్దానముచేసి తీసికొమ్మని చెప్పి తివి. నీ సత్యదీక్ష కెంతయో సంతసించితిని. సత్యముకంటె పరమ ధర్మము ఈ ప్రపంచమందు లేదు. సత్యమే దైవస్వరూపము. సత్య మైన పరమాత్మ సత్యవాక్యపరిపాలకులకు దర్శనమొసంగును. అసత్య పరులకు, అజ్ఞానులకు, ధనాశాపీడితులకు, గురుభక్తిహీనులకు, అక్రమ ప్రవర్తకులకు, స్వార్థభోగులకు, కల్మషహృదయులకు కోటిజన్మలకైన పరమాత్మ దర్శనము లభింపదు. ఈ బాలుడు నా బాలుడే గాని నీ బాలుడు కాదు. వీని భారమంతయు నా యదియే! నీ కుమారుని నా వెంట నెప్పుడు బంపించెదవు తల్లీ!" యని అడుగగా "స్వామీ! ఒకసంవత్సరమునకు తమ ఆశ్రమమునకు బంపించెదము" అని నుడివెను. గురుసార్వభౌములు 'సరే' యని సమాధానమిచ్చి సంతోషించిరి.

## శ్రీ వేంకటేశ్వరమూర్తికి బ్రహ్మోపదేశము చేయుట

యోగిగా మారనున్న వెంకటేశ్వరమూర్తికి శ్రీ సద్గురుస్వామి బ్రహ్మోపదేశ మొసంగి హస్తమస్తక సంయోగ మొనర్చి కర్ణమున ప్రణవమును ఉపదేశించి "బ్రహ్మచర్యవ్రతమును అనుష్ఠించెదవు గాక" యని దీవించిరి. ఆ యోగమూర్తి దీవనయే ఆ బాలుని కాలక్రమమున మహాయోగీశ్వరునిగా మార్చెను. శ్రీ మహాలక్ష్మీదేవి చిన్నకుమారు డగు సత్యనారాయణకు జ్ఞానోపదేశము గావించి "నాయనా! ముద్దుల కుమారా! నీవు సరస్వతి ముద్దు బిడ్డడవు. నిస్వార్థ సేవానిరతితో నీ జీవితమును సార్థకత చెందించి గురుభక్తితో మెలంగెద" వని దీవించెను. సద్గురుదేవులు శ్రీ మహాలక్ష్మీదేవి గృహమున కొన్ని రోజులు నివసించిరి. సతిపతు లిర్వురు సద్గురుదేవులకు సేవలొనర్చి, భక్తితో పాదపూజలు చేసి పట్టువలువ లొసంగిరి. గురుదేవుల శిష్యు లగు నారాయణస్వామి, నరసింహయ్య, కుచేలయ్య యను వారలకు నూతనవస్త్రము లొసంగి నమస్సు లర్పించిరి. శ్రీ సద్గురుమహారాజు ప్రియశిష్యులను జూచి ఆనందముతో ఈ విధముగా ప్రబోధము చేసిరి.

### శ్రీ సద్గురు ప్రబోధము

"యోగిగా మారనున్న వెంకటేశ్వరా! నేను ప్రబోధము చేసెడి మహోపదేశములను విని మననముచేసి మనస్సునచేర్చి స్వ ప్రజ్ఞచే నాచరించుచు ఆదర్శమూర్తివై మాగురుపీఠమునకు సత్కీర్తిని చేకూర్చి మాకు సంతోష మొనగూర్పుము. మా గురుపీఠము మీ యింట నిల్చెడి యోగమున్నది. అట్టి శక్తిని ఆర్జించుటకే నీవు ప్రయత్నించి నీ జీవితమును అంకితముచేసి మమ్ము ఆనందింపజేసి సద్గురుకృపకు పాత్రుడవుకమ్ము. నీ జీవన సర్వస్వము భగవంతునికి నివేదనచేయుము. ఇతరములగు కోర్కెలను ఈ క్షణమే బరిత్యజింపుము. 'నా ఆత్మను వికసింపచేయు మనియు, నా హృదయములోనికి, శాంతి-స్థిరత్వము-

తేజము-ఆనందములను, ప్రసరింపచేయుమనియు', దివ్యశక్తికి మ్రొక్కి-లిడుకొనుము. ఆకాంక్షించుము, శ్రద్ధాభక్తులుగలిగి ఫలసిద్ధికి వేచి అనన్య భక్తిశ్రద్ధలపైనను, మహాత్యాగశీలాదులవలనను, సర్వము ఆధారపడియున్నది. నీలో ప్రాపంచికబంధ మణుమాత్రమున్నను అది నిన్ను బంధించును. సంపూర్ణముగా నీవు భగవంతునికి దాసానదాసుడవైనగాని బంధవిముక్తుడవు గాజాలవు. సంసారమున సంభవించు నొడుదుడుకులను ప్రశాంతమైన మనస్సుతో జలింపని ధైర్యముతో భగవచ్ఛక్తిని సంపూర్ణ విశ్వాసములతో నమ్ముకొని సంసారసముద్రమున పొంగులువారెడి దుఃఖములనెడి కెరటముల నెదుర్కొనుటయే ఈ యోగములో నభ్యసింపవలసిన ప్రథమపాఠమై యున్నది.

"అనేక జన్మసము పార్జిత పుణ్యవిశేషముననే మానవజన్మ సంప్రాప్తమైనది. ఈ మానవజన్మ సార్థకతచెందవలెననిన నిరంతరకృషితో సద్గురుకృపాకటాక్షమును పొంది మాధవుని దర్శింపవలెను. ఎన్నిజన్మలెత్తినను దైవసాక్షాత్కారము పొందని జీవునకు సద్గతిలేదు. ఇది పరమసత్యము, వేదసారము, శాస్త్రసమ్మతము, మహర్షులవాక్యము, సద్గురువులప్రబోధము. దేహధారిగానున్నపుడే సాధన చేయదగును. కాని దేహ మంతరించినప్పుడేమి చేయనగును! శరీర మంతర్ధానమై ఆత్మపరలోకములో సంచారములు సలిపి తుట్టతుదకు మఱియొక దేహమును దాల్చి ఇహమందు జన్మించును. ముందుజన్మలో నీడేర్చ కష్టములు తిరిగి యీ జన్మలో ప్రత్యక్షమగును. కనుక శరీర పరిత్యాగమువలన సాఫల్యమేమికలదు? ఈ జన్మలోనే సర్వకష్టముల నెదుర్కొని జయమందుటయే చక్కని రాజమార్గము. యోగములన్నియు భగవంతునిచేరు మార్గములే! ఈజన్మమందే భగవంతునిచేరి జన్మరాహిత్యము పొందవలెననిన త్యాగయోగమునకు మించినదిలేదు. ప్రథమమున భక్తియోగమును చేయుము. మిగిలిన యోగములన్నియు సద్గురుకృపచే పొందవలయు"నని ప్రబోధముచేసిరి. వినుచున్న

వెంకటేశ్వరమూర్తి గురుప్రబోధవాక్యరత్నములను తన హృదయ పేటికయందు భద్రముగా పదిలపరచిరి.

శ్రీ సద్గురు దేవులు శిష్యులతో స్వస్థానమగు కపిలగిరికి వేంచేసిరి. శ్రీ సద్గురుదేవు లొసగిన వేదాంతప్రబోధమునే వెంకటేశ్వరమూర్తి మననము చేయుచు తదేకనిష్ఠతో స్వగృహమందే కొన్నిరోజులు భక్తి సాధనలు ప్రారంభించిరి.

## శ్రీ మహాలక్ష్మీదేవి బంధుతృప్తికై సత్యమును సమర్థించుట

ఒకరోజున శ్రీ మహాలక్ష్మీదేవిగారి గృహమునకు బంధువులు వచ్చిరి. వారిని గౌరవించి క్షేమములు విచారించగ "అమ్మా! మేము శ్రీహరి కృపచే క్షేమముగా నున్నాము. ఒక వార్త విన్నాము. నీ వెంత భక్తురాలివైనను కన్నకుమారుని గురుదేవుల కొప్పగించుట తగునా! ఎట్టివారైనను ఇట్టిపని చేయుదురా? పది పదారేడుల ప్రాయముగల ఆ బాలుని వదలి యెట్లు జీవించెదవమ్మా!"యని పరిపరి విధముల బోధించి బాధింపసాగిరి.

వీరి బోధ లన్నియు నామెహృదయమునకు తీరని బాధ గలిగించినవి. ఆమె వారితో–"తెలియక సంభాషించుచున్నారు. నేను లోకోద్ధరణకై నా కన్నకొమరుని సద్గురు దేవులకు నిష్కల్మషహృదయముతో సర్వార్పణ చేసితిని. నా దోసమేమియు లేదు. అంతయు ఈశ్వరేచ్ఛ!

"ఆ సర్వేశ్వరుడు మన పురాకృతకర్మల ననుసరించి ఆడించెడి నాటకములలో మనము జాగరూకత వహించి భక్తితో రక్తిగా పాత్రను పోషింపవలయును. పాత్రపోషణము చక్కగా నిర్వర్తించి జగన్నాటక సూత్రధారియగు ఆ పరమాత్మను ఆనందింప చేయవలయును. ఇదియే మానవకర్తవ్యము.

"నేను నా కుమారుని ఒక సంవత్సరమునకు బంపించెదనని గురుదేవులతో వాగ్దానము చేసితిని! ఐదు సంవత్సరములవరకు నా వద్దనే

కుమారుని నుంచుకొన్నను నా సద్గురుస్వామి యేమియు సంశయింప" రనునంతలో వీరనృసింహశక్తి యామె శరీరమున ప్రవేశించి చేష్ట లుడుపగా నామె పడిపోయెను. తత్క్షణమే సద్గురుశక్తిద్వారా యామె నోటినుండియే బిగ్గరగా "ఉంచుకొందువులే-చూచెదనుగా" యనెడి పలుకులు వెలువడినవి. మరుక్షణమే బాహ్యస్మృతి గలుగ నీదృశ్య మంతయు వీక్షించెడి బంధువులెల్లరు నామెనోటినుండి వెలువడిన దివ్య వాక్యము లామెకు విన్నవించిరి. ఆమహాతల్లి త్యాగబుద్ధితో "శ్రీసద్గురు దేవుని ఇచ్ఛ యట్లున్నది, మన మేమి చేయగల"మని చెప్పెను. ఆమె ధర్మనిర్ణయమునకు చూచువా రెల్లరు విస్మయమందినారు.

సంవత్సరములోపలనే యిట్టి సంఘటన లెన్నో జరిగెను. మహో త్తర పరిణామ మొందవలసిన పుత్రునిగూర్చి మనస్సున 'ఆహా! పవిత్రమూర్తియగు నా కుమారుని వదలి నే నెట్లు భరించగలను. సంవత్సరము వెళ్ళిన తదుపరి కొంతకాలమునకు గురుదేవుల కొప్పగించ వచ్చునులే' యని ఆమె హృదయమున దలచినది. వెనువెంటనే యోగీశ్వరుడు కావలసిన వెంకటేశ్వరున కీ కారణముగా నప్పటికప్పుడే విపరీతమగు శిరోవేదన ప్రారంభమై అమిత బాధ ననుభవించుచుండెను. ఆ ముద్దుకుమారుని చూచి మనస్సున గురుదేవుని ధ్యానించి క్షమా భిక్షనర్థించి "స్వామీ! తమ కిచ్చిన మాటప్రకారము సంవత్సరము నకే నా కుమారుని తమ కర్పించెద"నని వేడుకొనగా నా క్షణమే కుమారుని శిరోవేదన మటుమాయమై ప్రసన్నవదనముతో ప్రకాశించి నాడు. దైవవిధి యనగా నిట్టిదే కాబోలు! మానవయత్నము లెన్ని చేసినను దైవదృష్టి ప్రసరింపనినాడు వృథాయేగదా!

మాతృదేవి బంధువులవైపు జూచి "చూచితిరా! కుమారుని బాధ! ఈ బాధజూచి నోర్వలేక నా తండ్రి సుఖముగానున్న యదే పదివేలనుచు భావించితిని. భోగి గాకపోయినను యోగియై పవిత్ర

జీవితము గడిపిన నంతేచాలును. చూచియానందించగలనని సంకల్పించు కొంటిని. ముద్దుకొమరునిపై మమకారములేక గా"దని ఆమె సమాధానము చెప్పినది.

బంధువులెల్లరు నేమి మాటాడుటకు పాలుపోక తలలూపిరి. తల్లి వాక్యములు వినెడి వెంకటేశ్వరమూర్తి "అమ్మా! వారి యమాయికపు వాక్యములు విని నీ చిత్తమును చలింపనీయకుము. సద్గురుదేవులతో వాగ్దానముచేసితివి. ఆ వాగ్దానము నెరవేర్చుటయే మానవత్వము. చుట్టములాడు వాక్యములకు అర్థములులేవు. పోతన మహాకవి భాగవతమున 'చుట్టాలు దొంగలు, సుతులు, ఋణస్థులు, ధనములస్థిరములు, కాంతలు సంసారకారణము'లని చెప్పిరి. వీరందరు స్వార్థాపేక్షకు చిక్కుకొని సుజ్ఞానమును తెలిసికొనలేక తెలిసికొనుటకైనను యత్నించక యజ్ఞానప్రవృత్తితో సత్యమైన పరమాత్మ నసత్యమనుకొని యసత్యమగు నీ ప్రపంచమును సత్యమని నమ్మి, యర్థమునకై పరమార్థమును విస్మరించి వ్యర్థమగు మాటలతో నమూల్యమగు కాలమును దుర్వినియోగము చేయుచు కాలమను నుర్రితాటియందు చిక్కుకొని విడివడు మార్గము గానక సద్గురువుల నాశ్రయింపక సంసార మోహములకు గుఱియై నశించెడి వారి మాటలతో ప్రయోజన మే"మని చెప్పెను. కుమారుని వేదాంతవాక్యముల కెంతయో సంతసమంది, మాతృశ్రీ వెంకటేశ్వరమూర్తిని గాఢాలింగనము చేసికొనెను.

వెంకటేశ్వరమూర్తి పరమేశ్వరునియం దపారప్రేమచే దేవునకు ఫలములు నివేదన చేయుటకు ముందే, స్వామికి తీపిగానుండు పండ్లనే నివేదన చేయవలయు ననెడి సుసంకల్పముతో పండ్లను రుచిచూచియే నివేదన చేయుచుండును. రోజుకు నాలుగుసార్లు భోజనము చేసెడి ఈ బాలభక్తశిఖామణి, జ్ఞానోపదేశమైన రెండుమాసములకే భోజనము పూర్తిగా మానివేసిరి.

## శ్రీ వేంకటేశ్వరమూర్తి మనస్సు పూర్తిగా మారిపోవుట

సద్గురు కృప గలుగనినాడు తీవ్రకృషి సల్పినను కార్యములు సిద్ధింపవు. సద్గురు కృప గలుగవలెనన్న భక్తుని హృదయము విశాలమై ప్రకాశింపవలయును. అనేక జన్మల సముపార్జిత పుణ్యఫలమువలనగాని సద్గురుకృప లభించునని మన ప్రమాణములు వాకొనుచున్నవి. షోడశ వర్ష ప్రాయముననే మార్కండేయునివలె నఖండభక్తిసాధనతో కాలము గడుపుచున్న యీ బాలుడు ఆహారమును వర్జించుట యెంతటి ఆశ్చర్యమో తమరే గమనింపుడు.

సోదరుడగు కోటయ్య తన తమ్ముని అన్నము తినిపించవలయునని విశ్వప్రయత్నము చేసి యపజయమునే పొందెను. భోజనము చేయించుట ఆతనికి చేతకాలేదు. మధురపదార్థములను దినిపింపవలయునని లడ్లు హల్వా జిలేబీలు తెప్పించి వెంకటేశ్వరమూర్తి ధ్యానము చేసెడి గదియందుంచిరి.

ఆ పుణ్యమూర్తి ఫలహారములపై నణుమాత్రమైన మనస్సుంచక భగవంతునియందే మనస్సు నిల్పియుండిరి. ధ్యాననిష్ఠయందున్న సోదరుని గాంచి యాశ్చర్యముతో "తల్లీ! నా తమ్ముని ధ్యాననిష్ఠను వీక్షించితివా! పోయి దర్శింపు" మనెను. మాతృదేవి బాలుని మనోభావమును దర్శించి "నాయనా కోటయ్యా! నీ సోదరుని మనస్సు భగవంతునిపై కేంద్రీకరించినది. నీ ప్రయత్నములు మానుము. సర్వేంద్రియ ప్రవృత్తుల నరికట్టిన నీ తమ్ముని త్యాగశీలాదులను గ్రహింపవైతి"వని చెప్పెడి సమయమందే వెంకటేశ్వరమూర్తి ధ్యాన సమాధిని వీడి మాతృదేవి పాదముల వ్రాలెను.

వెంటనే పెద్ద కుమారుని బిలచి "నాయనా! ఈ పరీక్షను దర్శింపు"మని చెప్పి వెంకటేశ్వరుని 'నోరు తెరువుము నాయనా' యనెను. ఆ పరమపవిత్రమూర్తి నోరు తెరువగా, మాతృదేవి పుత్రుని నాలుకను తడివి చూచినది. నాలుకపై నేమాత్రము తడిలేక ఆరి

యుండెను. ఆహా! ఏమి నిదర్శనము ? మాతృదేవి పరీక్ష శల్యపరీక్ష యని వేరుగా వ్రాయవసరము లేదు. మధురాతిమధురమై చవు లూరించెడి రకరకములగు పదార్థములెల్ల నా బాలునికి నలువైపుల ప్రత్యక్షమగుచుండెను. వానిపై భ్రాంతియున్నచో నోరైన నూరును గదా యని తల్లి యీ పరీక్ష చేసినది.

సోదరుడగు కోటయ్య తన తమ్ముని మనస్సు సంగీతములో మేళవించిన మారునని యోచనచేసి ముందుగా నాతడే హార్మోనియము నేర్చుకొని తమ్మునకు "స రి గ మ ప ద ని" స్వరము లభ్యాసము చేయు వలయు నని సంకల్పించిరి.

శ్రీహరి పాదపద్మములపై లగ్నమొందిన మనస్సును పనికిమాలిన యీ వైహిక సంగీతము నాకర్షించునా ! సంగీతమునకు మూలమై వెలుగొందెడి నేడక్షరముల భావమును, సంగీతవిద్వాంసులైనను సరియైన రీతిగా పరిశీలన చేసియుండలేదేమొ ! త్యాగరాజాది మహనీయులు మాత్రమే వాని యంతరార్థమును పరిశీలనచేసి యనుభవముతో నాత్మానందమును పొందిరి.

మానవదేహమున ఆధార స్వాధిష్ఠ మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞేయ సహస్రారములను నేడు చక్రములు గలవు. ఆ చక్రములపై నుండెడి బీజాక్షరములనే గీతముగా మార్చి సంయోగమను సంగీతము మేళవించి యాత్మవీణపై ప్రణవమును ప్రయోగించెడి యోగము గల యీ వెంకటేశ్వరయోగి భావి జీవితపరమార్థ తత్త్వమును గుర్తింప లేకపోయిరి.

తమ్ముని మనస్సు నణుమాత్రమైనను మార్చశక్తి లేక, కోటయ్య మరుక్షణమే మార్కాపురము చేరి సమీపమందు కపిలగిరిపై ప్రశాంతవాతావరణమున వెలుగొందెడి శ్రీ యోగానందమహర్షిని నాశ్రయించి తన సోదరుని స్థితినంతయు విన్నవించిరి.

శ్రీ యోగానంద సద్గురు దేవులు శ్రీ మహాలక్ష్మి దేవి హృదయా వేదన శాంతింప చేయుటకై యొక లేఖను వ్రాయించిరి. "పరమేశ్వరుడే యుపాధిచే నే యే కార్యములు చేయుటకు నిర్ణయించెనో యా కార్యములన్నియు నా ఉపాధి విధిగా నిర్వర్తింపవలయును. జన్మాంతర సంస్కారమున నవతరించిన యోగిసత్తముడవగు ఓ! వేంకటేశ్వరా సద్గురునాజ్ఞ పాటింపుము. శ్రీ మహాలక్ష్మి లభవిష్యముకలదు. అన్నము తినుటవలన చెడిపోవునది లేదు. నీవు ఒంటిపూట భోజనము చేయ వలసినది. ఇది నీ యిష్టదైవమగు సద్గురునాజ్ఞ!" ఈ విధముగా లేఖ పూర్తిగావించి ప్రియశిష్యుడగు కోటయ్యచేతి కందివ్వగా సీతమ్మజాడ దెలిసిన శ్రీ యాంజనేయునివలె పర్వులు దీయుచు స్వగృహము చేరి ప్రియసోదరున కొసంగిరి. అన్నగారు కొనివచ్చి యిచ్చిన సద్గురువుల లేఖను విప్పిచూచి "సద్గురు దేవుల మాట-వరహాలమూట. ఒంటిపూట భోజనము నా కర్తవ్య"మని శ్రీ వెంకటేశ్వరమూర్తి గుర్తించిరి.

## శ్రీ సద్గురు దేవులు ప్రియశిష్యులను చూచుటకై వినుకొండకు వేంచేయుట

శ్రీ యోగానందమూర్తి ప్రియశిష్యులగు చేవూరి హనుమయ్యగారి గృహమునకు వెళ్ళవలయునని సంకల్పించుకొని తక్షణమే వినుకొండ కరుదెంచి భక్తుని గృహమునకు దయచేసిరి. శ్రీమహాలక్ష్మిదేవి యఖండమగు ప్రేమతో శ్రీమన్నారాయణుడే మన గృహమున కరుదెంచిరను దృఢవిశ్వాసముతో నర్ఘ్యపాద్యాది విధుల పూజించిరి.

శ్రీ మహాలక్ష్మిదేవి సోదరులగు శ్రీ కోటయ్య, శ్రీ లక్ష్మినారాయణులకు సద్గురు దేవులు వచ్చిరను విషయమును తెలియజేసెను. ఇర్వురుసోదరులు నమితోత్సాహమున నప్పటికప్పుడే ప్రయాణమై యక్కగారి గృహమున కరుదెంచిరి. సాక్షాత్ శ్రీ వైకుంఠవాసుని వలె ప్రకాశించెడి సద్గురు దేవుకు ప్రణామము లర్పించిరి.

శ్రీ స్వామివారు వారి వినయ సౌశీల్యాదులను గుర్తించి "ఓ! మహాలక్ష్మీదేవి! వీరు నీ సోదరులా?" యనిరి. ఆ తల్లి చేతులుమోడ్చి "స్వామీ! త్రికాలజ్ఞులు తమకు తెలియనిదేమున్నది! వీరు నా సోదరులే. తమవలన జ్ఞానోపదేశమును పొందవలెనను సద్వాంఛతో తమ రాక తెలియగనే హంసలవలె తమ పాదకమలములసన్నిధికి చేరి" రని చెప్పెను. స్వామి యానందమును పొంది "తల్లీ! నీవుగాక నీ సోదరులను తరింపచేయ ప్రయత్నించుచున్నావు. ముందుముందు నింకెందరిని తరింపచేయ సంకల్పించెదవో నీవు ధన్యజీవి" వని మహాలక్ష్మీదేవిని పొగడిరి.

## శ్రీ కోట కోటయ్య శ్రీ లక్ష్మీనారాయణాది భక్తులు జ్ఞానోపదేశమును పొందుట

ఆనాటి సాయంత్రమున గురుదేవులు శ్రీ కోట కోటయ్యగారికి జ్ఞానోపదేశము చేసిరి. మరునాటి యుదయమున శ్రీ లక్ష్మీనారాయణునకు జ్ఞానోపదేశము చేయుటకై పద్మాసనాసీను గావించి హస్తమున శుద్ధగంగ నిడి యందులో వత్తిని వేసి జ్యోతివెలిగింప చిటచిటమని హస్తముననే జ్యోతి యారిపోవుటకు సంసిద్ధమైన నరచేతిలో జ్యోతి యారకపూర్వమే సద్గురుమూర్తియే యా జ్యోతిని తీసి వేసిరి.

"నాయనా లక్ష్మీనారాయణా! నీ చేతిలో జ్యోతి యారి పోవుటకై కంపింపదొడగిన కారణమేమో తెలియచేసెద" ననిరి. జ్ఞానోపదేశ మొనరింపకయే సద్గురు సార్వభౌములు కొండ క్రిందిభాగమున కోటిదాసు తోట లోపలకు వెళ్ళి ప్రశాంతస్థలమున కూర్చొని యోగదృష్టితో పరిశీలనచేసి లక్ష్మీనారాయణ భవిష్యజ్జీవితము నెరింగి యా సాయంత్రమున శ్రీ హనుమయ్యగారి గృహమునకు వేంచేసి యెందరో భక్తులాసీనులై యున్నసమయమున "నాయనా లక్ష్మీనారాయణా! నీ చేతిలో జ్యోతి కంపించిన కారణము నేను యోగదృష్టిచే సర్వము దర్శించితిని. నీకు ముప్పదియేడవ సంవత్సరమున

మృత్యురూపమగు నొకగండ మున్నది. అది కడుదుస్తరమైనది. ఐనను భయము లేదు. నే నుపదేశించెడి మహామంత్రమును నీవు నియమబద్ధముగా, నిష్ఠతో జపించినయెడల నిన్నామృత్యు వేమియు చేయలేదు. జాగరూకత కలిగి భక్తిజ్ఞాన వైరాగ్యములతో సత్యమును దప్పక సంసారయాత్ర సాగించి శ్రీహరి కృపకు పాత్రుడవు గ"మ్మని ప్రబోధము చేసి వెంటనే జ్ఞానోపదేశము గావించిరి. శ్రీ మహాలక్ష్మిదేవి బంధువులలో నెందరికో శ్రీ యోగానందమూర్తి జ్ఞానోపదేశము గావించిరి.



శ్రీ కోట కోటయ్యగారు

వినుకొండ పురనివాసులు, సూక్ష్మబుద్ధిగలవారు, సహృదయులు శ్రీ గంగిశెట్టి గురునాథము శ్రీ కనమర్లపూడి మల్లిఖార్జునతో "విన్నావా! మన ప్రాణమిత్రుడగు శ్రీ చేవూరి కోటయ్య శ్రీ తోకపల్లి స్వామివారి పాదసేవలు చేసి వారి కృపకు పాత్రుడై జ్ఞానోపదేశమును పొందిరి. మనము నీ క్షణమే యా యోగమూర్తిని దర్శించి వారి కృపకు పాత్రులమై తరింతము. ఎన్ని శాస్త్రములు వల్లించినను, సర్వ

యాత్రలు సేవించినను, ధనధాన్యభోగభాగ్యసంపద యెంత యుండినను సద్గురు దయ పొందనిచో ప్రయోజనము లేదు. సున్నా లెన్ని చేర్చినను మొదట నొకసంఖ్య లేకపోయినచో నాసున్నాల విలువ సున్న యే! అటులే ఎంత తెలివి యున్నను సద్గురు దయ పొందనిచో మానవుని తెలివితేటలన్నియు నెండమావులవలె నిరర్థకమౌను. మన మీ క్షణమే సద్గురుని దర్శింత"మని వా రిర్వురు పూజాద్రవ్యములు తీసుకొని శ్రీ మహాలక్ష్మిదేవి ఇంటి కరుదెంచిరి. బ్రహ్మవర్చస్సుతో ప్రకాశించెడి శ్రీ సద్గురుదేవులను దర్శించి పూలు పండ్లు నొసగి స్వామివారి పాదకమలములపై ప్రణమిల్లిరి.

త్రికాలవేదియగు సద్గురుమూర్తి వారి హృదయ పరివర్తన గుర్తెరిగి వా రిర్వురకు జ్ఞానోపదేశము చేసి యాత్మప్రబోధము చేసిరి.

"దైవాత్మ స్వరూపులారా! సద్గురూపదేశము పొందిన నేముక్తి కలుగదు. సద్గురు మంత్రమును నిష్ఠతో నియమబద్ధముగా భక్తితో జపించుచు భగవద్దర్శనమునకై తపించుచు సద్గురు ప్రబోధవాక్యములను మననము చేయుచు జీవితాంతము వరకు నాచరణలో నుంచుకొని సర్వ భూతాంతరాళములయందు ప్రకాశించెడి పరమాత్మ యొకడే యను భావముతో నే యితరప్రాణుల నే విధమగు హింసల పాల్సేయక పరధనములను మట్టిపెళ్ళలవలె పరకాంతలను మాతృమూర్తులవలె జూచుచు నసత్యమును విడనాడి సత్ప్రవర్తనతో సత్యముతో ధర్మజీవనము చేయుచు నిష్కల్మష దైవభక్తి గలిగి సర్వమానవ సౌభ్రాతృత్వము హృదయముల నెలకొల్పి బీదసాదల నాదరించుచు శక్త్యానుసారముగ పుణ్యకర్మ లొనర్చుచు జ్ఞానమార్గమున ప్రయాణము సాగించి మానవ జీవితపరమావధిని గుర్తించి సంసారబంధములను మొదలంట త్రుంచి సర్వప్రాణులు తమవంటివే యని జాతిమత భేదములను నిర్మూలనము చేసి ప్రేమమూర్తియగు సర్వేశ్వరుని సర్వకాల సర్వావస్థలయందు

ధ్యానమొనర్చుచు కాలమును సద్వినియోగము చేయుము. ఇదియే భక్తి యోగమునకు ప్రథమ సోపాన"మని గురుదేవులు వారికి ప్రబోధము చేసిరి.

శ్రీ సద్గురు ప్రబోధము విసిన మిత్రులిర్వురు సంతోషచిత్తులై సద్గురునకు నమస్కారము లొనర్చి సెలవుగైకొనిరి.

శ్రీ యోగానందమూర్తి వినుకొండ నుండి అబ్బూరుకు వేంచేసిన ప్రియశిష్యుల యోగక్షేమములు విచారించి కొన్ని దివసములట నివసించి అబ్బూరు నుండి స్వస్థానమగు కపిలగిరి కేగిరి.

## శ్రీ సద్గురువులకు శ్రీ మహాలక్ష్మీదేవి కన్నకుమారు నర్పించుట

శ్రీ యోగానందమూర్తి కపిలగిరిపై కపిలమహర్షివలె ప్రకాశించుచుండిరి. శ్రీ మహాలక్ష్మీదేవి యపారభక్తితో గురుదేవులను హృదయమునందు చేర్చి తామరాకుపై నీటికణమువలె సంసారము నంటక మెలగుచుండెను. గురుదేవుల కిచ్చిన వాగ్దానపు గడువు సమీపము కాజొచ్చెను. "ఆహా! ఏమి ఆ త్యాగమూర్తి సత్యసంపద! శ్రీ యోగానంద నరసింహ యోగీంద్రులు సంవత్సర మగుసరికి వినుకొండకువచ్చి భక్తిజ్ఞాన వైరాగ్యములను ముప్పురు పుత్రులతో సంసారయాత్ర సాగింపుచు సత్యమార్గమున సంచరించెడి శ్రీ మహాలక్ష్మీదేవిగారి గృహమున కరుదెంచిరి.

ఆదర్శదంపతులగు శ్రీ హనుమయ్య మహాలక్ష్మీదేవియు గురుదేవులకు పాదాభిషేకము చేసి సుఖాసీనుని గావించి పాదాభివందనము లొనర్చిరి. అంతలో గురుదేవులు "తల్లీ! సంవత్సర మీనాటితో పూర్తియైనది. నా బిడ్డను నా కిచ్చివేయుము. శాశ్వతకీర్తిని సంపాదింపు"మనిరి.

"స్వామీ! తమయాజ్ఞ ప్రకారమే నా ప్రియతనూజుని తమ వెంట బంపించెద"నని శ్రీ మహాలక్ష్మీదేవి చెప్పెను. ఈ వాక్యము లన్నియు వినెడి దయార్ద్రహృదయుడగు కోటయ్య కన్నీరుగార్చుచు

గద్గద కంఠముతో "మా తల్లికేమి దెలియదు ! నా సోదరమూర్తిని వీడి క్షణమేని నిలువజాలము స్వామీ !" యనుచు బాలభక్త శిఖామణియగు వెంకటేశ్వరుని గాఢాలింగనము చేసికొనెను. కుమారుని గాఢబద్ధానురాగమును వీక్షించుచున్న మాతృదేవి గురుపాద పద్మములపై చిత్తమును చేర్చి మౌనము వహించెను.

"ఆహా ! నా కుమారుడు మహాయోగి యౌనుగదా ! ఆ మహాయోగివలన మా జన్మలు చరితార్థములై మా వంశము పవిత్రమౌను. ఇంతకన్న కావలసినదేమున్న"దని ప్రశాంత చిత్తముతో నా తల్లి మహానందానుభూతి నొందుచుండెను.

ఈ దృశ్యమంతయు వీక్షించెడి శ్రీ యోగానందమహర్షి "నాయనా కోటయ్యా ! మీ మాతృదేవి నీ సోదరుని నా కిచ్చెదనని వాగ్దానము చేసెను. ఆ గడువునకు విచ్చేసితిని. మీ మాతృదేవి నాతో బాలు నివ్వలేమని చెప్పినచో వెళ్ళిపోయెదను. బలవంతము చేయువారము కాము. సన్యాసులము. ముందు జరుగనున్న విషయ మొకటి చెప్పెదను. శ్రద్ధతో నాలించి మీ యిచ్ఛవచ్చినరీతి మెలగుడు. మీ రాడినమాట ప్రకార మా బాలభక్తుని నా ముద్దుకుమారుని నా కొసంగినచో నా యొద్దనే యుంచుకొని పరతత్త్వమును గ్రహింపచేసి యోగరహస్యము లన్నిటిని కరతలామలకము చేసెదను. మీరు నా వాక్యములను గ్రహింపక మీ రాడిన సత్యవాక్యముల విడనాడి పుత్రవ్యామోహమునకు గురియై యీ బాలుని మీ యింటియందే స్థిరముగా నుంచుకొనదలచిన నా ప్రళయావతార వీరనృసింహశక్తియే మీ బాలుని హృదయ కుహరమున చేరి ఘోరారణ్యసీమలకు గొంపోయి యే కొండగుహలలోనో దాచి రక్షించును. అట్టి సమయమున మీ రందరు నా బాలయోగి కొరకు పలుమారులు కలవరించినను, పలవరించినను ప్రయోజనము లేదు. నే నాదేశించిన యీ రెండు విధానములలో నేది శ్రేయస్కరమో మీ బుద్ధిని వికసింపచేసి, కార్యనిర్ణయము గావింపు"డని అనుజ్ఞనిచ్చిరి.

"సద్గురు నాదేశమును వినిన కోటయ్య యాపర్ణసతీమణి శ్రీమహాలక్ష్మిదేవి, నిష్కపటహృదయులు నిత్యసంతోషియగు శ్రీ హనుమయ్య శ్రేష్ఠి మొదలగువారలు బ్రహ్మఋషుల వాక్యములకు భిన్నముసే లేదని గుర్తించినవారైరి. అందరు నేకాభిప్రాయులై నిష్కల్మషహృదయములతో నఖండమైన గురుభక్తితో నా సాధుమూర్తియగు వెంకటేశ్వరుని బంపించుటకై సమ్మతించిరి. గురుదేవులు వారి నిశ్చితాభిప్రాయమునకు సంతోషించిరి.

## శ్రీ యోగానందమూర్తి శ్రీ లక్ష్మీనృసింహస్వామి జయంతి చేయుట.

భవనామ సంవత్సర వైశాఖశుద్ధ చతుర్దశిన మార్కాపుర సమీపమున కపిలగిరిపై శ్రీ యోగానంద సద్గురుదేవులు శ్రీ లక్ష్మీనృసింహస్వామికి జయంతిమహోత్సవములు గావించెదరను విషయమును తెలిసికొని యా మహోత్సవముల కన్నులార దర్శించి, తరించవలయునను కోర్కెతో శ్రీ మహాలక్ష్మిదేవి తన కుటుంబసమేతముగా ప్రయాణమై సద్గురుదేవుని నివాసస్థానమగు కపిలగిరికి పోయిరి.

ఆమె 'త్యాగేన మోక్షః' అనెడి సద్గురు వాక్యమును మదిదలచి కన్నకుమారుని వెంకటేశ్వరుని సద్గురుదేవులకొప్పగించి హృదయపూర్వక నమస్సు లర్పించి సద్గురు దయకు పాత్రురాలయ్యెను. నృసింహజయంతి మహోత్సవములు కన్నులార దర్శించి జయంతి వెళ్ళిన మరునాడే సద్గురువులవద్ద సెలవు గైకొని స్వగృహము చేరెను.

శ్రీ మహాలక్ష్మిదేవి గ్రామములో నడుగిడగనే ఆప్తమిత్రులు కొందరు వచ్చి "ఆహా! ఎంతపని చేసితివమ్మా!" యని కన్నీరుగార్చిరి. వారిని చూచి "అమ్మా! నాపై ప్రేమచే మీ రందరు నిట్లు జాలినొందుచున్నారు. ఆనందాశ్రువులు విడువవలసిన సమయమున దుఃఖాశ్రువులను రాల్చుచున్నారు. ఇదేమి వెఱ్ఱి! కలిదేవత మిమ్మావహించెనా యేమి? సర్వాంతర్యామియగు శ్రీమన్నారాయణమూర్తి

యొసంగిన బిడ్డను పరోక్షదైవమగు నా సద్గురుదేవుల కొసంగితిని. అన్యుల కొసంగితినా ? ఈ ప్రపంచమున నెంత కాలము జీవించగలము ? 'నీటిపై బుడుగలవలె, గాలిలో దీపములవలె, మేఘములమధ్య మెఱపు కాంతులవలె పాంచభౌతికమగు నీ దేహము నశించునదే ! ఎన్నటికి నశించక చావుపుట్టుకలులేని నిత్యానందమగు బ్రహ్మావిద్యాభ్యాసము నకై, నా పియపుత్రుని సద్గురుస్వామికి సర్వార్పణదృష్టితో సమర్పించితిని. ఇక నాకేమి చింత ! మా యోగక్షేమములు గురుదేవులే చూచెద"రనెడి వేదాంతవాక్యములు బంధువులకు విన్నవించ వారెల్లరు విస్మయమంది "తల్లీ ! ఇట్టి సద్గుణనిధి వగుటచేత నిట్టికార్యము నిర్వహించుచుంటి"వని యామె పాదములకు ప్రణమిల్లిరి.

శ్రీ సద్గురుదేవుల పాదసన్నిధియందున్న వెంకటేశ్వరమూర్తి మాతాపితరులను సోదరసోదరీమణులను వదలి నిరంతరము సద్గురుసేవ లొనర్చుచు గిరికి సమీపమున ప్రవహించెడి కుండికానదికి వెళ్ళి కాల కృత్యములు నెరవేర్చి స్నానమొనరించి శుచియై గిరిపైనున్న లక్ష్మీ నృసింహాలయమున ప్రవేశించి ధ్యాననిష్ఠలో నిమగ్నులైరి.

ప్రతిదినము బ్రాహ్మీముహూర్తమున లేచి ధ్యానయోగమున నిమగ్నులై మధ్యాహ్నమొంటిగంటవరకు ధ్యానావస్థలోనే యుండెదరు. ఐహిక బంధములకు తిలోదకములిడి యాముష్మికచింతతో సద్గురువే శ్రీ మన్నారాయణమూర్తి యని దృఢనిశ్చయముతో మార్కండేయుని వలె నచంచల దైవభావనతో సద్గురుదేవులను ప్రేమించుచు, నృసింహాలయమున నేకాంతముగా కూర్చొని కన్నులు మూసికొని ధ్యాననిమగ్నులైయున్న సమయమున నా బాలునకు 'ఓం' యను ప్రణవధ్వని వినవచ్చినది. ఆ ధ్వనిని ప్రశాంతముగా వినుచున్నంతలో పెద్ద సుడిగాలి చుట్టును ప్రదక్షిణము లొనర్చి యా ప్రణవధ్వని శబ్దస్వరూపముతో బ్రహ్మరంధ్రముద్వారా హృదయమున ప్రవేశించెను.

ఈ సంఘటన జరిగిన మరుక్షణమే యొక సిద్ధపురుషుడు దిగంబరియై బ్రహ్మవర్చస్సుతో ప్రకాశించుచు వెంకటేశ్వరమూర్తికి దివ్యదర్శనమిచ్చిరి. ఈవిషయమును సద్గురుదేవులగు శ్రీయోగానందమూర్తికి విన్నవింప సద్గురుదేవులు "నాయనా! వెంకటేశ్వరా! నీవు దర్శనమిచ్చిన సిద్ధమూర్తి యెన్నో వందల సంవత్సరములనుండి యీ పవిత్రస్థలమున వేంచేసియున్నారు. పెద్దకాలము తపస్సుచేసి సిద్ధిబొందిన మహనీయమూర్తియగు నా సిద్ధమూర్తి నా కెన్నోసారులు దర్శనమిచ్చిరి. వారు-నేను పరతత్త్వరహస్యములను ముచ్చటించుకొని యాత్మానందముతో పరవశత్వస్థితిలో కొన్నిరోజులు అట్లే యుండెడివారము. ఆ ప్రేమమూర్తి నాకు ప్రియమైన భక్తశిఖామణి వగు నీకు మాత్రమే దర్శనమిచ్చిరి. నీవు మిక్కిలి పుణ్యమూర్తివి. నీకును నాకును భేదము లేదు. ఆ సిద్ధమూర్తి దివ్యదర్శనమును నీవు పొందుటయే యిందులకు ప్రబలనిదర్శన" మని చెప్పిరి.

శ్రీ వెంకటేశ్వరమూర్తి యాశ్చర్యమానసుడై గురుదేవుల పాదపద్మములపై వ్రాలిరి. గురుసార్వభౌములు ప్రియశిష్యునకు యోగరహస్యము లన్నియు దెలిపిరి. 'గురుదేవుడే సర్వస్వ' మని యపార కరుణారస ముప్పొంగ గాఢాలింగన మొనర్చుకొని వారి హృదయ వీణపై ప్రతిధ్వనించెడి ప్రణవనాదమును వినుచుండెడివాడు. గురుదేవుని యపార కరుణకు పాత్రుడై యా పవిత్ర ప్రశాంత వాతావరణమున మూడు మాసము లుండిరి. మూడు మాసములు సమాప్తి చెందగనే, మాతృదేవియగు శ్రీ మహాలక్ష్మీదేవి, సాధుమూర్తి యగు గారాబుపట్టిని కన్నులార దర్శింపవలె నని సంకల్పము కలుగగా జ్యేష్ఠ పుత్రుడగు కోటయ్యను బిలిచి "నాయనా! నా ద్వితీయ రత్నమగు వెంకటేశ్వరుని దర్శింపవలయు నని నా మనస్సు పరవళ్ళు త్రొక్కుచున్నది. ఈ క్షణమే నీవుపోయి నీ సోదరుని తీసికొనిరమ్మ"ని చెప్పగా, సద్గుణనిధి యగు కోటయ్య, మాతృదేవికి హృదయాంజలి ఘటించి సెలవు తీసికొనిరి.

## సోదరుని తీసికొనివచ్చుటకు కోటయ్య వెళ్ళుట

శ్రీ కోటయ్యా వినుకొండనుండి సద్గురుదేవుని కొండకు వెడలి శ్రీ యోగానందమూర్తికి ప్రణామము లర్పించిరి. సద్గురు సార్వభౌములు పాదములపైనున్న శిష్యుని లేవనెత్తి యత్యాదరమున "నాయనా కోటయ్యా! మీ మాతృదేవి యొనర్చెడి దైవారాధన నిరాఘాటముగా సాగుచున్నదా!" యని అడిగిరి. "ఓ స్వామీ! తమ యపారకరుణామృత దృష్టిచే మేమెల్లరము ప్రశాంతముగా నున్నాము స్వామీ!" యని మౌనమున కోటయ్యా చేతులు జోడించి నిలువబడియెను. "నాయనా! నీవు వచ్చిన కారణము దెలుపవైతివి. మాతో తెలుపుటకై సందేహించు చున్నావా? కన్నతండ్రియొద్ద ప్రియపుత్రునకు భయమే"మని కోటయ్యను దగ్గరకు చేర్చుకొని వారి యమృతహస్తముతో శరీరమును నిమురుచున్న సమయమున "సద్గురుదేవా! నా సోదరుని చూడవలయునని మా మాతృదేవి కాంక్షించుచున్నది. తమ యాజ్ఞయైనచో నా సోదరుని తీసికొనివెళ్ళెదను స్వామీ" యని కోటయ్యా విన్నవించెను.

శ్రీసద్గురుదేవులు "నాయనా కోటయ్యా! బాహ్యదృష్టితో నీ బాలయోగిని సోదరుడని సంబోధన చేయుచుంటివా! నీ సోదరుడు సర్వమానవసోదరుడు, సర్వభూత సమవర్తి, సద్గురువులను దైవభావముతో చూచెడి యపర ప్రహ్లాదమూర్తి. ఈ బాలయోగి యే స్థలమున నివసించినను మనస్సు నా యందే లగ్నముచేసి ప్రశాంత చిత్తముతో పరమాత్మ ధ్యానముతో వెలింగెడి సాధుమూర్తి."

శ్రీ సద్గురుస్వామి దివ్యవాక్యములు వినిన కోటయ్యా, "దేవాదిదేవా! దివ్యప్రభావా! మా పాలిటి సద్గురుదేవా! మా సోదరుని భక్తిబీజమును తమకృపారస మను శుద్ధగంగనిడి, పోషింపనెంచిన మా పాలిటి పెన్నిధివి. మా పురాకృత పుణ్యఫలము వలన తమవంటి యఖండాధ్యాత్మిక సంపన్నులు లభించిరి. తమప్రబోధము మా కుటుం

బమునకు దివ్యౌషధమయ్యెను. తమ చరణారవింద సేవయే మాకు జీవనోపాధి" యనిరి. సద్గురుస్వామి "నాయనా! మీ తల్లియెంతో పుణ్యమొనరించినది. మూడురత్నాల గాంచినది. అందులో ద్వితీయ రత్నము మిగుల ప్రకాశవంతమై మా గురుస్థానమునకు సద్యశస్సును చేకూర్చి గురుపీఠమే యలంకరించును. కాలక్రమమున నేను నుడివిన దంతయు మీరే దర్శించెదరు. ఈ నాడు మీరు మీ సోదరుని యాంత రంగిక దివ్యభక్తిని పూర్తిగా తెలిసికొనలే"రని గురుస్వామి తెలిపిరి.

శ్రీ కోటయ్య హృదయము సద్గురు దివ్యవాణి కెంతయో యానందము పొందెను. సద్గురునాజ్ఞచే సోదరుడగు శ్రీ వెంకటేశ్వర మూర్తిని తీసికొని స్వగృహమునకు వచ్చిరి. మాతాపితరులెంతో యానందమును పొంది ప్రియ తనూజుని గాఢాలింగనము చేసికొని గురుశక్తిని పొగడిరి.

## శిష్యరత్నములను చూచుటకై శ్రీ స్వామివారు వినుకొండకు దయచేయుట

కొన్ని మాసములు గడచినపిదప శ్రీ యోగానంద మహర్షి బాలభక్తుడగు వెంకటేశ్వరుని, నితర ప్రియశిష్యులను చూచుటకై కార్తీకమాసమున వినుకొండకు వచ్చి శ్రీ చేవ్రూరి హనుమయ్యగారింట బసచేసిరి. వారందరు సాక్షాత్ శ్రీ వైకుంఠవాసులే మనగృహమున కరుదెంచినారని వినిర్మలభక్తితో, సర్వార్పణదృష్టితో వారిని సేవించి, పూజించి తీర్థప్రసాదములను స్వీకరించిరి.

శ్రీ వెంకటేశ్వరమూర్తి కనురెప్పపాటేని యెడబాటు సహించక సద్గురు పాదపద్మములచెంతనే కాచి వేచికొనియుండెను. మహాలక్ష్మి దేవి సద్గురు పాదసేవ లొనర్చుచు వారి దివ్యప్రబోధమును వినవలయు నను కోర్కెతో వారి పాదపద్మముల చెంతనే యాసీనురాలయ్యెను.

శ్రీ సద్గురుని రాకవినిన తక్షణమే అన్ని పనులు వదలి ప్రియశిష్యులు శ్రీ గంగిశెట్టి వెంకటగురునాధము, శ్రీ కనమర్లపూడి మల్లిఖారునము

మొదలగు భక్తులందరు వచ్చి ఫలము లొసంగి నమస్సు లర్పించి సుఖాసీనులైరి.

సూర్యునిరాకకై కమలములు నిరీక్షించు భంగి సద్గురుదేవుల దర్శనమును కాంక్షించెడి ప్రియశిష్యులు శ్రీ కోట కోటయ్య, శ్రీ కోట లక్ష్మీనారాయణ పట్టరాని యానందముతో నతివేగముగ వినుకొండకు వచ్చి బావగారగు శ్రీ హనుమయ్యశ్రేష్ఠి గృహమున కరుదెంచి శ్రీసద్గురుదేవుల పాదములపై వ్రాలిరి. దయామయులగు శ్రీ యోగానంద మూర్తి యిర్వుర శిష్యులను లేవనెత్తి "నాయనలారా! నా రాక తెలిసికొని సంసారము నావలనుంచి వెంటనే వచ్చితిరి. మీ గురుభక్తికి సంతసించితి"నని చెప్పగ వారు "స్వామీ! తమ యపారకరుణయే మమ్ము మీ దరిచేర్చిన" దని చెప్పిరి.

శ్రీ సద్గురుదేవులకు నలువైపుల భక్తులు శిష్యులు క్రిక్కిరిసి యుండిరి. ముఖద్వారము చెంత, సద్గురు ప్రబోధము వినవలయునని జనులు గుమిగూడియుండిరి.

శ్రీ సద్గురు సార్వభౌములు శ్రీ యోగానంద నృసింహదేవులు శ్రీ వీరనృసింహోపాసకులు సామాన్యులుగాదు, సందేహము వలదు. స్వామివారు ప్రబోధము చేయునది వాచా వేదాంతము గాదు. పుస్తకపాండిత్యము కాదు. వేదవేదాంగము లన్నియు నన్ని పనులు మానుకొని యదేపనిగా వల్లెవేసి, యుపమానాలంకారాది లక్షణము లతో బల్లలు గుద్దుచు పండితపామర ప్రజానీకము నుర్రూత లూగించెడి బోధలు గావు. ఆచరణలేని బోధలన్నియు బాధలకు మాత్రమే కారణ మని ప్రతి మానవునకు తెలసినవిషయమేకదా! శ్రీ యోగానందుని బోధ బాధలను నిర్మూలనము చేసి మానవజీవితలక్ష్యసిద్ధిని గలుగ జేసెడి బోధ యని సదా జ్ఞప్తి నుంచుకొనుడు.

మన సద్గురుదేవులగు శ్రీ యోగానంద నృసింహస్వామి బోధా స్వరూప మేమనగా- వారి యాత్మజ్ఞానముతో వారి హృదయమును

మథనముచేసి యా సారము ననుభవించి, సత్యస్వరూపమగు స్వయం జ్యోతిమై కోటిసూర్యుల కాంతితో ప్రకాశించెడి పరమాత్మ సాక్షాత్కారమును పొందిన విషయమునే మనకు ప్రబోధము చేయుట. వారు ప్రబోధము చేసిన పరతత్త్వబోధను ప్రశాంతచిత్తముతో నాలించి వారి యాజ్ఞలను పరిపాలించి భగవంతుని దయను పొంది, సంసార సముద్రమున పొంగులు వారెడి సుఖదుఃఖ తరంగములనుండి విడివడి మోక్ష మను తీరమునుచేరి జరామరణములు లేని నిత్యానందమును పొందుదము. ఇంతకంటె సులువైనమార్గము మన జీవితాంతముల వరకు వెదకినను లభింపదు. మన సద్గురువు ప్రబోధము చేసెడి ప్రతి సదుపదేశము నొక రత్నము వంటిది. మానవజీవిత తరుణోపాయము నకు సూటిబాట. జన్మజన్మాంతరములనుండి జీవుల వెన్నంటి వచ్చెడి పాపారణ్యమున కగ్ని వంటిది. అట్టి మహాత్ముని యాచరణ వేదాంత సారాంశ ప్రబోధామృతపానమే! మానవ హృదయములలో నావరించిన కారుచీకటులను సర్వనాశన మొనరించి విజ్ఞానజ్యోతిని ప్రకాశింప చేయును. అట్టి పవిత్రబోధను శ్రీ స్వామివారు ప్రబోధించెదరు. జాగరూకతగలిగి శ్రద్ధతో విని మననము చేసి, యనుభూతిని పొంది యానందింపుడు.

## శ్రీ సద్గురు సత్యప్రబోధము

"ఓ దైవాత్మ స్వరూపులగు జననీ జనకులారా! శ్రద్ధతో వినుండు. జన్మక్రమమువలన మానవులందరు సమానమే. జాతిభేదము పాటింపక మనస్సునందు దైవదృష్టి నిల్పినచో నాత డన్నిజాతుల మానవులందును నుత్తమోత్తము డగును. జాతి మత లింగ భేదములు పాటింపక సమానభావముతో, నుండుటే యోగి ధర్మము. సాధన చతుష్టయసంపత్తి యనగా– నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్ర ఫలభోగవిరాగము, శమాదిషట్కసంపత్తి, ముముక్షుత్వమును తెలిసికొని 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా', 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ'

'సర్వం ఖల్విదం బ్రహ్మ' యనెడి, వేదాంతవాక్యములు తెలిసికొని, ధర్మము, అర్థము, కామము, మోక్షము అను నాలుగు పురుషార్థములలో కడపటిదగు మోక్షమును పొందుటకై మొదట పేర్కొనిన ధర్మముతో, మధ్యనున్న అర్థకామాదులను త్యజించుటే జ్ఞానమున్నందుకు ఫలము. మోక్ష మనగా నెక్కడో యాకాశములో లేదు. రాత్రింబవళ్ళు సంసార వ్యామోహములో బడి నీ-నా భేదములతో చరించెడి మానవుడు సంసార పాప పంకిలమునుండి విడివడుటే విముక్తి (మోక్ష) యనబడును.

"నిష్కామబుద్ధితో నిర్వికల్పసమాధితో నీశ్వరధ్యానము గావించుటయే యోగిధర్మము. బాగుగా నంతర్దృష్టిని సుషుమ్నానాడియందుంచి, భయభ్రమలను విడనాడి స్వబుద్ధితో నంతర్దృష్టిని సహస్రారకమలమున జేర్చి సాధించి ఈశ్వరసాక్షాత్కారమునుపొంది యాత్మానందముతో నుండుటయే యోగిలక్షణము. నాడీచక్రమును పరిశీలించి చూచినచో పదినాడులు ముఖ్యములు. ఆ నాడు లన్నింటిలోన నాసిక కుండలిపైన ఇడ, పింగళ, సుషుమ్నా అను మూడునాడులు గణనీయములు. ఈ నాడీక్రమము చక్కగా నెఱింగి ఇడా, పింగళ, సుషుమ్నా నాడులద్వారా రేచకపూరక కుంభకముల క్రమరీతి జరుపుటయే నిజమైన యోగులధర్మము. నాదబిందుకళల నభ్యాసముతో కనుగొని, యాత్మజ్ఞానమును పొంది బ్రహ్మరంధ్రమునందు ప్రకాశించు జ్యోతిర్మండలమున దృష్టి నంతర్లీనము గావించినచో యోగియగును. తానే దైవము! దైవము దేవాలయములలో, మహాక్షేత్రములలో, తీర్థములలో, కాశీప్రయాగలలో, మంచుకొండలలో, కైలాసశిఖరములలో లేదు. సర్వతీర్థములు, సర్వ పుణ్యక్షేత్రములు త్రిమూర్తులు మొదలుగా గలవన్నియు నీ మానవదేహాలయమునందే మూర్తీభవించినవి. ఈ జ్ఞానతత్త్వమును సామాన్యులకు తెలుపుటకు జ్ఞానులు ఎంతో కృషిచేసి ఆలయములని, తీర్థములని, యాత్రలని యెన్నెన్నో నిర్మాణముచేసి

నామము లేర్పరచిరి. కొండబిలములలో మునులుందురనియు, మహా క్షేత్రములలో మహాత్ము లుందురనియు, వారు తమ్ముద్ధరింతురనియు నాశించి గుట్టలు, గుహలు, యాత్రలు గాలించుట యవివేకమ సుమా! యోగి తా నున్నచోటును విడువకయే ముక్తిని సాధించును. మానవుడను కోతు చిత్తమను గుఱ్ఱమునెక్కి దానిని లొంగదీయలేక దాని ప్రవృత్తి ననుసరించి, పిచ్చివానివలె నెంతకాలము తిరిగినను చిత్త చాంచల్యము తగ్గదుసుమా! చిత్తచాంచల్యముగల వానికి కాశీ, గయలు ముక్తినీయజాలవు. మనస్సునం దీశ్వరస్వరూపమును ప్రతిష్ఠించి యాత్మావలోకనమువలన నీశ్వరసాక్షాత్కార మొందుటయే యోగి లక్షణము. భగవద్దర్శన మొక్క యోగికి మాత్రమే సాధ్యపడును. జడలు బెంచుకొనుట, శిరోముండనము గావించుకొనుట, విభూతి దండ కమండలములు దాల్చుట, కాషాయాంబరములు ధరించుట, పులి చర్మముపై నాసీనులగుట, తులసిపేరులు రుద్రాక్షమాలలు మెడ నిండ ధరించుట, తర్క వితర్కవాదములు నేర్చుకొని, ప్రజలను వశ పరచుకొని హాయిగా జీవయాత్ర సాగించుచు, శరీరమును పెంచుకొని 'ఇదే శాశ్వత'మని యంధవిశ్వాసముతో సంచరించెడివారందరును యోగులు కారు. విరాగులుకారు. భోగులు చివరకు రోగులుమాత్ర మయ్యెదరు. యోగి ప్రవర్తన మెట్టిదో యతి జాగ్రత్తతో వినుడు—

"మానవ దేహమునందు గుదస్థానమున 'మూలాధార చక్ర' ముండును. దాని కధిష్ఠాన దేవత విఘ్నేశ్వరుడు. దానికి రెండంగుళ ములపైన గుహ్యస్థానమున 'స్వాధిష్ఠాన చక్రముండును' దానికి అధిష్ఠాన దేవత బ్రహ్మ. దానికి నెనిమిదంగుళములపైన నాభిస్థానమున 'మణిపూరక చక్ర' ముండును. దాని కధిష్ఠాన దేవత విష్ణువు. దానికి పదంగుళములపైన హృదయస్థానమున 'అనాహత చక్ర' ముండును. దాని కధిదేవత శివుడు. దానికి పంద్రెండంగుళములపైన కంఠస్థానమున 'విశుద్ధ చక్ర' ముండును. దాని కధిదేవత జీవుడు. దాని పైభాగమున

కనుబొమల మధ్యస్థానమున 'ఆజ్ఞేయ చక్ర' ముండును. దాని కధి దేవత ఓంకార స్వరూపమగు సదాశివుడు. ఈ సదాశివు డగ్నివంటి కాంతితో ప్రకాశించుచుండును. ఇట్టి విషయముల నెఱుంగుటయే విజ్ఞానము. ఈ శరీరమునం దుండెడి షట్చక్రములను సద్గురు కృపచే నెరుగుట నిత్యానందమగు స్థితి. చావుపుట్టుకలు లేని స్థితియగును. సహస్రారమున కోటిసూర్యుల కాంతితో స్వయంజ్యోతిర్మయమూర్తియై వెలింగెడి పరమాత్మ తత్త్వమున నేకీభావము పొందుటయే మోక్షము. ఇదియే శివ జీవైక్యస్థితి. దీనినే జీవసమాధినిష్ఠ యని పేర్కొను చుందురు. అట్టి నిష్ఠను బొందెడు స్థితి చేకూరినప్పుడే సద్గురువుయని ముద్ర వేసికొని ప్రపంచమున తిరిగెడి జీవుల నుద్ధరించుటకు ధర్మకంక ణమును దాల్పవలయును. ఇట్టి ప్రవర్తన గలిగినవాడే నిజమైనయోగి. అసలైనయోగి! ఆదర్శమైన యోగి యని మానవులైన వారందరు గ్రహించెదరుగాక!

"ఇతరములైన కోర్కెలనెల్ల పరిత్యజించి చిత్తము నేకాగ్రము చేసి జీవితపరమావధిని పొందుటకు దేహధారిగా నున్నపుడే సాధన చేయదగునుగాని, దేహ మంతరించినప్పు డేమిచేయనగును? శరీర మంతర్ధానమైన వెంటనే యాత్మ పరలోకములో సంచారము చేసి తుట్టతుదకు మఱియొక దేహమును దాల్చి ఇహలోకమందు జన్మిం చును. ముందు జన్మలో నీడేర్చనట్టి కష్టములు తిరిగి యీ జన్మలో ప్రత్యక్షమగును. కనుక శరీరపరిత్యాగము వలన లాభమేమి? సాఫల్య మేమి గలదు? శరీరము నపాయములకు గురిచేసి త్యజించినవాడు, పర లోకమున ఘోరయమయాతనలకు గుఱియగును. ఈ జన్మలోనే సర్వ కష్టముల నెదుర్కొని జయమందుటయే చక్కని రాజమార్గము. యోగము నుపాసించుట బహుకష్టము. ఈ యోగ మన్ని యోగము లకంటె దుర్ఘటమైనది. ఈ యోగము నుపాసించువా రహంకార మమకారములను నిశ్శేషముగా త్యజించి సర్వార్పణబుద్ధితో భగవంతుని

శరణుజొచ్చుట కెవ్వరికిచ్చగలదో యట్టివారికే యీ యోగమం దర్హత గలదు. బ్రహ్మభావన పొందక యాత్మసాక్షాత్కారము లేని వాచా వేదాంతులు, విషయాసక్తులగు వారు నిశ్చయముగ నజ్ఞానమగు తమస్సులోపడి మాటిమాటికి పుట్టుచు చచ్చుచు గర్భనరకముల ననుభవించు చుందురు. శ్రేష్ఠమైన పరిశుద్ధమైన బ్రహ్మజ్ఞాన నివృత్తిని త్యజించి విషయలోలురై వేదాంతప్రసంగము చేయువారు పశువులను సమానమైన మానవులై వ్యర్థముగ జీవించుచున్నారని తెలిసికొనుడు. ఎవడు పరమాత్మతత్త్వమునుబొంది నిత్యానందమును పొందుచుండునో యా మహాత్మునికి భోగవాసన యెట్లుగలుగును? సాక్షాత్ శుద్ధమగు నాత్మస్వరూపమే తానని తెలిసికొనిన తర్వాత, వారు హేయమగు దీనకృత్యముల కెట్లు పోవుదురు! అనగా నమృతముత్రావి తృప్తి చెందిన మనస్సు విషము నెంచునా? ఎన్నటికి లేదు లేదు. అట్టి బ్రహ్మవేత్త మన స్సెన్నడు చలింపదు. ఈ నాటి స్వార్థభోగు లగు రాజయోగు లందరు, 'మేము రాత్రింబవళ్లు పొరలాడెడి యీ సంసారమే రాజయోగమని, వారు చేయునదియే రాజయోగ'మని సంతోషించుచు నెవరికివారు తృప్తి బొందుచున్నారు.

"అవివేకులు కొందరు జీవన్ముక్తుడగు జనకమహారాజును దృష్టాంతముగ చెప్పుచున్నారు. ఇదేమి మాయరోగమో దెలియకున్నది. సత్యమైనదానిని అసత్యమనియు, అసత్యమైనదానిని సత్యమని భ్రమించుచేటే 'మాయ' యను పదమునకు భావము. జనకమహారాజునకు వీరు సాటియా? సూర్యు డెక్కడ? మిణుగురు పురు గెక్కడ? సముద్ర మెక్కడ? జలబిందు వెక్కడ? మహామేరు వెక్కడ? ఇసుక రేణు వెక్కడ? జనకమహారా జెంత కాలము తపస్సు చేసిరో, శాస్త్రము చదివినవారికిగదా యెఱుక. సూర్యకాంత రత్నముపై సూర్యరశ్మి పడినవెంటనే జ్వలించునట్లు, నిర్మలహృదయముగల శిష్యునకు సద్గురు కృపచే జ్ఞానాగ్ని ప్రజ్వలించును. నిర్మలహృదయము లేని

శిష్యుడు, దైవకృపకు పాత్రుడు కానేరడు. సద్గురు దయాకిరణములు వానిపై ప్రసరింపవు. అట్టి వ్యక్తి యెంతకాలము గురుసేవ చేసినను గురుప్రబోధము విన్నను నిష్ప్రయోజనము. స్థిరచిత్తములేక దేశ ద్రిమ్మరియై రెంటికి చెడిన రేవడియై తిరుగుచుండును. అట్టి కారణము చేతనే, ఒకే గురువు శిష్యులు కొందరు జ్ఞానులవలె నుందురు. మఱి కొందర జ్ఞానులై యహంభావముతో మెలగుచుందురు. ఆ భేదమునకు సద్గురువుల దోషము మాత్రము కాదు. శిష్యుల హృదయ పరిపక్వతార తమ్యముల ననుసరించియుండును. పరమాత్మ సమస్తజనుల హృదయాంత రాళముల ప్రకాశించుచున్నను, వినిర్మల హృదయమునందు మాత్రమే గోచరించును నాయనలారా!" యని శ్రీ యోగానందమూర్తి ప్రబోధము చేయగా భక్తసంఘమంతయు పరమానందమును పొందిరి.

## శ్రీ వేంకటేశ్వరమూర్తి మనస్సు విరాగమొందుట

శ్రీ సద్గురు ప్రబోధమును వినిన వెంకటేశ్వరమూర్తి గృహమందుండుట ఇచ్ఛలేక కోటిదాసు తోటయందును, కొండపైనున్న రామలింగేశ్వరాలయమందును, జానకిగుహాయందును పరమాత్మ ధ్యానముతో దినమొకక్షణముగ గడుపుచుండెను. పగలంతయు నిరాహారియై ధ్యానయోగములో మునిగి తేలుచుండును. రాత్రి పదిగంటల కరసోలెడు పాలు, రెండు గోధుమరొట్టెలు తీసికొనుచు మౌనభావముతో నేకాంత వాసము కొన్నిమాసములు గడపిరి. మహాలక్ష్మిదేవి పెద్దకుమారుడగు కోటయ్య ధ్యానయోగములో నున్నతఱి, బొగ్గులకొండయందొక ఋషి యున్నట్లు దర్శనమాయెను.

కొన్నిరోజులకు శ్రీ యోగానందమహర్షి మానసికముగా దర్శనమై "నీ సోదరుడే పూర్వజన్మలో యోగియై యా బొగ్గులకొండ యందు తపస్సుచేసిరి. లోగడజన్మ నీకు దర్శింపచేసితి"నని చెప్పిరి. తదుపరి కోటయ్యగారికి శ్రీ యల్లమందల కోటేశ్వరస్వామి దర్శనమై "నీ సోదరుని నా కొండకు బంపుడురక్షణముచేసెద"నని చెప్పిరి. ఈ విష

యమును సద్గురు దేవులకు దెలుపగా, నా త్రికాలవేదియగు శ్రీయోగా నంద మహర్షి కోటయ్యతో "నాయనా! నీవు దర్శించిన దృశ్యము యదార్థమే! నాకు సుబ్బారాయుడను నొక సోదరుడు గలడు. గొప్ప విరాగి. కోటేశ్వరు సన్నిధికి బంపుద మనుకొనుచున్నంతలో అకాల మృత్యువునకు గురియయ్యెను.

"ఈ నాడు నా శిష్యుడగు నీ వెంకటేశ్వరమూర్తిని శ్రీ కోటేశ్వరునకు దత్తతగా నివ్వదలంచితిని. శివకేశవులకు భేదములేదను పరమ సత్యమును వ్యక్తముచేయుటకే ఇట్లు సంకల్పించి కోటప్పకొండకు వెళ్ళి తపస్సు చేసికొమ్మని చెప్పితిని. మీరీ బాలుని యీ క్షణమే కోటేశ్వరుని సన్నిధానమునకు చేర్చు"డని చెప్పిరి. మాతృదేవి "ఆహా! నా ప్రియ తనూజుని వీడి నే నెట్లు భరియింతునని యావేదనతోనున్న తరి, శ్రీ కోటేశ్వరస్వామి యా మహాతల్లి మనస్సున చేరి, "నీ కుమారుని రక్షణభారము నాది నాది నాది," యని ముమ్మారు చెప్పగా, "యేమి నా యదృష్టము నా కుమారుడు పరమేశ్వరసాక్షాత్కారమును పొంది బ్రహ్మానందమును, పొందగల"డను నానందముతో సద్గురుదేవుల యాజ్ఞను నెరవేర్పదలంచి ప్రియతనూజునకు చెప్పెను.

ఆ సజ్జనమూర్తి "ఆహాహా తల్లీ! ఇంతకంటె భాగ్య మింకొకటి కలదా! సర్వకాలములయందు నా మహేశ్వరుడే నాకు శరణ్యము. పరమోత్కృష్టమగు పరతత్త్వమును గ్రహించుశక్తి నా గురుదేవులకు శ్రీ యోగానందమూర్తి కృపచే సిద్ధించును. సందేహము వలదని" చెప్పగా, జననీజనకు లత్యంతప్రేమతో కుమారుని దీవించిరి. ఆహా! యేమి యీ ఆదర్శదంపతుల యాశయము.

యువ నామ సంవత్సరాషాఢ శుద్ధపంచమి దివసమున శ్రీ చేవూరి హనుమయ్యశ్రేష్ఠి కన్నకుమారునిపై భ్రాంతివీడి సద్గురు దేవుని యాజ్ఞయే మన కుటుంబమునకు రాజమార్గమని ఈశ్వర సాన్నిధ్యమునకు వెంకటేశ్వరుని తీసికొనివెళ్ళుచున్న సమయమున

మాతృదేవి కొంతధనము, మఱికొంత ఫలహారము దెచ్చి కుమారునకు సంసిద్ధమొనర్ప నా బాలయోగి ముద్దులొలుకు వాక్యములతో "తల్లీ! నీవిచ్చిన ఫలహారము కొన్నిరోజులకే సరిపోవును. ఆతదుపరి యెవ రిచ్చెదరు? 'సర్వం ఈశ్వర మయం' నా కేమికొదువ? ఆ ఈశ్వరుడే యన్నిటినిసమకూర్చి కంటికి రెప్పవలె కాపాడగలడు. ఈ ఫలహారము, ఈ పైసలు యేమియు నవసరము లే"దని చెప్పి, మాతృమూర్తికి మువ్మారు ప్రదక్షిణములు చేసి అన్నకు నమస్సు లర్పించి, ప్రియజనకుని వెంటనంటి శ్రీకోటీశ్వరస్వామి కొండకు వెళ్ళిరి. ఆ బాలయోగి వెళ్లెడి సమయమున మాతృదేవి, సోదర సోదరీమణులు, మిత్రులు, గ్రామపౌరులు నాశ్చర్యముతో మౌనము వహించి యొకే దృష్టితో వీక్షింపసాగిరి.

ఆహా! ఆ బాలయోగి, యతిబాల్యావస్థలోనే సద్గురు కరుణకు పాత్రుడై వారి యాత్మప్రబోధమును విని మననము చేసిచేసి చివరకు తేల్చుకున్న సారాంశ మిదియే. "తల్లిదండ్రులు టక్కు, ధనధాన్య ములు హుళక్కి, ఆలు సున్న, మనగృహము నాస్తి, వట్టి బూటకము మేలుకొంటి సద్గురూ! నీదయచే మేలుకొంటి" నని గుర్తించి పితృదేవుని వెంట ననుసరించిరి.

నక్షత్రము లెన్ని యున్నను ప్రయోజనము లేదు? చంద్రు డొక్కడే చాలు లోకములో చీకటి నణచుట కన్నటుల, సంసార వ్యామోహములోబడి మెట్టవేదాంతవాక్యములు నేర్చుకొని కాసులపై మమకారము వీడలేక యెన్ని యసత్యము లాడియైనను పైసలు ప్రోగుచేయుటే మన జన్మకు ఫలితార్థమని భావన చేసెడి శిష్యు లెందరుండినను నేమి ప్రయోజనము. నిర్మలమనస్సుతో గురుదేవునిబోధ కనుగుణముగా ప్రవర్తించి జన్మను, తరింపచేసికొనెడి యీ వెంట టేశ్వరునివంటి శిష్యరత్న మొకడే చాలును.

శ్రీ హనుమయ్యశ్రేష్ఠి యా రోజు సాయంకాలసమయమునకే ప్రియతనూజునితో శ్రీ కోటేశ్వరుని శిఖరము చేరి, ఈశ్వరాలయమున ప్రవేశించిరి. శరీరమంతయు విభూతి, కంఠమున సర్పహారములు, శిరమున గంగయును గలిగి మారేడుదళములతో నిండిన, యా పరమేశ్వరుని, ముందు కూర్చుండి స్థిరచిత్తముతో నొాకే దృష్టితో భగవద్దర్శనమును గాంచెడి నందీశ్వరుని దర్శించి, పరమాహ్లాదమును పొందిరి.

## శ్రీ వేంకటేశ్వరుని ఈశ్వరార్పణము గావించుట

భక్తమణియగు ప్రియతనయుని శివునిముందు చేర్చి దీనముగా హనుమయ్యశ్రేష్ఠి యిట్లు ప్రార్థించిరి— "ఓ కైలాసవాసా! పార్వతీవల్లభా! ప్రమథగణపూజితా! భక్తవశంకరా! భవభయవిదూరా! దుష్టశిక్షణా! శిష్టరక్షణా! ఓ పరమపితా! కోటేశ్వరా! దీనబంధూ! పాహిమాం! పాహిమాం! పాహిమాం! ఓ జగదేకప్రభూ! ఇంతవరకు భ్రాంతితో నా కుమారుడని భావించి మోసపోయితిని. ఈనాడు నీ కుమారుడని సత్యమును గుర్తించి యానందమును పొందితిని. వీని భారమంతయు నీదే ప్రభూ! వీని భవితవ్యమును జాజ్వల్యమొనర్చి నీ యంతవాసిని చేసి, నీ కీర్తిని నిల్పుకొమ్ము తండ్రీ!" యని పలుమఱు ప్రార్థించెను.

పితృదేవులు కన్నకొమరుని వీడి మరునాటి యుదయమున పయనమై స్వగృహము చేరిరి.

శ్రీ వెంకటేశ్వరమూర్తి యాహారము మాని కొండదొానలలో నున్న నీరము నే గ్రోలుచు సద్గురుదేవు లుపదేశించిన మహామంత్రమును నిష్ఠతో జపించుచు పరమేశ్వరుని యందు, తనమనస్సును లగ్నముచేసి తపస్సుచేయసాగిరి. ఆహారమును వర్జించి రోజును నియమముగా నీరమును మాత్రమే తీసికొానసాగిరి. ఆభక్తమూర్తి దేహతత్త్వమునకు సరిపడక త్రాగిననీరము వెళ్ళిపోవుచుండెను.

వినుకొండలో ధర్మజీవనము చేసెడి మాతృదేవి యగు శ్రీమహా లక్ష్మీదేవికి కోటేశ్వరస్వామి దర్శనమై "కొండకు రావా తల్లీ!" యని ప్రశ్నింప, స్వప్న వృత్తాంతమున కచ్చెరువొందుచు పరమేశ్వరుని పొగడినది.

శ్రీ కోటేశ్వరాలయార్చకులు బాలభక్తుని గాఢమైన ప్రేమ కచ్చెరువొంది "ఆహా! యీ బాలుడు త్రికరణశుద్ధితో భగవత్ప్రాప్తికై ప్రయత్నము చేయుచున్నాడు! మే మెంత కాలము నుండియో శివప్రీత్యర్థము నిత్యపూజలు చేయుచుంటిమి. ఈ వెంకటేశ్వరమూర్తి మనో నిశ్చలత యఖండమైన భగవదనుభూతిని మేము పొందజాలమైతిమి. ఇదంతయు నా పరమేశ్వరుని కృపాకటాక్షమే గాని వేఱొండుగా"దని దలచి బాలుని విషయమును మాతృదేవియగు శ్రీ మహాలక్ష్మీదేవికి తెలియజేసిరి.

శ్రీ మహాలక్ష్మీదేవి వెంటనే కొన్ని ఫలహారములు తీసుకొని పెద్దకుమారుడగు కోటయ్యతో శ్రీ కోటేశ్వరుని కొండకు వెళ్ళిరి. ఈ తల్లి వెళ్ళువరకే లోకేశ్వరుని దయాప్రసారముచే వెంకటేశ్వర మూర్తికి వాంతులు తగ్గి, సంపూర్ణారోగ్యముతో ప్రకాశించుచుండిరి. మాతృదేవి పరిపూర్ణవాత్సల్యముతో "నాయనా! నావెంట వినుకొండకు రమ్మా! అచ్చోటనే యేకాంతముగా నుండి తపస్సు చేసికొనవచ్చు" నని కోరగా బాలయోగి "అమ్మా! నేను పరమేశ్వరుని పాద సన్నిధి వీడి రాలేను. నా భారమంతయు కోటేశ్వరునిదే! నాకెట్టి భయములు లే" వనిరి.

తల్లి సోదరు లేమియు చేయునదిలేక తీసికొనిపోయిన గోధుమ పిండి పంచదార యిచ్చి, "తండ్రీ! ఆపరమశివుని నమ్మి భజించి తరింపుము. మేము వెళ్ళివచ్చెద" మని చెప్పి పరమేశ్వరునికి నమస్సు లర్పించి స్వగృహము చేరిరి.

బాలభక్తు డగు వెంకటేశ్వరమూర్తి భక్తిభావములతో మెలగుచు పరమేశ్వరునిపై దృష్టి సారించి దిన మొకక్షణముగా గడుపుచున్నంత బాలభక్తుని రక్షణభార మా పరమేశ్వరునిపై బడినది. సర్వప్రాణులను రక్షణచేసెడి యా కరుణారసమూర్తికి, బాలభక్తుని రక్షణ భారమా!

సమీపగ్రామ మగు మిడిమల్లిలో నివాసము చేసెడి సజ్జనమూర్తి, గ్రామాధికారి యగు శ్రీ కాశీనాథుని పర్వతాలు అను నియోగి బ్రాహ్మణోత్తమునకు స్వప్నమున నీశ్వరుడు సాక్షాత్కరించి, "ఓ ఉదారస్వభావా! నా సన్నిధిలో నన్నే నమ్మి రాత్రింబవళ్ళు ధ్యాననిష్టలో మునిగి తేలుచున్నా డొక బాలయోగి. ఆతని త్యాగదీక్ష యుత్తమోత్తమమైనది. నీవు వెళ్ళి వానిని సంతృప్తి బరచుము నేను సంతృప్తి చెందినట్లే!" యనెడి దైవవాణి వినిపించెను. వెంటనే మేల్కొని దిక్కులు పరికించి యేమియుగానక యా నియోగి "ఆహా! యేమి యీ వింతవాక్యము" లని అచ్చెరువొంది స్వప్నగతవృత్తాంతము యదార్థమా యను సందేహముతో పాలుతీసికొని యే పమిడిమల్లి నుండి శ్రీ కోటేశ్వరుని కొండకు వెళ్ళి యాలయమున ప్రవేశించి యర్చకస్వామిని బిలిచి "నాయనా! యిచ్చట నొక బాలభక్తుడు తపస్సు చేసికొనుచున్నాడు. వా రెచ్చట నుండి"రని యడిగిరి.

ఆలయార్చకులు "ఔనండి వారిచ్చటకు వేంచేసి పదిదినములు గడచినవి. ధ్యాననిష్ఠయందున్నారు. పన్నెండు గంటలకు ధ్యాన మిచ్చెదరు. మరుక్షణమే పరమేశ్వర ధ్యానమున నిమగ్నులయ్యెద"రని చెప్పిరి. "సరే స్వామీ! రేపువచ్చి దర్శించెద"నని చెప్పి క్షీరపాత్ర యా బాలయోగి కిమ్మని యర్చకస్వామి కొసంగి వెళ్ళిపోయిరి.

మరునాటి మధ్యాహ్నసమయమున కాశీనాథుని పర్వతాలు క్షీరపాత్రతో నాలయమున ప్రవేశించి, బాలభక్తునికై వేచి కాచుకొని యుండెను. పన్నెండు గంటలకు వెంకటేశ్వరమూర్తి ధ్యాననిష్ఠయం

దుండి లేచి బయటకు రాగా కాశీనాథుని పర్వతాలు భయభక్తులతో క్షీరము నొసంగి నమస్కరించిరి. బాలభక్తమూర్తి యా మధుర క్షీరము నీశ్వరున కర్పణముచేసిన పిదప పానముచేసిరి. కాశీనాథుని పర్వతాలు బాలభక్తాగ్రేసరుని సెలవుగైకొని స్వగృహమునకు జనిరి. ఈ విధముగా ప్రతిదినము క్షీరమును బంపుచుండిరి. ఇట్లు రెండుమాసములు గడచినవి.

అంతలో మాతృదేవియగు శ్రీ మహాలక్ష్మీదేవి కన్నకుమారుని చూచుటకై శ్రీ కోటేశ్వరునికొండకు వేంచేసి ప్రియతనూజుని యొద్ద నివసించుచు విఠల్ నామమును లిఖించుచు పరమేశ్వరుని ధ్యానించుచు నా పవిత్ర ప్రశాంత వాతావరణమున నారుమాసములు నివసించెను. దేవహూతిదేవికి-కుమారుడగు కపిలమహర్షి వేదాంతప్రబోధము చేసిన రీతి వెంకటేశ్వరమూర్తి మాతృదేవికి వేదాంతమును ప్రబోధము చేసిరి.

ఒకరోజున వెంకటేశ్వరమూర్తి కొక సంకల్పము గలిగినది. ఈ గిరివీడి, మరెచ్చటికైన వెళ్ళి కొండబిలమున ప్రవేశించి మానవుల సంగమ మేమాత్రములేక తీవ్రతపోనిష్ఠయం దుండవలయునను సంకల్పము గలిగినది. ప్రియశిష్యుని మనోభావమును తెలిసికొనిన, సద్గురువులగు శ్రీ యోగానందమహర్షి ముఖ్యశిష్యులను నల్వురను వెంటనిడికొని యా కోటేశ్వరుని కొండకు వేంచేసిరి. వెంకటేశ్వరమూర్తి శ్రీ సద్గురుదర్శనము కాగానే యమితానురాగముతో గాఢాలింగనము చేసికొనిరి. ప్రియశిష్యుని మనోభావ మెరిగిన యా యోగనృసింహస్వామి "నాయనా! వెంకటేశ్వరా! ఈ పవిత్ర శివసన్నిధిలో నీవు నాలుగు మాసము లుండవలయు"ననిరి.

వారు మాఱుమాటాడక శ్రీ సద్గురునిమాట సరసమైన బాటని యా స్థలమందే నివసించుటకు స్థిరచిత్తులైరి. సద్గురుమూర్తి కొన్ని రోజులు గిరియందే యుండి యోగరహస్యములను దెల్పిరి. గురుకీల

కమును గుర్తెరెంగి సద్గురుదేవుని పరిపూర్ణకృపకు వెంకటేశ్వరమూర్తి పాత్రులైరి.

శ్రీ యోగానందమూర్తి వెంటనున్న ప్రియశిష్యులతో కోటేశ్వరుని కొండవీడి మారికాపురి సమీపమున ప్రకాశించెడి కపిలగిరికి వేంచేసిరి. కొన్ని మాసములు చనిన పిమ్మట గురుదేవులు పయనమై అబ్బూరుచేరి నృసింహస్వామి జయంతి జరుప నిశ్చయము చేసిరి.

శ్రీ యల్లమందల కోటేశ్వరుని గిరిపై నివసించెడి భక్తమూర్తి యగు వెంకటేశ్వరమూర్తి సద్గురు దర్శనార్థమై అబ్బూరు గ్రామము నకు వెళ్ళిరి. గురుదేవుని దర్శించి పాదాభివందనము లొనర్చి "ఓ స్వామీ! యాగంటి కొండకు వెళ్ళవలయునని సంకల్పమయ్యెను. తమ సెలవైనచో వెళ్ళెద"నని యడిగిరి. శ్రీ యోగానందమూర్తి "తండ్రీ! నా సోదరుని కోటేశ్వరున కివ్వని కారణముచేతనే మృత్యు దేవత కాహుతియైనాడు. ఆ కొరంత తీర్చుటకై నిన్ను కోటేశ్వరున కర్పించితిని. సరే! నీకిచ్ఛయున్నచో వినుకొండ కొండపై శ్రీ రామలింగేశ్వర సన్నిధానమున ధ్యాననిష్ఠయందుండుము. ఆ కొండపై పదునైదు రోజులు నివసించినచో నేనే నీ వద్దకు వచ్చెద"నని చెప్పిరి.

శ్రీ సద్గురుదేవుని యాజ్ఞయే నా జీవితమునకు వెలుగు బాటని గుర్తించి అబ్బూరు నుండి వినుగొండ కొండపై చేరి నిరంతరము ధ్యాన నిష్ఠలో కాలమును సద్వినియోగ మొనర్చు చున్నంత, నీ వెంకటేశ్వర మూర్తిమనస్సు చలనమై స్థిరత్వము లేక 'యాగంటికొండకు వెళ్ళుదునా? కోటయ్య కొండకు వెళ్ళుదునా' యను భావములతో మనోనిశ్చయము లేక యేమియు దోచకయున్న తరి "హా దీనబంధో! హా జగద్రక్షకా! ఓ కోటేశ్వరా! నీ సన్నిధానమందే యుండెదను ప్రభూ!" యని యాత్మపూర్వకముగ ప్రార్థింప వెంటనే స్థిరత్వము నొందెను. అంతయు నీశ్వరుని లీల! ఈ విషయమంతయు నామూలాగ్రముగ తెలిసికొని, కోటయ్యను సజ్జనమూర్తి తన ప్రియసోదరుని వెంటనిడుకొని కోటప్ప

కొండకు వేంచేసి సర్వభూతనాయకుడగు నీశ్వరుని కర్పించి "ఓ మహా దేవా! నా తమ్ముని రక్షణ భారమంతయు నీదే ప్రభూ!"యనుచు పలు విధముల దీనాతిదీనముగా ప్రార్థించి కన్నీటితో శివలింగము నభిషేకించి శివమూర్తిని గాఢాలింగనము చేసికొని వీడలేక వీడలేక వీడి స్వగ్రామమగు వినుకొండ చేరిరి.

అది మొదలు శ్రీ వేంకటేశ్వరమూర్తి ఏ కొండలకు వెళ్ళదమను సంకల్పము లేక యచ్చటనే స్థిరచిత్తముతో పరమేశ్వరుని గూర్చి తపస్సుచేసిరి. రెండువత్సరములు కన్నతల్లియే ఫలహారము తీసికొని పోయి సమర్పించి వచ్చుచుండెను. అనేక పర్యాయములు వీరు కఠినోపవాసదీక్షలు సలిపెడివారు. ఇట్లు జరుగుచున్న సమయమున నొకరోజున నరసరావుపేట హైస్కూలు లోనియుపాధ్యాయులు, సాధు భావములు గల వ్యక్తి శ్రీ గోపరాజు సత్యనారాయణగారు కుటుంబసమేతముగా కోటయ్యకొండకు వెళ్ళి యోగిపుంగవులగు వెంకటేశ్వరమూర్తిని దర్శించి వారియందు భక్తిశ్రద్ధలు గలవారై యఖండ గౌరవముతో భక్తుల సహాయముతో యోగిగారికి ఫలహారములు బంపసాగిరి. వెంకటేశ్వర యోగిని దర్శించవలయునను నాకాంక్షతో వెళ్ళెడి భక్తమూర్తులకు, యోగిగారి మాతాపితరులకు సోదరసోదరీమణులకు, నరసరావుపేటనుండి కోటేశ్వరుని సన్నిధిచేరుటకై బస్సుచార్జీలను, శ్రీ గోపరాజుసత్యనారయణగారు జమిందారుగారికి నచ్చచెప్పి మాన్పించిరి. ఎవరైనను బస్సులో నెక్కి మేము శ్రీ వెంకటేశ్వర యోగిని దర్శించుటకు వెళ్ళుచున్నామని చెప్పిన ప్రతివ్యక్తిని యదార్థము తెలిసికొని చార్జీలులేకనే శ్రీ స్వామిసన్నిధికి చేర్చుచుండిరి.

ఆయోగీశ్వరమూర్తి పట్టిన పట్టు వీడక దిట్టతనముతో నచంచల యోగనిష్ఠతో సమస్త భూత హృదయాంతరాళముల ప్రకాశించెడి యాకోటేశ్వరుని గూర్చి ద్వాదశవర్షంబులు, తపోనిష్ఠ యందుండిరి. ఘోరతపమాచరించి యీశ్వరవిభూతిని పొందిరి.

## శ్రీ వేంకటేశ్వరయోగి శివకృప వడయుట

ఆ యోగీశ్వరమూర్తి తపోదీక్షయం దున్న సమయములలో మహత్తరమైన దివ్యదర్శనము లెన్నో దర్శించిరి. లోకాల నన్నిటిని తృటికాలమున సృష్టించి వేలసంవత్సరములు పెంపొందించి క్షణకాలములో, లోకాల నన్నిటిని గంగపాలొనర్పగల శక్తివంతుడగు నా కోటేశ్వరుని పరిపూర్ణకృపకు పాత్రుడగు వేంకటేశ్వర యోగి కేమి కొదువ! పరమేశ్వరుని బిడ్డడు. ఆ బిడ్డనికి కావలసిన సదుపాయము లన్నియు ముందే యోచించి సిద్ధపచేయును. జగన్నియంత యగు సర్వేశ్వరుని కృపాకటాక్షవీక్షణము సామాన్యులపై ప్రసరించునా! అనేక జన్మసముపార్జిత పుణ్యవిశేషముచే సమకూరును. కర్పూర మగ్ని యందు చేరువిధాన నీ యోగితత్త్వము యీ మహాతత్త్వమున నేకమై పరిపూర్ణబ్రహ్మానందమును పొందెడిస్థితి చేకూరినది. శివజీవైక్యస్థితిని పొందెడి యోగశక్తిని నార్జించినధీశాలి. యీ మహనీయమూర్తిని కన్న మాతాపితరులు ధన్యజీవులైరి. వీరి వంశమే పావనమైనది. వీరి బంధువర్గమంతయు తరించు నవకాశ మేర్పడినది. జన్మభూమి యగు 'వినుకొండ' పవిత్రమయ్యెను. యీ వినుకొండ యుగములనాడే దైవ సందేశ మందించినది. సీతావియోగ దుఃఖములో నున్న అయోధ్యాపురీశుడగు శ్రీరామచంద్రమూర్తికి, జటాయువు సీతవార్త దెలిపి ప్రాణములు వీడి పరమపదము చెందినది. ఆనాటినుండి వినుకొండగా మారిన యీ కొండ భాగ్య మేమనవచ్చును. యీ వినుకొండ సీమ కవులను, పండితులను, గాయకులను, నాయకులను నెందరెందరినో కన్నది. అట్టి 'వినుకొండ'లో ఈ యోగిపుంగవునిచే మహత్తర దైవసందేశ ములు వినెడి మహద్భాగ్యము వినుకొండ పురనివాసులకు సంప్రాప్త మయ్యెను. ఈ సాధుపుంగవుని హృదయమున శ్రీ యోగానందమహర్షి దివ్యశక్తి ప్రవేశమై వేదవేదాంగ విషయముల యదార్థస్వరూపమును

గోచరించిన ట్లొనర్చినది. అంతర్లీనమైయున్న యాత్మభావము లన్నియు వీరికి కరతలామలకము లయ్యెను.



శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరస్వామి వారు

శ్రీ సచ్చిదానందమూర్తి యగు శ్రీ వేంకటేశ్వరస్వామి వారి తపస్సు నిరాంటకముగా, సాగిపోవుచున్న రోజులలో, వీరి మాతృదేవి

శ్రీ లక్ష్మీనృసింహుని పాదభక్తురాలగు శ్రీ మహాలక్ష్మీదేవి సంసారమందు విరక్తిభావములు గలిగి సాధువేషధారిణియై శ్రీ సద్గురునాజ్ఞ వడసి యొక మఠమును స్థాపించుటకై సంకల్పము చేసి యీ విషయమును సద్గురుదేవులకు విన్నవించిరి.

శ్రీ స్వామివారు యోగదృష్టితో బరిశీలనచేసి యీ భక్తురాలి కోరిక శ్లాఘనీయమైనది. ఈమె కోరిక సిద్ధించును. పండువెన్నెలవలె ప్రకాశించునని యెంచి ఓ తల్లీ ! నీ కోరిక ఫలించును. సద్గురువులు సంతోషించెదరు. లోకోత్తరమైన పుణ్యకార్యమును సంకల్పించితివి. లోక కల్యాణమునకే యుద్దేశించిన యోగినివలె గాంచితివి. నీకంటె ధన్యురాలెవరమ్మా! ముందు కాలమును నా పేరుతో మఠమును స్థాపించి యోగినివై సాధువేషము చేయుదువు. నీ కన్నకుమారుడగు శ్రీ వెంకటేశ్వరమూర్తి నీ పజ్జచేరి నిన్ను దైవమునవలె పూజించుచు ధర్మవ్యాధునివలె భక్తితో సేవించుచు నీకన్నుల యెదుటనేయుండి మహత్తర దైవప్రబోధము చేసి మిమ్మానందింపచేయును. ఆ భక్తమూర్తి నివాసము చేయవలయునన్నచో, మేడలు మిద్దెలు పనికిరావు. ఆ కారణముచేతనే నీకు సంసారమందు విరక్తి గలిగినది. కన్నకుమారుని లేప్రాయముననే సద్గురుయాజ్ఞ నెరవేర్చుటకై విరాగిగా నొనర్చిన యాదర్శ సతీమణివి. మఠమునకు యోగ్యమైన స్థలము మీ గ్రామమునుండి శ్రీశైలమునకు వెళ్ళెడి రోడ్డునకు రైలుమార్గమునకు మధ్యనుండెడి కాళీస్థలము నందు నిర్మింపుడని నుడువుచు నా యోగమూర్తి దిగ్గునలేచి పావుకోళ్ళు వేసికొని యూరికి దక్షిణ భాగమందున్న స్థలమును జూపిరి.

ఆ సద్గురుమూర్తి చూపిన స్థలము పాములతో కసవు కుప్పలతో ముండ్లకంచెలతో నిండుకు పనికిమాలినదై చూచువారల కసహ్యము కలిగించుచుండెను. గురుభక్తి తత్పరయైయున్న శ్రీ మహాలక్ష్మీదేవి యాత్మదృష్టికి "ఓహో! నా గురుదేవుడు నిర్ణయించిన స్థలమే! నాకు

వాసయోగ్యమైనది, పరమ పవిత్రమైనది. నాకేమి కొదువయని నిశ్చయించినది. ఆ మహాతల్లి "స్వామీ! తమరు త్రొక్కిన యీ భూమియే మా జీవితములను తరింపచేయును. ఇదియే మా జీవితాశా జ్యోతులను వెలిగించెడి పవిత్రప్రశాంత నిలయమగు పుణ్యభూమి యని బదులు చెప్పెను.

"నమ్మిచెడినవారు– నమ్మక బాగుపడినవారు" లేరను సామెత యీ మహాతల్లి జీవిత పరిణామ దృశ్యములవలన సార్థకమైనది. సద్గురు దేవునిమాట–సరసమైనబాట–వరహాలమూట యని భావించి యాదర్శ గృహిణీమణి యగు శ్రీ మహాలక్ష్మీదేవి, సద్గురుమూర్తి నిర్ణయించిన పవిత్రస్థలమునే రెండు యకరముల ఇరువది యారు శెంట్ల భూమిని ఖరీదునకు తీసికొని క్రయధనము పూర్తిగా చెల్లించి యామె పేరిట ఖండన చేయించుకొనెను. "ఆహా! నా గురుదేవులు చూపిన పవిత్ర స్థలమును తీసికొనినాను. ఈ స్థలమందే యొక బావిని త్రవ్వించినచో యాశ్రమనిర్మాణమునకు సౌకర్యముగా నుండును. బాటసారులెల్లరు హాయిగా నా జలమును గ్రోలి శ్రమ బాపుకొనుచుందురు. ఎంతో మేలుగా నుండు" నని భావించి, యొక శుభముహూర్తమున, పని వాండ్రను బిలిపించి బావిని త్రవ్వింప బూనెను. కూలీలెంతో శ్రద్ధగా కష్టించి కొలది దినములలో బావిని పూర్తి గావించిరి. ఆసద్గురు దేవుల పాదస్పర్శ ఫలితముచే నా బావియందు పరిశుద్ధమైన, మధుర గంగ యుద్భవమయ్యెను. ఆమె యెంతో యాప్యాయతతో నా మధుర గంగను కడుపారగ్రోలి పరమానందమును పొందెను.

త్రికాలవేదులగు నా సద్గురుదేవుని వాక్యము సత్యమైనది, ఘనమైనది, నిత్యమైనది. వారికి తెలియని విషయములే లేవు. ఆ తండ్రి నామస్మరణయే నా జీవితమునకు వెలుగుబాటని మదినెంచి, మట్టితో కొద్దిమఠమును నిర్మింపచేసెను. మఠమును కట్టించిన కొలదిరోజులకే

యామె 'నాకు సంసారశ్రమ లెందుకు ! ఆత్మానందమును పొందుటకు వాసయోగ్యమగు నొక మఠమును నిర్మింపచేసితిని అందే యుండెద' నని సంకల్పించుకొనెను.

## శ్రీ మహాలక్ష్మీదేవి శ్రీ యోగానంద మఠమున చేరుట

త్యాగ హృదయముతో సంసారము నా క్షణమే పూర్తిగా త్యజించి భావానుకూలమగు కాషాయాంబరముల ధరించి వైరాగ్య భావములతో నాశ్రమమున గురుదేవుని పూజామందిరము నేర్పరచి స్వగృహము వీడి శ్రీ యోగానందమఠమందే నిర్మలభక్తితో సద్గురు దేవుల పూజించుచు మహాయోగినీ జీవితము దినమొక క్షణముగ గడుప సాగెను. ఇట్టి పరిణామము నొందుట సామాన్యమా !

శ్రీ యోగానంద వీరనృసింహకళావతారమూర్తి యగు యనంత శక్తిప్రసారము చేతనే సంసారపు బంధనములను కూకటివ్రేళ్ళతో పెక లించిపవిత్ర ప్రశాంత వాతావరణమునకు నిలయమగు శ్రీ యోగానంద మఠమునందు చేరి సుఖశాంతులను పొందుచుండెను. హృదయముననున్న యాశలను రూపుమాపి శాంతిజ్యోతి వెలిగించుకొని నాత్మానందము ననుభవించిననాడే మఠప్రవేశము సార్థకత చెందును. లేనిచో మహారణ్య మందున్నను, మఠమందున్నను, సంసారమందున్నను నొకటే !

శ్రీ సద్గురు సార్వభౌములగు శ్రీయోగానంద నరసింహమూర్తి యోగశక్తితో శ్రీ యల్లమంచల కోటేశ్వరుని కొండపై తపోనిష్ఠ లొనర్చి పరమేశ్వర సాక్షాత్కారమును పొందిన తన ముద్దుల శిష్యు డగు శ్రీ వెంకటేశ్వరస్వామితో హృదయస్థముగా, "నాయనా ! మీ మాతృదేవి నీ నిమిత్తము లోకరక్షణార్థము కొరకు పవిత్రమగు నొక మఠమును స్థాపించినది. మీ మాతృదేవి సద్వాంఛను నీ గురు దేవులగు మా యాజ్ఞను పాటించి నీవా మఠమందుచేరి భగవత్సాక్షా త్కారము పొందగోరెడి ముముక్షువులకు జ్ఞానోపదేశములు చేయుచు వారి హృదయపరివర్తన మెఱింగి వారలకు తగురీతి నాత్మప్రబోధము

చేయవలసిన యోగమున్నది. మఱియును ముందు కాలమున నాశక్తియే నీ హృదయమున చేరి వేదవేదాంగములలోని మూలరహస్యములను ముఖ్యసూత్రములను విజ్ఞానులైనవారికి విప్పిచెప్పి వారలను మంత్రముగ్ధుల నొనర్చెడి యోగమున్నది. స్వస్థానమందేగాక యనేక స్థలములకు వెళ్ళి యెందరెందరినో తరింపచేసెడి మహత్తర యోగమున్నది. నా సర్వశక్తులను నీకు కాలక్రమమున నాత్మరూపముతో ధారవోసెదను నాయనా!" యని గుర్తింపచేసిరి.

## శ్రీ సద్గురు నాజ్ఞతో వేంకటేశ్వరయోగి మఠమున చేరుట

ఆ యోగీశ్వరమూర్తి సద్గురునాజ్ఞయే జీవితలక్ష్యమని శ్రీకోటేశ్వరుని సెలవుకై గర్భాలయమున చేరి యపారప్రేమతో గాఢాలింగనము చేసికొనినతరి, సర్వాంతర్యామి యగు నా భూతేశ్వరుడు, "ఓ భక్తాగ్రేసరా! నీ హృదయకుహరమున నన్ను బంధించినావు. నన్ను వీడి వెళ్ళుటకు సాధ్యపడునా? నీకు నాకు భేదము లేదు. నీవే స్థలమున నివసించిన యా స్థలమే ఈశ్వరాలయముగా మారగలదు. సర్వదా నీరక్షణభారము నాయదియే, వెళ్ళిరా నాయనా!" యను పవిత్రదైవవాణి గర్భాలయమున ప్రతిధ్వనించెను.

శివు నాజ్ఞ పొందిన శ్రీ వెంకటేశ్వరయోగి, యనంత కల్యాణగుణాభిరాముడగు నా మహేశ్వరుని వీడుటకు మనస్సొప్పక కోటేశ్వరుని ముద్దిడుకొనుచు నానందాశ్రువులతో దివ్యాభిషేకము చేసి ఈశ్వర సన్నిధానమును వదలుట కెంతో యావేదన పొంది, మహేశ్వరునికి వీడ్కోలు విన్నవించి మాతృదేవి కట్టించిన శ్రీ యోగానంద మఠమునకు వేంచేసి కన్నతల్లి పాదకమలములను కన్నుల కద్దుకొని సాష్టాంగనమస్సు లర్పించిరి. ఆ మహాలక్ష్మిదేవి కన్నకుమారు నీశ్వర సమానునిగా భావించి పరిపూర్ణభక్తితో నంతరంగమున నమస్కృతు లొనర్చెను.

శ్రీ వెంకటేశ్వరస్వామి మఠమునకు వేంచేసి రను వార్త వినిన తక్షణమే పురజనులెల్లరు నమితోత్సాహమున మఠమునకు పరుగులతో వేంచేసి స్వామిని దర్శించి నమస్సు లర్పింపసాగిరి. బ్రహ్మ వర్చస్సుతో వెలుగొందు యీ వెంకటేశ్వర భానుని నాకే దృష్టితో వీక్షించుచు యవ్యక్తానందమును పొందసాగిరి.

మాతృదేవి నిత్యానందస్వామి బెంగళూరు నుండి వచ్చి ప్రియతనూజుని కన్నులార దర్శించుచు మనస్సున నిట్లూహించెను. "ఆహా ! భగవత్సాక్షాత్కారము పొందగోరి కోటప్పకొండకు వెళ్ళి కఠిన నియమములతో తపస్సు పూర్తిచేసి ఈశ్వర విభూతినిపొంది కన్నతలిదండ్రుల సద్భావనను నెరవేర్ప దీక్షబూనియే యీ మఠమునకు వేంచేసిరి. నా జన్మ చరితార్థమైనది. మా వంశమే పవిత్రమైనది. నా కన్నతండ్రి దైవ సందేశములను వినెడి మహద్భాగ్యము చేకూరినది. నా కెట్టి కొరంతయు లేదు. నేను సర్వార్పణ దృష్టితో నా గురుదేవులగు శ్రీ యోగానంద మహర్షిని నమ్మి సేవలొనర్చిన ఫలము నాకీ జన్మలోనే యనుభవమునకు వచ్చినదని, లోలోన యానందము చెందుచుండెను.

శ్రమలన్నిటిని రూపుమాపి ప్రశాంతిని చేకూర్చెడిదే ఆలయము, మఠము, యాశ్రమము మొదలైనవి. సంసారసాగర తరంగములలో కొట్టుకొనుచు తీరము చేరెడి యుపాయమును గానక యపాయమునకు గురియై భవనరకమున గూలెడు ప్రాణికోట్లకు సద్గురు సేవా భాగ్యమే జీవిత గమ్యమునకు చేయూత !

సద్గురువు లనగా నెట్టివారు – తన్ను తా నెఱింగి పరతత్త్వమునుదర్శించి భగవదాజ్ఞచే పరమసత్యమును వెల్లడిచేయుమానవాదర్శ మార్గదర్శకులే సద్గురువులు. మఱియు, సత్యదీక్షయందు స్థిరచిత్తము లేక విషయసుఖములకు లోనై, ముక్తిని విడనాడి భక్తిని పోనాడి భుక్తి కొరకే ప్రాకులాడెడి బాధగురువు లెందరోగలరు. సంసారశ్రమలను రూపుమాపుటకు యత్నించు మానవులు, బాధగురువుల ముఖ

మైనను చూడక బోధగురువుల పజ్జచేరి వినయవిధేయతలతో, భక్తి శ్రద్ధలతో మెలంగుచు, వారి ధర్మోపదేశములను, వారియాత్మ ప్రబోధము నతిజాగరూకతతో విని మననము చేయుచు నాచరించి ఫలితము ననుభవించి యాత్మానందమును పొందిననాడే భగవాను డొసగిన మానవజీవితమును సార్థకత చెందించినవార మయ్యెదము.

ఆ విధముగా ప్రవర్తించుట చేతగాక యర్థాపేక్షచే మాయ మాటలు నేర్చుకొని మాయను జయింపలేక దొంగకూతలు కూయుచు తనలోనున్న దొంగలార్గుర ప్రవర్తన నరికట్టలేక మటుమాయమై పోవువారెందరో గలరు.

ఆరోగ్య సూత్రములనెల్ల పాటించి హాయిగా జీవించెడివారు సైతము జన్మాంతరముల నుండి వెంబడించి వేధించెడి "మాయ" రోగమును మాత్రము గుర్తించుట లేదు. ఈ "మాయరోగము" అన్ని రోగములకంటె ఘనమైనది. ఈ మాయరోగముతో నశాంతిని పొందెడి బాధగురువులు, లోకము నెట్లుద్ధరించగలరు ? వారి రోగమునే గుర్తించక విఱ్ఱవీగెడి మూర్ఖులు, పరుల రోగములెట్లు కుదర్చగలరు ? ఇది యంతయు వట్టిభ్రమ ! గ్రుడ్డివాడు గ్రుడ్డివానిని సహాయము కోరినట్లు ! పాపము ! సంసారమునబడి మునకలు వేయుచు, ముఖ్యవిషయమును గుర్తింపక తికమకచెందెడి మానవులు, బాధగురువుల మెట్టవేదాంత వాక్యములు విని నమ్మి మోసపోవుచున్నారు.

నిత్యమూ శ్రీ వెంకటేశ్వరస్వామివారిని దర్శించుటకు భక్తులు, భక్తురాండ్రు శ్రీ యోగానంద మఠమునకు వేంచేయుచుండిరి.

## గ్రంథకర్త సుబ్బారావు శ్రీ యోగానంద మఠమునకు వెళ్ళుట

ఈ గ్రంథకర్త సుబ్బారావు శ్రీ వెంకటేశ్వరస్వామివారిని దర్శించవలెనని కొండాయపాలెం నుండి వినుకొండకు వెళ్ళి మధురఫలములతో శ్రీ యోగానంద మఠమున ప్రవేశించిరి. కాషాయాంబరధారిణి

యగు శ్రీ మహాలక్ష్మీదేవిగారిని, శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వర స్వామివారిని దర్శించి, భక్తితో హృదయపూర్వకముగా, సాష్టాంగ నమస్కృతు లొనర్చి ప్రశాంతభావమున నాసీనులై కన్నులార్పక స్వామివారిని దర్శింపసాగిరి.

శ్రీ మహాలక్ష్మీదేవి రామకృష్ణ లక్ష్మీవిగ్రహములను శుద్ధ గంగలో స్నానము చేయించి, పొడిబట్టతో తుడిచి పీతాంబరములను ధరింపచేసి, విమలోర్ధ్వపుండ్రనామములు మేనెల్ల ధరింపచేసి, పీఠముపై నునిచి, తులసిపేరులు మెడయందువేసి పూలతో పూజలొనర్చి నారికేళ నైవేద్యములను సమర్పణ గావించి చిటుకలు చేత ధరించి తంబుర మీటుచు పరవశత్వమున హరినామ భజన చేయదొడంగిరి.

ఆ మహాసాధ్వి చేసెడి పూల పూజలను కన్నులార దర్శించిన మేనల్లుడు సుబ్బారావు ముగ్ధుడై యామె స్వామిపూజ కాదర్శముగ నా మహాతల్లిని 'స్వామి - అత్త' యని ప్రియమార బిలచిరి. ఆనాటి నుండి యీనాటివరకు నా విధముగనే బిలుచుచున్నారు. శ్రీ వెంకటేశ్వరస్వామిని వీక్షించుచు తనలో "ఆహా! నేనుమాత్ర మన్నమును వర్జించి బ్రహ్మచర్యదీక్షతో నెందుల కుండకూడ"దని దలచి, స్వామి వారి సెలవుతో శ్రీదేవికి నమస్సు లర్పించి మఠము వీడి స్వగృహము చేరెను.

## గ్రంథకర్త బాల్యజీవితము

ఈ గ్రంథకర్త బాల్యజీవితము చాల విచిత్రమైనది. భక్తిమయ మైనది. వీరికి బాల్యమున బొగ్గరము శ్రీరంగయ్యగా రక్షరాభ్యాసము చేసిరి. ఆనాడు తోడిబాలురకు పప్పుబెల్లాలు పంచి యధ్యాపకులను తగురీతి గౌరవించి హృదయపూర్వక నమస్సు లర్పించిరి. ఒకటి రెండు మూడు నాలుగు తరగతు లతి శ్రద్ధతో వీ రధ్యయనము చేసిరి. ఉపాధ్యాయులు వ్రాసి యిచ్చిన పాఠముల నొకటి రెండు సారులు బాగుగా పరిశీలించి తుడిచివేసెడివారు, తోటిబాలురతో నాట పాట

లలో కాలమును గడిపి మరునాటి ప్రాతఃకాలమున పాఠశాలకు బోయి యందరికన్న మిన్నగా పాఠమును వల్లించెడివారు. గురువులు బాలుని ప్రతిభను గుర్తించి 'యేకసంథాగ్రాహి' యని మెచ్చుకొనుచుండెడివారు. శ్రీ రంగయ్యగారు బాలుడగు సుబ్బారావును కన్నకొమరునివలె నత్యాదరమున జూచుకొనుచు విద్యగరపిరి. గురువులనిన నతిభక్తితో మెలగుచు దైవసములని భావనచేసి చెప్పినది చెప్పినట్లుగా వల్లించెడి వాడు. తదుపరి చండప్రచండులగు బొగ్గరము శ్రీ నరసింహయ్యగారీ సుబ్బారావునకై దారు తరగతులు పూర్తి గావించిరి. వినయ విధేయతలతో మెలగుచు గురువే సాక్షాత్ దైవమని భావన చేసి గురువుల కృపకు సుబ్బారావు పాత్రుడయ్యెను.

ఈ సుబ్బారావు తాతగారి గ్రామమగు కొచ్చర్లకు వెళ్ళి కొంత కాలము విద్యాభ్యాసమొనర్చిరి. ఆ కొచ్చర్ల గ్రామమున యోగి వెంకయ్య అను నొక వ్యక్తికి గ్రామపౌరు లొకమఠమును నిర్మించి వారి నందుండునట్లుగా నియమించిరి. వారు ప్రతి దినమును భగవన్నామమును స్మరించుచు పూజలు గావించుచు తంబుర చిటుకలు దాల్చి బ్రహ్మముగారి తత్త్వములు మొదలగు వేదాంత కీర్తనలు గానము చేయుచుండెడివారు.

సుబ్బారావునకు బాల్యమాదిగా హరిభక్తి మెండు. హరికథ, పురాణ, నాటకములన్నను నమితాసక్తితో వెళ్ళి యందు పాల్గొనుచుండును. తీరిక సమయములయందు మఠమునకు వెళ్ళి, యోగి వెంకయ్యతో తెలిసీ తెలియని వేదాంతము సంభాషించుచు, హరినామ భజన లొనర్చుచు నుత్సాహపూరితుడై యోగి వెంకయ్య చేతిలో నున్న తంబుర తీసికొని వచ్చీరాని తత్త్వములు భావపరవశత్వమున గానము చేసెడివారు. ఆ తత్త్వముల భావములను యోగి వెంకయ్య విప్పిచెప్పెడివారు. తెలియని విషయమును వెంటనే ప్రశ్నించి తెలిసికొనుచుండెడివాడు. బాలభక్తుడగు సుబ్బారావు నవ్యక్తమధురభక్తిని

వీక్షించి యోగివెంకయ్య లోలోన యానందమును పొందుచు గాఢాలింగన మొనరించుకొని యెంతయో మెచ్చుకొనెడివారు.

మఠమునకు వేంచేసెడి రైతు సోదరులు యోగి వెంకయ్యతో 'ఏమండీ! ఈ సుబ్బారావునకింతటి భక్తి గలుగుటకు కారణము లేక పోలేదు. వీరి నాయన విశేషభక్తిపరులు. వారివంశమే భక్తిమయమైనది. వారి బంధువర్గమే గురుసాంప్రదాయమునకు చెందినది. మన వైశ్యులవలె నితడు వ్యాపారమునందు నెక్కువ ఆసక్తికలవాడు కాదు. లేకున్న నీ లేబ్రాయమున మఠమునకు వచ్చి వేదాంత ప్రసంగము చేయునా! మనగ్రామమున వైశ్యబాలకు లెందరు లేరు? ప్రాతఃకాలమునుండి సూర్యాస్తమయమగువరకు మిఠాయి మొదలగు సరుకుల నమ్ముకొనుచుందురే గాని, తీరిక సమయములందేనియు నొకడైనను మఠము తైపునకు రారు. ఏ విషయమైనను బాల్యమునుండియే పెంపొందుచుండును. ఎవరెవరి సంస్కారముల ననుసరించి వారి మనస్సులు వాని వానిపై ప్రసరించుచుండునని' చెప్పుకొనుచుండెడివారు.

సుబ్బారావు నిత్యము మఠమునకు వచ్చి తత్త్వములు గానము చేయుచుండెడివారు. ఒకరోజున పెద్దవర్షము పడినది. వీథులన్నియు నీటితో నిండిపోయినవి. ఆకాశమున కారుచీకటిక్రమ్మి యురుములు, మెఱపులు భయంకరముగా విజృంభించినవి. అట్టి సమయమున రైతుసోదరు లందరు మఠమునకు వచ్చిరి. యోగి వెంకయ్యగారు వారిని జూచి "నాయనలారా! మన మిత్రుడగు సుబ్బారావు రాని కారణముచే నా మనస్సేమియు బాగుగా లే"దని చెప్పిరి. రైతు సోదరులు లైటు తీసికొని సుబ్బారావు నిమిత్తము వారి మేనమామలగు శ్రీ కాకమాను నరసింహయ్య, రాఘవయ్యగారు నివసించు గృహమునకు వెళ్ళి సుబ్బారావును పిలువగా, మేనమామలు కోపముతో "నీ యుద్ధ [illegible] వీథులన్నియు నీరు నిండి యున్నవి. గాఢాంధకారముగా యున్నది.

నీ తత్త్వాలు రేపు పాడవచ్చును. ఈనాడు వెళ్ళవద్ద"ని చెప్పిరి. సుబ్బారావు వారిమాట పెడచెవినిబెట్టి వెంటనే రైతుసోదరుల కన్నముందే పరుగులు తీయగా వారెల్లరు చాల సంతోషించి యెత్తుకొని తీసికొని పోయి మఠములో దించిరి.

ఒక రోజున మేనమామగారగు శ్రీ నరసింహయ్య మఠమునకు వెళ్ళి కోపముతో "ఏమయ్యా! యోగి వెంకయ్యా! మా యల్లుని నీ వలెనే యోగిగా మార్చెదవా యేమి? మా వైశ్యుల కెందు కయ్యా ఈ వేదాంతము, నీ తత్త్వములు, తంబురలు, తాళాలు. ఏదో మా కులవృత్తి వ్యాపారము చేసికొని నాలుగు రూపాయలు సంపాదింప వలయునుగాని, యీ భక్తివలన భుక్తివచ్చునా! ముక్తి లభించునా?" యని కేకలు వేసిరి.

సాధు వెంకయ్యగారు "ఓ నరసింహయ్యగారూ! మీ మేనల్లుని మనోభావములను మీరు గుర్తించుట లేదు. అన్ని విద్యలకన్న మిన్నయై ప్రకాశించెడి బ్రహ్మవిద్యకై ప్రయత్నము చేయుచున్నాడు. పరతత్త్వబోధలకై యీ బాలుడు బాల్యావస్థలోనే యిట్లు ప్రవర్తించు చున్నాడు. ఇట్టి సద్భావములు జన్మాంతర పుణ్యఫలమువలనగాని ప్రాప్తించవు, లౌకికులకు భగవత్కథలు రుచింపవు. మీ మేనల్లుని ప్రవర్తన జూచి మీరు శంకింప నవసరములే"దని చెప్పిరి. శ్రీ నరసింహయ్యగారు, యదార్థసత్యమును గుర్తించి యల్లుని గాఢాలింగనము చేసికొని యపరిమితానందమును పొందెను.

సుబ్బారావు కొచ్చర్లగ్రామమువీడి స్వగ్రామమగు కొండాయపాలెము వేంచేసి స్వగృహమందే నివసించుచుండిరి. కులవృత్తియందు మనసులేక సదా సద్గ్రంథములను చదువుచు తనలో తాను "ఆహా! మన మీ లోకమున కొంత కాలముమాత్రమే జీవించెదము. తదుపరి జరిగెడు కాలమంతయు మనకు తెలియదుగదా! కొన్నిరోజులు జీవించెడి యీ యశాశ్వతపు జీవితమునకై చింత యెందులకు! నేడో, రేపో,

మరణించవలసిన దే! 'జననము - మరణము' ఈ రెంటి రహస్య మేమొ యెవరును తెలిసికొనుటలేదు. జన్మకర్మ రహస్యము తెలిసికొనుటే మానవత్వ"మని మనస్సు నతర్కించుకొనుచు రోజులు గడపుచుండిరి.

ఇంటిపను లేమియు పట్టించుకొనడు. ఎచ్చట నుత్సవములనిన తిరునాలలనిన తప్పక వెళ్లుచు ధనమంతయు ఖర్చుచేయుచు స్వగృహము చేరే ముందొక సద్గ్రంథము ఖరీదునకు తీసికొనివచ్చి యతిజాగ్రత్తగా నా పుస్తకమును ప్రాణప్రదముగా జూచుకొనుచు నందలి విషయము లను చదువుకొని యానందము పొందుచు, వృద్ధులగు తాతగారిప్రక్క చేరి తెలిసినంతవరకు విషయములను విశదీకరించుచు తాతాగారి మనస్సు నానందపెట్టుచుండిరి.

శ్రీ రామాయణ భారత భాగవతాది గ్రంథములన్నియు సమ కూర్చుకొని ప్రశాంతముగా కథాభాగములను చదివి గ్రామపౌరులకు భక్తితో వినిపించెడివారు. రకరకములైన తత్త్వములు పద్యములెన్నో కంఠస్థము చేసికొని తీరికసమయములలో రచ్చబండలపై చేరిన పౌరు లెల్లరకు వినిపించి వారి మనస్సుల నానందింపచేయుచుండిరి. భాగవత మున సప్తమస్కంధమున ప్రహ్లాద కథాభాగమున పద్యములు ముఖ్య మైన వానిని కంఠస్థముచేసి ప్రతిదినమును రాత్రికాలమున తాతయ్య ప్రక్కలోపరుండి వరుసగా రాగయుక్తముగా గానము చేసెడివారు.

శక్తి, యుక్తి, భక్తి గలిగిన రామయ్యశ్రేష్ఠి మనుమని వాగ్ధోరణి భక్తిజ్ఞాన వైరాగ్యములను వెదజల్లెడి పద్యభాగ పఠనమును విని, పరమాశ్చర్యముతో ప్రియతనూజుని శ్రీలక్ష్మీనారాయణుని తన వద్దకు పిలిచి "నాయనా! మన సుబ్బారావు నడవడిని గుర్తించితివా? యుక్తి - వ్యాపారపుశక్తి శూన్యము. భక్తి - సరస్వతీనందదాసక్తి మొదలగు విద్వద్గుణములు మూర్తీభవించినవి. ముందెట్లు మూరునో! ఆ నారాయణమూర్తికే యెరుక"ని నుడివిరి. ముత్కులపుత్రుండగు శ్రీలక్ష్మీ నారాయణ తండ్రితో "నాయనా! నీకీ చింతలన్ని యెందులకు? భగవ

చ్చింతన చేయుము. ఎవరి సంస్కారము వారిది. ఏది యెట్లు జరుగవలయునో యట్లే జరుగునుగాని, మధ్యలో మార్చుటకు మనము కర్తలమా! కర్త, భర్త రెండును శ్రీనామన్నారాయణమూర్తియే" యని సమాధానము చెప్పిరి. శ్రీ రామయ్యశ్రేష్ఠి లోలోన ముసిముసి నవ్వులతో మౌనముగా శ్రీహరిని ధ్యానింపదొడగిరి.

షోడశవత్సరముల ప్రాయముగల సుబ్బారావు, శ్రీవెంకటేశ్వర స్వామి వలె నన్నమును వర్జించి సంసారమును త్యజించి యేకాంత వాసమున తపస్సుచేయవలెనని సంకల్పించి, మాతాపితరుల యొద్దకు జని, వారికి ప్రదక్షిణపూర్వకమగు ప్రణామము లొనర్చి "ఓ జననీ జనకులారా! నేనీ నాటినుండి రోజునకు రెండుసార్లు భోజనము గావించెద" నని చెప్పిరి.

మాతాపితరులు ప్రియతనూజుని వాక్యముల కెంతయో సంతసమంది—"నాయనా! ఈ లేబ్రాయమున, రెండుసార్లు భోజనము గావించెదవా? హాయిగా దినమునకు ముమ్మారు భోజనము గావించి తోడి బాలురతో గంతులువేయు వయస్సు నీది! ఈ వేదాంత మెందుల"కని చెప్పిరి. సుబ్బారా వణుమాత్రమేని చలింపక, గట్టిపట్టుతో నుండెను.

సుబ్బారావు పుట్టినది మొదలు మాతృదేవికంటె వేయిరెట్లు ప్రేమతో జూచెడి యుత్తమయిల్లాలు, కమ్మవంశమున జన్మించిన ప్రత్తిపాటి బుచ్చమ్మ యను నామె కలదు. శ్రీ లక్ష్మీనారాయణుని బిడ్డల కనారోగ్యముగలిగిన తక్షణమే, బుచ్చమ్మయను యుత్తమసాధ్వి పరుగులు తీయుచు, లక్ష్మీనారాయణుని గృహమునకు వచ్చి, యా బిడ్డలకు కావలసిన వైద్యము చేయుచు ధైర్యము చెప్పుచు నెంతో యాదరముతో చూచుచుండును. సుబ్బారావు నెడ నమితప్రేమతో నుండెడి మాతృమూర్తి, ఒకరోజున నమిత వాత్సల్యమున దగ్గరకు చేర్చుకొని "నాయనా సుబ్బారావు! ఈ ఈడున రెండుసార్లు భోజనము చేయకూడదు. ఎవరు చెప్పినారు! వెఱ్ఱిమొఱ్ఱి వేషాలు మాని

మీ తండ్రి చెప్పినట్లు నడుచుకో నాయనా!" యని ప్రబోధము చేసినది.

శ్రీ లక్ష్మీనారాయణ, కొంతకాల మీ బుచ్చమ్మగారి భవనమున నొకప్రక్క నివాసము చేసిరి. సుబ్బారావు బాల్యజీవితము కొంతభాగ మీ భవనముననే గడచినది. శ్రీ లక్ష్మీనారాయణ యన్నగారగు శ్రీ కోటయ్య యను భక్తమూర్తి పెరుమాళ్ళపల్లెనుండి సోదరుని జూచుటకై వేంచేసిరి. తమ్ముని కుమారుని ప్రవర్తన జూచి యాయన యాశ్చర్యమొందెను.

సుబ్బారావు వ్రాసుకున్న కీర్తనలు, తత్త్వములు, పద్యములన్నియు దెచ్చి పెదనాన్నగారికి జూపి వేదాంతభావములు గల తత్త్వములు శ్రావ్యముగా పాడుచు నందలి భావముల నరటిపండొలిచినరీతి విప్పిచెప్పెడివారు. పెదనాన్న ప్రియకుమారులగు సుబ్బారావు గానము చేసిన తత్త్వములను విని యమితానందమును పొంది "నాయనా లక్ష్మీనారాయణా! సుబ్బారావు మన వంశమర్యాద నిలువబెట్టినాడు. మనవారందరు, భక్తి జ్ఞానములు గల్గినవారు! శ్రీ సద్గురు సాంప్రదాయమునకు చెందినవారు. వారి ననుసరించియే మన సుబ్బారావు, బాల్యదశయందే హరిభజనలతో నాధ్యాత్మిక తత్త్వములతో మనస్సును లీనము చేయుచున్నాడు. నీవు మాత్రమేమియు భయము చెందనవసరము లేదు. మన యారాధ్యదైవమగు శ్రీ సద్గురుదేవులు శ్రీ యోగానంద నరసింహస్వామి కృప యేతీరున నున్నదో యట్లే జరుగు"నని చెప్పిరి.

శ్రీ కోటయ్య, లక్ష్మీనారాయణు లిర్వురు ప్రతిదినమును సద్గురు పూజామందిరమున నామ భజనలు చేయుచు నానందముతో నృత్యములు చేసెదరు. నాన పెదనానలు చేసెడి నామభజనలు వీక్షించుచు సుబ్బారావు ఆనందాశ్రువులు రాల్చుచుండెడివాడు. కొంత కాల మీ విధముగా గడచినది.

సుబ్బారావు హృదయమున భక్తిభావములు పెంపొందసాగెను. ఒకరోజున శ్రీ లక్ష్మీనారాయణ మాతృదేవి నరసమ్మ యను సాధ్వి, మనుమరాలగు ధనలక్ష్మమ్మను తీసికొని కొండాయపాలెమువచ్చి చిన్న కుమారని గృహమునకు దయచేసెను.

కొచ్చర్లగ్రామములో స్కూలుమాష్టరు శ్రీ వల్లూరి సూర్యనారాయణ భాగవతారు 'భీమార్జున గర్వభంగ' మను కథ నెంతో రక్తితో గానముచేసెద రను విషయమును తెలిసికొని సుబ్బారావు వెంటనే కొచ్చర్ల గ్రామము వెళ్ళి తాతగారగు శ్రీ మల్లయ్య గారింటి కెళ్ళిరి.

రాత్రి పది గంటలకు శ్రీ వల్లూరిసూర్యానారాయణ భాగవతారు 'భీమార్జున గర్వభంగ' మను కథ నెంతో రక్తితో చెప్పి శ్రోతల నానందాబ్ధిలో ముంచి తేల్చిరి. సుబ్బారా వొంటరిగా కూర్చొని కథ సంపూర్తియగు వరకు ప్రశాంతముగా విని యమితానందమును పొంది కథాభాగమును మననము చేయుచు నా రాత్రి గడిపి, మరునాటి యుదయమున స్వగృహము చేరెను.

రాత్రి పది గంటలకు తాతగారగు శ్రీరామయ్య శ్రేష్ఠి, నాయనమ్మ గారగు నరసమ్మ ప్రియపుత్రుడగు శ్రీ లక్ష్మీనారాయణునితో లోకాభిరామాయణము ముచ్చటించుకొను సమయమున శ్రీ సుబ్బారావు పట్టుపంచ ధరించి శాలువ వేసికొని విభూతి ధరించి చిటుకలు వేయుచు తాతగారిముందు నిల్చొని, గతరాత్రి వినిన భీమార్జున గర్వభంగము హరికథను విన్నది విన్నట్లుగా విన్నవించిరి.

తాతయ్య, నాయనమ్మ లెంతో యానందముతో "నాయనా! ముందుకాలమున నీకు హరికథలు చెప్పు యోగమున్నది. లేకున్న విన్నకథను విన్నట్లు మాకు విన్నవించి యింత యానందము గల్గింతువా!" యని మెచ్చుకొని ముద్దుల మనుమని గాఢాలింగనము చేసికొనిరి.

శ్రీ రామయ్యశ్రేష్ఠి ముద్దుల మనుమని ప్రక్కకు చేర్చుకొని "నాయనా సుబ్బారావు! నీవు జన్మించిన లగ్నము విద్వల్లగ్నమని పండితులు చెప్పిరి. నీవు ప్రయత్నము పట్టుదలతో చేసిన-చో హరి దాసువై, కవీశ్వరుడవై మా వంశమును పవిత్ర మొనర్చెదవు. నార్యుల వాక్యములను గౌరవింపు"మని చెప్పిరి.

సుబ్బారావు తాతగారి వాక్యము లన్నియు విని మౌనముతో నేవేవో యాలోచించుకొని, తాతయ్యను కౌగలించుకొని యమిత ముగా దుఃఖింపసాగెను. అదిగాంచి నాత డాశ్చర్యముతో "నాయనా! కారణమేమి! భగవంతుని దయవలన మన కే కొరతయు లేదు. నీ కోరిక యేమి నాకు దెల్పుము ఈ క్షణమే నెరవేర్చెద" నని యోదార్చిరి.

సుబ్బారావు దుఃఖమును మ్రింగుకొని "తాతా! నేను దుఃఖం చిన కారణము నీవు గుర్తించలేదు. నా హృదయమున గలిగిన భావ ములు వినుడు. నీవింత గారాబముతో మమ్ము చూచుచున్నావు. నీవు కొన్నాళ్ళకు మమ్మందరిని విడచి యొంటరిగా వెళ్ళవలసిన దేకదా! నీవీ-చోటు వీడిన తదుపరి మరల మా కన్నులకు కన్పించవుకదా? సరే! ఆవిషయ మట్లు వదలినను, నాలో నింకొక ప్రశ్న యుత్పన్న మైనది! నేను పెరిగి పెద్దవాడనై నీవలెనే పెండ్లిచేసికొని సంతాన మును గాంచి సుఖము లన్నిటి ననుభవించి చివరిదశలో నీవలెనే తాతనై కదలలేక మెదలలేక గట్టి వస్తువులను తినవలెనని భ్రాంతి గల్గియు తినలేక వగచుచు శరీరరుగ్మతతో ననేక బాధ లనుభవించ వలసినదేకదా! ఈ బాధలను రూపుమాపు నుపాయము తెలిసిన-చో నాకు దెల్పుము. నేను దుఃఖమును మాని సదా యానందముతో మెలగెద" నని చెప్పిరి.

శ్రీ రామయ్యశ్రేష్ఠి యాశ్చర్యమానసులై "నాయనా! నీవు నుడివిన దంతయు యదార్థమే! తొంబది సంవత్సరములు జీవించితిని. ఈ క్షణమునకు నాకు సంసారముపై భ్రాంతి వీసమేనియు తగ్గలేదు.

సదా 'రామా కృష్ణా' యని యుచ్చరించుచుందును. కొడుకులపై, కోడండ్రపై, మనుమలపై భ్రాంతిని వీడలేకున్నాను. మాయ నెటింగి మసలుట చాల కష్ట"మనిరి.

సుబ్బారావు అందరు వినెడి సమయమున "నేను పెండ్లి చేసికొనను. శ్రీ యోగానంద మఠమున స్వామివారివలె బ్రహ్మచారినై తపసు గావించెదను. నాపట్టు వీడ" నని గట్టిగా దెల్పిరి.

కుమారుని వాక్యము లన్నియు సావధానముగా వినెడి వెంకమాంబ ప్రియకుమారుని గాఢాలింగన మొనర్చుకొని "నాయనా! నీవు మా తొలికానుపు బిడ్డవు. మా యాశలన్నియు నీపై బెట్టుకొని జీవించుచున్నాము. నీ తరువాత రత్నముల వంటి బిడ్డలు జన్మించి మరణించిరి. మా యాశలన్నిటిని గంగపాలొనరించెదవా తండ్రీ!" యని కన్నీరు గార్చిరి. సుబ్బారావు మాతృదేవి కన్నీటిని దర్శించి బిగ్గరగా "అమ్మా! నే నెక్కడకును వెళ్ళను. మీ చెంతనే యుండెద" నని కన్నతల్లి దుఃఖము నుపశమింప చేసిరి.

సుబ్బారావు రోజునకు రెండుసార్లు భోజనము చేయక, నాహారమును వర్జించి యోగిగా మసలవలయు నని యెంచి, రోజున కొక పర్యాయ మాహారము తీసుకొనసాగెను. ఈ విధముగా కొన్ని మాసములు గడచినవి. ప్రేమపాత్రురాలగు ప్రత్తిపాటి బుచ్చమ్మ, సుబ్బారావు పరిస్థితి గుర్తించి కడుచింతించి మాటిమాటికి సుబ్బారావుతో "నాయనా! నీ పట్టుదలమాని మీ తల్లిదండ్రుల కోర్కెను చెల్లింపుము. ఈ లేతవయస్సున నొకపూట భోజనమా? ఇది వేసవికాలము. ఎండ వేడిమి తీవ్రముగా నున్నది. రోజునకు ముమ్మారు భోజనము చేసినను ప్రాణముస్సు రనుచున్నది. ఇట్టి కాలమున, మిట్టమధ్యాహ్నమున కొక మెతుకుదిని మరునాటి మధ్యాహ్నము వరకు నోరు కదల్పక కన్నులు మూసికొని దేవునిముందు ధ్యానము

చేయుచున్నావు. నీ విషయము మా కేమియు బాగుగాలే"దని యెంతో కష్టముతో చెప్పెను.

సుబ్బారావు "ఓ అవ్వా! నాపై మమకారముతో నీవు మాటలాడితివి. ఎన్నాళ్ళు బ్రతికెనను కాటికే! ఎన్నాళ్ళేడ్చినను కాటికే! నీవు తెలిసియు నన్ను భ్రమపెట్టుచున్నావు. యదార్థము విచారించినచో మన స్థూలదృష్టికి గోచరించెడి పదార్థము లన్నియు మట్టిలో గలియవలసినదే! స్థూలదృష్టికి గోచరింపక, సూక్ష్మదృష్టికి స్వప్రకాశమై సాక్షాత్కరించెడి పరమాత్మ యొకటియే సత్యమైనది, నిత్యమైనది, శాశ్వతమైనది. అట్టి పరమాత్మ మనహృదయ కుహరమున ప్రకాశించు చున్నాడు. ప్రాణులందరికి స్వస్థానమగు నా పరమాత్మ యొకటియే! ఆ పరమాత్మను దర్శించుటే మానవత్వము. దర్శించుటకు యత్నించుటే మానవత్వము! సర్వమును తృణమువలె త్యజించి పరమాత్మ భావమును పొందుటయే మానవత్వము. తన పుట్టుకేదో, తను చేరవలసిన స్థానమేదో తెలిసికొనుటకైనను ప్రయత్నించక, మిద్దెలు మేడలు ధనధాన్యరాసులు, దారాసుతాదులు తనవేయని తనవారేయని నమ్మి, రాత్రింబవళ్ళు సంసార వ్యాసంగములతో కాల మంతయు వృథచేసి నయాపైసయైనను లోకోపకారమునకువెచ్చించక, యిదంతయు తనదేనను పిచ్చిభ్రమతో, తానుదినక నొకరికి పెట్టక, లోభియై జీవించి, యేనాడో, యేక్షణమో, తనకు తెలియకనే, సర్వ సౌఖ్యములను బంధువులను మురిపించి ముచ్చటలుతీర్చు భార్యాబిడ్డలను, తళతళ మెరయు బంగారునాణెములను వదలి, చిల్లిగవ్వయైనను వెంట తీసికొని వెళ్ళుటకు చేతగాక, జీవితమున చేసిన పాపపుకొండలను పైన వేసికొని, కాలకింకరుల సమ్మెట పోటుల కోర్వలేక, గతజీవిత సంఘటనలను గుర్తుకు దెచ్చుకొని తన తెలివితక్కువ చేష్టలకు కుమిలి కుమిలి యేడ్చుచు నరకమునకు పోవుచుండును. భక్తిలేని నరపశువుల కీదుస్థితి మిట్లుండును అవ్వా!" యని చెప్పెరి

ఆమె దిగ్భ్రమతో నొద్దనున్న సుబ్బారావును కౌగలించుకొని "నాయనా! నీ వింతవాడ వని గుర్తింపనైతినే! ఆహా! నీవంటి సద్గుణముల రాశి యొకడే చాలును. 'కసవువాడ్చిన చిలిపిరాళ్ళు గంపెండేల?' యన్నటుల, మంచి ముత్యమువంటి బిడ్డవు, మా లక్ష్మీనారాయణునకు, నీ వొక్కడివే చాలు"నని యెంతో యానందము పొందినది.

సుబ్బారావు మనస్సు పూర్తిగా మారిపోయినది. భోజనము చేయక నిరాహారదీక్షతో మూడు రోజులు గడుప కన్నతండ్రి లక్ష్మీనారాయణమూర్తి, యన్నిటికి మా సద్గురుదేవులగు శ్రీ యోగానంద నరసింహమూర్తియే కలడు. మధ్య నా కెందుకు చింత యని మది నెంచి, కుమారుని పట్టుదలను వీక్షింప దలచి, పంచదార యరిసెలు నేతితో చేయించి పదియరిసెలు పళ్ళెరమం దుంచి కుమారుని ముం దుంచిరి.

త్యాగయోగముతో నుండెడి సుబ్బారావు వానిని కన్నెత్తియైనను చూడక భగవన్నామమునే స్మరించుచుండెను. కన్న తండ్రి ప్రేమ నరికట్టలేక యా యరిసెలను తీసుకొని కుమారున కొసగిరి. ఆ బాలుడవి తీసికొని దూరముగా విసరివేసెను. ఈ సంఘటనను దర్శించిన ప్రియ జనకుడు, మన యత్నములు నిష్ప్రయోజన మని దలచి కుమారునితో, "నాయనా! మన గురుదేవులు శ్రీ యోగానందస్వామి వారు, మార్గాపుర సమీపమున శ్రీ కపిలగిరిపై ప్రశాంత వాతావరణమున యోగ శక్తులతో నఖండ ప్రజ్ఞాన్వితులై వెలుంగుచున్నారు. వారి సన్నిధికి వెళ్ళెదము. వారు చెప్పినట్లే మెలగెదవా" యని ప్రశ్నించిరి.

ప్రియనందనుడు తండ్రీ! ఆ యోగానందమూర్తి నా కంఠమును కోసి యిమ్మన్నను నిచ్చెదను సందేహము లేదని చెప్పిరి. లక్ష్మీనారాయణమూర్తి ప్రియకుమారుని వెంట నిడుకొని వినుకొండలోని శ్రీ యోగానంద మఠమునకు జని శ్రీ మహాలక్ష్మీదేవితో కుమారుని విషయ మంతయు విన్నవించి "ఓ అక్కా! నీ మేనల్లుడు సుబ్బారావును

మన సద్గురుమూర్తి పాద సన్నిధికి చేర్చుము. ఆ తండ్రి యిష్టానుసారం" మని చెప్పి యక్కయ్య కొప్పగించి సోదరుడు స్వగృహము చేరెను.

## గ్రంథకర్త జ్ఞానోపదేశమును పొందుట

శ్రీ మహాలక్ష్మిదేవి మేనల్లుని వెంటతీసికొని శ్రీ సద్గురుదేవులు నివశించెడి శ్రీకపిలాశ్రమమునకు జని సద్గురుమూర్తికి ప్రణామము లర్పించెను. సుబ్బారావు సద్గురుపాదములపై వ్రాలి ప్రార్థించెను.

శ్రీ యోగానంద మహర్షి "అమ్మా! మహాలక్ష్మమ్మా! ఈ బాలుని జ్ఞానోపదేశమునకై తీసుకొని వచ్చినట్లున్న" దనిరి. ఆమె "స్వామీ! తమరు సర్వజ్ఞులు. ఇతడు నా సోదరుడగు లక్ష్మీనారాయణుని కుమారుడు. త్యాగముతో సన్న్యమును వర్జించి తమదర్శనమునకై పట్టు బట్టి యున్నంత, వీని తండ్రి తీసికొనివచ్చి నాకొప్పగించి వెళ్ళినాడు. నేను తమ కొప్పచెప్పి వెళ్ళుటకై వెంటతీసుకొని వచ్చితిని తండ్రీ" యని నుడివెను.

శ్రీ సద్గురుదేవులు బాలుని భవిష్యత్తంతయు నామూలాగ్రముగా తెలిసికొని "నాయనా! నీ కోర్కె దెలుపు"మనిరి. భయభక్తులతో చేతులుమోడ్చి "స్వామీ! నేను బ్రహ్మచారినై యోగాభ్యాసము తమయొద్ద నభ్యసించి తపోనిష్ఠయందుండవలయునను సంకల్పముతో తమపజ్జ చేరితిని, స్వామీ!" యని సుబ్బారావు విన్నవించెను.

శ్రీ సద్గురుదేవులు, "నాయనా! నీకు బ్రహ్మచారివై యుండుటకు యోగము లేదు. సంసారయోగమున్నది. నీకీనాడే జ్ఞానోపదేశము గావించెదను. సాయంత్రము మూరుగంటలకు శ్రీ లక్ష్మీనృసింహస్వామి యాలయమున నొకచక్రము గీచి యా చక్రముపై నాసీనుని గావించి సద్గురు స్తోత్రము చెప్పి కర్ణమున ప్రణవ ముపదేశించి యాత్మానంద మొనగూర్చెడి మహామంత్రము నుపదేశించి, నాలుకపై బీజాక్షరము లను ముద్రవేసి, "నాయనా! నీ వీనాటినుండి రెండుసార్లు భోజనము

చేయుచు భక్తితో ముక్తిని కాంక్షించుచు సాధుగుణములతో సత్సంగ
ములతో సద్గ్రంథముల పారాయణ మొనర్చుచు ధర్మజీవన మొన
ర్చుము. నీవు రాజయోగివై నిర్మలమైన భక్తియోగము నవలంబించి,
ప్రష్ఠాంవభక్తితో మెలగుచు కీర్తికాముడవై వర్థిల్లు యోగమున్నది.
మరియు నింకొక విశేషమున్నది. నీవు కౌమార దశయందు తీవ్రవైరా
గ్యమును పొంది సాధువేషముతో నేనున్న స్థానమునకే చేరెదవుగాక!
స్వాత్మాంతము వరకు నిత్యసంతోషివై చరించెదవు నాయనా!" యని

ప్రియశిష్యుడగు సు... "స్వామీ! మహాభాగ్య
తమ యాదేశము దైవసందేశము; సందేహము లేదు. సర్వకాల
సర్వావస్థలయందు తమరే దిక్కని నమ్మికొని యుండెద స్వామీ!
వెళ్ళి వచ్చెద" నని సద్గురువు సెలవు గైకొని మేనత్త వెనువెంటనంటి
కపిలగిరి వీడి వినుకొండ శ్రీ యోగానంద మఠము చేరి పిమ్మట
స్వగృహమున కేగిరి.

## గ్రంథకర్తగారి వివాహమహోత్సవము

భక్తితో గురుమంత్రము జపించుచు స్వగృహమందే కుల
వృత్తిపై మనస్సుంచక సదా సద్గ్రంథపారాయణ మొనర్చుచు
సుబ్బారావు కాలము వెళ్ళబుచ్చుచుండిరి.

సమీప గ్రామమగు బొగ్గరములో గౌరవనీయులు శ్రీ కాక
మాను చిన్నకృష్ణయ్య ద్వితీయపుత్రులు శ్రీ కాకమాను వెంకట
కోటయ్య శ్రేష్ఠిగారు, కొండాయపాలెమునకు వచ్చి శ్రీ లక్ష్మీనారా
యణతో, "యేమండీ! మీ పెద్దకుమారునకు మా పెద్దకుమార్తె నిచ్చి
వివాహము చేయుటకు సంకల్పించి నా"మనిరి. వృద్ధులగు శ్రీ రామయ్య
శ్రేష్ఠిగారు "నాయనా! వెంకటకోటయ్యా! మీ తండ్రీ నేను బాల్య
మిత్రులము. ఈ నాడు బాంధవ్యమున కరుదెంచినావు. మేము కాదన

గలమా! 'శుభస్య శీఘ్రం'. కట్నములు కానుకలు మీ యిష్టము. ధనధాన్యములు శాశ్వతమా? వంశమర్యాదయే ముఖ్య"మని చెప్పిరి.

శ్రీ వెంకటకోటయ్యశ్రేష్ఠి తన స్థితికి తగినట్లు కట్నములు కానుకలు నొప్పుకొని యేడుకొండల వేంకటేశ్వరుని సన్నిధానమున వివాహము చేయ నిశ్చయించుకొనిరి. ఇరుపక్షములవారు బంధువర్గములతో ప్రయాణమై గోవిందలు కొట్టుచు భక్తితో శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధానమునకు చేరి సత్రశాలలో మకాము చేసిరి.

విరోధి నామ సంవత్సర జేష్ఠ మాసమున బహుళ దశమీ శుక్రవారము, రాత్రి లగ్నమున శ్రీ సుబ్బారావునకు హనుమాయమ్మ యను బాలికామణి నిచ్చి పాణిగ్రహణ మహోత్సవము పూర్తి గావించిరి. పెద్దలందరు మంగళాశీర్వాదము లొనర్చి మంత్రాక్షతలు నూతన వధూవరులపై చల్లిరి. మూడు రోజులు స్వామిసేవలో పాల్గొని దివ్యమంగళ విగ్రహుడగు శ్రీ వేంకటేశ్వరస్వామిని తనివిదీర దర్శించి బంధువు లెల్లరు స్వగృహములకు జనిరి.

కొన్ని మాసములు గడచిన పిమ్మట శుభ ముహూర్తమున నక్కరదీర్చి హనుమాయమ్మను నత్తవారింటికి పంపించిరి. అత్తమామల యాజ్ఞల శిరసావహించుచు సతికి పతియే ప్రత్యక్షదైవమను నార్యుల వాక్యములను పాటించుచు శ్రీహరిభక్తిగలిగి హనుమాయమ్మ సంసార యాత్ర సాగించుచుండెను.

సంసారము సారహీనమైనదని గుర్తించిన సుబ్బారావు సంసారమందుండియు తామరాకుపై నీటికణమువలె నంటక హరినామముతో నహర్నిశలు హరికథలను పఠించుచు భాగవతాది మహాగ్రంథములు చదివి గ్రామవాసుల మనస్సులను నానందింపచేయుచు, కాలమును సద్వినియోగ మొనర్పసాగెను.

ఈ గ్రంథకర్తయగు సుబ్బారావు తత్త్వము సాధుసమ్మతమైనది. ఇతడు తీర్థయాత్ర లనిన, పుణ్యస్థలము లనిన, పుణ్యాశ్రమము లనిన ఆసక్తి నొందు. వాటిని దర్శించవలయు నని తహతహ లాడెడివాడు.

## గ్రంథకర్త దసరా యుత్సవములకు మైసూరు వెళ్ళుట

శ్రీమతి హనుమాయమ్మ గర్భవతియై నవమాసములు నిండినంత పుట్టింటివారు తీసికొని వెళ్ళిరి. శ్రీ సుబ్బారావు దసరా మహోత్సవము లను దర్శించవలయునని, యొంటరిగా ప్రయాణమై, ఖరనామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధవిదియనాడు స్వగ్రామము వీడి వినుకొండకు వెళ్ళి యా రాత్రి పదిగంటల రైలులో చేరిరి. యాత్రకు వెళ్లెడి వ్యక్తులకు వేదాంత ప్రబోధ మొనర్చుచు మరునాటి సాయంత్రము 4 గంటలకు మైసూరు చేరిరి.

ప్రతిదినము సాయంత్ర మారుగంటలకు లక్షలాదిగ బల్బులు వెలుగుచుండగా దర్బారులో శ్రీ చామరాజ యొడయార్ సుఖాసీనులై యాత్రికులకు దర్శనమిచ్చెదరు. సుబ్బారావు చాముండేశ్వరి కొండకు వెళ్ళి దేవిని దర్శించిరి. బృందావన్ గార్డెన్స లోపలకు వెళ్ళి లక్షలాది రంగురంగుల బల్బులతో నారిపోవుచు వెంటనే వెలుగుచుండెడి వింత వింత దృశ్యములు గల బృందావనమును కన్నులపండువుగా దర్శించిరి. మైసూరు సమీపముననున్న శివసముద్ర జలపాతమునకు వెళ్ళిరి. ఆదృశ్య మత్యంతరమణీయమై యానందదాయకమై జీవితమున మరపురానిది.

ఎత్తయిన రెండుకొండలమధ్య లోయలో కావేరీ మహానది నాలుగుగజముల వెడల్పులో శరవేగమున నిగికాంతులతో నావిరి పొగలతో ప్రణవధ్వనులతో ప్రవహించుచుండును. అట్టి దృశ్యము లుత్తమ మానవులు దర్శించిన మనస్సు విరాగమొందును. దైవసృష్టి యత్యంత రమణీయమై, కళ్యాణప్రదమై యొప్పుచుండును. ఆ గంగా ప్రవంతిని దర్శించి, మార్గమధ్యమున శిథిలావస్థపొందిన సోమనాథ దేవాలయములన్నియు ప్రశాంతముగా దర్శించిరి. ఆ దృశ్యములెల్లను

వీక్షించెడు సుబ్బారావు మనస్సున మనుగభావము ఉత్పన్నమై పరమ వైరాగ్యమును ప్రబోధము చేసికొనిరి.

"ఆహా! ఈ శిల్పనైపుణ్యము మరపురానిది! ఈ శిల్పాచార్యు లెంతో శ్రమించి, బుద్ధి నుపయోగించి సజీవ స్వరూపములనుసృష్టించిరి. ఎన్నోవందల సంవత్సరములనాటి శిల్పసౌందర్య మీనాటికి నెంత శోభగా వెలుగొందుచున్నది! అట్టి శిల్పసౌందర్యమును తురుష్క ప్రభువులు తుత్తునియలు గావించిరి. ఎంత నేర్పుతో సృష్టించినను శాంతి లేనినా డన్నియు వ్యర్థము లేకదా! శాంతియే స్థిరమైనది. ఇట్టి నిర్మాణములే విఫలములైనవి. ఏవి యేనాటి కెట్లు మారునో యా సర్వేశ్వరునికే యెఱుక!

సర్వ మనిత్యము. స్వయంజ్యోతియై ప్రకాశించెడి యాత్మయే నిత్యమైనది. సత్యమైనది! ఎట్టి దుష్ట పరిణామములకు నాశ మొందనిది. ధీరులకు వీరులకు శక్యముగానిది. అస్త్రశస్త్రములచే ఛేదింపబడనట్టి వస్తువు. వాస్తవమైన దేవస్తువు? అది పరమాత్మయే! ఆ వస్తువును పొందుటకే యీ వస్తుసామాగ్రినంతయు సమకూర్చుకొంటిమి. ఆ సద్వస్తువును దర్శింపనినా డీవస్తుజాలమంతయు వ్యర్థము. ఆపరమాత్మ కొరకు మన ధన ప్రాణములను వెచ్చించిననాడే మనము మానవత్వము నిలువబెట్టినవార మయ్యెదము. వాస్తవ వస్తువగు పరమాత్మ దర్శనమునకు జీవితమును వినియోగింపని మానవుని పుట్టుకే వ్యర్థమని మహనీయులందరు వేనోళ్ళ చాటుచున్నారు. మానవుడు మాధవునిగా మారుటకొరకే, వివిధములగు దేవాలయములను కట్టించి, రంగురంగుల రూపములను స్థాపించి, రకరకములగు మంత్రములతో, వేరువేరు యర్చనలతో దైవము నారాధించుచున్నారు. మొదటిమెట్టు దాటించుటకే, ఆర్యులు రూపరహితమగు భగవంతునకు రూపము లేర్పరచి యాలయములు నిర్మించి మూర్తులను స్థాపించి పూజలు చేయుచున్నా"రని, సుబ్బారావు తన యాత్మకు తానే ప్రబోధము చేసికొనిరి.

దసరాయుత్సవములు పూర్తిగావించి సుబ్బారావు స్వగృహము చేరిరి. స్వగృహము చేరిన మూడుదినములకే సుబ్బారావునకు కర్మదేవత జ్వరరూపమున ప్రవేశించినది. కర్మదేవత వక్రదృష్టి ప్రసారము చేత ముప్పది లంఘనములుచేసి జ్ఞాపకశక్తి పూర్తిగా లేక తారుమారైరి. గంటముందు చేసినపని యణుమాత్రమేని స్ఫురణకు రాకుండెను. ఒకటి రెండు మూడెంతని యడుగ చెప్పెడి శక్తియు నశించిపోయెను. కన్న తల్లిదండ్రులు, అత్తమామలు, సతియు నమితావేదన పొందుచుండిరి. భాగవత మహాగ్రంథము చేతికిచ్చి యొకపద్దెము వల్లింపుమనిన, వెఱ్ఱిచూపుతో పద్దెమువంక చూపునిలిపి మౌనముతో నోరు విప్పక గంటలకొలది యట్లే నిరీక్షించుచుండిరి. ఈ సంఘటలన్నియు వీక్షించెడు, మాతాపితరు లిర్వురు నమిత దుఃఖమును పొందసాగిరి.

ప్రియజనకు డేమియు దోచక నన్నిటికి గురుదేవులే దిక్కని కుమారుని వెంటనంటి వేయికన్నులతో కాపాడు కొనుచు శ్రీయోగానందమహర్షి నివసించెడు కపిలగిరికి పోయి గురుదేవులకు ప్రణమిల్లి కుమారుని దుస్థితిని విన్నవించిరి.

## గ్రంథకర్త వ్యాధికై పలుస్థలములకు తిరుగుట

శ్రీయోగానందమూర్తి "లక్ష్మీనారాయణా! నీ పుత్రుని శిరస్సుపై మృత్యుదేవత ప్రళయనాట్యము చేయుచున్నది. మీ పూర్వులార్జించిన ధనమున పాపమున్నది. పాపపుసొమ్ము ఖర్చుకావలసినదే! దాని నాపుట కెవ్వరి తరము కాదు. వీని వ్యాధికారణముగా కొంత ధనము వ్యయమగును. చివరకు వీని వ్యాధి మటుమాయమైపోవును. భయము వల" దని చెప్పిరి.

"సద్గురుదేవుల వాక్యములకు తిరుగులేదు బ్రహ్మవ్రాతే!" యని శిష్యుడగు లక్ష్మీనారాయణ సద్గురు సెలవుతో కుమారునితో స్వగృహము చేరిరి.

సుబ్బారావు తనలో తాను చింతించుచు యయోమయముగా వెఱ్ఱిచూపులతో ఎవ్వరితో ఏమియు చెప్పక యే ఒంటరిగా దీనముఖముతో దిక్కులు పరికింపసాగెను. మాతృదేవియగు వెంకమాంబ ప్రియకుమారుని దుస్థితి కన్నులార గాంచి యాహారమునే వర్జించి మమకారముతో కుమిలి కుమిలి యేడ్వసాగెను. ప్రియజనకు డేమియు దోచక కుటుంబముతో ప్రయాణమై, గుంటూరు కేగి రంగూన్ డాక్టరుయొద్ద చేర్చి వివిధములగు మందు లెన్నో యిప్పించి విసిగి వేసారిరి.

లక్ష్మీనారాయణ ప్రియకుమారుని చేయి పట్టుకొని యతి జాగ్రతగా వైద్యశాలకు, తీసికొనివచ్చి ఇంజక్షన్లు నిప్పించుచు సత్రశాలకు తీసికొనివచ్చుచుండెను. లక్ష్మీనారాయణ లోలోన చింతించుచు 'హా దైవమా! ఈ గుంటూరున కెన్నో వందలసారులు వచ్చి పనులు చూచుకొని స్వగృహము చేరెడి నా కుమారుని గతి యెట్లు మారె'నని వగచుచు శ్రీహరిని ధ్యానింపసాగిరి.

దైవ మనుకూలింపని నా డెట్టి మేధావులైనను నెందుకు పనికి రారు. శ్రీహరి దయాప్రసారము లేనిరోజులలో నెట్టి ధీశాలియైనను బికారియై భిక్ష మెత్తవలసిన దే!

సుబ్బారావు వ్యాధిని చూచి సత్రములోనివారు, 'భూతమాంత్రికులకు చూపించండి అర్థముగాని వ్యాధులు వారి కర్థమగు'నని చెప్పిరి. లక్ష్మీనారాయణ వెంటనే గంపడాశతో గుంటూరునుండి పొన్నూరు వెళ్లెడి మార్గమధ్యమునకు సమీపగ్రామమగు నారికేళపల్లెకు సుబ్బారావును తీసుకొని వెళ్ళిరి.

భూతమాంత్రికుడగు బ్రాహ్మణుడు సుబ్బారావును చూచి "ఇదొక లెక్కయా? ఓహో! రక్షరేకు కట్టిన తక్షణమే మీ గ్రహము మటుమాయమగు"నని గట్టిగా దెల్పిరి. లక్ష్మీనారాయణగారు, ఆ భూతమాంత్రికునితో "నాయనా! రక్షరేకు కివ్వవలసిన ధన మెంత"నియడిగిరి.

తాంత్రికారాధకుడు, "ఏమి వద్దుబాబూ! ఐదురూపాయల ఐదణాలు మాత్రమే దక్షిణ తీసుకుంటాను. టెంకాయ తాంబూలము ఐదు గిద్దలబియ్యము మాత్రము మా కిచ్చేపద్ధత"ని మెల్లగా చెప్పిరి. లక్ష్మీనారాయణ, వారు చెప్పినవన్నియు దెచ్చియిచ్చి నమస్సు లర్పించిరి. సుబ్బారావు ఇదంతయు రెప్పలార్పక వీక్షించుచు వీని మంత్రము తంత్రము యంత్రము పరీక్షించవలయునని మౌనముగా నుండిరి.

శ్రీ లక్ష్మీనారాయణ మనస్సున సద్గురునామస్మరణ మొనర్చుచు దీనదృష్టితో ప్రియనందనుని వీక్షింపసాగిరి. భూతమాంత్రికుడు వ్రాయు యంత్రమును సుబ్బారావు పరీక్షించి "ఏమయ్యా! నీవు వ్రాయు యంత్రము బాలారిష్ట నవగ్రహయంత్రము! నీ యంత్రములు, మంత్రము లన్నియు నెరుంగుదును. నీ వౌనర్చెడి తంత్రము మాత్రము తెలియ"దని చెప్పిరి. భూతమాంత్రికుడు నివ్వెరపడి "ఓ లక్ష్మీనారాయణా! డబ్బు నెందుకు వ్యయము చేసెదవు? నీ కుమారునకు మతిలేదన్నవారికి మతిలేదు. నేను వ్రాయు మంత్రము, యంత్రము మీ కుమారునికి తెలియు నయ్యా! ఈ యంత్రము దండుగ"ని నుడివిరి.

శ్రీ నారాయణ "దండుగ కేగదా మాకీ విపత్కరస్థితి యేర్పడినది! యంత్రము వేయండ"ని వేడగా—"సరే" యని రక్షరేకు మంత్రించి మాంత్రికుడు సుబ్బారావు మెడలో గట్టెరి. వారి గృహముననే యిర్వురు భోజనము గావించి వారి సెలవుగైకొని, పిమ్మట లక్ష్మీనారాయణ కుమారుని వెంటబెట్టుకొని గుంటూరు చేరిరి.

సత్రమున ప్రవేశించి కుమారుని మెడయందు రక్షరేకు చూడగా మటుమాయమైనది. కుమారుని కోపముతో "రక్షరే కేమి చేసితి?" వని యడుగ—"నా దొంగ కట్టిన రక్షరేకు పసిబాలురకు బాలారిష్టదోషపరిహారార్థము కట్టవలసినది. నాకు కట్టి మోసముచేసినాడు. నేను వారి కేళపల్లె వీడి వచ్చు మార్గముననే త్రెంపి చెరువులోపారవేసితి"నని సుబ్బారావు

చెప్పిరి. తండ్రి యాశ్చర్యపడి, యానందము నపారదుఃఖమును పొంది, మిన్నకుండిరి.

'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' యనెడి నార్యోక్తి పరమసత్యము. మాతృదేవియగు వెంకమాంబ యాహారమును వర్జించి శుష్కోపవాసము లొనర్చుచు ప్రేమమీర కన్నకొమరుని కౌగలించు కొని, "నాయనా! భాగవతాది గ్రంథములు చదివి నందలి భావముల నరటిపండ్లొలిచినరీతి మాకు చెప్పి మమ్మానందింప చేసితివి. అట్టి శుభ సమయ మెన్నడు తిలకించెదవో, కుమారా!" యని భగవానుడగు శ్రీ లక్ష్మీనృసింహుని ప్రార్థింపదొడగెను.

శ్రీ లక్ష్మీనారాయణ యేమియు దోచక యాయుర్వేద నిపుణు లగు శ్రీ శిష్టా సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వైద్యశాలకు కుమారుని తీసి కొనిపోయి పరీక్షఫీజు చెల్లించి పరిస్థితి విన్నవించిరి.

ఆ యాయుర్వేద నిపుణులు సుబ్బారావును పరీక్షార్థ్యాయందు కూర్చుండ నియమించి విషయములన్నియు వరుసగా నడుగసాగిరి. శాస్త్రిగారి ప్రశ్నలకు సుబ్బారావు తగు విధముగా సమాధానములు చెప్పి చిట్టచివరకు కోపముతో "నీవు శాస్త్రివేనా? వ్యాధిలక్షణములు మొదలగు విషయములన్నియు నాచే చెప్పించుకొనిన తరువాత, ఫలానా వ్యాధి యని నిర్ణయించెదవా? ఇది వైద్యుని లక్షణమేనా! అన్యాయ ముగా నార్జించిన ధనము హారతికర్పూరమువలె కరిగిపోవు" నని బిగ్గరగా పలికిరి. శాస్త్రి తల గిర్రున ద్రిప్పి గదినుండి బయటపడి "ఓ అయ్యా! నీ కుమారునకు మతిలేదు పరీక్ష చేయండని చెప్పి ఫీజునూ చెల్లించితిరి. వాని కేమి జబ్బు, ఆతను వేయు ప్రశ్నలకు నిజమైన సమాధానము చెప్పవలయునన నాకే తోచలేదు. డబ్బంతయు నెందుకు ఖర్చు చేసెదవు స్వగృహము చేరు"డని సలహా యిచ్చిరి.

శ్రీ లక్ష్మీనారాయణ, సద్గురు దేవులు చెప్పిన వాక్యములన్నియు యదార్థములైనవి. పాపపుసొమ్ము ఖర్చైనదని కుటుంబముతో గుంటూరునుండి స్వగ్రామము చేరి సద్గురు దేవుని స్మరించుచుండిరి.

సుబ్బారావు ఎప్పటివలె నెవ్వరితో మాటలాడక నిల్లువదలి వెలుపలకు రాక యింటియందే యయోమయ జీవితము గడుపసాగిరి. గ్రామములో నున్న పెద్దవారు కొందరు సుబ్బారావు పరిస్థితినిచూచి దిగులొందుచు నేమియు చేయునది లేక ఒకరోజున లక్ష్మీనారాయణునితో 'పెదారగట్లకు తీసికొని వెళ్ళండి అచ్చట తాయెత్తు మంత్రకుంకుమ నిచ్చెదరు. పీడ పిశాచి గ్రహబాధలు తంతులు మొదలగునవి యేవియైనను వెంటనే పోవు'నని చెప్పిరి. ఆశతో కుమారుని తీసికొని పెదారకట్ల మంత్రసిద్ధులగు విశ్వబ్రాహ్మణోత్తముల గృహమున కరుదెంచి విషయమంతయు నామూలాగ్రముగా నెరింగించిరి.

ఆ మంత్రసిద్ధు డాప్యాయతతో దక్షిణ ఐదురూప్యములు తీసికొని తాయెత్తును చేతిలో నుంచుకొని లోలోన మంత్రము లుచ్చరించుచు పెదవులు మాత్రము కదలించుచు, మధ్య మధ్య ఓం హ్రీం క్లీం యని బిగ్గరగా నుచ్చరించుచు, కుంకుమను మంత్రించి తాయెత్తును మొలలో కట్టిరి. "నాయనా! యీ మంత్రకుంకుమను ప్రతిదినమును నొసట దాల్ప వలయును. పక్షము రోజులకు కర్మంతయు పటాపంచలగు"నని యేవేవో చెప్పి పంపిరి.

శ్రీ లక్ష్మీనారాయణ ప్రియకుమారునితో స్వగృహము చేరి పదిఐదురోజులు కుమారునకు మంత్రకుంకుమ నిడుచు పక్షమురోజులు గడపిరి. యేమియు ప్రయోజనము లేకపోయెను. ఎప్పటివలెనే మౌనముద్ర వహించి స్వగృహమున మారుమూలన కూర్చొనియుండెడివాడు.

నాటకములనిన సంగీతమనిన నమితాసక్తితో గంతులువేసెడు నీ గ్రంథకర్త స్వగ్రామమున రైతుసోదరులు 'కురుక్షేత్ర' మను నాటక

రాజమును సాధన చేయుచు సంగీతములో పద్దెములన్నియు గానము చేయుచుండిరి.

సుబ్బారావా ప్రక్కకైనను వెళ్ళక యేమియు తోచక మౌన ముద్రతో నిల్లువీడక రాత్రింబవళ్ళు దుఃఖమయ జీవితములో గోజాక యుగముగా గడుపసాగిరి.

పురాకృతకర్మ నెట్టిదైనా రైనను ననుభవింపక తప్పదు. 'నవ్వుచు చేసినపాపము-నేడ్చుచు ననుభవింపవలయు'నని యార్యులు పల్కుదరు గదా !

## గ్రంథకర్త యాశలన్నియు వీడి సద్గురుని చేరుట

సుబ్బారావు ఒకరోజున తండ్రితో "నాయనా! నే నీ విధముగా నెన్నిరోజులుండెదను. నాకు తల్లి దండ్రి గురువు దైవము సర్వస్వము నా సద్గురు దేవులగు శ్రీ యోగానందమూర్తులే! ఆ మహానీయునివద్దకు వెళ్ళి ప్రాణత్యాగ మొనర్చెద"నని పల్కు నలవనినను వినక నొంటరిగా వెళ్ళి సద్గురు దేవులు నివసించెడు శ్రీ కపిలాశ్రమము చేరి గురు దేవులను దర్శించి పాదములపై బడి యమితావేదనతో దుఃఖించెను.

సద్గురుప్రభువు "నీ కేమివలయునో కోరుకొనుము నెరవేర్చెద!" నని కన్నీరు తుడువగా "ఓ దేవా! నా కర్మను తమరే దగ్ధమొనర్ప వలయును. లేకున్న నా ప్రవహించెడి కుండికనదిలో దూకి ప్రాణములను వీడెద"నని వాపోవ కరుణామయులగు శ్రీ యోగానందమూర్తి శిష్యుని గట్టిగా బాహువులతో బంధించి "భయమువలదు. ఈనాటితో నిన్నావ రించిన కర్మదేవత వీడి కుండికానదిలో దుమికినది. నీకీ నాడే యొక రక్షరేకు కట్టెదను. నీ మనోవైకల్యము, నీ చింత సమసిపోగల"వని శిష్యుని చేయిబట్టుకొని నృసింహాలయమునకు తీసికొనిపోయి పద్మాసనా సీనుని గావించి యీ విధముగా చెప్పిరి.

"నాయనా! నబ్బూరులో యజ్ఞము చేయునపు డొకభక్తుడు ఘోరకర్మతో బాధపడుచు నన్ను ప్రార్థింపగా వాని నిమిత్త

మీ యంత్రమును వ్రాసి మంత్రశుద్ధితో నుంచితిని. కారణాంతరమున, నా భక్తునకు వేయకపోవుటచే నా యొద్దనే యున్నది. ఆ మహాయంత్రమును నీకు వేయుచున్నాను. ఈ నాటినుండి నీ జీవితాంతమువరకు గాలి వయ్యము లాదిగాగల గ్రహబాధలు నిన్నంటజాలవు. ఈ నాడు మిక్కిలి పవిత్రదినము. అమావాస్య ఆదివారము. నీ కర్మ తీరిపోయిన" దని శ్రీనృసింహ మహామంత్రము నుచ్చారణచేయుచు పండ్లు పటపట కొరక మ బీజాక్షరములతో మంత్రమును పఠింప నాలయము మార్మ్రోగెను. ఆ మంత్రోచ్చారణకు పద్మాసనాసీనుడైన ప్రియశిష్యుడు గడ గడ వణకినంత శ్రీ యోగానంద నృసింహమూర్తి జింకచర్మము చేత ధరించి శిష్యుని శిరస్సుపై మూడుదెబ్బలు కొట్టగా స్పృహతప్పి పడి పోయిరి. కొన్ని ఘడియలకు శిష్యుడగు సుబ్బారావు బాహ్యస్మృతి పొందిరి. సద్గురుదేవులు ఆ రక్షరేకును తామెత్తునందుంచి శిష్యుని మొలయందు గట్టి తన యమృతహస్తముతో శరీరమును నిమిరి గాఢాలింగనము చేసికొనిరి. వారు సాక్షాత్ శ్రీ బుద్ధభగవానులే! వారి ముఖబింబము సదా బ్రహ్మవర్చస్సుతో ప్రకాశించుచుండును. వారి వాక్యములు మనోరంజకములు! మహిమాన్వితములు!

## శ్రీ సద్గురు బోధను మననము చేయుట

ప్రియశిష్యుని మనస్సునకు స్వస్థత చేకూరెను. ప్రశాంతమై యానంద మయమయ్యెను. శ్రీ యోగానంద మహర్షి యోగశక్తి యనంతమైనది. ఆత డాధ్యాత్మికసాగరము. బ్రహ్మజ్ఞానమునకైనను బరిమితి కనుగొనవచ్చునుగాని, యగాధమగు మన సద్గురుదేవుని మనోబల మిట్టిదని నిర్ణయింపజాలము. ఆ మహాత్ముని కరుణాకటాక్షవీక్షణ మొక్కటి బ్రసరించిన చాలును. మన జీవితములు పునీతములగును. స్వామిదృష్టిలో సమస్త కర్మములును భగవదారాధన విధానములే! గృహస్థులైనను న్యాయమార్గమున ధనమార్జించుచు నుదార హృదయులై పారమార్థికాదర్శములను బరిపాలనము చేయు గృహస్థులను

చూచినను, స్వామికి పరమానందము. ప్రపంచమున వైరాగ్య మొక్కటియే భయరహితమైన పదవి యని స్వామి పలుమారులు ప్రియశిష్యులకు ప్రబోధము చేయు చుండెడివారు.

శ్రీ సద్గురుదేవుల సెలవుగైకొని సుబ్బారావు స్వగ్రామమునకు చేరి గురుదేవుని యనంతశక్తిని పొగడుచు కలవృత్తిపై మనస్సుంచక భగవంతుని గురించియే విచారణ సల్పుచు, మానవజీవిత లక్ష్యమగు పరమాత్మను పొందవలయు నన్నచో నెట్టి సాధన లొనర్పవలయునో, సద్గురువులచే, నా యోగరహస్యములను తెలిసికొని యతిజాగరూకత వహించి యోగాభ్యాసము చే బ్రహ్మభావన పొందవలయునని తలంచుచు తనలో తాను తర్కించుకొనెను.

"ఆహా! నే నతిబాల్యముననే శ్రీ యోగానందమహర్షి కృపకు పాత్రుడనైతిని. ఏమి ప్రయోజనము! నా పూర్వజన్మ సంస్కార ప్రభావమువలన నా గురుదేవునిచే జన్మరాహిత్యమగు విషయముల నామూలాగ్రముగా నెఱింగితిని. ఆ వేద రహస్యములను మఱువక మననము చేయుచుంటిని. యోగాభ్యాసముతో బ్రహ్మభావన పొంద వలయు నను యత్నమును సిద్ధింపచేయుటకై ప్రయత్నము చేసితిని. ఫలమును పొందనైతిని, కారణమేమొ గుర్తించితిని. సంసార సమర మున సతమతమగు మానవాళికి పరతత్త్వమున లయమొందెడి యోగ మును సిద్ధింపచేసికొనుట బహుకష్టసాధ్యము! గడచి గట్టెక్కుట దుర్లభము!"

ఎన్నిరోజులు శుష్క వేదాంతము ముచ్చటించుకొనినను, వేద వేదాంగము లన్నియు పలుసారులు పారాయణ మొనర్చినను, పుణ్య స్థలములయందు నివాసము చేయుచున్నను, నాశ్రమములు నిర్మించుకొని గీతాపారాయణము లొనర్చుచు పుస్తకపాండిత్యముతో నాత్మ రహ స్యము లన్నియు గంటలకొలది యుపన్యసించినను, ధనావేశాపిశాచము

నకు మంగళహారతులివ్వక ధనాశతో బాధపడు సన్యాసులు, సన్యాసులు కారు! ఆ సన్యాసులు వేషములతో మెలంగెడి సంసారులని గుర్తింప వలయును. హృదయములనున్న భోగవాంఛలను పోగొట్టుకొనజాలక, యాశ్రమమున చేరినను నరణ్యామధ్యమున ప్రవేశించినను ప్రయోజనము లేదు. లోకమును మోసముచేసి తన పొట్టనింపుకొనుటే మానవత్త్వమని విఱ్ఱవీగెడి మాయ సన్యాసులను మాత్రము భగవంతు డేనాటికైనను ప్రాయశ్చిత్తము చేయక వదలడని గుర్తుంచుకొనవలయును.

ఎన్ని జన్మలకైనను సద్గురువు లభింపనిచో వానికి విముక్తి లేదు. సద్గురు దయాకిరణము ప్రసరించినవెంటనే గులకరాయి రత్నముగా మారును. గడ్డిపోచ మేరువగును. బంట్రోతు పరిపాలకుడై ప్రజాపాలనము చేయును. మూర్ఖుడు పండితుడై ప్రకాశించును. ఎట్టి సందేహము లేదు.

"సద్గురుని దయ మనపై ప్రసరించునట్లు సత్యప్రవర్తనతో సత్యవాక్య పరిపాలన మొనర్చుచు, సజ్జనమైత్రితో మెలంగవలయును. లక్ష్యమును గుర్తింపచేయునది సద్గురువు, లక్ష్యసిద్ధికై సాధన బూనవలసిన కర్తవ్యము శిష్యునదై యుండును. ధ్యానసాక్షాత్కార సంజనితమైన యానందమే, సర్వోత్కృష్టమైన బ్రహ్మానందము. ప్రగాఢ ధ్యానస్థితియే సమాధి. ఇదియే యతీంద్రియ జ్ఞానావస్థ, సమస్త తత్త్వరహస్యములును నిందే ప్రత్యక్షమై భాసించునని మా సద్గురుదేవులు, మాకు చెప్పెడివారు. ఇట్టి స్థితి నొందినవారే సద్గురువులని, తత్త్వవేత్తలని, యోగులని, మహర్షులని పిలువబడుచుందురు. ఈ స్థితి శ్రీ యోగానందునిలో మూర్తీభవించినది. పరిపూర్ణమైన యతీంద్రియ జ్ఞానావస్థయే-ధ్యానపరమావధియే- నిర్వికల్ప సమాధియని చెప్ప నొప్పును. ఇదియే యద్వైత వేదాంతమునకు తుదిమెట్టు. మాయను పారద్రోలి ద్వైత ప్రపంచము నతిక్రమించి సుఖదుఃఖాది ద్వంద్వములను, సమస్తభ్రాంతులను రోసి, యే మహోన్నత స్థితియం దాత్మ స్వస్వరూపవైభవమున,

దేదీప్యమానమైన దేదియో నిర్వికల్ప సమాధి. అట్టి నిర్వికల్ప సమాధిని నేను పొందితిని నాయనలారా!" యని శ్రీ యోగానందమహర్షి యప్పుడప్పుడు సూక్ష్మదృష్టిగల శిష్యులతో సూత్రప్రాయముగా సంత రంగమున చేరి చెప్పెడివారు.

శ్రీ యోగానందమహర్షిని పరిపూర్ణచంద్రులయినని వారి వేదాంత వాక్యములను, ధర్మసూత్రములను వినవలయునని భక్తులనేకులు కోరికను వెంబడించసాగిరి. సామాన్యభక్తులకు ధర్మములను ఈ విధముగా ప్రబోధము చేసిరి

"ఓ భక్తులారా! అచ్చటచ్చట లోకరక్షకులు తప్ప మిగిలినవా రందరు నాచరణలేని వాచావేదాంత ప్రబోధమును పల్లెలు, బస్తీలు, పట్టణములు మొదలగుచోట్ల మారుమ్రోగునట్లొనర్చిరి. చెప్పున దొకటి చేయునది మరొకటి. అని గమనించి యిచ్చట మీకు చెప్పు చున్నాను. నేను చెప్పెడి యీ వేదాంత రూపమగు ధర్మసూత్రములు మనముందువారెందరో సూక్తులలో శ్లోకములలో వాక్యములలో చెప్పిరి-చేసిరి. ఐనను పూర్తిప్రయోజనము లేకపోయెను. ఆ కారణము చేతనే మహనీయులందరు ఒకే విషయమును రకరకములగు మార్పు లతో కూర్పులతో నేర్పుమీర మీకు ప్రబోధము చేయవలసివచ్చినది. పెద్దల సదాశయమును గుర్తించి విన్న నీతులు నాచరణలో నుంచి భయముతో దుర్గుణములను నిశ్శేషముగా పరిత్యజించి మంచిని మీ హృద యమున చేర్చుకొనుడు. సద్గురూపదేశమైన ఫలము సార్థకత చెందును. శుష్కవేదాంతముతో ప్రక్కవారిని మోసగించి యగాధమగు పాప జలధిలో క్రుంగి కృశించి నశించెడు యజ్ఞానులుచేయు ప్రవృత్తి లీక్రింది విధముగా నుండును పరిశీలింపుడు.

1. యోగులని చెప్పుట — భోగముల వదలక యుండుట
2. సన్యాసులని చెప్పుట — అన్యాయ ప్రవర్తన గలిగియుండుట
3. తమస్సులని చెప్పుట — తమస్సులోనే యుండుట

| | | |
|---|---|---|
| 4. ముముక్షువులని చెప్పుట | .. | బుభుక్షువులై తిరుగుట |
| 5. భక్తులని చెప్పుట | .. | భుక్తిప్రియులై యుండుట |
| 6. సాధులని చెప్పుట | .. | సాధనలు చేయకపోవుట |
| 7. ఆశ్రమవాసులని చెప్పుట | .. | అశాంతితో జీవించుట |
| 8. విరాగులని చెప్పుట | .. | రాగపరవశులై యుండుట |
| 9. సోహంపరులని చెప్పుట | . | అహంకారపరులై యుండుట |
| 10. మంత్రనిష్ఠులని చెప్పుట | . | తంత్రపరులై యుండుట |
| 11. రాజయోగులని చెప్పుట | . | రాగరోగులై వర్తించుట |
| 12. తీర్థపరులని చెప్పుట | . | ధూర్తగుణము గల్గియుండుట |
| 13. బ్రహ్మనిష్ఠులని చెప్పుట | . | కర్మిష్టులై నడచుట |
| 14. బ్రహ్మచారియని చెప్పుట | . | దురాచార ప్రవృత్తి యుండుట |
| 15. నిష్కామినని చెప్పుట | . | కామపరవశుడై తిరుగుట |
| 16. నిష్ఠగలవాడని చెప్పుట | . | కష్టములను సహింపలేకుండుట |
| 17. అచలుడని చెప్పుట | . | చపలత విడువక యుండుట |
| 18. నిర్గుణియని చెప్పుట | . | దుర్గుణముగల్గి యుండుట |
| 19. పరమహంసయని చెప్పుట | . | పరహింసచే జీవించుట |
| 20. ధ్యానయోగియని చెప్పుట | . | కానిపనులు చేయుట |
| 21. సిద్ధుడని చెప్పుట | | శుద్ధిలేక ప్రవర్తించుట |
| 22. త్యాగియని చెప్పుట | | యోగసాధన లేకుండుట |
| 23. ప్రాణాయామియని చెప్పుట | | ప్రణయవేదనతో నుండుట |
| 24. వేదాంతులని చెప్పుట | | మత్తువస్తువులు వాడుట |
| 25. కాషాయాంబరములు దాల్చుట | | పరులధనము కాజేయుట |
| 26. విచారణ మాత్రము చేయుట | | ఆచరణ లేకుండుట |
| 27. తాపసులని చెప్పుట | . | తామసవృత్తి గలిగియుండుట |
| 28. పీఠాధిపతులని చెప్పుట | , | పాడుగుణములు గల్గియుండుట |
| 29. పరమయోగులని చెప్పుట | . | పరులనడిగి తిని పొట్టలు పెంచుకొనుట |
| 30. యోగినులవలె మెలగుట | . | వ్యభిచారిణులె తిరుగుట |

ఈ ముప్పది ధర్మములలో గల సత్యమును గ్రహించి యాచరణలో పెట్టుకొని క్రమశిక్షణతో జీవితమును భగవత్కార్యముల కంకిత మొనర్చి, శక్త్యానుసారము దానధర్మము లొనర్చుచు కాలమును గడుపుటే, మిక్కిలి పరమోత్కృష్టమైన మానవధర్మము. అట్టి మానవుని మాధవుడు తప్పక రక్షించి తనవానిగా చేసికొనును.

సామాన్యాభక్తులకీ ప్రబోధము చాలునని శ్రీ స్వామివారు పలుకగా, భక్తులెల్లరు పరమానందమును పొంది సద్గురుదేవుని వేనోళ్ళ పొగడుచు స్వగృహములకు జనిరి.

## శ్రీ యోగానంద మఠమున జయంత్యుత్సవము జరుగుట

శ్రీ యోగానందమఠ స్థాపకురాలగు శ్రీ మహాలక్ష్మీదేవి జయంతి మహోత్సవము చేయ సంకల్పించిరి. కుటుంబ సమేతముగా సుబ్బారావు మఠమునకు వెళ్ళి జయంత్యుత్సవమున పాల్గొనిరి. ఆనాడు తెనాలి నివాసులగు "విద్యాదానకర్ణ" శ్రీ తెల్లాకుల వేంకటేశ్వరగుప్త భాగవతారు సాయంత్రి మూడుగంటలకు భక్తనందనాఖ్య హరికథను గానముచేసి జనుల నుల్లాసపరచిరి. సుబ్బారావు కథాంతమువరకు నొకే మనస్సుతో విని యానందమునుపొంది వేదిక నెక్కి హరిదాసుగారిపై నప్పటికప్పుడె యాశువుగా నొక పద్యమువ్రాసి చదివి వారి పాదములకు నమస్కరింపగ శ్రీ వేంకటేశ్వరగుప్తగారు సుబ్బారావును వేనోళ్ళ పొగడి "పూర్వకాలమున ప్రేమగలవారికి పద్యములను కానుకగా సమర్పించెదరు. అదేవిధమున నీ సుబ్బారావు భక్తితో నాకీ పద్యమును కానుకగా సమర్పించిరి. శ్రీ నృసింహమూర్తి నీరికి భక్తిజ్ఞాన వైరాగ్యము లొసంగి మావలెనే హరిదాసులై కథాధ్యయనములు చేసి గొప్ప కీర్తిని పొందెదరుగాకని శుభాశీర్వాదము లొనర్చుచుంటి"నని చెప్పిరి.

సుబ్బారావు ఆ కథను విన్నది మొదలు మనస్సున "ఆహా! నేను మాత్రము హరిదాసునై, కథ లెందుకు చెప్పకుండదు? నీరియొద్దనే కథ లధ్యయనము చేసెద"ననుకొని, ప్రథమమున నా గురుదేవుని భక్తికి శక్తికి కారణమగు 'భక్త ప్రహ్లాద' కథనే నేర్చుకొని గానము చేయవలెనని సంకల్పించి శ్రీ వేంకటేశ్వరగుప్తతో విషయము నెఱుకు విన్నవించిరి.

గుప్తగారు "నా యనా! నీవు వాగ్దేవి సహాయసిద్ధియగానున్నావు. ప్రయత్నము చేసిన నొకకథయేమి ఎన్నికథలనైన చెప్ప నేర్పింతును,

| | |
|---|---|
| 4. ముముక్షువులని చెప్పుట | బుభుక్షువులై తిరుగుట |
| 5. భక్తులని చెప్పుట | భుక్తిప్రియులై యుండుట |
| 6. సాధులని చెప్పుట | సాధనలు చేయకపోవుట |
| 7. ఆశ్రమవాసులని చెప్పుట | అశాంతితో జీవించుట |
| 8. విరాగులని చెప్పుట | రాగపరవశులై యుండుట |
| 9. సోహంపరులని చెప్పుట | అహంకారపరులై యుండుట |
| 10. మంత్రనిష్ఠులని చెప్పుట | తంత్రపరులై యుండుట |
| 11. రాజయోగులని చెప్పుట | రాగరోగులై వర్తించుట |
| 12. తీర్థపరులని చెప్పుట | ధూర్తగుణము గల్గియుండుట |
| 13. బ్రహ్మనిష్ఠులని చెప్పుట | కర్మిష్ఠులై నడచుట |
| 14. బ్రహ్మచారియని చెప్పుట | దురాచార ప్రవృత్తి యుండుట |
| 15. నిష్కామినని చెప్పుట | కామపరవశుడై తిరుగుట |
| 16. నిష్ఠగలవాడని చెప్పుట | కష్టములను సహింపలేకుండుట |
| 17. అచలుడని చెప్పుట | చపలత విడువక యుండుట |
| 18. నిర్గుణియని చెప్పుట | దుర్గుణముగల్గి యుండుట |
| 19. పరమహంసయని చెప్పుట | పరహింసచే జీవించుట |
| 20. ధ్యానయోగియని చెప్పుట | కానిపనులు చేయుట |
| 21. సిద్ధుడని చెప్పుట | శుద్ధిలేక ప్రవర్తించుట |
| 22. త్యాగియని చెప్పుట | యోగసాధన లేకుండుట |
| 23. ప్రాణాయామియని చెప్పుట | ప్రణయవేదనతో నుండుట |
| 24. వేదాంతులని చెప్పుట | మత్తువస్తువులు వాడుట |
| 25. కాషాయాంబరములు దాల్చుట | పరులధనము కాజేయుట |
| 26. విచారణ మాత్రము చేయుట | ఆచరణ లేకుండుట |
| 27. తాపసులని చెప్పుట | తామసవృత్తి గలిగియుండుట |
| 28. పీఠాధిపతులని చెప్పుట | పాడుగుణములు గల్గియుండుట |
| 29. పరమయోగులని చెప్పుట | పరులనడిగి తిని పొట్టలు పెంచుకొనుట |
| 30. యోగినులవలె మెలగుట | వ్యభిచారిణులై తిరుగుట |

ఈ ముప్పది ధర్మములలో గల సత్యమును గ్రహించి యాచరణలో పెట్టుకొని క్రమశిక్షణతో జీవితమును భగవత్కార్యముల కంకిత మొనర్చి, శక్త్యానుసారము దానధర్మము లొనర్చుచు కాలమును గడుపుటే, మిక్కిలి పరమోత్కృష్టమైన మానవధర్మము. అట్టి మానవుని మాధవుడు తప్పక రక్షించి తనవానిగా చేసికొనును.

సామాన్యభక్తుల కీ ప్రబోధము చాలునని శ్రీ స్వామివారు తెలుపగా, భక్తులెల్లరు పరమానందమును పొంది సద్గురుదేవుని వేనోళ్ళపొగడుచు స్వగృహములకు జనిరి.

## శ్రీ యోగానంద మఠమున జయంత్యుత్సవము జరుగుట

శ్రీ యోగానందమఠ స్థాపకురాలగు శ్రీ మహాలక్ష్మీదేవి జయంతి మహోత్సవము చేయ సంకల్పించిరి. కుటుంబ సమేతముగా సుబ్బారావు మఠమునకువెళ్ళి జయంత్యోత్సవమున పాల్గొనిరి. ఆనాడు తెనాలి నివాసులగు "విద్యాదానకర్ణ" శ్రీ తెల్లాకుల వేంకటేశ్వరగుప్త భాగవతారు సాయంత్రము మూరుగంటలకు భక్తనందనార్ హరికథను గానము చేసి జనుల నుఱ్ఱూతలూగించిరి. సుబ్బారావు కథాంతమువరకు నొకే మనస్సుతో విని యానందమునుపొంది వేదికనెక్కి హరిదాసుగారిపై నప్పటికప్పుడె యాశువుగా నొక పద్దెముప్రాసి చదివి వారి పాదములకు నమస్సులొనర్పగ శ్రీ వేంకటేశ్వరగుప్తగారు సుబ్బారావును వేనోళ్ళ పొగడి "పూర్వకాలమున ప్రేమగలవారికి పద్దెములను కానుకగా సమర్పించెదరు. అదేవిధమున నీ సుబ్బారావు భక్తితో నాకీ పద్దెమును కానుకగా సమర్పించిరి. శ్రీ నృసింహమూర్తి వీరికి భక్తిజ్ఞాన వైరాగ్యము లొసంగి మావలెనే హరిదాసులై కథాధ్యయనములుచేసి గొప్ప కీర్తిని పొందెదరుగాకని శుభాశీర్వాదము లొనర్చుచుంటి"నని చెప్పిరి.

సుబ్బారావు ఆ కథను విన్నదిమొదలు మనస్సున "ఆహా! నేను మాత్రము హరిదాసునై, కథ లెందుకు చెప్పకూడదు? వీరియొద్దనే కథ లధ్యయనము చేసెద"ననుకొని, ప్రథమమున నా గురుదేవుని భక్తికి శక్తికి కారణమగు 'భక్త ప్రహ్లాద' కథనే నేర్చుకొని గానము చేయవలెనని సంకల్పించి శ్రీ వేంకటేశ్వరగుప్తతో విషయమంతయు విన్నవించిరి.

గుప్తగారు "నాయనా! నీకు వాగ్ధోరణి సహజసిద్ధముగానున్నది. ప్రయత్నము చేసిన నొకకథయేమి ఎన్నికథలనైన చెప్పి యొప్పించి,

మెప్పించు శక్తి నీలో కలదు. సందేహము వలదు. తప్పక రం"డని ప్రేమతో చెప్పిరి.

పల్నాడు తాలూకా రెండచింతల వాస్తవ్యులు, పంచాంగకర్త లగు శ్రీ వేంకటేశ్వరగుప్త సిద్ధాంతిగారు లగ్నమునువేసి "నాయనా సుబ్బారావు! నీవు గుప్తగారి గృహమునకుపోయి లగ్నమునకు హరికథ ప్రారంభము చేయించుకొను"మని చెప్పి లగ్నమును వ్రాసి యిచ్చిరి. ఆ లగ్నము, 1958 జనవరి పదునైదవ తేదీ ఉదయము పదిగంటల పన్నెండు నిముసములకు– సుబ్బారావు భక్తితో నిర్వురకు సాష్టాంగ ప్రణామము లొనర్చి సెలవు గైకొని స్వగృహము చేరిరి.

సుబ్బారావు మనస్సు హరికథా ప్రారంభమునకై యువ్విళ్ళూరుచు మూటాముల్లె సవరించుకొని లగ్నమునకే తెనాలి వెళ్ళి మారీసుపేటలో అప్పలస్వామిగుడి సమీపముననున్న శ్రీ వేంకటేశ్వరగుప్తగారి మేడ యందు ప్రవేశించి సుఖాసీనులై యున్న గుప్తగారికి మధురఫలము లొసగి సాష్టాంగ ప్రణామము లొనర్చిరి. గుప్తగారు "సెహభాష్! ఆడినమాట ప్రకారమే వచ్చితి"వని సంతోషముతో ధర్మపత్నిని బిలచి సుబ్బారావు విషయమును చెప్పిరి. అన్నపూర్ణా స్వరూపిణియగు శ్రీమతి ఆదిలక్ష్మీదేవి పతిచెంతనున్న సుబ్బారావును ఆదరించి మాతృప్రేమతో నాతిథ్య మొసగిరి.

రకరకములగు జాతులవా రెందరో శిష్యులై శ్రీ గుప్తగారియొద్ద హరికథాధ్యయనము సాగించుచుండిరి.

శ్రీ వేంకటేశ్వరగుప్తగారు సుబ్బారావుతో "నాయనా! యే కథ నధ్యయనము చేసెద"వనిరి. "తండ్రీ! ప్రథమమున భక్తప్రహ్లాదకథ నధ్యయనము చేయింపు"డని సుబ్బారావు కోరిరి.

గుప్తగారు "ప్రహ్లాదకథ నీ కలివాతావరణమున నెవరువినెదరు? కుటుంబపోషణకు, ధనము కావలయునుగదా! ఆకారణమును గుర్తించి మహాభారతకథలు నేర్చుకొనుము, భక్తిని సంపాదించుకొనవచ్చు"నని

చెప్పిరి. ఏమి చెప్పుటకు పాలుపోక, భారతకథలు నేర్చుకొనుటమంచిదే! ముందుగా ప్రహ్లాదకథనే యధ్యయనము చేయింపుడనుచు సుబ్బారావు సందిగ్ధముగ మీా యిష్టమనుచు మిన్నకుండిరి. ఆరోజే గుప్తగారు, కేదారరాగము - ఆదితాళముతో గణపతి ప్రార్థన ప్రారంభము చేసిరి.



1. శ్రీ "విద్యాదానకర్ణ" తెల్లాకుల వేంకటేశ్వరగుప్త భాగవతారుగారు
2. ఈ చరిత్ర నాయకులగు శ్రీ యోగానందనరసింహస్వామివారు
3. శ్రీ కొత్త వేంకటేశ్వరగుప్త సిద్ధాంతిగారు
4. ఈ గ్రంథకర్త సుబ్బారావుగుప్త భాగవతారుగారు

గణపతి ప్రార్థన చెప్పినది చెప్పినట్లుగా సుబ్బారా వధ్యయనముచేసిరి. సరస్వతిప్రార్థన చెప్పిరి. సరస్వతిప్రార్థనయు సులభముగా నధ్యయనము చేసిరి. పరిమి సుబ్రహ్మణ్యముగారు రచించిన భారతకథ యక్షగానమున, 'తొల్లి కల్మాషపాదు'డను పద్యము చెప్పిరి. ప్రహ్లాదకథయే నా

జీవితమునకు వెలుగుబాటని మదినెంచి కథాధ్యయనమున కుపక్ర మించిన సుబ్బారావున కెన్నివందలసారులు వల్లించినను, నదేమి చిత్రమోంకాని యా సీసపద్యము సీసమయ్యెను. శ్రీ సద్గురుదేవుల దయకు పాత్రుడ నయ్యెదనని, ప్రహ్లాదకథ నధ్యయనము చేసెదనని యుబలాటపడిన సుబ్బారావు మనస్సు పరిపరివిధముల పరుగిడుచుండెను. పక్షముఃరోజులు గడచినవి. ప్రయోజన మిసుమంతయు కానరాదయ్యెను. ప్రప్రథమమున శ్రీ సద్గురుధ్యేయసిద్ధికి నాందియైన ప్రహ్లాదకథ నధ్యయ నము చేయ సంకల్పించిన సుబ్బారావు మనస్సు భారతకథయందు ప్రవేశించలేదు. గుప్తగారి గృహమున నుండుటకు మనస్సు కుదురక సద్గురునామస్మరణతో యేమియు దోచక 'ఇంటికి వెళ్ళివచ్చెద'నని శ్రీ వేంకటేశ్వరగుప్తగారి పాదపద్మములకు నమస్సులర్పించిరి. హరికథా ధ్యయనమునకై ఇంటికరుదెంచిన బాలబాలికల యోగక్షేమముల విచారించుచు, కన్నబిడ్డలవలె యాదరించెడి ఉత్తమ గృహిణియగు "మాతృశ్రీ" ఆదిలక్ష్మమ్మగారి దివ్య పాదపద్మములకు నమస్సులర్పించి సెలవు తీసికొనిరి.

స్వగృహముచేరిన సుబ్బారావు వృథాగా నింటనుండుటకు మన సొప్పక తోడివారు చేసెడి వ్యాపారమునే చేయవలయునని సరుకు లన్నియు కొని కొన్నిమాసములు నిల్వయుంచి నష్టముతోనే యమ్మ కము చేసి, తనలో తా నిట్లను కొనసాగిరి, 'నా యోగ మీవిధముగా పరిణమించినది. 'ప్రారంభముననే పాకముచెడినదన్న' సామెతగా వ్యాపారారంభముననే నష్టము ప్రారంభమైనది. "నాకీవ్యాపారము వద్దని, గురుదేవుని ధ్యేయసిద్ధికి నాంది యగు ప్రహ్లాదకథయే నాకు శరణ్యమని, నెవ్వరియొద్ద యీ ప్రహ్లాదకథ నధ్యయనము చేయవల యును నరసింహా !' యని స్మరించెడి సమయమున సంగీతప్రియులగు బొగ్గరము శ్రీరామచంద్రయ్య పంతులుగారు, "నాయనా! సుబ్బా రావు! నీవు హరికథకై వెళ్ళి వెంటనే తిరిగివచ్చితివి. నీకు భక్తుల

హరికథలపై భ్రాంతియున్నచో, నాదర్శవంతముగ భక్తి జ్ఞాన వైరాగ్యములు తొణికిసలాడునట్లు మహాభక్తశిఖామణుల జీవిత చరిత్రలను స్వయముగా రచనగావించుచు హరికథ లధ్యయనము చేయుచు శ్రావ్యమైన కంఠముతో మధురమైన సంగీతమును మేళవించి కథాగానమొనర్చెడి సద్భక్తులు గలరు. వారిపేరు వింటివా" ? యనిరి. దప్పితో బాధపడువారికి మధురపానీయము లభించిన చందాన, "వారి నామధేయము, వారిజన్మస్థానము, వారుండు నివాసస్థానము నెచ్చటనో సెలవీయు" డనుచు నావేదనతో సుబ్బారా వడిగిరి. ఆ పంతులుగారు, "నాయనా! సుబ్బారావు! ప్రశాంతితో వినుము. నీ వేమియు నాదుర్దా వద్దు. నీభక్తియే నిన్ను కంటికి రెప్పవలె కాపాడు"నని నుడువసాగిరి. "పల్నాడు తాలూకా మోర్జంపాడు గ్రామనివాసులు, బ్రాహ్మణోత్తములు, కృష్ణానది యొడ్డున గుహాలో వెలసిన మట్టపల్లి శ్రీలక్ష్మీ నృసింహోపాసకులు, గద్య గేయ కీర్తనాదులను అంత్యప్రాసలతో అతిమనోహరమగు శైలితో రచించెడి కవీశ్వరులు శ్రీరాజశేఖరుని లక్ష్మీపతిరావుగారు. వారు ప్రస్తుతము ఉపాధ్యాయవృత్తిలో పిడుగురాళ్ళకు పశ్చిమభాగమున బ్రాహ్మణపల్లె గ్రామమున నివాసము చేయుచున్నా"రని చెప్పిరి. అపరిమితానందమున శ్రీ సద్గురుదేవులను దలంచుచు తత్క్షణమే ప్రయాణమై సుబ్బారా వటకేగిరి.

## ప్రహ్లాద కథాధ్యయనమునకై పల్నాడు వెళ్ళుట

1958 - మే పదియేడవ తేదీన సుబ్బారావు ప్రయాణమై, పల్నాడు తాలూకాలో ప్రకాశించెడి, పిడుగురాళ్ళకు వెళ్ళి దివ్య జ్యోతియై దశదిశల వెలుగొందెడి శ్రీరామతీర్థ సేవాశ్రమమును దర్శించిరి. ముఖద్వారమున కిరువైపుల, "శ్రీ నారసింహా - జయనారసింహా- లక్ష్మీనారసింహా" యను పవిత్రనామము సువర్ణాక్షరములతో లిఖింపబడియెను. ఆ నామమును కన్నులార దర్శించిన సుబ్బారావు మన సానందమయమై శరీరము గగుర్పాటు నొంద నానందాశ్రువులను

రాల్చిరి. తనలో నిట్లూహించిరి. 'ఆహా! నా జన్మ తరించినది. ప్రారంభముననే మా యిష్టదైవమగు శ్రీ లక్ష్మీనృసింహమూర్తి నామ మును దర్శించితిని; ముమ్మారు స్మరించితిని. నా సద్వాంఛ సిద్ధించుటకు శుభసూచక' మనుకొని, కవాటము దెరచి లోపల ప్రవేశించిరి.

ఆహాహా! జగన్మోహన సౌందర్యముతో శ్రీ నృసింహస్వామి సభాస్తంభమును ప్రయ్యలు చేసికొని దుష్టదానవుని తన యూరువులపై పడవేసికొని వాడి నఖములతో హిరణ్యకశ్యపు పొట్ట చీల్చుటయు, భక్తప్రహ్లాదమూర్తి కభయప్రధాన మొసంగుట, యాకాశమున గీర్వాణులు మొదలగువారు కుసుమ వర్షములు కురిపించెడు, దృశ్యమును గాంచి యపరిమితానందమునుపొంది సాష్టాంగప్రణామము లొనర్చిరి. మేడపైనున్న శ్రీ స్వామి కేశవతీర్థు వారిని దర్శించి మధురఫలము లర్పించి, పాదాభివందనము లొనర్చిరి. సుఖాసీనులై యున్న శ్రీ కేశవ తీర్థులతో, "స్వామీ! నా యావేదన యేమని విన్నవింతు"నని గత చరిత్రనంతయు పూసగ్రుచ్చినటుల మనవిచేసికొనిరి.

స్వామివారంతయు విని "నాయనా! మంచిపని కన్నియు నాటంకములే. నిశ్చలమగు మనస్సుతో గట్టిప్రయత్న మొనర్పుము, సర్వము సమకూరు"నని చెప్పిరి. దాసోహమని వారి సెలవుగైకొని, పిడుగురాళ్ళనుండి బస్సునెక్కి బ్రాహ్మణపల్లెలో దిగి, భక్తి ప్రచారక శ్రీ రాజశేఖరుని లక్ష్మీపతిరావు భాగవతారుగారు నివాసముచేసెడి గృహమునకేగిరి. వారు పూజావేదికముం దాసీనులై నృసింహమూర్తికి పూజచేయుచుండిరి. సుబ్బారావు ఆ దృశ్యమును కన్నులార వీక్షించుచు పంచలోనే మౌనముగా కూర్చొనియుండిరి. రెండుగంటలు నృసింహ మూర్తికి పూజచేసి, శ్రీ లక్ష్మీపతిరావుగారు బయటకు వచ్చిరి. సుబ్బా రావు వారికి ఫలములు సమర్పించి పాదములపై ప్రణమిల్లిరి.

శ్రీ రాజశేఖరుని లక్ష్మీపతిరావుగారు ప్రేమతో సుబ్బారావు యోగక్షేమములను విచారించి యాతిథ్యమిచ్చిరి.

సుబ్బారావు వినయముతో "స్వామీ! నేను తమయొద్ద ప్రహ్లాద కథ నధ్యయనము చేయవలయునను నాశతో తమ దర్శనమును కాంక్షించితిని; నా సద్గురుదేవులగు శ్రీ యోగానందమహర్షి యీ దేశ ముతో నీ కథాధ్యయనమునకై పలువిధములుగా శ్రమ చేయుచుంటి"నని వేడుకొనిరి. కరుణామూర్తులగు శ్రీ లక్ష్మీపతిగారు "నాయనా! నీయాశ యము, పట్టుదల సంతోషమే! నేను నీకధ్యయనము చేయవలయు



"భక్తిప్రచారక" శ్రీ రాజశేఖరుని లక్ష్మీపతిరావు భాగవతారుగారు

నన్నుచో వీలుపడదు. నేను శిష్యుల నెవ్వరిని చేర్చుకొనలేదు. ఒకరిద్దరిని మాత్రము తప్పక చేర్చుకొని యధ్యయనము చేయించితిని. వారెంతో పట్టుబట్టి నన్ను ప్రార్థించి కథాధ్యయనమునకై వారి కుటుంబములతో నీ గ్రామము చేరి నివసించి కొంతకాల మధ్యయనము చేసిరి. వారిర్వురు యెవరో కాదు. చెన్నాయపాలెము గ్రామ నివాసులు, ఒంగోలు

సుబ్బారావు, పెదకొదముగుండ్ల గ్రామ నివాసులగు ఆత్మకూరి గురుబ్రహ్మముగుప్త. వారినిదప్ప మరెవ్వరిని చేర్చుకొనలేదు. నా కుపాధ్యాయవృత్తి. కొద్దోగొప్పో తీరికయున్న యేవేవో కీర్తనలను రచన గావించుచు కాలమును గడపుచున్నాను. నేను రచించెడి కథా భాగపు కీర్తన లంత సులువుగా నభ్యసించెవి కావు. శిక్షణగా సాంప్రదాయముగా నభ్యసించవలెను. భక్తిజ్ఞాన వైరాగ్యములతో భావగర్భితములై వెలుగొందును. ఎంతో కష్టించి సాధన చేసికొనవలయును. ప్రహ్లాదకథ కావలెనని కోరుచున్నావు. మేము నృసింహాభక్తులము. నీవునూ నృసింహాభక్తుడవు. ఆ కారణముచే కాదనలేక నీకు ప్రహ్లాదకథ నధ్యయనము చేయించెదనని మాట యిచ్చుచున్నాను.

"నా ప్రియశిష్యుడగు శ్రీ ఆత్మకూరి గురుబ్రహ్మగుప్త ప్రస్తుత మింటియొద్ద లేడు. కారంపూడి సమీపమున ఒప్పిచర్ల గ్రామమున మహాభారతకథాగాన మొనర్చుచున్నాడు. నాతని యొద్దకు వెళ్ళి నేను చెప్పినట్లుగా చెప్పుము. వారు నిన్ను శిష్యునిగా చేర్చుకొని నీకు ప్రహ్లాదకథ నధ్యయనము చేయును. నీ వాంఛను సిద్ధింపచేయు"నని చెప్పి పంపిరి.

సుబ్బారావు బ్రాహ్మణపల్లె వీడి ఒప్పిచర్ల చేరి పాఠశాలలో మకాముచేసిన భక్తిప్రచారక శ్రీ ఆత్మకూరి గురుబ్రహ్మముగుప్త భాగవతారుగారిని దర్శించి భక్తితో ప్రణామము లొనర్చిరి. ఆ యుదారమూర్తి, నాయనా యని యాప్యాయతతో క్షేమము లడుగగా, గత చరిత్రనంతయు యావేదనతో విన్నవించిరి. కరుణాస్వరూపులు శాంతమూర్తులగు శ్రీ ఆత్మకూరి గురుబ్రహ్మముగుప్త భాగవతారుగారు కరుణతో సుబ్బారావు నోదార్చి శిష్యునిగా స్వీకరించిరి.

ఆనాడే 1958 - మే ఇరువది తేదీరోజు సాయంత్రమున నారికేళ తాంబూలాది వస్తువులను తీసికొని పాఠశాలలో గురువుల యొద్ద నిడి భక్తితో పాదాభివందనము లొనర్చిరి.

శ్రీ గురుబ్రహ్మముగారు "నాయనా సుబ్బారావు! నీవు క్రొత్త వాడవుకాదు. చిరపరిచితుడవే, ఐనను నీ యావేదనకు తగినటుల ధ్యాయనము చేసిననాడే నీకూ మాకూ కీర్తి" యని నుడువుచు, వెంటనే, కానడరాగము-ఆదితాళముతో వినాయక ప్రార్థన ప్రారంభము చేసిరి.

ప॥ మనసున నిను దలచెదరా! నామొర వినగదరా
తొలి పూజ లందు దొర ॥మ॥



"భక్తిప్రచారక" శ్రీ ఆత్మకూరి గురుబ్రహ్మముగుప్త భాగవతారుగారు.

గురువు చెప్పినట్లుగా శ్రద్ధతో వర్తించి రెండురోజు లచ్చటనే యుండి వారివెనువెంట భక్తులగృహమున నాతిథ్యము స్వీకరించి మూడవనాటి యుదయము గురువుల సెలవుతో, మరల తమ సన్నిధికి వచ్చెదనని చెప్పి నమస్సు లర్పించి సుబ్బారావు స్వగ్రామమగు కొండాయపాలెమునకు వచ్చిరి.

## వలదన్న వ్యాపారము చేసి నష్టమును పొందుట

కొన్ని రోజులు గడచిన పిదప నొక దినమున తన కర్తవ్యమును గురించి హరికథాధ్యయనమునకు వెళ్ళవలయునను సంకల్పముతో సుబ్బారావుగా రుండిరి. ముఖ్యబంధువులు ప్రియమిత్రులు కొందరు వచ్చి "నాయనా సుబ్బారావు! ఈ వయసులో హరికథ లెందు కయ్యా! అందులో వైశ్యుల మేదో వ్యాపారమును చేసికొనవలయును గాని సంసారమును వదలి హరికథ నేర్చుకొనుట కెందుకు వెళ్లెదవు లేవయ్యా" యని చెప్పిరి.

సుబ్బారావు మనస్సు వ్యాపారము చేసిన లాభము తప్పక రాగల దని తోచి స్థిరచిత్తముతో నూహాసౌధములు నిర్మించుకొని, నేయి వ్యాపారము చేయవలయునని తలచి చుట్టుప్రక్కల పల్లెటూళ్ళ వెన్నం తయు కొని స్వయముగా కరగవేసి నేయిగా మార్చి గుంటూరునకు తీసికొనిపోయి యమ్మకము చేయ మొదలిడిరి. కొంత కాల మమితా సక్తితో కష్టించి యెంతో జాగ్రతగా వ్యాపారము చేసిరి. అదేమి పాపమో! నష్టము రాజొచ్చెను. లాభము లోపించెను. హారతి కర్పూరమువలె పెట్టుబడి హరించుకొని పోవుచుండెను. ఇదేమి చిత్రమో యనుకొని రకరకములగు ధాన్యములను ఖరీదు చేయుచు అమ్మకము చేయసాగిరి. గుడ్డల వ్యాపారము కొన్ని రోజులు చేసిరి. ఏ వ్యాపారము చేసినను, నీతి, నిజాయతి, సత్యము, సహనముతో వ్యాపారములు చేసిరి. ఏ వస్తువులనైనను తెచ్చిన రేటు చెప్పి, లాభ మును క్రమముగా కోరెడివారు. ఈ కృతయుగ ప్రవర్తన కలియుగ ములో కలసి రాలేదు. నష్టము కష్టము కలిగినను సద్గురునామస్మరణ మరువక జపించుచు సుబ్బారావు కాలము గడుపసాగిరి.

## శ్రీ సద్గురుదేవులు గీతాభావమును చెప్పుట

సుబ్బారావు నష్టములు గలిగి మనస్సేమియు బాగులేక సద్గురు దేవుని దర్శించవలెనని స్వగ్రామము వీడి మార్కాపురము చేరి గురు

దేవు లుండెడి కపిలగిరికి వెళ్ళవలయునని పూలు పండ్లు తీసికొనిరి. ఇంతలో స్వామి శిష్యుడు తటస్థమై "ఏమండీ! సుబ్బారావుగారు, కొండకు వెళ్ళనక్కరలేదు. సద్గురుమూర్తి శరీరస్థితి మారి ।పి డగు శ్రీ దోగిపర్తి సత్యనారాయణగుప్తగారి గృహమునందే నివసించుచున్నా రని చెప్పిరి.

1960 జులై ముప్పదవ తేదీ, ప్రియశిష్యుడు సుబ్బారావు "ఆహా! ఆడబోయిన తీర్థమెదురైనరీతి, నా గురుదేవు డిచ్చోటనే నివసించినారు. మహాభాగ్యమనుచు సోదరుని గృహమును జొచ్చి బ్రహ్మవర్చస్సుతో పరుపుపై శయనించియున్న సద్గురుదేవులను కరవుదీర దర్శించి ఫలముల సమర్పించి యమితభక్తితో పాదకమలములను కన్నుల కద్దుకొని పాదముల చెంత నాసీనుడై సద్గురుదేవు వీక్షింప సాగిరి.

అపారకరుణతో ప్రియశిష్యుని వీక్షించి "నాయనా! సుబ్బారావు వచ్చితివా! నీకు నా విషయ మెవరు చెప్పి"రని గురువులు ప్రశ్నించిరి. "స్వామీ! నా కేమి తెలియును. తమ దర్శనమును కాంక్షించి వెంటనే పరుగులతో తమ పజ్జచేరితి" నని సుబ్బారావు చెప్పిరి.

సద్గురువు "నాయనా! భక్తిగల హృదయములలో నేను నివాసము చేయుచు వారిని రక్షణచేయు చుండెదను. సర్వగతముగా నుండు పరమాత్మయే నీలో చేరి నా సన్నిధికి రప్పించినది. ఎంతయో సంతోషము నా ముద్దుల శిష్యుడవు నీ కేమి కొరత యుండ"దని గాఢాలింగనము చేసికొని వీనులకు విందొనగూర్చెడి పద్యములు వినిపింపవలయునని కోరిరి. ప్రియశిష్యుడైన సుబ్బారావు శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారు రచించిన "విజయశ్రీ" కావ్యములోని గీతాప్రబోధ పద్యరత్నములను వినిపించిరి. శ్రీ సద్గురుదేవులు దిగ్గునలేచి యానందముతో శిష్యుడవనిన నీవే యని మెచ్చుకొని క్రిక్కిరిసియున్న భక్తసంఘము వైపు జూచుచు, ప్రియశిష్యునితో "నాయనా! దోగిపర్తి నారాయణా!

మన సుబ్బారావు చదివిన గీతాప్రబోధమున యంతరార్థమును గుర్తించితిరా! ఆనాడొక్క పార్థునికొరకే చేసిన ప్రబోధముకాదిది. జీవకోట్ల సద్గతికై సదా పరమాత్మ చేయు ప్రబోధము.

"ఓ నరుడా! నీలో సర్వప్రపంచములో సదా జ్యోతిర్మయ మూర్తినై ప్రకాశించెడి మూర్తిని నేనే! దృశ్యప్రపంచమంతయు నొకనాడు నశింపవలసినదే! నీవు చంపకపోయినను, కాలవాహినిలో వారందఱు కొట్టుకొని పోవలసినదే! నీవారని యెందుకు వ్యసనము చెందెదవు? ఈ క్షణమే వారిపై నాటిన మమకారమును, నీలోనున్న వికారమును పోనాడి, నీ నిజమైన యాకారమును గుర్తించి, నేను ప్రబోధముచేసిన ప్రకారము దుష్టుల కపకారమొనర్చి సాధుమూర్తుల కుపకార మొనర్చుము. నీవు నిమిత్తమాత్రుడవు, సర్వ నియంతను నేనే! నా నిజరూపము నీ స్థూలదృష్టికి గోచరించెడి యీ నలుపు మాత్రము కాదు. శుద్ధ సాత్వికమయమగు నా తెల్లని స్వరూపమును గాంచి 'నీ జన్మను చరితార్థ మొనర్చుము జీవుడా!' యని దేవదేవుడగు శ్రీకృష్ణపరమాత్మ విశ్వరూప సాక్షాత్కారమును చూపి దివ్యోపదేశ మొసంగిరి. అజ్ఞానముతో, నహంకృతితో విర్రవీగెడి నరుడు, నారాయణుని నిజరూపమునుగాంచి పరమాశ్చర్యమానసుడై, సత్యవస్తువగు పరమాత్మయొకటే! అనుకున్నదంతయు నా స్థితియేయని యెరిగినవాడై, సర్వము ఈశ్వరేశ్ఛ! ఏదియెట్లు జరుగవలయునో యట్లే జరుగును. మన కర్తవ్యమును మనము నిర్వహింపవలయును, సందేహము లేదు. పాపము పుణ్యమనెడి ప్రశ్నలు నాకనవసరము. భగవదాజ్ఞయే ముఖ్య కర్తవ్యమని జ్ఞానశక్తిని విజృంభింపచేసి - అజ్ఞానశక్తులన్నిటిని హత మొనర్చెను. ఈ సంవాదమంతయు, జీవునకు-దేవునకు, హృదయక్షేత్ర మధ్యమున జరిగెను.

"కృష్ణుని ప్రబోధముచే పార్థుడు తెలివొంది నీ-నా భేదములేక కర్తవ్యమునుగుర్తించి ధైర్యముతో గాండీవమునుదాల్చి ధనుష్టాంకార

మొనర్చి బాణవర్షమున కౌరవనాశనము చేసి యఖండ విజయమును గాంచెను.

"అదేరీతి నీ ప్రపంచమునందలి నరుడు, నారాయణస్వరూపమగు సద్గురుదేవుని ప్రబోధము వినిన మరుక్షణమే తనలోనున్న సోహంభావ మను శ్వాసను లాగి ప్రణవనాద మొనర్చినచో, చిత్తగుణములను కౌరవులు పారిపోగలరు. మానవ హృదయముననున్న దుష్టగుణములు ఏనాడు పారిపోవునో యానాడే భగవత్సాక్షాత్కారము పొంద గలడు. ఇదియే నిజమైన గీతాప్రబోధరహస్యము. మన సుబ్బారావు చదివిన విజయశ్రీ పద్దెముల యంతరార్థమిదియే! ఇంతకంటె వేరే ఏమియు లే" దని స్వామివారు సెలవిచ్చిరి.

పాదపద్మములయొద్ద కాచుకొనియున్న సుబ్బారావు పరమా నందమును పొంది "ఓ స్వామీ! సద్గురువులనిన తమరే! సత్యమైన గురుతొ నుపదేశించెడి నృసింహకళావతార స్వరూపులు తమరే! మే మే పురాణము చదివినను తమరు మా చదువుల యదార్థస్వరూప మును తేటతెల్లముగా తెలియచేసెదరు. మీరు పొల్లుచదువులు చదువకయే యయోనిసంజాతుడగు శ్రీ నృసింహస్వామి స్వస్వరూప మును సాక్షాత్కారమును పొందిన దివ్యమూర్తులు! వేదవేదాంగ ముల రహస్యములన్నియు మీకు కరతలామలకము. మీ శక్తిని పొగడుటకు నే నెంతవాడను తండ్రీ!" యని సుబ్బారావు ప్రణమిల్లిరి. శ్రీ యోగానందమూర్తి యపారకరుణతో నమృతహస్తమును శిష్యుని శిరస్సుపై నుంచి యేమేమో దీవించిరి.

శ్రీ సద్గురు దేవుని పాదపద్మములచెంత కూర్చొని ఛాయా చిత్రమును తీయించుకొనవలయునను సంకల్పము గలిగి ప్రియశిష్యుడగు సుబ్బారావు శ్రీ యోగానంద మహర్షిని సుఖాసీనుని గావించి వారి పాదములంటి కూర్చొనిన దృశ్యమును ఛాయాచిత్రమును దీయించిరి.

శ్రీ సద్గురుదేవుల సెలవుతో గ్రంథకర్తగారైన సుబ్బారావు మార్కాపురము వీడి స్వగృహమునకు జనిరి. గృహమందే నిరామయ



గ్రంథకర్త శ్రీ సద్గురు సన్నిధిన నున్న దృశ్యము.

జీవితమును గడుపుచు నేపని చేయుటకు మనస్సొప్పక లోలోన చింతిలుచు "ఆహా! నేను ప్రహ్లాదకథను నేర్చుకొని నా యోగానందమూర్తి

సన్నిధిలోనే పవిత్రదినమున కథాగానము చేసి వారికృపకు పాత్రుడ నయ్యెదనో లేదా!" యని వగచుచు కొన్నిమాసములు గడపిరి.

## హరికథాధ్యయనమునకు శ్రీ గురుబ్రహ్మముగారి యెద్దకు చేరుట

1960 అక్టోబరు 29, శ్రీ సుబ్బారావు కన్నతండ్రి యగు శ్రీ లక్ష్మీనారాయణునకు పాదాభివందన మొనర్చిరి. ఆరోజే పిడుగు రాళ్ళకు చేరి శ్రీ రామతీర్థ సేవాశ్రమమున ప్రవేశించి ప్రశాంతితో నుండిరి. ముప్పదివ తేదీన శ్రీ కేశవతీర్థస్వామివారి నడిగి వ్రాతప్రతి భక్తప్రహ్లాదకథ నిప్పించుకొని యాశ్రమమందే పూర్తిగావ్రాసుకొని "స్వామీ! శ్రీ గురుబ్రహ్మగుప్తగారు ఇప్పుడెచ్చట నున్నారో తమకు తెలియునా, నేను వారియొద్ద ప్రహ్లాదకథ నధ్యయనము చేయవలయు" నని విన్నవింప, స్వామి యపారకరుణతో "నాయనా! సుబ్బారావు! మీ గురువు గురుబ్రహ్మము తెనాలి సమీపమున వేమూరు గ్రామమున భారతకథలు గానముచేయు చున్నారు, వెళ్ళి యధ్యయనము చేయు" మనిరి. శ్రీ కేశవతీర్థస్వామి సెలవుతో సుబ్బారావు ఆశ్రమము వీడి వేమూరు వెళ్ళుటకు ప్రయాణోన్ముఖులైరి.

ఆ నాటి రాత్రికి సత్తెనపల్లి చేరి, మకాము చేసిరి. సుబ్బారావు మరునాటి యుదయమున లేచి, 'నా సద్గురుదేవులగు శ్రీ యోగానంద మూర్తికి కట్టించిన జీవసమాధి మఠాలయము, ఇచ్చటకు సమీపగ్రామ మగు ఆబ్బూరులో నెలకొనియున్నది. సద్గురుదేవుల ముఖ్యశిష్యులగు శ్రీ నారాయణస్వామి జన్మభూమి యగు అబ్బూరు గ్రామమున కీరోజు వెళ్ళి మఠమును నారాయణస్వామిని దర్శించిన పిదప వేమూరు వెళ్లెద' నని దలచి, 1960 నవంబరు ఒకటవ తేదీన పూజాద్రవ్యములు తీసికొని సత్తెనపల్లినుండి అబ్బూరు వెళ్ళుచుండిరి. "ఆహాహా! ఏమి పవిత్ర సమయము, అబ్బూరి పొలిమేరల వరకు "శ్రీ నారసింహా – జయనార సింహా – లక్ష్మీనారసింహా!" యను పవిత్ర నామస్మరణ మొకుదాఁరా

వీనులకు విందొనగూర్ప, సుబ్బారావు మన సానందవీథిలో షికారులు చేసెను. అబ్బూరు పౌరు లెదురైరి. వారితో సుబ్బారావు "నాయన లారా! శ్రీ యోగానంద నరసింహస్వామి మఠాలయ మెచ్చట గల" దనిరి.

ఆ గ్రామపౌరులు, "నాయనా! నీవు వెళ్ళు త్రోవ ప్రక్కనే మఠాలయమున్నది. శ్రీ నారాయణస్వామి గురుదేవులగు మార్కాపురస్వామివా రిచ్చటనే యున్నారు. వారు వేంచేసి మూడు రోజులైనది. గ్రామములో శ్రీ నారాయణస్వామివారు కట్టించిన లక్ష్మీ నారాయణాలయమున నేకాహము జరుగుచున్న"దని చెప్పిరి.

సుబ్బారావు హృదయ ముప్పొంగిపోయెను. "ఆహా! నా సద్గురు దేవులగు నపరనృసింహావతారమూర్తి దర్శనము తలవని దలంపుగా లభించుచున్న" దనుకొని వర్ణించుటకు వీలులేనంతటి, యానందమును పొంది ప్రక్కనేయున్న మఠాలయ ముఖద్వారములో కాలుపెట్టగనే సుబ్బారావునకు, మేనెల్ల విమలోర్ధ్వపుండ్రనామములు ధరియించి, పట్టుపీతాంబరము, పండితశాల్వ, పావుకోళ్ళు ధరించినవారై సాక్షాత్ శ్రీ మన్నారాయణమూర్తివలె స్వయంప్రభతో వెలింగెడి సద్గురు, శ్రీ యోగానంద నరసింహస్వామి దివ్యదర్శనమాయెను. మాతృదేవి స్వరూపిణి యాశ్రమనివాసిని, సద్గురుదేవుల దయకు పాత్రురాలు నగు శిష్యురాలు శ్రీ శాయమ్మగా రచ్చటనే యుండిరి. వారిర్వురను గాంచిన సుబ్బారావు, నారికేళము పండ్లు పూలు సద్గురుదేవులకు సమర్పించి పాదములపై వ్రాలిరి. గతజీవిత సంఘటన లన్నియు నొకే సారి కన్నులముందు సాక్షాత్కరించినవి. ప్రియశిష్యుడగు సుబ్బారావు, పొంగి పొరలిన కన్నీటిధారలతో సద్గురు పాదముల నభిషేకము చేసిరి.

త్రికాలవేదులగు శ్రీ సద్గురుదేవులు శిష్యుని కన్నీటిని గుర్తించి వెంటనే, లేవనెత్తి "నాయనా! దుఃఖింపకుము. నీ కెందులకు కన్నీరు,

నేనున్నాను నీకెట్టి భయములేదు. నీకన్నీటిని పన్నీటిగా మార్చెదను నాయనా! నీ కోరికేదో నాతో విన్నవింపు" మని యపారకరుణతో నడిగిరి.

"తండ్రీ! సద్గురుప్రభూ! నేను ప్రహ్లాద కథకై పడెడిపాట్లు నీకే దెలియును. సర్వజ్ఞుడవు. నా పాలిటి కామధేనువు. నీవుగాక యింకెవ్వరు దేవా!"యని డగ్గుత్తికతో, "మా యధ్యాపకులు శ్రీ గురు బ్రహ్మముగారు వేమూరులో నున్నారు. వారి యొద్దకు వెళ్ళుచు తమ యొద్దకు చేరితిని స్వామీ! యాశ్చర్యమగు సంఘటన యింకొక టున్నది. నేను పిడుగురాళ్ళనుండి మట్టుపల్లి నృసింహుని దర్శించవలె నని ప్రయాణమై బస్సులో నెక్కి కండక్టరుతో 'నాయనా! మట్టపల్లి వెళ్ళవలయును. ఏ స్థలమున దిగవలయు'నని యడిగితిని. 'నాయనా! ఒంటరిగా వెళ్ళెడిమార్గము కాదు. దాచేపల్లిలో దిగి కాలినడకతో తంగెడ గ్రామముచేరి కృష్ణానదిపై పడవదాటి యావలితీరము చేరి నడకతో మట్టపల్లి గ్రామముచేరి యచ్చటికి కొద్దిదూరములోనున్న కొండగుహలో శ్రీ నృసింహమూర్తి వెలసియున్నాడు మీయిష్ట'మని చెప్పిరి.

"స్వామి దర్శనమునకు సమయము రాలేదని బస్సుదిగి యీ స్థల మునకు చేరితిని, సద్గురుదేవా!"యని సుబ్బారావు వ్రాతప్రతి ప్రహ్లాద కథను స్వామికి చూపిరి. శ్రీ సద్గురుదేవులు ముసిముసి నవ్వులతో "నాయనా! మానవుడు యత్నము లెన్ని చేసినను దైవ మనుకూలింప నిచో నా పనులన్నియు వ్యర్థములౌను. వ్యర్థములౌచున్నవని విరమింప రాదు. అంతరాయము లెన్ని యెదురైనను, దృఢమైన మనస్సుతో విఘ్నముల నెదుర్కొని లక్ష్యసిద్ధికై పురోగమించవలయును. అదియే నిజమైన భక్తుని లక్షణము నాయనా!" యని నుడువుచు శిష్యుని చేతిలోనున్న వ్రాతప్రతి ప్రహ్లాదకథను తీసికొనిరి.

## శ్రీ యోగానందమూర్తి మూలవిరాట్టునెదుట భవితవ్యమును చెప్పుట.

శ్రీ సద్గురుదేవులు, ప్రహ్లాదకథ పుస్తకమును శ్రీ నృసింహమూర్తి పాదపద్మములపైనుంచి ప్రియశిష్యునివైపు చూడగా కన్నీరుగార్చుచు సుబ్బారావు సద్గురుదేవుల పాదములయొద్ద చేరిరి. శ్రీయోగానందమూర్తి నారికేళమును చేతదాల్చి మూలవిరాట్టుతో "ఓ వేదస్వరూపా! ప్రహ్లాదరక్షణకై సభాస్తంభమున వీరవిజృంభణముతో ముక్కోటిదేవతలు వణక ప్రళయధ్వనులతో నవతరించిన యో లక్ష్మీనృసింహా! నా ప్రియశిష్యుడగు సుబ్బారావుచే ప్రహ్లాదకథ చెప్పించవలయును. నీ మహత్తర దైవశక్తి నీ దీనుని హృదయమున ప్రవేశపెట్టి వేదాంతవిషయము లన్నియు కరతలామలకము చేయుడు ప్రభో! జై నృసింహా!"యని కేకవేసి, నారికేళము పగులగొట్టి కాళ్ళయొద్ద కాచుకొనియున్న సుబ్బారావు శిరస్సుపై నారికేళమునుండి స్రవించెడి శుద్ధగంగను బోయుచు భగవదాశీర్వాద మొనర్చిరి.

ఈ దృశ్యమంతయు భక్తురాలగు శాయమ్మదేవి వీక్షించుచు నాశ్చర్యముచెంది "నాయనా సుబ్బారావు! నీ వెంతో ధన్యాత్ముడవు. త్రికాలవేదులగు మన సద్గురుదేవు లమృతహస్తము నీ శిరస్సుపైనుంచి హరిదాసువై యఖండకీర్తి నార్జించెద"వని దీవించిరి. నీ కెట్టి కొరతయు గలుగదు. సద్గురుదయకు పాత్రుడవైతి"వని చెప్పెను.

శ్రీ సద్గురుదేవులను వీడి వెళ్ళుటకు మనసొప్పక పాదములొత్తుచు సుబ్బారావిట్లు దలంచిరి. "ఆహా! ఇట్టి మహనీయమూర్తి మాకు లభించుట మే మొనరించిన పూర్వపుణ్యఫలమునకదా! స్వామివారికి శిష్యులపైగల ప్రేమ యపారము. కరుణలో సాక్షాత్ బుద్ధభగవానులే! ఓర్పునందు శ్రీ యేసుక్రీస్తుప్రభువే! శిక్షించుటలో శ్రీ వీరనృసింహస్వరూపమే! అన్నియవతారములలో ప్రజ్వలించిన మహత్తర దైవశక్తియే శ్రీ యోగానందుని హృదయమున చేరియున్నది.

చిన్నతనమున నేను వారి సన్నిధికి చేరినరోజులలో నొక దినమున చలిలో చింతచెట్లక్రింద వారు శయనించిన పాన్పునకు క్రిందుగ చాప పరచుకొని శయనించితిని. అర్ధరాత్రి యగుసరికి చలి మిక్కుటమై నేను లోలోన వణకజొచ్చితిని. నా పైభాగమున శయనించిన కరుణాస్వరూపులు శ్రీ సద్గురుదేవులు వీక్షించి, వారు కప్పుకొనిన శాలువదీసి నా శరీరముపై కప్పిరి. నేను తీసికొనివెళ్ళి సమర్పించిన మిఠాయి మొదలగు ఫలహారములుగాని, పండ్లుగాని వారు తీసికొని జాగ్రతచేసి మాటిమాటికి ప్రేమతో తీసికో నాయనా! యని నాకిచ్చెదరు. వారు భుజించెడి సమయమున శిష్యులుగాని, భిక్షువులుగాని, బాటసార్లుగాని యెవరైనను వచ్చినచో వారు భోజనముచేయుటమాని తోటివారికమితప్రేమతో నన్నమును పెట్టించి వారు భోజనము చేయుచుండగా వీక్షించి తదుపరి భోజనము చేసెదరు. సాధుధర్మములన్నియు వా రాచరించి మనకు ప్రబోధము చేసెదరు.

శిష్యుల సొమ్ము కాసైనను గ్రహింపరు. భగవంతుడొసంగిన పొలమును దున్ని శ్రమించి ఫలింపచేసిన ఫల సముదాయమును భగవత్సంబంధమగు కార్యక్రమములకు తన్ను దర్శింపవచ్చిన శిష్యసంఘములకు వెచ్చించుచు వారలకు కడుపార భోజన మిడి, వారి కైహికవాంఛ లున్నచో, మీ భవిష్య మిట్లున్నదని నుడువుచు, నాముష్మికచింతగలవారికి, వారి హృదయాంతరాళములలో నణగి మణగియున్న భావములకు తగినరీతి ప్రబోధముచేయుచు వారిమనస్సుల నానందింపచేసెదరు. ఇట్టి లోకోత్తర పుణ్యమూర్తి యగు నా గురుదేవుని దర్శన మెన్నటికో యని సుబ్బారా వనుకొనుచున్నంతలో, గురుదేవుల ప్రథమ శిష్యుడగు (శ్రీ) నారాయణస్వామి వేంచేసి గురుసన్నిధిలో నున్న తన యాత్మసోదరులగు సుబ్బారావును వీక్షించి "ఓహో! ఎన్ని రోజుల కీ స్థలమునకు వచ్చినా" రని యానందముతో సుబ్బారావును గ్రామ మధ్యభాగములో తన యధ్వర్యమున జరిగెడి

ఏకాహమహోత్సవము నొద్దకు తీసికొనిపోయి స్వామి తీర్థప్రసాదముల నిచ్చి దీవించిరి.

సుబ్బారావు ఆనాటి సాయంత్ర సమయమువరకు నామసంకీర్తనలో పాల్గొని శ్రీ నారాయణస్వామివారి సెలవు గైకొని శ్రీ సద్గురుదేవుల సన్నిధికి చేరి ప్రణుతు లొనర్చి సద్గురు సెలవునొంది అబ్బూరు వీడి మరునాటి మధ్యాహ్నమునకు వేమూరు చేరిరి.

శ్రీ గురుబ్రహ్మముగుప్త భాగవతారుగారు సుబ్బారావున కాశ్రయమిచ్చి హరికథ ప్రార్థనల నధ్యయనము చేయించిరి. దయగల హృదయముగల వారినే భగవంతుడు పరీక్షించునటుల కథ ప్రారంభమునకే యాహ్వానము నంపినట్లుగా! వర్షాధిదేవత ప్రత్యక్షమై కథ కంతరాయము గలిగించి నిరుత్సాహమును ప్రోత్సహించుచున్నది. హరిదాసుగా రిది సమయము కాదని గుర్తించి వేమూరు వీడి స్వగృహము చేరిరి. సుబ్బారా వింటికి వెళ్ళిరి.



# చతుర్థ ఖండము

## శ్రీ కంటు లక్ష్మయ్య శ్రీ సద్గురు సన్నిధికి చేరుట

శ్రీ యోగానంద నరసింహస్వామికి వెంకటసుబ్బయ్యను నొక సోదరుడు గలడు. ఆత, డన్నయే నాకు పరమదైవము. నా రక్షణ భారము స్వామిదే నని మదినెంచి, భక్తితో సకలవిధ శుశ్రూష లొనర్చుచు నన్నగారి కెంతో యామోదము చేకూర్చుచు నాశ్రమ జీవితము గడపుచు సాధుభావములతో మెలగసాగెను. ఆ వెంకట సుబ్బయ్యకు కాలకర్మవశమున స్ఫోటక మావేశించి తారుమారుగా నుండెను. ఆ రోజులలో రామదండు పేరుతో ప్రజలందరు కరతాళ భజనలు చేయుచు రామనామమును కీర్తించుచు గ్రామగ్రామములు తిరుగుచుండిరి. వెంకటసుబ్బయ్య యోగమూర్తియగు తన యన్నను వద్దకు చేర్చుకొని "తండ్రీ! నేను రామదండులో వెళ్ళెదను సెల విచ్చెదరా" యనిరి. శ్రీ సద్గురు దేవులు "ఓహో! అప్పుడే వెళ్లెదవా సోదరా!" యనిరి. "ఓ అన్నయ్యా! సర్వము తెలిసిన సాధు మూర్తులు. మీకు నేను చెప్పెడివాడనా ప్రభూ! నేను జీవించుటకు వీలులేదు. ఈ జన్మవీడి వెంటనే మానవజన్మ యెత్తి నీ పాదభక్తి గలిగి నీ దాసుడనై నా జీవితము నీకర్పించవలయు నను సంకల్పమున్నది. నా సంకల్పమును సిద్ధింపచేయు" మని దీనముగా ప్రార్థించెను.

త్రికాలవేదియగు శ్రీ యోగానందస్వామి సోదరుని కోరిక మన్నించి, తమ్ముని భవిష్యమును దివ్యదృష్టితో తెలిసికొని "నాయనా! నీ కోరిక సిద్ధించును. ఇరువది సంవత్సరములకు కమ్మవంశమున జన్మించి బాల్యప్రాయముననే, కారణాంతరమున నా పజ్జచేరి శిష్యుడవై నాకు పాదసేవ లొనర్చుచు నాశ్రమ కార్యక్రమములను నిర్వహించెద"వని చెప్పిరి.

శ్రీ వెంకటసుబ్బయ్య స్థిరచిత్తముతో యోగమూర్తి వాక్యము లాకర్ణించి పరమానందభరితుడై, బ్రహ్మవర్చస్సుతో వెలింగెడి యన్నగారి ముఖబింబమును దర్శించుచు, నృసింహనామమును స్మరించుచు, ప్రాణవాయువును వదలిరి.

ఇరువది సంవత్సరములు క్రమక్రమముగా గడచిపోయినవి. శ్రీ యోగానంద నృసింహస్వామి యాజ్ఞానుసారము, నెల్లూరుజిల్లా కందుకూరు తాలుకా పొన్నలూరు రెడ్డిపాలెము గ్రామమున కమ్మ వంశమునకు చెందిన శ్రీ కంటు రామస్వామి, పున్నమ్మలను దంపతుల కొక శుభముహూర్తమున నొక పుత్రరత్నము జన్మించెను. ఆ బాలునకు జాతకర్మాదివిధుల నిర్వర్తించి పదునొకండవనాడు లక్ష్మయ్యయని నామకరణ మొనర్చిరి. దినదిన ప్రవర్ధమానుడై మాతాపితరుల కానందము గలిగించుచు పెరిగి పెద్దయగుచుండెను, తోడిబాలురకు తలలో నాల్కవలె మెలంగుచు కులాచార ప్రకారము వ్యవసాయ మొనర్చుచు బీదసాదలయందు ప్రేమనుజూపుచు సాధుసజ్జనులతో నణకువగలిగి మెలగుచుండెను. లక్ష్మయ్య యిరువది సంవత్సరముల ప్రాయముగలిగి సత్ప్రవర్తనతో సాధుభావములతో తోటివారిని సోదరులని భావించుచు కాలమును సద్వినియోగ మొనర్పసాగెను,

పురాకృతకర్మచే లక్ష్మయ్యకు కడుపునొప్పి సంభవించి నానాటికి వృద్ధియగుచుండెను. తల్లిదండ్రులు కుమారునిబాధ జూచి సహింపలేక మెన్నోమందు లిప్పించిరి. మందులవలన ప్రయోజనము లేకపోయెను. అతనికి జీర్ణశక్తి నశించి శల్యావశిష్టుడయ్యెను. పెద్దవారిదిచూచి "నాయనా! లక్ష్మయ్యా! మందులవలన లాభము లేదు. మందులకు సాధ్యముగాని మొండివ్యాధులకు శ్రీ ఆంజనేయస్వామి ప్రదక్షిణములు పెట్టిన పేరు. ఎట్టి కర్మలనైనను నట్టె మటుమాయ మొనర్చును. నీవు తప్పక శ్రీ ఆంజనేయస్వామి ప్రదక్షిణములు చేసి విముక్తిని పొంది సుఖమును వడయు" మని చెప్పిరి.

పెద్దల వాక్యముల నాకర్ణించిన లక్ష్మయ్య స్థిరచిత్తముతో మరునాటి ప్రాతఃకాలమున, లేచి కాలకృత్యములు దీర్చి శుచియై శ్రీ ఆంజనేయస్వామి ప్రదక్షిణములు గావించుచు స్వామియందు భక్తి గలిగి పట్టుదలతో స్వామి సన్నిధిలో శయనింపసాగిరి. ఆంజనేయ స్వామియే దిక్కని యేకాభిప్రాయముతో మారుతి నామమును మననముచేయ మొదలిడిరి.

ఈ లక్ష్మయ్య యను భక్తున కొకనాటి రాత్రి మధురస్వప్న మొకటి పొడకట్టెను. మార్కాపుర సమీపమున చిన్నకొండ, ఆకొండ సమీపమున మ్రోతలు వెట్టుచు ప్రణవధ్వనితో, కుండికానది ప్రవహించుచున్నది. కొండ క్రింది భాగమున నింపుసొంపొనగూర్చెడి వనము. కొండశిఖరమున శ్రీ లక్ష్మీనృసింహాలయము. ఆ యాలయ ప్రాంగణమున పడకకుర్చీలో బ్రహ్మవర్చస్సుతో వెలింగెడి శ్రీ యోగానంద సద్గురుమూర్తులను వారి పాదకమలములపై తాను శిరస్సును మోకరించి 'రక్షించు ప్రభూ !' యని కన్నీరు కార్చిన మహత్తర దృశ్యము లక్ష్మయ్య కా స్వప్నమున గోచరించెను.

ఇట్టి కలగాంచి దిగ్గున లేచి దిక్కులన్నియు జూచి స్వప్నగత దృశ్యమును దలంచి యాశ్చర్యమానసుడై "ఆహా ! నా జన్మ తరించినది ! మహాయోగీశ్వరుని దివ్యదర్శనమును పొందితిని. నా జీవితమునకు వెలుగు నిచ్చెడి పవిత్రమూర్తి యాయన దప్ప మరెవ్వరు లే"రని, యెంచి "నా జీవితము నాసత్యస్వరూపున కంకిత మొనర్చెదను. ఇదియే నా జీవిత లక్ష్య"మని నిశ్చయించుకొని సంసారముపై విరక్తినొంది విరాగముతో మూడురోజు లట్లే గడిపి, గమ్యమును చేరుకొనుటకు, చేత కాసైనను లేక "యెట్లు చేరెదరా ! ఆంజనేయా" యని స్మరించుచు నమితావేదనతో లక్ష్మయ్య కుందుచుండెను.

అంతలో లక్ష్మయ్య బావగారైన శేషయ్యగారి పంచ చెంగున నున్న మూడురూపాయలు దైవవశమున జారి క్రిందపడెను. శ్రీ ఆంజ

నేయస్వామియే నా కిప్పించినా డను నమ్మకముతో నా మూడు రూప్యములను గ్రహించి కన్నుల కద్దుకొని "ఆహా! దైవలీల యెంత విచిత్రము! నా జన్మను సార్థకము చేసికొనుటకు భగవంతుడే సాయము చేసినా" డనుకొని భగవన్నామమును స్మరింపుచు, స్వప్న దృశ్యదర్శనమునకై పరితపించుచు యానాటి శనివార మర్థరాత్రికే ప్రయాణమై జన్మభూమి, యగు రెడ్డిపాలెము వదలి పన్నెండుమైళ్ళలో నున్న పాలేటి గంగాలయమునకు సూర్యోదయమగుసరికి వారు చేరిరి.

ఆయన స్వప్నగత దృశ్యము నడుగుచు త్రోవ తెలిసికొని ఆదివారము రాత్రికి మార్కాపురము చేరి సమీపస్థలమున ప్రకాశించెడి శ్రీ కపిలగిరికి వేంచేసిరి. శ్రీ యోగానందమహర్షుల యాశ్రమమున ప్రవేశమై ప్రశాంత వాతావరణమున కుప్పొంగి యానందబాష్పముల రాల్చుచు కొండపైనున్న శ్రీ లక్ష్మీనృసింహమూర్తిని కరవుదీర దర్శించి నిరాహారియై యా రాత్రి యందే పరుండి, సోమవార ముదయమున లేచి కొండదిగి యావేశముతో శ్రీ యోగానందమహర్షి వారి పాదపద్మములపై వ్రాలి దీనముగా గద్గదస్వరముతో కన్నీరు గార్చుచు 'ప్రభూ!' యని పలుమారు వేడిరి.

కరుణాస్వరూపులగు శ్రీ సద్గురుదేవులు పాదములపై బడి వాపోయెడి యా బిడ్డను జూచి జాలితో లేవనెత్తి బుజ్జగించి "యేడ్వకుము నాయనా! నిన్ను శ్రీ లక్ష్మీనృసింహస్వామి రక్షించును. సందేహము లేదు. భయము వీడి నరసింహ నామమును స్మరింపు" మని చెప్పిరి.

లక్ష్మయ్య పొరలివచ్చు కన్నీటి ప్రవాహము నాపుకొని "ఓ స్వామీ! యీ దాసుని రక్షించు భారము తమదే యని నమ్మి పరుగులు దీయుచు తమయొద్ద చేరితిని. నా గతి నా దుస్థితి తమకు విన్నవించుకొనెద స్వామీ!" యని గతచరిత్రనంతయు విన్నవించిరి.

కొన్ని సంవత్సరములనాడే శ్రీ సద్గురు కరుణకు పాత్రులరాలై నృసింహస్వామినిపూజించుచు శ్రీసద్గురుసేవలొనర్చుచు యాశ్రమమును

సంరక్షించుచు సర్వసుఖములను త్యజించి సద్గురుపూజలే సద్గురుబోధలే మిన్నయని మదినెంచి జీవించెడి మాతృమూర్తియగు శాయమ్మగారు నాధ్యాత్మికదృష్టితో యాశ్రమజీవితము గడుపసాగెను.

శ్రీ సద్గురు చరణము లంటివేడుచు కన్నీరుగార్చెడి లక్ష్మయ్య బాలుని జూచి జాలిగలిగి "రా నాయనా! నీ కేమియు నాపద లేదు. సర్వశక్తిగల సద్గురుస్వామి నీ కభయదాన మొసంగి, నమ్మి కొలిచెడి భక్తులను కంటికిరెప్పవలె బ్రోచెడి కరుణామూర్తి. ఆ మహనీయుని శక్తి సామాన్యులమగు మనము తెలిసికొనలేము. చంద్రునివంటి చల్లదనము, సూర్యునివంటి తపోగ్నిగల వీరనృసింహ కళావతారమూర్తి, యా గురుదేవు"లని ప్రబోధముచేయుచు నా బాలుని తీసికొనిపోయి కడుపార భోజన మిడి ప్రియమార గౌరవించెను.

ఆ తల్లి కరుణకు ముగ్ధుడై లక్ష్మయ్య యామె పాదములకు భక్తితో నమస్సులర్పించి, "అమ్మా! నీవు నిజముగా మా కన్నతల్లివే! తల్లికంటె వేయిరెట్లు ప్రేమతో సాదమిడితివి. నీవు సామాన్యురాలవు కావు. సాక్షాత్తుగ అన్నపూర్ణాదేవి" వని నుతించి యతిభక్తితో మెలగసాగెను.

శ్రీ సద్గురు సార్వభౌములు ప్రియకుమారుడగు లక్ష్మయ్యను దగ్గరకు బిలిచి వాని శిరస్సున తన యమృత హస్తముంచి "నాయనా లక్ష్మయ్యా! ఈనాటి రూపముతో నా పజ్జ చేరితివి! నీవు గత జన్మలో నాకు సోదరుడవై సేవలొనర్చియు నీ కోర్కె పరిసమాప్తి నొందకముందే మృత్యుదేవత నిశిత కరాళదంష్ట్రలకు గురియైతివి. నీ పూర్వజన్మ సుకృతఫలముచే నీ జన్మలో శిష్యుడవై నా చెంతకు జేరితివి. నీవు నిర్భయుడవై యాశ్రమసేవలుచేసి నీ జీవితమును ధన్య మొనరింపు" మని యానతిచ్చిరి.

శ్రీ లక్ష్మయ్య భక్తితో "తండ్రీ! తమ యాజ్ఞయే నా జీవితమునకు సూటిబాట. తమ యాజ్ఞానువర్తినై ప్రవర్తించెద స్వామీ!"

యని దోసిలొగ్గెను. శిష్యుని భక్తికి సంతసించి "నాయనా! ధర్మదేవత లగు గోవులను సంరక్షింపుము. మన యాశ్రమమునకు చెందిన భూమిని సేద్యము చేసి ఫలమును మా కందచేయుము. ఆ ఫలముతో మనము,



శ్రీ సద్గురు సన్నిధిన మాతృమూర్తి శ్రీ శాయమ్మదేవి.

మనభక్తులు, మన యారాధ్యదైవమగు శ్రీ లక్ష్మీనృసింహమూర్తి ప్రసాదమును స్వీకరింతము.

"కష్టేఫలి!, కష్టింపనిదే ఫలము లభింపదు. ఆ క్షేత్రముతో పాటు నీ హృదయక్షేత్రమును పవిత్ర మొనర్పుము. క్షేత్రమును చక్కచేసి కొనిననాడే మనము వేసిన జ్ఞానబీజములు నిర్మలజ్ఞాన మనెడి శుద్ధ గంగచే తడిసి మొలకెత్తి "ఆకులతో, రెమ్మలతో, కొమ్మలతో, పూలతో, పిందెలతో, కాయలతో, ఫలములతో నలరారుచుండును. బీజ మెన్నో పరిణామములనుపొంది యంతిమదశకు వృక్షమై మధురఫల సంభరితమై వెలుగొందెడురీతి నేను ప్రబోధముచేసెడి వేదాంతరహస్య ములను నీ హృదయక్షేత్రమందు నాటి జ్ఞానగంగనిడి మొలకెత్తించి నీతి, స్వచ్ఛత, సత్ప్రవర్తనలనెడి కంచెలనువేసి సదా రక్షించుచు ఫలములకై కాంక్షించుచు నోర్పుతో, నేర్పుతో, త్రికరణశుద్ధితో సద్గురువే సాక్షాత్పరబ్రహ్మస్వరూపమని భావనచేయుచు ధర్మపథ గామివై యాశ్రమజీవితమునే జీవితాంతమువరకు గడపి నీ జన్మను సార్థక మొనరింపు"మని ప్రబోధముచేసిరి.

శ్రీ సద్గురుదేవుల యాచరణ వేదాంతసూత్రములను విని మరువక మననము చేయుచు లక్ష్మయ్య ధర్మమార్గమున నడువసాగెను. గురు దేవుని యాజ్ఞయే నా జీవితమునకు తరుణోపాయమని, సద్గురుసేవ, యాశ్రమసేవ, గోసేవ చేయుచు దిన మొకక్షణముగ నాయన గడుప సాగిరి. ఆరు మాసములు గడచినవి. శుభసమయ మాసన్నమైనది. సద్గురుకరుణ ప్రసరించినది. ఎంతో కాలమునుండి వేధించుచు యేడ్పించెడి కడుపునొప్పి సమూలముగా నాశనమొందినది. భక్తితో సేవలొనర్చెడి లక్ష్మయ్యకు శ్రీ యోగానంద నరసింహస్వామి, 1951 జులై పదిఐదవ తేదీన జ్ఞానోపదేశము గావించిరి. సద్గురుదేవు లొసగిన దివ్యమంత్ర మును జపించుచు నిరంతరము సద్గురుదేవులకు చేదోడుగా పరిశ్రమ చేయుచు కాలమును సద్వినియోగ మొనర్చుచు తన జీవితముపై నాశ వీడి నా భారమంతయు నా సద్గురుసార్వభౌమునిదే యను దీక్షతో నెట్టి కష్టములనైన తృణప్రాయములుగా నెంచి యెదుర్కొనుచు నతి

భక్తితో మెలగుచుండిరి. ఈ విధముగా కొన్ని వత్సరములు లక్ష్మయ్య సద్గురు సేవలో నిమగ్నులైరి.

శ్రీ సద్గురుబోధ వినవలయునని సాధులు, సంసారులు, యతులు, మందమతులు, భోగులు, రోగులు, విరాగులు మొదలగువా రందరు శ్రీ కపిలాశ్రమమునకు వచ్చి శ్రీ యోగమూర్తి పాదపద్మములకు ప్రణ



శ్రీ కంటు లక్ష్మయ్యగారు

మిల్లి, వారి ప్రబోధామృతమును పానము చేయవలయు నని నిరీక్షించుకొని ప్రశాంతితో నాసీనులైరి. అట్టి తరుణమున శ్రీ స్వామివారీ విధముగా ప్రబోధము చేసిరి.

## సత్యదృష్టితో చేసిన శ్రీ సద్గురు ప్రబోధము

"ఓ పరమ భక్తులారా! మీ రందరు నొక విషయమును మాత్రము సదాజ్ఞప్తి నుంచుకొని జాగరూకత గలిగి మెలగుడు. మీ భక్తిజ్యోతి సదా స్వచ్ఛమై ప్రకాశ మొందును. మీరా యొక విషయమును మాత్రము మరచి మీ చిత్తానుసారము ప్రవర్తించినచో మీలో వెలింగెడి జ్ఞానజ్యోతి యారిపోయిన మరుక్షణమే యజ్ఞానము మీ హృదయమున నావరించి, స్వప్రజ్ఞను నాశనముచేసి ద్విపాద

పశువుగా మార్చి వేయును! ద్విపాదపశువుగా మారి యెంత కాలము జీవించినను నరకయాతన లనుభవించుటే గాని హృదయమునకు శాంతి చేకూరదు.

"సదా జ్ఞప్తినుంచుకొని జాగరూకతగలిగి ప్రవర్తింపవలయున నెడి విషయము నిక సావధానచిత్తముతో నాలింపుడు. ఆలించినదానిని పాలింపుడు. కలికాలపు భక్తులు, యోగులు, జ్ఞానులు, ఆచార్యులు, కవులు, గాయకులు, పండితులు, విద్వాంసులు మొదలగువా రందరు ముఖ్యముగా గమనింపవలసిన విషయ మొక్కటియే!

"కాముక స్త్రీహృదయము అగ్నిగుండమువంటిది. అగ్నిగుండము ప్రజ్వలించుసమయమున నెట్టివస్తువులనైన నెట్లు బూడిదచేయునో యదేరీతి, నెట్టిధీశాలులైనను కాముక స్త్రీ మాయలలో పడినచో నామె మీ తేజస్సును, మీ బలమును, మీ గౌరవప్రతిష్ఠలను, మీ భక్తిని, మీ శక్తిని, మీ యుక్తిని, మీ భోగభాగ్యములను, మీ జ్ఞానములను, మటుమాయ మొనర్చి, భిక్షాపాత్రను చేతికిచ్చి, బికారిముద్ర వేసి 'బయలుదేరు బాటసారి' యని మెల్లగా చల్లగా సాగనంపి మంగళహారతి పాడుకొనును.

"ఈ ప్రపంచమున నెట్టివారనైనను నిత్యానంద నిలయమగు పరతత్త్వమును పొందవలయు నని వాంఛయున్నచో, రెంటిని త్యజింపవలయును. అవి కామినీ–కాంచనములు. ఈ రెంటిని త్యాగ మొనరించిన నాడే, యా సర్వేశ్వరుని యవ్యాజకరుణాకటాక్ష వీక్షణము మీపై ప్రసరించును! లేనిచో నెన్ని జన్మలిట్లు వాచా వేదాంతము వల్లించినను భగవత్కృప గలుగదు. ఇది పరమసత్యము.

"కొందర జ్ఞానముతో నీవిధముగా తలంచెదరు. 'మేము నిత్యము భక్తితో భజనలు చేయుచున్నాము. సాధువులకు నమస్సు లొనర్చుచు ధర్మోపదేశములు వినుచుంటిమి. మీదుమిక్కిలి, ధర్మ కార్యము లొనర్చుచుంటిమి. సప్తాహము లెన్నో కంకణముకట్టుకొని నిర్వహించు

చుంటిమి. పెద్దలందరు మమ్ము మంచివారని మెంచి యాశీర్వాదము లొనర్చుచున్నారు. భగవద్గీతాపారాయణము నియమముగా చేయుచున్నాము. రామకోటి లిఖించుచున్నాము. తీర్థయాత్రలన్నియు సేవించినాము. నగరసంకీర్తనము నేర్పుతో చేయుచున్నాము. ఓర్పుతో మాపనులన్నియు చక్కబెట్టుకొనుచున్నాము. లోకులందరు మమ్మెంతయో మంచివారని పొగడుచున్నారు. మాగృహములలో గోడలన్నియు రామకృష్ణనామములతో కళకళలాడుచున్నవి. ఎన్ని పాపములొనర్చినను మాకేమి భయము, మా రామయ్యతండ్రి యన్నిటిని క్షమించెదరు. ఎన్ని పాపములు చేసిన నొక్కసారి, రామా! కృష్ణ! యన్నచో, మాపాపములన్నియు మమ్ము వీడి యెగిరిపోవును, మేమే పని చేసినను, మా దేవదేవుడు క్షమించి సదా కాపాడు'నని లోకులకు కీడొనరించెడి ఘోరపాపు లెందరో గలరు. ఈ ఘోరపాపుల నాపరమాత్మ తప్పక శిక్షించును. ఈ విధమగు, పాపుల నొక్కసారి మీ మనస్సునకు దెచ్చుకొనుడు.

"తీర్థయాత్రలకు వెళ్ళునపుడు, భగవన్మందిరములకు వెళ్ళినపుడు తప్పక, చూచుచున్నారు. వార లెవ్వరనిన—

"మార్గమున కిరువైపుల కళ్ళులేక, కాళ్ళులేక, మాటరాక, కదలక మెదలక 'బాబూ! నయాపైసా ధర్మము చేయుడు, పాపకర్మలు చేసిన పాపులము. మీరైనను పుణ్యకర్మలు చేయుడు. పుణ్యకర్మలు చేయక యెవరు చూచెదరులేయని, మదముతో ధనపిశాచావేశాపరులై కన్నుమిన్ను గానక మన్నుపై తిరుగుచు, మానవధర్మమును మంటగలిపిన, మీకును మా గతియే పట్టును, బాబూ! నయాపైసా ధర్మ'మని వాపోవుచుందురు. ఆచరించెడివాని కాగ్రుడ్డివాని వేదాంత వాక్యములేచాలు. ఆచరణలేనివాని కెన్ని తత్త్వోపదేశములు చేసినను, బూదిలోపోసిన పన్నీటివలె, చవిటినేల నాటిన విత్తనమువలె వ్యర్థములైపోవును.

"త్రికరణశుద్ధి యవసరము. మనస్సు వాక్యములు చేయుపని పరిశుద్ధము గావలెను. అట్టిస్థితి నొందిన తక్షణమే కరుణామయుడగు భగవానుడు తప్పక రక్షించును. నోటితో నెన్నినీతులు చెప్పినను నీ యంతరంగమున కనుగుణమగుఫలమే కలుగును. నీవెంతో తెలివితో యతిజాగ్రతతో చేసిన పాపకర్మను నీ స్థూలదృష్టికి గోచరించని పరమాత్మ నీలోనే యుండి నీ తప్పులకు తగినఫలమును కలుగచేయును. ఆ ఫలమును తప్పించుకొనుటకై నీవు విశ్వప్రయత్న మొనర్చినను నిష్ఫలమే! భగవదాజ్ఞమీరి యెవ్వరేమి చేసినను కష్టనష్టములకు గురియై భ్రష్టులై కృశించి కృశించి వారు నశించెదరు.

"తనతప్పు తాను తెలుసుకొని భగవంతునిప్రాపుచేరి యార్తితో రాత్రింబవళ్ళు మనన ధ్యాన స్మరణ భజనాదులచే ప్రార్థించి కన్నీటితో భగత్పాదారవిందముల నభిషేక మొనరించినచో సాధురక్షకుడగు శ్రీ లక్ష్మీనృసింహస్వామి కరుణతో కాపాడి కన్నతండ్రివలెరక్షించును. ఈ పరమసత్యమే భక్తుల స్వానుభవసిద్ధాంతము. వేఱొండు కాదని సదా జ్ఞప్తినుంచుకొని యాచరణ భక్తికై ప్రయత్న మొనరింపుడు.

"పరమాత్మ యొకటే! అదియే, శక్తులన్నిటికి మించి ప్రకాశించెడి మహాశక్తి! సర్వమతములవారు నా పరమాత్మ తత్త్వమున కనుగుణముగా ప్రవర్తించి యదార్థపదార్థమగు స్వయంజ్యోతిలో నేకీభవించినవారే యని సదా జ్ఞప్తినుంచుకొనుడు. అట్టి పరమాత్మదర్శనమును పొందినవారినే మనమందరము యోగులని, సిద్ధమూర్తులని, మహనీయులని, తత్త్వవేత్తలని, కళావతారములని, మహాత్ములని మొదలగునామములతో పేర్కొనుచుందుము.

"రాముడు, కృష్ణుడు, మహమ్మదు, క్రీస్తు, శంకరుడు, రామానుజుడు, మధ్వాచార్యుడు మొదలగు మహామనీషుల హృదయకుహరములలో జ్యోతిరూపమున పరమాత్మ కోటిసూర్యులకాంతితో ప్రకాశించుచున్నాడు. ఆ దివ్యకాంతిని దర్శించి తరించుటకు బాహ్యరూపములో

నున్న స్థూలచక్షువులకు సాధ్యము కాదు. జ్ఞాననేత్రమును స్వప్రజ్ఞతో తెరచి యా దివ్యకాంతిని దర్శింపవలయును. పరమాత్మశక్తిని తన వశము చేసికొనినమీదటనే ధర్మములను శాసించిరి. మతములను సృష్టించిరి. మానవోద్ధరణకై విజ్ఞానబోధలు కొనసాగించిరి. ఉన్న దొకటే యను పరమసత్యమును గుర్తింపక 'తా బట్టిన కుందేటికి మూడే కాళ్ళనుచు' శైవులు వైష్ణవులను దూషించుచు, వైష్ణవులు శైవులను దూషించుచు, నొక్కొకసమయమున వైష్ణవులు, శైవులు కలసి మహమ్మదీయులను దూషించుచు వారు–వారు–వీరు కలసి క్రైస్తవులను దూషించుచు నీవిధముగా నానాటికి జ్ఞానుశూన్యులై, వీరిలో నెవ్వరు నన్వేషింపక నా స్వామిగొప్ప, నా దేవుడే పెద్ద, నీ దేవుడు చిన్న వాడు, మీరు చిల్లరవిగ్రహములకు పూజచేసెదరు. మేము పెద్ద విగ్రహమునకు పూజచేసెదము. మీరు మాకంటెతక్కువ, మీమతమును వదలి మా మతమున చేరి సుఖింపుడు, బొందితో పరలోకమునకు బోవుదము. మీరు చచ్చిన తదుపరి పొందునది యేమున్నదని, ఒకరి నొకరు దూషించుకొనుచు, సర్వమానవ సౌభ్రాతృత్వమును వదలి మానవత్వమునే మంటగలిపి దానవులై తిరుగుచున్నారు. ఇట్టి జ్ఞానహీనులను జూచి, రాముడేమి సంతోషించును? మహమ్మదేమి యాదేశించును? క్రీస్తుప్రభు వేమి బోధించును? ప్రశాంతచిత్తులై మీలో మీరే యోజింపుడు. దైవాత్మస్వరూపులారా! యదార్థసత్యము నెన్నటికైనను గుర్తించి, మీ హృదయములను మీరే సంస్కరించుకొనెదరుగాక!

"సర్వశక్తుల కతీతమైనశక్తి, స్థూలదృష్టికి గోచరింపని మహాశక్తి యగు నా పరమాత్మశక్తి సదా యేమి ప్రబోధము చేయుచున్నదో జాగ్రతతో గమనింపుడు.

"ఓ రామచంద్రా! నీ కాలయము లేర్పరచి, శిలాస్థాపములు స్థాపించి, నిత్యనైవేద్యదీపారాధన మహోత్సవములు చేసినను, తులసి మాలలు మెడయందు దాల్చి విమలోర్ధ్వపుండ్రములు మేనెల్ల ధరి

యించి పవిత్రగ్రంథములు చంకయందిడి 'సత్యమేవ జయతు సత్యమేవ జయ'తని నోటితో నరచుచున్నను, మణిమయగోపురాదులు నిర్మించినను, నఖండ హరినామ యజ్ఞము లెన్ని చేసినను, లెక్కకు మిక్కుటమగు నారికేళములు నీ పాదములయందు పగులగొట్టి, కర్పూరపు ముద్దలను వెలిగించి హారతు లొసంగినను, నీలో వెలింగెడి స్వయం జ్యోతి స్వరూపమగు పరమాత్మను నే నానందింపను, ఆనందింపను, ఆనందింపను. ఇది యదార్థసత్య మని సదా ప్రతిధ్వనించు చుండును.

"శ్రీరాముని ప్రవర్తన గలిగినవారే రామభక్తులు! రామ ప్రవర్తన లేక రామనామము మాత్రము నామకః చేసెడివారు రామ భక్తులు కాదు. రావణ భక్తులే! ఇదియే గురుకీలకము!

"ఓ మహమ్మదు! ఓ ఏసుక్రీస్తు! మీ పేర్లు చెప్పి, వాదములతో క్రోధములతో ఖేదములను పొందుచు రాత్రింబవళ్ళు మీ ప్రార్థనలు చేయుచుండిరి కాని, వారి ప్రార్థనలు పనికిమాలినవి. ఏ యొక భక్తుడైనను మీ మీ ప్రవర్తనల ననుసరించుచున్నాడా? మీ యాదేశములను పాటించుచున్నాడా? మీ పరిశుద్ధహృదయములందు వెలింగెడి జ్ఞానజ్యోతి, యే యొకభక్తుని హృదయమందైనను, సదా వెలుంగుచుండునో, వారే మహమ్మదు భక్తులు. వారే క్రీస్తుప్రభువు బిడ్డలు. ఇది సర్వమతసారాంశ మని యీ పరమాత్మ శక్తి బోధించుచున్నది. పరమాత్మ తత్త్వమునకు వ్యతిరేకముగా ప్రవర్తించి మీ హృదయమున నావరించిన యజ్ఞాన మను చీకటిని తొలగించుకొనక, రామభజనలు రాత్రింబవళ్ళు చేసినను రాముడు రక్షింపలేడు! శివ భజన లెడతెగక యొనర్చినను నా శివుడు మిమ్ము దరిచేర్పలేడు! మసీదులలో చేరి 'అల్లాహో అక్బ'రని యరచినను మహమ్మదు ఉద్ధరింపడు. హృదయశుద్ధి లేక దేహశుద్ధి గలిగి చర్చిలలో ప్రవేశించి స్తుతించినను, స్తోత్రములు చేసినను నా యేసుక్రీస్తు ప్రభువు కన్నెత్తియైననుచూడడు. ఈ వాక్యములమృతోపమానములని గుర్తించి, సత్యదృష్టి గలిగి సత్యవాక్య పరిపాల

కులై సత్యాన్వేషణతో సర్వమత సమత్వదృష్టిగలిగి ప్రబలప్రయత్న మొనర్చి, సత్యమై, నిత్యమై, సనాతనమై, స్వయంప్రకాశమై, సర్వ భూతాంతరాళములయందు నొకేశక్తితో వెలింగెడి పరమాత్మను శరణుపొందుడు! ప్రార్థింపుడు! భజింపుడు! తపింపుడు! తత్త్వమసి వాక్యమును 'అహం బ్రహ్మాస్మి' వాక్యములసారము నాస్వాదనము చేయుడు! ఆ పరమాత్మశక్తి మీలో వ్యక్తమై దివ్యజ్యోతియై ప్రకాశించి మిమ్మందరిని తనలోనే యేకీభావము చేసికొని యెప్పటివలె సూక్ష్మరూపమై వెలుగొందుచుండును."

శ్రీ సద్గురు దైవప్రబోధము విన్నవారందరు "ఓహో! యిన్ని దినములనుండి తెలిసినవారివలె ప్రవర్తించుచు 'నీ–నా' యను భేదముతో పరమసత్యమును త్యజించి, పనికిమాలినవాదములతో పవిత్రమగు కాలమును దుర్వినియోగము చేసితిమి. ఈ నాటికి యోగమూర్తుల సత్యప్రబోధమును విని మన యహంకార మమకార స్వార్థపరత్వము లనెడి పిశాచములను పారద్రోలితిమి. సత్యమగు పరమాత్మ దర్శనమునకై పాటుపడుద" మని యెవరికివారు కృతనిశ్చయులైరి.

సదా సద్గురుని భజించెడి ప్రియశిష్యుడు లక్ష్మయ్య గురుసేవకు జీవితమునే యంకిత మొనరింపబూనిరి. గోమాతల నఖండ ప్రేమతో నల్లమల యడవులకు దోలుకొనిపోయి కడుపార మేపెడి కష్టజీవి. గోవులను పంచప్రాణములతో సమానముగా చూచెడి సాధుమూర్తి.

## గోవుల దుస్థితి

ఒకరోజున గోవులన్నియు గుండికానది దాటి సమీపములో నాకు దోటవలె కళకళలాడెడి యాముదపుతోటలో ప్రవేశించి కడుపార మేసినవి. వెంటనే గోవులన్నియు తిక్కెత్తి యుంగిడితో బాధనొందుచు నోట నురుగులు గ్రక్కుచు క్రిందబడి పొరలాడుచుండెను. అందులో కోడెదూడ తల్లులు రెండు మరణించినవి. జ్యోతిరూపముతోనున్న యాత్మ వేరైపోయిన వెంటనే కన్నప్రేమంతయు గంగలో కలసినది.

జన్మాంతరములనుండి వెంబడించి చనుదెంచిన ప్రేమపాశముచేత నా గోమాతలు తన బిడ్డలనుజూచి కన్నీరుగార్చుచు వీడిపోలేక విధివశమున ప్రాణములను గోల్పోయినవి.

ఇట్టి విపత్కర పరిస్థితిని కన్నులార దర్శించుచున్న లక్ష్మయ్య గజగజలాడుచు, "ఆహా! నే నుండగనే నా గురుదేవుని గోమాతల కెట్టి యాపద సంభవించినది. నేను నా సద్గురునితో నేమని దెలుపుదునో



గోవుల దుస్థితి

పరమేశ్వరా! ఇంతటి విపద్దశను కన్నులార గాంచవలసిన కర్మపట్టెనే! గురుసాన్నిధ్యములో తోడుగా మెలగితిని. ఈనాడు నా గోమాత లన్నియు ప్రాణములను కోల్పోయినవి. ఒక్క విఘుడియలో నిన్ని ప్రాణ ములు లేచి యే మార్గములకు పయనించినవో? నే నొంటరి బ్రతుకు

నెట్లు గడిపెదరా గోపాలబాలా! నా జీవిత మెందులకు కాల్పనా?" యను నావేదనతో దుఃఖమును మ్రింగుకొనలేక త్యాగహృదయముతో తన తలను రాళ్ళకు మోదుకొనుచున్నంత స్మృహతప్పి పడిపోయి మాటలు లేకయుండెను.

బాటసారు లెవ్వరో లక్ష్మయ్యగారి స్థితినిజూచి పరుగులతో కొండ యొద్దకుబోయి జరిగిన యుదంతమును శ్రీ యోగానందస్వామికి విన్నవించిరి. శిష్యులను కన్నబిడ్డలవలె జూచెడి సచ్చిదానందమూర్తి లోలోన "ఆహా! ఏమి యీ దైవసంఘటన! నా శిష్యుడెట్టి యిక్కట్ల పాలయ్యెను. ఎంతపని చేసితివి లక్ష్మీనరసింహా! నిన్నే నమ్ముకొని నా గోవులనిమిత్తమై ప్రాణమును తృణప్రాయముగా నెంచిన నా ప్రియ శిష్యుని ప్రాణములను హరించెదవా? ఆర్తత్రాణ పరాయణా! భక్త రక్షకుడను బిరుదెటుపోయెనోయి! శంఖచక్రగదా శార్ఙ్గముల నాల్గు చేతులలో నెందుకు ధరించితివి? అందమునకా? ఆనందమునకా? లక్ష్మయ్య పితరులు నన్నే నమ్ముకొని కన్నకొమరుని నాకొప్పగించి వెళ్ళిరి. వారి కేమని దెల్పుదునురా! వీరలక్ష్మీనృసింహా!" యని ప్రార్థించిరి.

కొందరు భక్తులేగి స్మృహతప్పి పడిపోయిన లక్ష్మయ్యను, మరణించిన గోమాతలను నాశ్రమమునకు చేర్చిరి. రాత్రి పదిగంటలవరకు నెన్నెన్నో శైత్యోపచారములు సల్పిరి. ప్రయోజనము లేకపోయెను. మాతృదేవియగు శాయమ్మగా రెన్నో విధములగు వైద్యములుచేసిరి. లాభము లేకపోయెను. సద్గురునాజ్ఞతో శాయమ్మగారు మార్కాపురము వెళ్ళి సద్గురుదేవుని శిష్యుడగు డాక్టరు చెన్నయ్యకు జెప్పెను. వారు మందు యిచ్చి మ్రింగించుడని చెప్పిరి. ఆ మందు తీసికొని యాశ్రమమునకువచ్చి లక్ష్మయ్యచే మ్రింగింప నెంతో ప్రయత్నము చేసిరి. ప్రయోజనము లేకపోయెను. లక్ష్మయ్య మందు మ్రింగలేని ప్రమాదస్థితిలో నున్నాడు. నోట మాట లేదు. కన్నెత్తియైనను

చూచుటలేదు. మనలోక స్మృతిలేదు! ఈ విషమసంఘటనకు గుఱియైన లక్ష్మయ్యను, సద్గురుమూర్తి దగ్గరకు చేర్చుకొని "ఓ వీర నృసింహావతారా! ధర్మరక్షణ సాధురక్షణకై నీ చక్రమును ప్రయోగించి మృత్యుదేవతను పొలిమేరలుదాట తరిమివేయు" మని నృసింహస్వామిని స్తోత్రము చేసిరి.

శ్రీ యోగానందమూర్తి ప్రార్థన విని, శ్రీ వీరనృసింహదేవుడు చక్రమును పంపిరి. లక్ష్మయ్య గుండెలపై ప్రళయనాట్యము చేసెడి మృత్యుదేవతను తరిమివేసి, లక్ష్మయ్య ప్రాణములను అది కాపాడినది. తెల్లవారుజాము నాలుగు గంటలకు బాహ్యస్మృతినొంది, యెద్దనున్న శ్రీ సద్గురు పాదపద్మముల కన్నుల కద్దుకొని, 'స్వామీ! ఏమి జరిగిన' దనిరి. స్వామివారు జరిగిన వృత్తాంతమంతయు చెప్పి "నాయనా! లక్ష్మణా! నీ గురుభక్తి ప్రసంశనీయమైనది. నీ త్యాగ మాశ్చర్యమొందించినది. నీవు త్యాగివి కనుకనే, యీ లక్ష్మీనృసింహమూర్తి చల్లగా కాపాడి" రని చెప్పగా లక్ష్మయ్య విస్మయము నొంది సద్గురుదేవుల నమితముగా శ్లాఘించిరి.

### శ్రీ లక్ష్మయ్య ఆవులతో నల్లమలకు వెళ్ళుట

ఒకరోజున శ్రీ యోగానందమహర్షి లక్ష్మయ్యతో "నాయనా! మన గోమాతలను నల్లమల యడవులకు, చెంచువారి కప్పగించి వెంటనే తిరిగి మన కపిలగిరికి చేరు" మని చెప్పిరి. లక్ష్మయ్య తక్షణమే ప్రయాణమై గురుదేవుల పాదములను కన్నుల కద్దుకొని, నడువసాగిరి. లక్ష్మయ్య వెనువెంట శ్రీ యోగానందమహర్షి వెళ్ళుచు కుండికానదిని దాటించి జాగ్రత్త యని చెప్పి వెనుకకు మరలి కుండిక నదీజలములో పాదప్రక్షాళనము చేయుచున్నతఱి, యోగమూర్తి శరీరమున వామభాగము కంపించినది. శరీరతత్వము మారినదని గుర్తించి యాశ్రమము చేరి భక్తురాలగు శాయమ్మతో "అమ్మా! నా యెడమపార్శ్వ మగస్మాత్తుగ కంపించినది. నా దేహస్థితి మారిన ట్లున్న" దనిరి.

శేషయమ్మ శ్రీ సద్గురుదేవులను సుఖాసీనులచేసి యొకభక్తుని, మార్కాపురమునకు బంపించి గురుభక్తి పరాయణుడగు రామారావును పిలిపించెను. అత్యాదర గౌరవములతో రామారావు పరుగులు దీయుచు నాశ్రమమునకు వచ్చి యోగమూర్తిని దర్శించిరి. సహజసిద్ధముగా సంప్రాప్తమైన మహత్తర యోగశక్తిచే ప్రాణవాయువును కుంభించి స్వప్రకాశముతో వెలుంగుచుండిరి.

శ్రీ యోగానందమూర్తి స్వయముగా దివ్యానుభూతి నందియుండెనుగదా! ధ్యానసిద్ధులగు మహాయోగుల వినిర్మలాంతఃకరణమున, వేదవేదాంత రహస్యములును, భూతభవిష్యములు సైతము నప్రయత్నముగా వ్యక్తమగుచుండు ననుటకు, శ్రీ యోగానందుని దివ్యానుభూతులే తార్కాణములు. ధ్యానప్రభావము నేకదా ఋషులు స్వయముగా మంత్రద్రష్టలై ప్రకాశించుచున్నారు. శ్రీ యోగానందమూర్తి యాచరించిన యోగసాధన లనుపమానములు. వారు కామినీ కాంచనముల రెంటిని జయించిన ధీశాలురు. శ్రీ లక్ష్మీనృసింహమూర్తి తన యభీష్టదైవతమైయున్నను, భగవానుని నానా రూపముల యెడ సమభావమూని యన్ని రూపములయందును శ్రీ నృసింహ పరబ్రహ్మమునే దర్శించు చుండెదరు. ప్రాపంచికవిద్యలు రాకపోయినను, నృసింహ చూర్ణికలు, మహామంత్రములు, శ్రీ నృసింహస్వామి పూజావిధి, భూతభేతాళ బ్రహ్మరాక్షసాది మహాపిశాచములను పాడలెత్తించెడి మంత్రరాజము లెన్నో నృసింహాలయమున నుచ్చారణ చేసెడితటి, వేదములను వల్లించెడి బ్రాహ్మణులు సైతము గుండెలపై చేయి నిడికొని నివ్వెరపాటుతో వినుచుండెదరు. స్వామివా రెంతటి ప్రతిభావంతులో యోచింపుడు. సామాన్య బ్రాహ్మణులందరు నాలయమూర్తుల యెదుట వల్లించెడి, మంత్రపుష్పములోని యంతర్భావములను శ్రీ స్వామివారు తన హృదయకమలమున పరిశోధించి, యాత్మతత్త్వమును గుర్తించిన కారణమున 'మంత్రార్థ రహస్య మిదిరా

నాయనా!' యని చెప్పగా వినెడి పౌరాణికులందరు సంభ్రమాశ్చర్యములను పొందుచుండెదరు.

శ్రీ స్వామివారు సదా యాచరణ వేదాంత మూలసూత్రములనే ప్రబోధము చేసెదరు. లౌకికపురాణ ప్రసక్తి వారి హృదయమున నణుమాత్రమైనను లేదు. మచ్చునకైనను లభింపదు. అట్టి పరమపవిత్ర మూర్తియగు శ్రీ యోగానందమూర్తిని, రామారావు దర్శించి ప్రాణ వాయు ప్రసారమునకు తగినరీతి సూక్ష్మబుద్ధితో శుశ్రూష యొనర్చి సేదదీర్చిరి.

శ్రీ సద్గురుదేవుని యోగశక్తి వర్ణనాతీతమైనది. మృత్యువును తృణమువలె భావించెడి ధీరమూర్తి. సర్వాతీతమైన భగవచ్ఛక్తిని, తుచ్ఛమగు హేయమును నగు నీ పనికిమాలిన పాడుదేహమునకై వెచ్చించుటకు మనస్పూర్వక సర్వశక్తియుతుడగు శ్రీహరిని ప్రార్థించ లేదు.

జరామరణములు లేని నిత్యానందపదవికై దేహయాత్ర సల్పిన యమరమూర్తులు శ్రీ గురుదేవులు. స్వామివారు సన్నిధానమున శాయమ్మతో "అమ్మా! నా శిష్యుడగు లక్ష్మయ్యను పిలిపించు" డని శాయమ్మ యొకభక్తుని లక్ష్మయ్యయొద్దకు బంపెను. ఆ భక్త మూర్తి వాయువేగముతో నల్లమల యడవులలోనున్న లక్ష్మయ్య యొద్దకు జని గురుమహారాజస్థితి నంతయు విన్నవించెను.

శ్రీ లక్ష్మయ్య యమితావేదనతో గాఢబద్ధానురాగియై గోవులను చెంచుల కొప్పగించి యన్నపానములను ముట్టక యమావాస్య నాటి యర్ధరాత్రియందే పయనమై తొందరపాటుతో మనస్సును సద్గురుదేవునిపై నిల్పి నడచుచున్నంత, గాఢాంధకారమై త్రోవకాన రాక యుండెను. త్రోవ కానరాలేదను మనస్సే లేదు. లక్ష్మయ్య 'నా సద్గురుదేవు లెట్లుండిరో, నాగురుదేవునితో సంభాషింతునో లేదో, నా గురుస్వామి సత్యదృష్టి నాపై ప్రసరించునా'! యను, తీవ్రపరితాప ముతో ప్రయాణమును త్వరితగతి సాగింపదొడగెను. అప్పుడప్పుడు

"ఓ తల్లీ! శాయమ్మా! లక్ష్మయ్య నిమిత్తము మీ రెట్టి ప్రయత్నము చేయనవసరము లేదు. నా శిష్యు డీ దినముననే వచ్చు"నని చెప్పిరి.

మూడురోజులకు ముందే లక్ష్మయ్యకు స్వప్నములో గురుదేవుని స్థితియంతయు సాక్షాత్కరించెను. వెంటనే ప్రయాణమై గురుదేవుల సన్నిధికి చేరి లక్ష్మయ్య నమస్సు లర్పించిరి.

భక్తులందరు లక్ష్మయ్యరాక కచ్చెరువొంది "ఆహా! గురుదేవులు త్రికాలవేదులు. వా రాదేశించినరీతి లక్ష్మయ్య మనకు ప్రత్యక్షమైరి. గురుశక్తి గుర్తించితిమి. ఆహా! సాక్షాన్నృసింహమూర్తియే" యని యొకరి మొగ మొకరు చూచుకొనుచు శ్రీ స్వామివైపునకు మరలి "ఓ స్వామీ! మా యజ్ఞాన పిశాచమును పారద్రోలి మమ్ము కృతార్థులచేయు"మని ప్రార్థనలు సల్పి, "ఓ దేవా! మీకు అతిసమీపములో నివసించుచు మీ దివ్యశక్తిని తెలియని మందమతులమైతిమి. తమశక్తి తెలియక మీపై భక్తికుదురక యజ్ఞానములో నేమేమొ వదరితిమి. కమలములక్రింది కప్పలవలె మీ హృదయకమలములోని మకరందము చవిచూడలేదు. సద్గురుప్రభూ!" యని దుఃఖింపసాగిరి.

శ్రీ యోగానందమూర్తి కరుణాంతరంగులై వారి మూఢభక్తికి సంతసించి జాలిగలిగి "నాయనాలారా! తెలియనిస్థితిలో నేమేమొ మాటలాడితిరి. ఇప్పటికైనను సత్యమును గుర్తించి పశ్చాత్తాపమును పొందితిరి. మీ దోషములను మీరే గుర్తించిరి. తన తప్పు తాను గుర్తించి పద్ధతిని మార్చుకొని సక్రమమార్గమున సంచరించుటే మానవ లక్షణము. మీ దోషములను భగవానుడగు నృసింహమూర్తి సహించి మిమ్ము తప్పక రక్షించును. ఏమరపాటుననైనను సాధుమూర్తులను తిరస్కార భావములతో దర్శింపకుడు. దర్శించితిరా సమూలముగా నశించెదరు. సదా జ్ఞప్తినుంచుకొని జాగరూకతతో మెలగుడు. సాధు దూషణము భగవంతుడు సహింపడు. క్షమింపడు. జాగ్రత్త జాగ్రత్త!" యని ప్రబోధము చేసిరి.

కొన్ని రోజులు గడచిపోయినవి. శ్రీ యోగానందస్వామివారికి శరీరస్థితి బాగుగాలేని కారణమున, పాదసేవకురాలైన భక్తురాలు శాయమ్మ గురుదేవులను దీసికొని శ్రీ నారాయణస్వామి జన్మస్థానమగు అబ్బూరు వెళ్ళవలయునను నాలోచనతో నుండెను.

## బాలకవి సింగం వీరారెడ్డి సద్గురుని దర్శించుట

శ్రీ స్వామియెడ మూఢభక్తిగలిగి సద్గురునామస్మరణయే మనస్సున నమ్ముకొన్న బాలుడు, ఎర్రగొండపాలెము గ్రామనివాసి సింగం వీరారెడ్డి సద్గురుదేవుని జీవిత విషయములను మాత్రమే సంగ్రహముగా పాటలరూపములో రచనగావించి శ్రీ స్వామి కర్పించవలయునను సత్సంకల్పముతో జన్మభూమి వీడి శ్రీ యోగానందమహర్షి నివాసస్థలమగు, కపిలగిరికి వచ్చి స్వామికి జోహారు లర్పించి సాగిలబడి ప్రార్థించెను.

గురుదేవులు "నాయనా! బాలకవీ వీరారెడ్డీ! నా చరిత్ర రచన గావించితివా సంతోషమే! నా శిష్యులలో కవులు, గాయకులు, పండితులు, విద్వాంసులు, జ్ఞానులు, విజ్ఞానులు, వేదాంతులు, తర్కశాస్త్రనిపుణులు, తత్త్వశాస్త్రపరిశోధకులు, హరిదాసులు మొదలగువారెందరో కలరు. కాలక్రమమున నా శిష్యులలోనే నా జీవితము నెల్లరకు తేటతెల్లమగునట్లు విపులీకరించి రచించెదరు. నా జీవితమును హరికథగా మార్చి గానము చేసెదరు. ముందు ముందు ఈ స్థానము మహోత్తమస్థాయిని పొంది మహాక్షేత్రమై దివ్యతిరుపతియై ప్రకాశించును. నన్నుగురించి వాడవాడ వేనోళ్ళ చాటుచుందురు. నాయనా! దైవశక్తి యనంతము. ఏ స్థలమున కే భోగమో! ఏ వ్యక్తి యెట్లు మారునో నిజయోగులకే యెరుక"యని చెప్పిరి.

మాతృమూర్తియగు శాయమ్మదేవి "నాయనా! సింగం వీరారెడ్డి! మన మిర్వురము గురుదేవుని తీసికొని ప్రేమపాత్రుడగు నారాయణస్వామి యొద్దకు చేరుద"మని చెప్పగా 'చిత్త' మని వీరారెడ్డి

ప్రయాణమయ్యెను. శాయమ్మ, వీరారెడ్డి యిర్వురు గురుసార్వభౌముని తీసికొని అబ్బూరు గ్రామమునకు వెళ్ళిరి.

ప్రియశిష్యులగు శ్రీ నారాయణస్వామి శ్రీ సద్గురు దేవుల దర్శించి "ఆహా! నా గురుదేవుని దేహస్థితి మారినది. నిర్వికారమై స్వయం ప్రకాశముతో నాత్మ తేజరిల్లుచున్నది. అచంచల బ్రహ్మచర్యదీక్షతో కఠిననియమములతో, కఠినోపవాసములతో, కాలకూట విషమును సైతము కబళించిన పరమశివ స్వరూపులు గురుదేవులు. ఇట్టి మహనీయమూర్తి బాహ్యరూపమును బహుకాలము సందర్శింపబోము. పరతత్త్వములో కలసి కోటిసూర్యుల కాంతితో ప్రకాశించెడి గడువు సమీపించుచున్న"దని గుర్తించిరి.

"ఓ ఆత్మానందస్వరూపా! అచంచలయోగనిష్ఠాగరిష్ఠా! అపార కృపాసాగరా! వీరనృసింహకళావతారా! నమోనమః" యని వారు గాఢాలింగనము చేసికొనిరి.

ప్రియశిష్యునియొద్ద పదునైదురోజులు నివసించి ఆత్మప్రబోధము చేసిరి. ప్రియశిష్యుని నారాయణుని దగ్గరకు చేర్చుకొని "శిష్యుడ వన్న నీవే! శ్రీ రామకృష్ణపరమహంసను, వివేకానందస్వామి తన ప్రతిభాశక్తితో నెన్నో విధముల పరీక్షించి పరీక్షించి, గురుదేవుని యాత్మశక్తి కచ్చెరువొంది, శిష్యుడై సకలవిధ శుశ్రూష లొనర్చి తన జీవితమును ధన్యమొనర్చుకొని లోకమున శాంతి, సుస్థిరత, ద్వైపములయెడ, నాచార్యులయెడ నెట్లు మెలగవలయునో తనస్వానుభవముచే లోకమున వెల్లడిచేసి గురుదేవు యాత్మశక్తి లోకమునకు చాటిరి. అదేవిధముగా నీవు నన్ను పరిశోధించి పలువిధములగు ప్రశ్నలతో నీ సంశయములను రూపుమాపి, సద్గురువే సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపమని గుర్తించిన ధీశాలివి. సూక్ష్మబుద్ధిగలిగి ప్రవర్తించెదవు. గురుకీలకమును గుర్తించితివి. ఒరుల కణుమాత్రమేని బాధకలిగింపక వర్తించెదవు. నిర్మలచిత్తముతో భగవాను నుపాసించెదవు. నావలె

నీవును త్యాగమూర్తివి. నేను గంతులిడిన నీవు గంతులిడెదవు. నేను విషము త్రాగిన నీవును విషము త్రాగెదవు. ప్రతి విషయములో నన్నే యనుసరించెదవు. నీ హృదయకుహరమున చేరి త్రికాలవిషయములను గుర్తింపచేయుదును. నీ చేత సర్వకార్యములు చేయించెదను. నాస్వస్థానమును, నీ వాస్థానముగా నేర్పరుచుకొని యాత్మప్రబోధము లొనర్పవలయును. నీవు నిమిత్తమాత్రముగా కర్తవ్యమును కొనసాగింపుము. సర్వసాక్షి యగు నా నృసింహ ప్రళయశక్తి నీ కండదండగా నుండి తోడునీడయై పరమోత్సాహము గలిగించును. నన్ను నీ హృదయమున చేర్చుకొనుము. కొండలనైనను పిండిచేసెడి శక్తిని నీలో ప్రవేశపెట్టెదను. ఆ యనంతశక్తి సహాయముతో నీ వనుకున్న భగవత్కార్యము లన్నియు సమకూరును. ఎట్టి సందేహము లే"దని చెప్పిరి.

గురుసందేశము వినిన నారాయణస్వామి పరమానందముతో సద్గురు పాదపద్మములను ముమ్మారు కన్నులకద్దుకొనిరి.

శ్రీ యోగానందమహర్షి నారాయణస్వామికి వీడ్కోలుచెప్పి, శాయమ్మను, సింగం వీరారెడ్డిని తీసికొని అబ్బూరువీడి మార్కాపుర సమీపగిరికి విచ్చేసిరి. వీరారెడ్డి సద్గురుసెలవుతో స్వగ్రామము చేరిరి.

## శ్రీ యోగానంద మఠమునకు శ్రీ స్వామివారరుదెంచుట

పదిరోజులు గడచినవి. అనంతకరుణాప్రపూర్ణులు శ్రీ యోగానంద నరసింహస్వామివారు, శాయమ్మతో "అమ్మా! యీ క్షణమే వీను కొండకు వెళ్ళవలయును. నా భక్తురాలు శ్రీ మహాలక్ష్మీదేవిని, నా ప్రియమైన బిడ్డడు సచ్చిదానంద వేంకటేశ్వరమూర్తిని చూడవలయు ననినామనస్సు తహతహ లాడుచున్నది" అని చెప్పిరి. శాయమ్మ గారు ప్రయాణమునకు ఏర్పాట్లు చేసెను.

శ్రీ యోగానంద మఠమున జయంతోత్సవము జరుప నిశ్చయించి భక్తులకు శ్రీ మహాలక్ష్మీదేవి శుభలేఖలను పంపిరి. సహృదయులందరు శ్రీ యోగానంద మఠమునకు వచ్చిరి. గురుభక్తి తత్పరుడు శ్రీ మహా

లక్ష్మీదేవి మేనల్లుడగు శ్రీ కోటసుబ్బారావుగుప్త జయంతిమహోత్సవమునకు వచ్చిరి. 1960 సంవత్సరము డిశంబరు ఆరవ తేదీన శ్రీ గీతా జయంత్యుత్సవములలో సుబ్బారావు పాల్గొనిరి. శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరస్వామీజీ గీతాసందేశమును ప్రబోధము చేయ మొదలిడిరి. సాయంత్ర మూరుగంటల సమయమున శ్రీ స్వామీజీ రెండుగంటలు గీతాప్రబోధముచేసి భక్తుల నానందాబ్ధిలో ముంచి తేల్చిరి. గుంటూరు నుండి శ్రీ కొత్తూరి రామయ్యశ్రేష్ఠి మొదలగు భక్తులెందరో విచ్చేసి గీతాసుధను గ్రోలి తృప్తులైరి. భక్తులందరు పారవశ్యమున హరినామ సంకీర్తనము చేయసాగిరి. అదే సమయమున శ్రీ యోగానంద నరసింహ యోగీశ్వరమూర్తులు శాయమ్మగారితో నాశ్రమమునకు వచ్చిరి. భజన చేసెడి భక్తబృందంలో, శ్రీ కోట సుబ్బారావు శ్రీ సద్గురు దేవుల దర్శించి తనప్రక్క నాసీనులైయున్న శ్రీ చేవూరి కోటయ్యతో "ఓ బావా! మనసద్గురుమూర్తి మఠమునకు వచ్చిరి. లే తీసికొనివత్తు" మనిరి. ఉదారమూర్తి యగు కోటయ్య దిగ్గున లేచి సద్గురు పాదపద్మములపై వ్రాలిరి. ప్రియశిష్యులగు సుబ్బారావు, కోటయ్య సద్గురుదేవుని బాహువులను భుజములపై నిడుకొని మఠము లోపలి భాగమునకు తీసికొనివచ్చి పట్టెపాన్పుపై సుఖాసీనుని గావించి పాదాభి వందనము లొనర్చిరి.

భక్తులందరు భజన చేయుచుండిరి. సుబ్బారావు వారి మధ్య చేరి "ఓ భక్తశ్రేష్ఠులారా! నరసింహనామభజన చేయుదము. భక్తితో చెప్పు"డని యీ విధముగా చెప్పిరి. "శ్రీ నారసింహా – జయనారసింహా, జయనారసింహా – లక్ష్మీనారసింహా!" యని చెప్పగా భక్తులెల్లరు నేక కంఠముతో గానము చేసిరి. వారు చేసెడి భజన శ్రీ యోగానందస్వామి విని "ఓ శాయమ్మా! నరసింహనామ భజన చేయించు వ్యక్తియెవ్వరమ్మా!" యని యడుగ– "ఓ స్వామీ! మన సుబ్బారావు నరసింహ నామము చెప్పగా, భక్తులు చేయుచున్నా" రనెను. స్వామి "ఓహో మన సుబ్బారావేనా! నామభజ నన నిట్టిదేనమ్మా! భక్తితో

రక్తితో మేనుమరచి నామము చేసినప్పుడే పరమాత్మ కరుణతో కాపాడును సందేహము లే"దనిరి.

సుబ్బారావు నృసింహభజన పూర్తిగావించి సద్గురుదేవుని పాదములపై వ్రాలి తలయెత్తకనే వెక్కి వెక్కి యేడ్చుచు కన్నీటితో పాదాభిషేక మొనరించిరి. పాదములపై వ్రాలి దుఃఖించెడి ప్రియశిష్యుని లేవనెత్తి "నాయనా! నీ దుఃఖమునకు కారణమే"మని యడిగిరి. "ఓ గురుదేవా! నాకు తెలియకనే దుఃఖము పొంగిపొరలినది. కారణ మేమో తెలియకున్నది స్వామీ!" యని సుబ్బారావనిరి. సద్గురుదేవులు మౌనము వహించిరి. గురుదేవుల శరీరస్థితి పూర్తిగా మారిపోయిన కారణముచే, నే ఫలములు తినుట కిష్టపడక కఠినోపవాసములు చేయు చుండిరి. సద్గురుదేవుని మనస్థితిని గుర్తించిన కూర్మిశిష్యుడు సుబ్బారావు బజారునకు వెళ్ళి కొట్టుకొట్టు తిరిగి మేలురకమగు 'ఆల్‌బకరా' పండ్లను గొనివచ్చి శ్రీ సద్గురుదేవుల కర్పించిరి. ఆ మహనీయమూర్తి యొుక ఆల్‌బకరా పండును నోటిలో వేసికొని చప్పరించి, "ఆహా! మా సుబ్బారావు తెచ్చిన పండ్లు నా నోటి కెంతోరుచి" యని పదేపదే చప్పరించి యెంతయో మెచ్చుకొనిరి.

సద్గురుదేవుల పొగడ్తలు విన్న సుబ్బారావు, "స్వామీ మీకు మాపైగల యవ్యాజ కరుణాకటాక్ష వీక్షణముచే నట్లుపొగడుచుండిరి. మీకు మే మొసంగెడి వారమా! మీ దయాప్రసారము చేతనే మే మెల్లరము సుఖముగా జీవించుచుంటిమి. మీ దయ వర్ణింప నలవి కానిది. ఆగ్రహమునగాని యనుగ్రహమునగాని మీకు మీరేసాటి. మీకు తగిన యుపమానము నా మనస్సునకు స్ఫురింపలే"దని విన్నవించిరి. సద్గురుమూర్తి యెంతయో సంతసమందిరి.

శ్రీ యోగానందమూర్తి ప్రియశిష్యుడు నరసరావుపేట తాలూకా కూకట్లపల్లె గ్రామనివాసులు అన్నమునేని వీరయ్య యను భక్తుడు జయంతి మహోత్సవమునకై శ్రీ యోగానంద మఠమునకు వచ్చిరి. శ్రీ యోగా

నంద సద్గురుదేవులు శరీరస్థితి బాగులేక మఠమునందే పదునైదు రోజులు నివసించిరి. శ్రీ అన్నమునేని వీరయ్య సంసారవ్యాసంగమునకు మంగళహారతినిచ్చి సద్గురుసేవ లొనర్చిరి. శ్రీ యోగమూర్తి శాయమ్మతో "అమ్మా! మనము వెంటనే మనయాశ్రమమునకు వెళ్ళవలయు"నని యాజ్ఞాపింప, శాయమ్మ, వీరయ్య తక్షణమే ప్రయాణమై గురుదేవునితో కపిలగిరికి చేరిరి.

ఈ గ్రంథకర్త సుబ్బారావు శ్రీ యోగానంద మఠమును వీడి, గుంటూరువెళ్ళి శ్రీరామనామక్షేత్రమున, 1960 డిశంబరు తొమ్మిదవ తేదీన భక్తిప్రచారక శ్రీ ఆత్మకూరి గురుబ్రహ్మగుప్త భాగవతారు భక్తితో గానము చేసెడి భక్తతులసీదాస్ కథను ప్రశాంతముగా విని కథానంతరము శ్రీగురుబ్రహ్మముగారి పాదములపై వ్రాలి నమస్సులర్పించి "తండ్రీ! కథాధ్యయనమునకై తమవెంట నుండెద" నని కోరిరి. భక్త మూర్తి, సహృదయులగు శ్రీ గురుబ్రహ్మముగుప్తగారు, "రా నాయనా! యెట్టి అభ్యంతరము లే" దనిరి. శిష్యుడగు సుబ్బారావు పరమానందముతో గురువులవెంట పయనమైరి.

1960 డిశంబరు పదవతేదీన శ్రీ గురుబ్రహ్మముగారు ప్రియ శిష్యుని సుబ్బారావును తీసికొని శ్రీ మహాభారత కథాగానమునకై అమరావతి వెళ్ళి యాలయమున ప్రవేశమై యమరలింగేశ్వరునకు నమస్సు లర్పించి యాలయము వీడి, పురప్రముఖులగు వైశ్యరత్నములతో కలిసికొని యన్ని విషయములు మాట్లాడి యా నాటిరాత్రికే శ్రీ మహాభారత కథాగానమును ప్రారంభము చేయుటకు సంకల్పించుకొనిరి.

## శ్రీ గురుబ్రహ్మగుప్త భాగవతారు అమరావతిలో హరికథ గానము చేయుట

రాత్రి 10 గంటలకు శ్రీ మహాభారతకథను ప్రారంభము చేయ మొదలిడిరి. ప్రార్థనలు ముగించి మట్టపల్లి శ్రీ లక్ష్మీనృసింహస్వామిని

మధురగాన మొనర్చి కథ ప్రారంభము చేసిరి. కథాగానమును వినుటకు వేలకొలది ప్రజలు వేంచేయుచు కథను దిగ్విజయముగా కొనసాగింప సాగిరి.

శ్రీ గురుబ్రహ్మముగుప్తగారు గానముచేయు సమయమున ప్రియ శిష్యుడగు సుబ్బారావు శ్రుతిని మేళవించుచు పరవశత్వముతో కథను వినుచు పరమానందముతో, దినమొక క్షణముగా గడుపసాగిరి.

(శ్రీ) గురుబ్రహ్మగుప్తగారి భారతకథాగానమునకు మృదంగం ఒంగోలు తాలూకా బ్రాహ్మణనిడమానూరు వాస్తవ్యులు శ్రీ మొగిలిచర్ల రామయ్యగారు, ఫిడేల్ పల్నాడు తాలూకా భట్టువారిపల్లె వాస్తవ్యులు శ్రీ కూరపాటి యల్లమందరాజుగారు, కథాగానమునకు చేదోడుగా రాళ్ళనైన కరగించెడురీతి వాయింపదొడగిరి. డిశంబరు పండ్రెండవ తేదీన, శ్రీ అమరలింగేశ్వరస్వామివారి యాలయార్చకులు హరికథాసంఘమున కాతిథ్యమొసంగి భక్తితో గౌరవించి యమితాదరణ చూపిరి. ఆ నాటి సాయంత్రము హరికథాసంఘమువారిని తోడ్కొని ఆలయఅర్చకులు ఆలయమున ప్రవేశించి నల్వురిపేర్లతో శ్రీ అమరలింగేశ్వరస్వామివారి కభిషేకమొనర్చి తీర్థప్రసాదము లొసగి పట్టరాని సంతోషముతో, శ్రీ గురుబ్రహ్మగుప్త భాగవతారుగారిని గాఢాలింగనము చేసికొని "నాయనా! నేను తమ కథాగానమును విని యుప్పొంగి పోవుచున్నాను. నా యానందమునకు మేర లేదు! తమ కథాగానమున అచ్చటచ్చట ప్రబోధమొనర్చెడి మహనీయులగు శ్రీ రామతీర్థస్వామి, శ్రీ కేశవతీర్థస్వామివారి దివ్యోపదేశములు నా హృదయక్షేత్రమున స్థిరముగా నాటుకున్నవి. తమ కథలలో పట్టు, కీర్తనలమట్టు, మానవులగుట్టు, యరటిపండొలిచినరీతి చెప్పుచు పండిత పామర ప్రజానీకము నానందాబ్ధిలో నోలలాడించిరి. గురువునకు సత్కీర్తి ఘటించెడి శిష్యు డొకడే చాలు, మీ వంటి జ్ఞానమూర్తులు. ఇది కలికాల ప్రభావమేమొ! బంగారు కడియములు ధరించి, మెడ నిండను సువర్ణపు యంత్రములు వేసికొని, బల్లలెక్కి మానవత్వము నే

మంటగలిపి, హరికథ యను పదమునకు వ్యతిరేకముగా పిచ్చి పిచ్చి పాటలు, ఒయ్యారపు నటనతో గంగిరెద్దులవలె గంతులువేయుచు, పామరులను కవ్వించి నవ్వించి, వందలకొలది రూప్యములను గ్రహించు చున్నారు ! హరిదాసులలో కొందరికి మాత్రము తల్లిదండ్రు లిర్వురు నుండరు. అనగా 'శ్రుతి మాతా, పితా లయః' యన్నటుల 'శ్రుతి' గాని, 'లయ' గాని, వారిలో మచ్చునకైన దొరకవు. ఏవి లోపించి నను ధనము మాత్రము లోపింపదు.

విజ్ఞుల యభిప్రాయములతో వారి కేమిపని ! సామాన్యులు మెచ్చుకొనుటే మన జీవితగమ్య మని వారిలో వారు పొంగిపోయెదరు. ప్రకృతిలోనున్న మాయాశక్తి మంచిని తెలిసికొననివ్వదు. ఏనాటి కైనను నిజమైన విద్యకు గౌరవము లభింపగలదు. హరికథ యనగా నంతరార్థమేదో గుర్తింపలేకున్నారు. ప్రాపంచిక బంధాలతో రాత్రిం బవళ్ళు సతమతమగు మానవాళికి విజ్ఞానబీజములను హృదయములందు నాటి, వారి జీవితాశయములను గుర్తింపచేసి సంసారబంధ విముక్తిని కలిగించెడి మహాభక్తుల జీవితపవిత్రగాథలే యీనాడు మన కందరకు వెలుగుబాటల చూపించి సత్యపథగాముల చేయును.

భక్తికథలలో ప్రేమనంతయు నొలకబోయుచు, సినిమా నటన లన్నిటి ప్రదర్శించుచు, కథాశయములను మంటగలిపి ముక్తి యను మాటయే స్మరణకు దెచ్చుకొనక, భుక్తికై శక్తినంతయు దుర్వినియో గముచేసి పరమార్థమును పూర్తిగా వీడి యర్థమే మన జన్మకు సార్థక మని, వ్యర్థప్రలాపములతో విలాపములతో కథలను పూర్తిగావించెడి కథకులను, కథకురాండ్రను ఆత్మవంచకులు, లోకవంచకు లని యనక తప్పదు.

ఇట్టి దుర్నీతిపరులను సర్వసాక్షి యగు సర్వేశ్వరు డెప్పుడో యొకప్పుడు మట్టుపెట్టి మట్టిపాల్సేయక వదలడు. ముందుగనే జాగ్రత వహించి మంచినడకతో కథాగానములు చేసి హరిదాసను పదమును

సార్థకముచేసి విజ్ఞానుల మనస్సులను రంజింపచేసినచో నైహికా ముష్మికములను పొందవచ్చు''నని,యాలయార్చకులు శ్రీ గురుబ్రహ్మము గారితో మనవిచేసిరి. ఆ యుదారమూర్తులు "ఆహా! మంచిని గుర్తించెడి మహానీయులు నూటికొక్కరైనను నున్నారు. మాకదే పదివే"లని సంతోషమును పొంది, "ఓ అర్చకస్వామీ! మా యధ్యాపకులగు శ్రీ రాజశేఖరుని లక్ష్మీపతిరావు భాగవతారుగారు. ఓ నాయనలారా! వేయిమంది పామరులను సంతోషింప చేయుటకంటె నొక జ్ఞాని హృదయము నానందింపచేయుటే హరిదాసుల ముఖ్యకర్తవ్య' మని, సదా మాకు ప్రబోధము చేసెడివారు. వారు చెప్పిన సందేశమే మీావలన వ్యక్తమైన" దని చెప్పిరి. అర్చకస్వామి యమితానందమును పొందిరి.

## గ్రంథకర్త దివ్యస్వప్నమును గాంచుట

ఒక నాటిరాత్రి సుబ్బారావు ఒకస్వప్నమును పొంది దిగ్గున మేల్కొని హరికథాధ్యయనాపరులగు శ్రీ గురుబ్రహ్మముగారితో "స్వామీ! నేను విచిత్ర స్వప్నమును గాంచితిని. మీాతో చెప్పుటకు నోరాడుటలేదు. గుండె దడదడలాడుచున్నది. మనస్సెచ్చటికో పరువులు దీయుచున్నది. నా హృదయమంతయు నాందోళనతో నిండిపోయినది. నా జీవితమున నెన్నో స్వప్నములు గాంచితిని! ఐనను గతరాత్రి కల్గిన స్వప్నదృశ్యము మరుపురానిది. అదియేమనగా మా యారాధ్య దైవము మా సద్గురు ప్రభువగు శ్రీ యోగానంద నృసింహస్వామి పద్మాసనాసీనులై ప్రాణవాయువును సహస్రారమునకు చేర్చి కదలక మెదలక భూలోకము వీడి యాకాశములోనికి చొచ్చుకొని పోవుట! వారి చుట్టును చక్రాకారముగా నగ్నిశిఖలు వెలుంగసాగెను. నేనా దృశ్యమును కన్నులార్పక తదేకదృష్టితో దర్శించుచుంటిని. ఆ నృసింహ స్వరూపులు పోయిపోయి యంతర్లీనమైరి. ఇట్టికల నెన్నడు గాంచలేదు గురూజీ!' యని చెప్పిరి.

శ్రీ గురుబ్రహ్మముగారు "నాయనా! కలలు మనోభావముల ననుసరించి, దేహతత్వము లనుసరించి వచ్చును. కలలన్నీ పరమసత్యములుగా" వనిరి.

శ్రీ గురుబ్రహ్మముగారి వాక్యములువిన్న సుబ్బారావు, తనలో "నీ కల నా కనుమానముగానే యున్నది. నాగురుదేవుని వీడి వచ్చెడి సమయమున నాకు తెలియకనే, యమితదుఃఖమును పొందితిని. ఆదుఃఖమునకు తోడుగా నీస్వప్నమును గాంచితిని. నాగురుదేవుని నెన్నడు మరల దర్శించెదనో" యనుకొనుచు నృసింహనామమును స్మరింపసాగిరి.

## శ్రీ యోగానందమూర్తి అంతిమదశ

శ్రీ యోగానందమూర్తి ప్రియశిష్యుడు శ్రీ దోగిపర్తి సత్యనారాయణ, నృసింహస్వామి కొండపై భాగమునకు సునాయాసముగా భక్తులందరు వెళ్ళుటకై మెట్లునిర్మించ వలయునను సంకల్పముతో సద్గురుదేవుల నడుగగా, "నాయనా! గట్టి ప్రయత్న మొనర్చి నెరవేర్చినచో నాలో వెలింగెడి శ్రీ నృహరి సంతోషించు" నని చెప్పిరి. శ్రీ సత్యనారాయణ "ఓ స్వామీ! నేను మీ ఆశీర్వాదబలముతో నెరవేర్చెద" నని చెప్పి తీవ్రమైన కృషితో భక్తుల, శిష్యుల సహాయ సంపత్తితో కొలది రోజులకు కొండపై భాగమున కెంతో రమణీయముగా సులువుగా నెక్కుటకు వీలగునట్లు నూతనవిధానముతో మెట్లను కట్టించి, సద్గురుదేవులకు జోహారనిరి. శ్రీ సద్గురుసార్వభౌములు "నాయనా! నిశ్చలమైన మనస్సు నిజమైన భక్తితో సద్గురు వాక్యములను నమ్మి కృషి చేసినచో కొండలనైన పిండిచేయవచ్చును. సందేహము లే" దని చెప్పగా శ్రీ సత్యనారాయణగారెంతో యానందమును పొందిరి.

శ్రీ యోగానంద నృసింహమూర్తి యిట్లూహించిరి. "నేను ప్రాణప్రదముగా, నింతకాలము గోవులను రక్షణచేసితిని. నా తదుపరి యీ గోమాతలను రక్షించెడి వా రుండ" రని యెంచి వెంటనే గోవులన్నిటిని దైవార్పణమని ది 1958 ఫిబ్రవరి ఏడవతేదీన గోశాలకు

సమర్పించిరి. ప్రియశిష్యులెల్లరు "ఆహా! స్వామి త్యాగము వర్ణనాతీతము. అన్ని గోవులను ధర్మముగా నిచ్చివేసిరి. మనము నయాపైసాను త్యాగము చేయవలసినచో తికమకతో తిక్కెత్తినవారివలె తిరుగుచు నుండెదము. సంసారికి సాధుమూర్తికి వ్యత్యాసమిదే! పాలలో పుట్టినదైనను వెన్న పూర్వపరిచయమును పూర్తిగా గోల్పోయినరీతి, త్యాగమూర్తులగు మన యోగానంద సద్గురుదేవులు మానవాతీతులు. వారి యాదర్శజీవితమే మనకు వెలుగుబాట" యని లోలోన నాశ్చర్యము చెందసాగిరి.

## శ్రీ గద్దె నరసింహదాసు భాగవతసప్తాహము ప్రారంభించుట

1960 డిశంబరు పదుతొమ్మిదిన దినమున ప్రియశిష్యుడు శ్రీ గద్దె నరసింహదాసు నల్వురశిష్యులతో శ్రీ సద్గురుమూర్తి నివాసస్థానమగు కపిలగిరికి వేంచేసిరి.

శ్రీ సద్గురుదేవులు తపోనిష్ఠయందుండి లేచినరోజులలో సర్వము శ్రీహరి స్వరూపమే; వేఱొండు లేదను త్యాగముతో శ్రీహరి శక్తిని లోకమున చాటుటకై కొండలనుండి క్రిందికి దొరలిరి. విషద్రావకము లను మంచినీటివలె త్రాగిరి. అడవిజెంకులపాలు విరివిగా గ్రోలిరి. కొండ రాళ్ళను పిండిపిండిగా తలతో మోదిరి. నాగజెముడు గుమ్మలపై పొర లాడిరి. యోగశక్తితో మహత్తరకార్యములు ప్రజలాశ్చర్యమొందెడి త్యాగయోగము లెన్నెన్నో యొనర్చిరి.

బాల్య యౌవనదశలలో చేసిన యద్భుత త్యాగములవలన కౌమారదశయందు శారీరకధర్మము ననుసరించి శరీరతత్త్వము మాఱి నది. దేహములో జవసత్వములు సన్నగిల్లినవి. ఆత్మ స్వప్రకాశ ముతో వెలుగుచున్నది. శరీరసంబంధమగు బాధలెన్నో సంభవించినను, స్థితప్రజ్ఞతో ప్రాణవాయువును యూర్ధ్వమునకు లాగుచుండిరి.

ప్రియశిష్యుడగు శ్రీ గద్దె నరసింహదాసు శ్రీ సద్గురు సన్నిధిలో 'భాగవత సప్తాహము' చేయవలయునను సత్యసంకల్పముతో శ్రీ సద్గురు దేవుల పాదకమలముల సన్నిధియందు చేరి "స్వామీ! భాగవత

సప్తాహము చేసెదను. తమరు సెలవీయవలయు ప్రభూ !" యని ప్రార్థించెను. శ్రీ సద్గురు దేవులు "ఓ నాయనా ! నరసింహదాసు ! నీ సూక్ష్మబుద్ధికి సంతసించితిని.

"పూర్వయుగమగు ద్వాపరమున శ్రీ పరీక్షన్మహారాజు సన్నిధి, శ్రీ శుకమహర్షి భాగవత పారాయణ మొనర్చిరి. 'భగవత్సేవకంటె భాగవత సేవయే మిన్నయైన'దని మహర్షులందరు వాకొనిరి. అదే విధము నీవు గురుసన్నిధిలో భాగవత సప్తాహముచేసి తరించవలయునని బద్ధకంకణుడవైతి"వని శ్లాఘించిరి.

శ్రీ నరసింహదాసు శ్రీ యోగానందుని పదకమలముల సన్నిధి నేకమనస్కుడై యేడురోజులు భాగవతపారాయణ మొనర్చిరి. భాగవతపారాయణ సమయములలో భక్తబృందము నృసింహ నామమును భజించుచు కరతాళధ్వనులు చెలరేగ భక్తిపారవశ్యమున భజనలు గావింపసాగిరి. భాగవతసప్తాహము సమాప్తి చెందించిరి. సమాప్తి చెందిన రోజు ఏకాదశి.

ఏకాదశిరోజున శ్రీయోగానందమూర్తి ప్రియశిష్యులగు శ్రీచేవ్వూరి కోటయ్య తన మాతృమూర్తి ~~ధర్మపత్ని~~ మహాలక్ష్మిదేవి సమేతముగ సద్గురు దేవుల సన్నిధిచేరిరి. ఆరోజే సప్తాహము పూర్తియైనది. వారు శ్రీ సత్యనారాయణస్వామి వ్రతమును సంపూర్తి గావించిరి. దూరశ్రవణ యంత్రములతో వందలకొలది భక్తులతో కపిలగిరి యంతయు మార్మోతమోగు రీతిగ నరసింహనామ భజనలు గావించిరి. ఆ రాత్రి జాగరణ చేసిరి.

శిష్యకోటి యొనర్చిన భగవద్భజనలు, భాగవతకథాశ్రవణమును గురుదేవులు కన్నులార గాంచుచు ముసిముసి నవ్వులతో, "ఇట్టి నిష్కల్మషభక్తియే వీరిలో సదా ప్రజ్వలించు గాక"యని దీవించిరి. భాగవతసప్తాహము చక్కగా నిర్విఘ్నముగా జరిగినది.

ప్రియశిష్యుడగు నరసింహదాసును చూచి "నాయనా ! నీ కోర్కె నెరవేఱినది. నీ దీక్షపూర్తియైనది. ఎందరో సహృదయు లీ భాగవత

సప్తాహములో పాల్గొనిరి. రామకృష్ణావతారములైన, నీభూలోకములో నదేరూపములో శాశ్వతముగా నిల్వలేదు. వారి వారి యవతారధర్మములు చక్కగా నిర్వర్తించి భక్తిగలవారి నెందరినో యుద్ధరించి ధర్మసంస్థాపన మొనర్చి, నిజయోగులకు వేదరహస్యములను ప్రబోధము చేసి తరింపచేసిరి. అదేవిధముగా మహనీయులెందరో యవతరించి జాతిమత భేదములను సమూలముగా నాశనమొనర్చి విజ్ఞానబోధలను గావించిరి. నేనీ స్థూలరూపముతో నుండెడి కాలము గడచిపోయినది. నిజభక్తుల కండదండగా నుండి వారి యోగక్షేమములను చూచుచుండెదను. మీ భక్తితో నన్ను సూక్ష్మరూపముతోడనే దర్శించెదరు. మీ కింత కాల మెన్నెన్నో ధర్మములు పరతత్త్వవిషయములు ప్రబోధము చేసితిని.

ఈనాడు మీకు సూక్ష్మముగా మానవజీవిత పరమావధిని, పొందుటకు తగిన విషయములను ప్రబోధము చేసెదను. స్థిరచిత్తముతో వినుడు.

## శ్రీ యోగానందమూర్తి పరమోపదేశములు

"విషయేంద్రియసంబంధమును త్రెంచివేయవలయును. భగవద్భక్తులందరు తెలిసికొనవలసిన విషయ మిదియే! విషయేంద్రియముల ప్రవృత్తుల నణచి వేయవలయును. దూషణ భూషణలకు నింద్రియములకు సంబంధము లేకపోయినచో సుఖదుఃఖము లేలేవు. కార్య మొకటే! భావములు వేరు. సామాన్యవ్యక్తి, కొంపలకు నిప్పుపెట్టిన వానిని హింసించెదము. అదేపని, శ్రీరామభక్తుడను నాంజనేయస్వామి చేసిన వారిని పూజించుచున్నాము. ఎందువలన? లోకక్షేమమునకై భగవదాజ్ఞతో స్వార్థరహితుడై లంకానగరము నగ్ని పాల్జేసినను నాయన కాచంద్రార్కము సత్కీర్తి స్థిరముగా నిలిచియున్నది. డాక్టరు చేతులు నరికినను సంతోషముతో ధనమును సమర్పించెదము. అదేపని దొంగ చేసినచో వానిని పట్టుకొని చేయవలసిన పనిచేసి మరణదండనకు గురి

చేయింతుము. పనియొకటే! భావములు వేరు. భగవంతు నెడ తెగక జలధారవలె భజించవలయును. శ్వాసముతో పాటు, నిశ్వాసముతో శ్రీహరి నామమును స్మరింపవలెను. అట్టి స్మరణమే, నిజమైన నామ స్మరణ! భగవద్గీతను పారాయణము చేయుచున్నారు, మంచిదే. యదార్థ సత్యమును గుర్తించలేకున్నారు. 'గీత' యనగా, త్యాగ తత్త్వమును ప్రబోధము చేయుచున్నది. 'త్యాగేన మోక్షః' త్యాగ మనగా నేమి? హారతిపళ్ళెరములో నయాపైసాను వేసి, నమస్సు లర్పించి 'ఓ దేవా! మమ్ము కాపాడుము. ఐహికభోగము లన్నియు మాకే సమకూర్చు' మని ప్రార్థించుటకాదు. భగవంతునికై సర్వమును త్యజింపవలెను. గీతాపుస్తకములోని భావములు మానవుని మస్తక ములో ప్రవేశించి మార్పుతీసికొనరావలెను. మానవుని తలలో సుడులు దిరిగెడు దుష్టభావములను సమూలముగా నశింపచేయవలెను. సర్వ భూతాంత రాళములయందు వెలిగెడి పరమాత్మ యొకటే యను భావముతో నీతోడిమానవుని నీవలెనే గుర్తించి ప్రేమింపుము. నీ శక్తికి తగినట్లుగా సాయమొనర్పుము.

ఎన్ని వేదాంతప్రబోధములు విన్నను, ప్రార్థనాసంఘము లెన్ని స్థాపించినను, విజ్ఞానము గలుగని మానవునిస్థితి యెట్టిదనగా, గరిటకుచు లలో తిరిగిన నేమియు అంటనిరీతి, అజ్ఞానుని గతియునట్టిదే.

బ్యాంకులలోనున్న ధనమంతయు మనదికాదు. మన నిల్వ యున్నవరకే డబ్బు మనకు లభించురీతి, భగవంతు డనంతశక్తివంతు డైనను, మనప్రార్థనలు మనధర్మములు మనభక్తితాత్పర్యముల ననుస రించియే ఫలమును గలుగచేయును.

కడవెంతో నీరంత! మానవునిభక్తికి తగినట్లే, భగవంతుని కృప గలుగుచున్నది. దక్షయజ్ఞమునకు పెద్దవారందరు వేంచేసినారు. పెద్దవారికి పెద్దయగు పరమేశ్వరుడు రానికారణముచేత, పవిత్రమైన యజ్ఞము సంగ్రామముగా మారి, ధ్వంసమైపోయినది. అట్లే, మానవు

డెంత యార్జించినను, నెంత ధీశాలియైనను, భగవానుని వ్యతిరేకించిన నాడు పతనమైపోవును. దైవమును శరణుపొంది 'నా' యను నహంకారము త్యజించి, యంతయు నీవే! నేను నిమిత్తమాత్రుడ ననెడి మనస్సుతో, పాండవమధ్యము డగు 'నరుడు' సంగ్రామ మొనర్చుటచే నాత్మయజ్ఞముగా మారినది. భగవతత్త్వము సంపూర్ణముగా తేటతెల్లమగునట్లు, నరరూపములోనున్న పార్థునకు నారాయణాంశతో ప్రకాశమొందెడి శ్రీకృష్ణ పరమాత్మ ప్రబోధము చేసిరి.

"మానవుని గమ్యము మోక్షము. మనగమ్యమును వదలి సత్రశాలవంటి సంసారములో కాలము గడపి, కర్తవ్యము మరచిపోయి, మానవుడు యదార్థమును దూరముగా గెంటి యభావములో మెలగుచున్నాడు. సదా యాలోచనలేక గమ్యము చేరలేడు. దురాలోచనయే గమ్యమును చేరుటకు భంగము గల్పించును.

"అలౌకిక శృంగారమధురభక్తిని రాధ యారాధింపగా నీ కలి వాతావరణములో లౌకిక శృంగారమాధుర్యము ననుభవించి నాశనమగుచున్నారు. ఇరువది నాలుగుగంటల కాలములో నైదు నిముసములు మాత్రము భగవానుని ధ్యానించి 'నాకు ప్రత్యక్షము కాలేదే! నన్ను రక్షింపలేదే, ఐదునిముసములు భక్తితో ధ్యానము చేసినాను. నా కోర్కెలు దీర్చవేమిరా ప్రభూ!' యని బాధపడెదరు. మిగిలిన యిరువదిమూడు గంటల యాభైయైదు నిముసములు, పనికిమాలిన సంసారతాపములతో దుర్వినియోగ మొనర్చితినని యనుకొనడు. మాయాప్రభావము తీరు యీ రీతిగనే యుండును.

"వెన్న పాలలో నున్నది. వెన్న రావలయు నన్న ప్రయత్నముతో సాధించవలెను. కర్మ యొనర్పక పాలలో వెన్న కావలెననిన వచ్చునా! హృదయమథనము చేయుము. పరమాత్మ యను వెన్నను పొందుము.

"వేణువుధరించి పరమానందముతో నూదియూది పరవశత్వము చెంది, వేణువును ప్రక్కనబెట్టి లోకేశ్వరుడు నిద్రచెందెను. ఆ సమయమున రాధాదేవి యా వేణువును తీసికొని 'ఓ పిల్లనగ్రోవీ! నీ వెంత యదృష్టవంతురాలవే! సదా జగన్నాధుని చేతిలో నివసించుచున్నావు. నీ యదృష్టము నాకు రాకూడదా! నీ మీద నంతులేని మమకారముతో మెలగుటకు కారణమైన యుపాయమేదో నాకు రహస్యముగా తెలుపు' మని ప్రార్థించెను. మురళి రాధతో నిట్లు చెప్పసాగెను. 'రాధాదేవీ! నేను జపించుటలేదు, తపించుటలేదు. నా లోపల చూడు నేనెట్లున్నానో! నేను లొట్టగా నున్నాను! నీవు, హృదయములో నావరించిన విషయవాసనలను పోగొట్టి ఖాళీయై ప్రశాంతముగా నుండినచో నీవును మురళి వయ్యెదవు! మురళిగా మారిన మరుక్షణమే, శ్రీకృష్ణపరమాత్మ ప్రేమించును.' పరమాత్మ ప్రేమ మనపై గల్గురీతి ప్రవర్తించవలయును. అదే నిజమైనభక్తి. పరమాత్మను కాదనినవాడు నిష్ప్రయోజకుడు. రావణుడు సర్వశాస్త్రవేత్తయైనను పరమాత్మను వదలి ప్రకృతియగు సీతను వరించెను. వాని భక్తియోగము లన్నియును వ్యర్థమైపోయి శ్రీరాముని చేతిలో మరణించెను.

"మానవున కగచాట్లు సంప్రాప్తమైన తక్షణమే దైవమునకు మాపైన దయలేదని యేడ్చును. ఆ విధముగా నేడ్చుట చాల వెఱ్ఱితనము. దైవదృష్టి మనపై ప్రసరించునట్లు సత్కర్మ నాచరింపవలయును. భక్తి యనగా ఆవకాయ గాదు, ఊరగాయ కాదు. నిత్యము భక్తికార్యక్రమములు సలుపవలయును. పరమాత్మ దర్శనము కొరకు చింతించవలయును. అపారముగా దుఃఖింపవలయును. ఈనాడు మెరసి మరునాడు నశించెడి ఐహికదృశ్యములను చూచి యనుభవించి యానందమును పొందవలయునను నాశతో పెనుగులాడుచుంటివి. ఇది సరియైనత్రోవ కాదు.

"కొందరు సృష్టిసహజము, ధనము సహజము, మన మనుభవించుటకే సర్వము సృష్టియైనదని దలచి పొరబడుచున్నారు. వస్తు సహజమే

కదా! వడ్లు తినుటలేదే! పొట్టును వదలిన బియ్యమునే వండి తినుచున్నారు. అదేరీతి, సహజమైన, ప్రకృతి వ్యామోహామును వదలి పరమాత్మ చింతనము చేయుటయే మిగుల శ్రేయస్కరము.

"మన సనాతనపద్ధతిని, భారతీయఋషి సాంప్రదాయము నవలంబించిన నాడే భారతీయులు విజ్ఞానవేత్తలని పిలువబడుదురు. ప్రస్తుతము భారతీయులు మన సంప్రదాయములకు విరుద్ధముగా నడచుచున్నారు. ఎన్ని జన్మలకైనను పరమాత్మను శరణు పొందవలయును. అదే మానవాశయము! మనవెంట వచ్చునదియును, జంటనుండునదియును, స్థూలదృష్టికి గోచరించనిది సూక్ష్మదృష్టికి మాత్రమే సాక్షాత్కరించెడి, పరమాత్మ దర్శనమును దర్శింపుము. ఆ జ్ఞానభాస్కరుని జ్ఞానజ్యోతులను దర్శించి తరింపుము.

" 'తల్లి చెవులు కోరికినవారికి పినతల్లి చెవులు బీరపువ్వులు.' భగవానుని వాక్యములను పాటించుటకు పాలుపోక భగవానుని కథలు చెప్పుకొని కాలమును గడుపుచున్నారు. తండ్రియాజ్ఞ పాటించునది లేదు. తండ్రియాస్తి కావలెననెదరు. 'కాకివలె కలకాలము బ్రతుకుటకంటె, హంసవలె నొకరోజు బ్రతుకుట యెంతయో శ్రేయస్కరము.' ధనముకొఱకు కొందరు పిచ్చివారై తిరుగుచున్నారు. భార్య నిమిత్తము మరికొందరు పిచ్చివారగుచున్నారు. బిడ్డలనిమిత్త మహర్నిశలు వాపోవుచున్నారుకానీ, నూటికొకడైనను భగవంతుని కొరకు పిచ్చివాడగుటలేదు. ఇదియే ప్రకృతి మహత్తర పరమరహస్యము.

"నిన్ను నీవు రక్షించుకొన్నచో దేశమునే రక్షించినవాడవయ్యెదవు. నీ హృదయమున శాంతిజ్యోతిని వెలిగింపుము. ప్రపంచమంతయు శాంతిమయమై గోచరించును. భగవదనుగ్రహామే మానవుని సర్వదా రక్షించును. భగవానుని యాగ్రహామునకు గుఱిగాకుము, రామభక్తుడవు కాకపోయినను రావణభక్తుడవుగా మారకుము.

"భగవానుని యాత్మసమర్పణతో పూజలు చేయుము. ప్రకృతిలో నున్న పూలతో భగవానుని సంతోషింపచేయలేవు. భక్తి జ్ఞాన వైరాగ్యము లనెడి కుసుమములచే, భగవానుని పూజించి యానందింప చేయుము. ఈ సద్గుణపుష్పములతో పూజించిననాడే, సర్వగతుడై ప్రకాశించెడి యాత్మారాముడు సంతోషించును. నేను ప్రబోధము చేసిన ధర్మసూత్రముల నెఱిగి మీ జీవితములను తరింపఁ యత్నింపు" డని శ్రీ యోగానందమహర్షి ప్రబోధము చేసిరి.

సప్తాహము పూర్తి చేసిన శ్రీ గద్దె నరసింహదాసు, విష్ణుచక్రమును తీసికొని బయలుదేరగా, భక్తులందరు కరతాళధ్వనులతో నృసింహనామ స్మరణతో వెంటజనిరి. మేళతాళములతో కుండి కానదికి పోయిరి.

ఆ సమయముననే శ్రీ యోగానందమూర్తి ప్రాణవాయువు నూర్ధ్వమునకు లాగుచుండిరి. కోటిసూర్యుల కాంతితో వెలింగెడి దివ్య విమానముతో నాకాశమున విష్ణుదూతల దృశ్యము గోచరించినది. శ్రీ స్వామి సమాధినిష్ఠను దర్శించిన విష్ణుదూతలు "ఓహో! వీరి హృదయమే వైకుంఠ" మని నిరాశతో వెనుకకు మరలిపోయిరి.

## శ్రీ సద్గురుదేవులు సమాధి నిష్ఠయందుండుట

శ్రీ సద్గురుదేవులే మా జీవితాశాజ్యోతి యని నమ్మికొని గురు సేవలు చేసిన త్యాగమూర్తులు శాయమ్మదేవి, లక్ష్మయ్య యను సాధువు లిర్వురు శ్రీ సద్గురు చరణసాన్నిధ్యమందే యుండిరి. శాయమ్మదేవి, లక్ష్మయ్య యిర్వురు లేచి గురుసార్వభౌముని వీనులయందు, ప్రణవమును "ఓం ఓం ఓం" యని గానము చేయ మొదలిడిరి. శంఖములను "భోంభోం" యని యూదసాగిరి. శంఖధ్వని శ్రీ సద్గురుదేవుని వీనుల యందొక గంటకాలము ప్రతిధ్వనించెను. ప్రియశిష్యుల సద్వాంఛను తెలిసికొన్న కరుణారసమూర్తి శ్రీ యోగానందమూర్తి సహస్రారమునకు చేరనున్న ప్రాణవాయువును యథాస్థానమునకు దింపివైచిరి.

శ్రీ స్వామివారు వెంటనే కన్నులుదెరచి ప్రియశిష్యులను శిష్యా రాంద్రను తదితరభక్తులను వీక్షింపసాగిరి. భక్తులందరు పరమానంద ముతో శ్రీ సద్గురు ముఖబింబమును దర్శింపసాగిరి.

మౌనము వహించిన శ్రీ గద్దె నరసింహదాసు "ఓ! యతి సార్వభౌమా! ప్రేమావతారా! పరిపూర్ణహృదయా! సద్గురు దేవా! తమరు వేదస్వరూపులు, త్రికాలజ్ఞులు. తమ దయవలన శ్రీ భాగవత సప్తాహము ప్రశాంతముగా కొనసాగినది. ఈరోజు ద్వాదశిపారాయ ణము జరుగవలయును. ఈ సత్కార్యము నెరవేర్చి మీ బిడ్డలనుదీవించి మా జన్మలను తరింపచేయవలయునని ప్రార్థించుచున్నా"మని దీనముగా వేడిరి. శ్రీ యోగమూర్తి భక్తుల కోర్కెను మన్నించి యానంద మయులై క్రిక్కిరిసియున్న ప్రజాప్రవాహమును వీక్షింపసాగిరి.

శిష్యుడగు నరసింహయ్యగారిమనస్సు కుదుటపడి "హా! లక్ష్మీ నరసింహా! నీవే దిక్కు. నా వాంఛ నెరవేర్చినావు ప్రభో!" యనుచు మేళతాళములతో నృసింహనామభజనలతో భగవదావేశపూరితులై నృత్యములుచేయు భక్తులతో కుండికానదికిబోయి స్నానములుగావించి పూర్ణ జలకలశములతో నృసింహనామ మొనర్చుచు శ్రీకపిలాశ్రమము చేరిరి.

శ్రీ లక్ష్మీరమణునకు నైవేద్యములుచేసి నివేదనలు చెల్లించి భక్తబృందమంతయు సద్గురు యోగ ప్రతిభాశక్తిని వేనోళ్ళ పొగడుచు సద్గురుప్రబోధము విని హాయిగా నాశ్రమమందే భోజనములుచేసి గురువారమంతయు గురుదేవునిబోధనలతో బాధలను రూపుమాపి తమలో తా "మిట్టి పవిత్రదినము మన జీవితములో నెన్నటికో! ఇంకెన్నటికో" యనుచు నానందముతో నా రాత్రి భగవన్నామ మొనర్చుచు కొంతవరకు మేల్కొని యలసిసొలసి యందరు నిద్రా వస్థలో మునిగిపోయిరి,

జీవితమును గురు శుశ్రూషకును, నాశ్రమసేవకును సంకితము చేసిన శిష్యురాలగు శ్రీ శాయమ్మదేవి శ్రీ సద్గురుపాద కమలములసన్నిధి నాశ్రయించి వేయికండ్లతో నిరీక్షింపసాగెను.

శ్రీ శాయమ్మదేవి యమితావేదనతో "ఆహా! ఇట్టి కరుణా స్వరూపుని వీరనృసింహకళావతారమూర్తిని నా సద్గురుదేవు నెన్ని జన్మలకు చేరగలనో" యను నావేదనాందోళనలతో దుఃఖసముద్రమున మునిగి తేలుచుండెను.

శ్రీ సద్గురుదేవు లైహికప్రపంచమును వదలి నిత్యానందమగు స్వప్రకాశముతో నేకీభవింపదలచి యెవ్వరిని దలంపక యొద్దకు రమ్మని యైనను పిలువక నాశ్రమకార్యక్రమాల బాధ్యతల నణుమాత్రమేని మనస్సునకు దెచ్చుకొనక, పాదములయొద్ద కాచుకొనియున్న శాయమ్మ గారిని పిలువక సర్వసంగములను క్షణములో వీడిరి. గురువులకు సద్గురువుల కిదే తారతమ్యము. శ్రీ యోగానందులు ప్రశాంతమైన మనస్సుతో, నఖండమై యద్వితీయమై యనుపమానమైన పరమాత్మ జ్యోతియందు లయమొందుటకై యాధారచక్రమునుండి సహస్రారము చేర్చుటకై ప్రాణవాయువును పైకిలాగుచుండిరి.

ఇమ్మహత్తరదృశ్యమును వీక్షించెడి శ్రీ స్వామివారి శిష్యుడు, నరసరావుపేట తాలూకా కూకట్లపల్లె గ్రామనివాసులు శ్రీ అన్నమునేని వీరయ్యచౌదరిగారు, స్వామిని పలుకరించకూడదనుకొని శ్రీ నృసింహుని మేలుకొలుపులను భక్తితో నానందబాష్పములు రాల్చుచు గానము చేయసాగిరి.

శ్రీ స్వామివారి పాదభక్తురాలు త్యాగమూర్తిని యగు శ్రీ శాయమ్మదేవి శ్రీ సద్గురుదేవుని శిరస్సునకు చేతులు పూన్చి కర్ణరంధ్రమున శ్రీ సద్గురుదేవు లుపదేశించిన ప్రణవమంత్రము నెడతెగక జపింపసాగెను,

జీవితమంతయు సద్గురుసేవకు వినియోగించిన శాయమ్మాదేవి జన్మ చరితార్థమైనది. ఆహాహా! ఏమి యా మహాతల్లి భాగ్యము! సద్గురు సేవ ఫలించినది! జీవితము తరించినది.

శ్రీశ్రీశ్రీ సద్గురు యోగానంద నరసింహ యోగీశ్వరమూర్తి. శ్రీ శార్వరినామ సంవత్సర పుష్యశుద్ధ త్రయోదశి శుక్రవారమురోజున పగలు రెండుగంటల ముప్పది నిముసములకు శ్రీ సద్గురు దేవులు ప్రాణ వాయువును, కోటిసూర్యులకాంతికి మిన్నయై వెలిగెడి పరంజ్యోతి స్వస్థానమగు సహస్రారమునకు చేర్చిరి. ఆహా! ఏమి యా యోగ మూర్తి శక్తి వర్ణనాతీతమైనది. జన్మరాహిత్య పదవిని పొంది యాత్మానందులై యోగానందులై ప్రకాశించిరి. వారి జీవితమే యానందమయము.

శ్రీ సద్గురు సార్వభౌముని విషయము శాయమ్మాదేవి మాయా నిద్రలో, మసలుచున్నవారిని మేల్కొలిపి దెలుపగా, వారందరు దిగ్గునమేల్కొని ఆశ్చర్యముతో సద్గురు దేవుల చుట్టును చేరి నిట్టూర్పు లతో క్షణమొక యుగముగా గడుపుచుండిరి.

ఈ వార్త చుట్టుప్రక్కల పల్లెటూళ్ళ ప్రజలందరికి పిడుగు పాటుగా వినిపించెను. ఎక్కడెక్కడోయున్న ప్రజలందరు దిగ్భ్రమతో శ్రీ సద్గురు దేవుల దర్శనముకొరకు దడదడ కొట్టుకొనెడి గుండెలతో పరువులుదీయుచు శ్రీ కపిలాశ్రమము చేరుచుండిరి.

శిష్యులు, భక్తులు, నితరవ్యక్తులు నెందరో శ్రీ కపిలాశ్రమము చేరిరి. ఆబాలగోపాలముతో కొండంతయు క్రిక్కిరిసియుండెను. ప్రియ శిష్యుడు శ్రీ గద్దె నరసింహయ్య, ప్రియభక్తులందరి కప్పటికప్పుడే తెలియచేసిరి.

శ్రీ సద్గురు దేవులను సింహాసనమం దాసీనులగావించి పూల మాలాలంకృతు చేసిరి. శిష్యులందరు శ్రీ సద్గురుపాదపూజలు గావించిరి.

మంగళవాద్యములు మార్మోత మ్రోగినవి. మహారాజు పెండ్లివైభవము కంటె మిన్నగా జరిగినది.



శ్రీ సద్గురుదేవుని సమాధి స్వరూపము

ప్రియశిష్యుడు, ప్రథమభక్తుడగు శ్రీ నారాయణస్వామి వచ్చు వరకు వేచియుండిరి. బ్రహ్మచర్యాశ్రమ దీక్షాపరులగు శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరస్వామి మొదలగు భక్తులందరు వేంచేసిరి.

వాయుపుత్రుడగు నాంజనేయునివలె, సద్గురు మహాపరి నిర్యాణము వినినతక్షణమే అబ్బూరు గ్రామమునుండి శ్రీ నారాయణస్వామి వాయు వేగముతో శ్రీ సద్గురు సన్నిధికి చేరిరి.

నిగ్రహాశక్తి లేని భక్తులు కొందర పారదుఃఖముతో నమితా వేదన పొందుచుండిరి. భక్తుల సమూహములో కన్నీరు పొంగి పొరలి ప్రవహించినది.

ప్రియశిష్యులగు శ్రీ దోగిపర్తి సత్యనారాయణ, శ్రీ చేవూరి కోటయ్య, శ్రీగంటిశెట్టి గురునాథము, శ్రీకనమర్లపూడి మల్లిఖార్జునము, శ్రీ కోట లక్ష్మీనారాయణ, శ్రీ కోట సత్యనారాయణ, శ్రీ దొడ్డా సుబ్బారెడ్డి, శ్రీ ఆకుల గురవయ్య, శ్రీ యర్రంశెట్టి వెంకటేశ్వర్లు మొద లగు సహృదయులందరు దుఃఖసముద్రమున మునిగి తేలుచు, మేళతాళ ములతో శ్రీ నృసింహనామస్మరణలతో కుండికానదికిపోయి స్నానము లొనర్చి బిందెలతో నీరు తీసికొని శ్రీ సద్గురుస్వామి సన్నిధిచేరి సద్గురు వులను స్నానము చేయించి పీతాంబరము ధరింపచేసి శ్రీనృసింహస్వామి యూర్ధ్వపుండ్రములను ఫాలభాగమున తీర్చిదిద్ది నృసింహస్వామి రజిత కిరీటమును కరాళమును సద్గురుస్వామికి ధరింపచేసిరి. వందలకొలది జనులు పూలమాలలు మెడయందువేసి హృదయపూర్వకమగు నమస్సు లర్పించిరి.

ఆనాటి సద్గురుదేవుని మూర్తిసౌందర్యము మిఱుమిట్లు గొల్పినది. ముఖకాంతి వీసమైనను తగ్గలేదు. స్వామివారు బ్రహ్మవర్చస్సుతో ప్రకాశించుచుండిరి. శ్రీవైకుంఠమందిరమున శ్రీమన్నారాయణమూర్తి యేవిధముగా వెలింగిరో యదే విధముగా శ్రీ కపిలగిరియందు, శ్రీ యోగానంద సద్గురుదేహులు వెలుగొందుచుండిరి.

శ్రీ సద్గురుదేవుల దివ్యచరమదర్శనమునకై వేలకొలది ప్రజలు, పూజాద్రవ్యములతో త్రొక్కిసలాడుచుండిరి సద్గురు దర్శనమునకై

తహతహలాడుచు, నొకరికంటెముం దొకరు దర్శించవలెనను నుబలాటముతో ప్రజ లుఱ్ఱూతలూగిరి.

మేధావులు కొందరు సద్గురుదేవు లాసీనులైన సింహాసనముతో సహా బల్లపై చేర్చి భుజములపై మోసికొని నృసింహగిరిమెట్లపై సద్గురుసార్వభౌముని చేర్చిరి.

త్రొక్కిసలాడుచున్న పరమభక్తాగ్రేసరు లందరు శ్రీ సద్గురుస్వామిని ప్రశాంతముగా దర్శించిరి. శ్రీ సద్గురు పాదపద్మములపై భక్తులందరు పుష్పములు సమర్పించిరి. భక్తిపూర్వకమగు నమస్కృతులొనర్చిరి. సద్గురుదేవుని శరీరముపై పూలవర్షము గురిపించిరి. స్వామివారు పూలకుప్పలో మునిగిపోయిరి. ఈ దృశ్యము కన్నులున్నవారు దర్శింపవలయుగాని వర్ణింపనలవికానిది. భక్తు లెందరెందరో స్వామిని దర్శించుటకై పరుగులుతీయుచు కపిలగిరి చేరుచుండిరి.

ఏ వైపు జూచినను జనసమూహములే! ఏ ప్రక్క చూచినను నరసింహనామస్మరణ చేయువారే! కరతాళధ్వనులతో కొండంతయు, మార్మ్రోత మ్రోగెను. సద్గురుదేవుని సమీపమునకు వెళ్ళవలయునన్నచో, ప్రజలయొత్తిడి కేమైపోదుమో యను భయముతో మనస్సు సద్గురురూపముపై నిల్పి దూరదూరముననే నిలచి తేరిపార చూడ సాగిరి. ప్రజలలో చూపందక యలజడి మెండాయెను. ప్రియశిష్యులైనను స్వామి సన్నిధి చేరెడి యవకాశము లేకపోయినది.

శ్రీ సద్గురుదేవుల విషయము తెలిసిన మరుక్షణమే యభిమానపాత్రుడు సహృదయమూర్తి నాదర్శభక్తిశ్రద్ధలు గల ప్రియశిష్యుడు, శ్రీ చేవూరి సత్యనారాయణ యను నున్నతోద్యోగి గుంటూరునుండి కుటుంబసహితముగా సద్గురు దర్శనము లభించునో లేదో యనెడి తహతహతో యాందోళనచెందుచు నావేశముతో, టాక్సీలో శ్రీకపిలగిరికి వచ్చి విపత్కరపరిస్థితిని కన్నులారగాంచి గుండె చెరువగురీతి, కన్నీరు

గార్చుచు గద్గదస్వరముతో 'సద్గురు ప్రభో' యని యరచుచు పోబోవ, ప్రజలు క్రిక్కిరిసి కాలుకదుపుట కవకాశము లేకయుండెను. మార్కా-పురమునుండి యెందఱెందరో యున్నతోద్యోగులు సద్గురుదర్శనము నకై వచ్చిరి.

ఆ యున్నతోద్యోగులలో సూపరింటెండెంట్ గారి ధర్మపత్ని సుగుణరాశియగు సాధ్వీలలామ, సద్గురు దర్శనము ప్రశాంతముగా దర్శించు టెట్లని యాలోచన చేసి తక్షణమే పేముబెత్తము చేత ధరించి క్రిక్కిరిసిన ప్రజలను నయోక్తితో మందలింప, 'దొరదలచుకొనిన దెబ్బలకు కొదువా' యనెడి సామెతదలచి యెచ్చటివా రచ్చట తొలగిరి.

సూక్ష్మబుద్ధిగల ప్రియశిష్యుడగు శ్రీ చేవూరి సత్యనారాయణ మొదలగు భక్తులందరు సద్గురుసన్నిధిచేరి భక్తితో పూజించిరి. బాహ్య రూపమున సద్గురుని దర్శించుటకిదియే కడసారి దర్శనమని శ్రీ సత్య నారాయణ రెప్పలార్పక మౌనముతో కొన్నిఘడియ లట్లే దర్శించిరి.

శ్రీ సద్గురుదేవుని జీవసమాధి యే స్థలమున చేయవలయునో యని విమర్శనలు చేయుచున్నంత శ్రీ సద్గురుసేవ గోసేవయు నాశ్రమ సేవయు త్యాగముతో నొనర్చిన స్వామి శిష్యుడగు శ్రీ కంటు లక్ష్మయ్యగారు వచ్చి "ఓ నాయనలారా! నాదొక చిన్న మనవి. శ్రీ సద్గురుదేవుని జీవసమాధి యేస్థలమున చేయవలయునని మీ పెద్ద లందరు తహతహలాడుచున్నారు. మనసద్గురుమూర్తి కొన్నిమాసముల నాడే, నన్ను నొద్దకు చేర్చుకొని యీరీతి నుడివిరి.

"'నాయనా! లక్ష్మయ్యా! కొండకు క్రిందిభాగమున సోపాన సమీపస్థలమున నీశాన్యభాగమున నా జీవసమాధి నిష్ఠ యని వారు సెలవిచ్చి"రని చెప్పెను. వినెడి పెద్దలందరి మనస్సంశయము తీరి పోయినది. మన సద్గురునాజ్ఞ శిరసావహించుటయే మనకు కర్తవ్యమని నిర్ణయించుకొనిరి.

శ్రీ సద్గురు సమాధి విషయములు చర్చించుచున్నంతలో, స్వామి శిష్యుడు సూక్ష్మబుద్ధిగలవ్యక్తి మార్కాపురము నివాసులగు శ్రీ దోగిపర్తి సత్యనారాయణ, "ఆహా! సద్గురుమూర్తి సమాధినిష్ఠకు తగిన ప్రయత్నములు చేయుటే నా కర్తవ్య" మని తలపోసి బండితో నీటుకలు, గచ్చు దెప్పించి సమాధిస్థానమును సక్రమముగా తయారు గావించిరి. శ్రీ సద్గురుదేవుని పాదారవిందములకు భక్తులందరు నత్యంత భక్తిశ్రద్ధలతో పూజలు గావింపసాగిరి. స్వామివారు సుగంధద్రవ్యములతో పూలమాలలతో నిండిపోయిరి. భక్తులందరు పూజలొనర్చిన పూల సుగంధ మాశ్రమమంతయు నిండి భక్తుల మనస్సులకు శాంతిని చేకూర్చెను.

పూలకుప్పలతో నిండిన సద్గురు శ్రీ యోగానందమహర్షి దివ్యస్వరూపమును ఛాయాచిత్రములు తీసిరి. ఆదివారము సాయంత్రము నాలుగుగంటల కా యోగమూర్తిని సమాధిలో చేర్చిరి. భక్తులు జ్ఞానులు వైరాగ్యమూర్తులు పతివ్రతామతల్లు లందరు, "జ్ఞాన భాస్కరు డస్తమించె"నని నిట్టూర్పులతో సద్గురు ప్రబోధసూత్రములను మననము చేయుచు స్వగృహములకు జనిరి.

ప్రియశిష్యుడగు చేవ్వూరి సత్యనారాయణ శ్రీ సద్గురుదేవుని సమాధి నిర్మాణమున కయిన ఖర్చు మూడువందల పదహారు రూప్యములు నిష్కల్మష హృదయముతో ప్రేమోపహారముగ సమర్పించి వారి త్యాగ గుణమును వెల్లడి చేసిరి.

శ్రీ సద్గురుదేవునిపై నపారభక్తిగలిగిన శ్రీ దోగిపర్తి సత్యనారాయణ యచ్చటనున్న గురుపుత్రులతో "ఓ అన్నలారా! ఓ అక్కలారా! మన యోగానందమూర్తి దివ్యశక్తులను పూర్తిగా తెలిసినవారే యొకరో యిద్దరోతప్ప యెక్కువమంది లేరేమొ"యని నేను తలచుచున్నాను. ఎట్లంటిరేని వారు చూచువారలకు సామాన్యులుగా తోచెదరు, నిరాడంబరయోగి, వేషభాషలు గానరావు! నూటికి

తోంచెమంది యీ కలివాతావరణమున వేషభాషలు చూచి ముగ్ధులై వారి పాదముల నాశ్రయించి యదార్థమును గుర్తించలేక ప్రకృతిశక్తులకు తలలొగ్గి తైతక్కలాడుచున్నారు. మన సద్గురువు లెంతటి యోగ శక్తిపరులో నేను వర్ణింపలేను. మారణశక్తులు, మాయాశక్తులు, తాంత్రికశక్తులు మొదలగు ప్రకృతిశక్తులన్నియు వారి యోగాగ్నిలో బూడిదయై గాలిలో కలసిపోయినవి.

"మా జీవితముల కాశాజ్యోతియని నమ్మకొని యోగమూర్తులగు శ్రీ నరసింహస్వామియొద్ద నేనును నా ధర్మపత్నియు జ్ఞానోపదేశమును పొంది వారికి పాదపూజలొనర్చి మా జన్మలను తరింపచేసికొంటిమి. స్వామివాక్యమనిన మా ప్రాణాలైనను త్యజించుటకు సంసిలమే! వారియందు, మా కఖండవిశ్వాసము ననంతమగు భక్తి గలదు.

"శ్రీ సద్గురు దేవులమనస్సు నానందింపచేయుటకై యొక ఉత్తమ కార్యమును నిర్వహించితిని. అది యేమనగా నే నొక పవిత్రదినమున సద్గురు దర్శనమునకై కపిలగిరికి వేంచేసితిని. సద్గురు దేవులు లక్ష్మీ నృసింహుని పూజించుటకై యెగుడుదిగుడుల యా కొండరాళ్ళలో చకచక నడువసాగిరి. సద్గురువులవెంట నేను వెళ్ళవలయునని యతి ప్రయాసతో రొప్పుచు కొండశిఖరముననున్న శ్రీ నృసింహాలయము చేరి స్వామి పాదములచెంత నాయాసముతో నాసీనుడనైతిని.

"శ్రీ స్వామివారు ప్రసన్నవదనముతో 'నాయనా! సత్యనారాయణా! నీవు కొండయెక్కువరకే మిక్కిలి యలసిపోయితివి. మేము బ్రహ్మచర్యదీక్షను పాలించినకారణమున మీ కెంతో కష్టమని తోచెడి కార్యముల మే మవలీలగా చేసెదము. ఈ కొండపైనుండి యెన్నోసారులు దుమికితిని. కొండరాళ్ళన్నియు బరబరజారి నాపైకి దూకుచున్నను లెక్కచేసెడివారము కాము. ఆ శక్తియేదో కాదు. పవిత్రబ్రహ్మచర్యవ్రతము ననుష్ఠించుట, ఎన్నో సంవత్సరములు ఘోర తప మాచరించుట, సర్వభూతములు తనవంటివే యను నహింసా

స్తోత్రమును పరిపాలించుట, ప్రత్యణువులో శ్రీ వీరనృసింహావతార మును దర్శించుట మొదలగు భగవత్ లక్షణములే ప్రబలకారణములు. వీరాకు ప్రత్యక్షనిదర్శనములు. నిష్కల్మష బ్రహ్మచర్యవ్రత ఫలిత మెంతని నుడువగలను. సూక్ష్మముగా రెంటిని దెలిపెదను.

"త్రేతాయుగమున, అంజనీదేవికి పుత్రుడై దశరథరాముని భక్తితో సేవించిన మహాభక్తుడగు శ్రీ ఆంజనేయస్వామి శతయోజన విస్తీర్ణమగు సాగరమును దాటి, లంకిణినిపరిమార్చి లంకలో ప్రవేశించి రావణుని, రావణాసైన్యములను, నహంకారస్వరూపులగు దానవులపీచ మణచి, లంకానగరము నగ్నిపాలుగావించి, అశోకవనమును హతము చేసి, లోకమాతయగు సీతమ్మను దర్శించి, రాముని విషయము విన్న వించి, రామముద్రిక నొసంగి, లోకమాతయగు సీతాదేవి యొసంగిన చూడామణితో శ్రీరాముని చేరిన శక్తియంతయు బ్రహ్మచర్యవ్రత మనుష్ఠించిన కారణముచేతనే సంప్రాప్తమైనది.

"ద్వాపరయుగములో కురువంశమణియగు మహాభక్తుడు భీష్మా చార్యులు, నిష్కల్మష బ్రహ్మచర్య వ్రతప్రభావముచే, నరనారాయణు లగు శ్రీ కృష్ణార్జునులతో పదిరోజులు ఘోరసంగ్రామముచేసి విజయ మునే గాంచిరి. సత్యాత్ముడగు ధర్మరాజు ప్రార్థనకు మనస్సుకరగి తన ప్రాణరహస్యమునే దెలిపి యోగశక్తితో జ్ఞానమార్గమున స్వేచ్ఛా మరణమును పొందిరి. బ్రహ్మచర్యబలము తెలిసినదా? నాయనా!" యనిరి.

నేను "ఓ సద్గురుప్రభూ! తమరు యోగమూర్తులు దివ్యశక్తి ప్రభావులు తమకు కొండలన్నను కోనలన్నను తృణప్రాయమేగదా! మా వంటి భక్తులు స్త్రీలు, వృద్ధులు, బాలురు సైతము కొండ నెక్క వలయునని బహుప్రయాసగా నున్నది. క్రిందినుండి పైవరకు రాతిమె ట్లమర్చవలయునను సంకల్పమున్నది. నా కోరిక ఫలించునా లేదా స్వామీ! యని యడుగ త్రికాలవేదులగు యోగానందస్వామి

'నాయనా! నీ కోర్కె ప్రశంసనీయమైనది. తప్పక నెరవేరును. వెంటనే ప్రయత్నము చేయు'మని సెలవీయ చిత్తమనుచు నమస్సు లర్పించితిని.

"సద్గురునితో మాటయిచ్చిన ప్రకారము ఈ సత్కార్యము దీక్షతో చేయవలయునని స్వంత పనులనాపి సద్గురు కార్యములో పాల్గొని మెట్లునకు పదిరూపాయలు నిర్ణయము చేసి స్వామిశిష్యులతో సహృదయు లగు వ్యక్తులతో విషయమును చెప్పి యతి సులువుగా వసూలు చేసి క్రిందినుండి పై వరకు రమణీయముగా రాతిమెట్లను నూతన విధానముతో వృద్ధులు బాలురు, సైతము ప్రయాస లేకనే గమ్యము చేరున ట్లొనర్చి కార్యక్రమమంతయు సంపూర్తిగావించి, సద్గురుప్రభువుయొద్ద చేరి స్వామీ! తమవాణికి తిరుగులేదు. తమ యాశీర్వాదఫలమే నా కూత కర్రయై నిల్చి యీ పనిని సంపూర్తిగావించినది. నే నెంత నా బలమెంత, అంతయు నృసింహస్వరూపులగు మీశక్తియే యని పొగడి నమస్సు లర్పించితిని. యంత సద్గురుదేవులు 'నాయనా! సత్యనారాయణా! నీ నామమునకు ముందు సత్యమనుపద మున్నది. ఆ సత్య పదము నీ నాటికి సార్థకము చేసికొంటివి. నా కృపను పొందితి'వని నన్ను గాఢాలింగనము చేసికొనిరి. సద్గురు చరితము వినిన, సర్వపాపహరము సకలశుభప్రదము. సద్గురు దేవుల విషయ మెంత యోగల"దని శ్రీదోగిపర్తి సత్యనారాయణగుప్తగారు నుడువగా, పెద్దలందరు పరమానందమును పొందిరి. సద్గురుశక్తిని వేనోళ్ళ కొనియాడుచు స్వగృహములకు దయ చేసిరి.

## గ్రంథకర్త శ్రీ లక్ష్మీనృసింహ జయంతికి సద్గురుసన్నిధికి వెళ్ళుట

గ్రంథకర్త సద్గురు శ్రీ యోగానంద నరసింహస్వామి సన్నిధిలో నృసింహజయంతి జరుగునని తెలిసికొని యారేడుల ప్రాయముగల ప్రియకుమారుని రామకృష్ణుని తీసికొని, 1961 ఏప్రియల్ యిరువది తొమ్మిదిన మార్కాపురము వెళ్ళి శ్రీ సద్గురు సార్వభౌముని జీవ సమాధికి ప్రణమిల్లి సద్గురు స్వరూపమును దర్శించుచు ప్రార్థన చేసిరి.

శిష్యులందరు నృసింహభజనలు చేసి శ్రీ సద్గురు పాదపూజలు గావించి, యాంఅభిషేకతీర్థము స్వీకరించిరి. ఏప్రియల్ ముప్పది శ్రీ సద్గురు దేవులు పోషించి రక్షించిన, శృంగారవనములో, గౌరవనీయులు మార్కాపుర నివాసులగు శ్రీ మూర్తి చలమయ్యశ్రేష్ఠిగారు మిత్ర బృందముతో సర్వవస్తు సముదాయముతో వనసమారాధనకు విచ్చేసిరి. భోజనములకై భక్తులందరు పంక్తులు దీరిరి.

శ్రీ నరసింహోపాసనాపరులగు శ్రీ చేవూరి కోటయ్యగారు, తన ప్రక్కనే కూర్చొనియున్న మేనమామగారి పుత్రులగు శ్రీ కోట సుబ్బా రావుతో "నాయనా! మంచిసమయము, భక్తులందరు కూర్చొని యున్నారు. యాత్మసోదరులగు మన గురునాథము, మల్లిఖార్జునము నిచ్చటనే యాసీనులైరి. మా కానందము చేకూర్చెడి పద్యములు చదువుము నాయనా!" యనిరి.

బావగారి కోర్కె తీర్చవలయునని, భక్తులంద రానందము చెందవలయునని గురుభక్తి తత్పరుడగు శ్రీ కోట సుబ్బారావు మనస్సం తయు శ్రీ సద్గురు స్వరూపమునందు లగ్నము చేసి సద్గురు మహిమాతి శయమును పొగడి శ్రీ సద్గురు శక్తిం వర్ణనీయమగు పద్య పంచరత్న ముల నార్తితో నావేశముతో, శరీరము నే మరచి గానము చేసిరి.

ప్రక్కనే సుఖాసీనులై యున్న శ్రీ చేవూరి కోటయ్యగారి మనస్సు ద్రవించెను. హృదయ ముప్పొంగెను. ఆ క్షణమే జీవసమాధినిష్ఠాగరిష్ఠు లైన సద్గురు శ్రీ యోగానందమహర్షి మహత్తర దివ్యశక్తి, నృసింహ భక్తితత్పరులగు శ్రీ చేవూరికోటయ్య హృదయమందు ప్రవేశించెను. వెంటనే కోటయ్య తన జేబులోనున్న రూపాయలనోట్లకట్టను దీసి యందొక రూపాయినోటుపైన కన్నులు మూసుకొని యీ విధముగ వ్రాసిరి.

"శ్రీ యోగానంద నృసింహమూర్తిదయచే హరిదాసు కావలయు నని నా యాజ్ఞ. శ్రీ గురుదేవుని యాజ్ఞచే నీ ప్రియశిష్యుడు చేవూరి

కోటయ్య ది 30-4-61. తేది కోట సుబ్బారావు స్వామివారి తోటలో పాడిన పాటల కానందము కలిగి సమర్పించినది. చే॥ కోటయ్య, ది 30-4-61."

శ్రీ సద్గురు పరశక్తియే కోటయ్య హృదయమునచేరి యీ విధముగా వ్రాయించినది. కోటయ్యగారు రూపాయినోటు చేతపుచ్చుకొని "సహృదయులగు సోదర, సోదరీమణులారా! సద్గురుశక్తి కిదొక పరమ నిదర్శనము. ఈ సుబ్బారావునకు వ్యాపారయోగము లేదు. ముందుకాలమున హరిదాసై పరమభక్తుల చరిత్రల నాదర్శముగా కథాగానములు చేసి ప్రజల మన్ననలపొంది బంగారు పతకములను నృసింహమూర్తి బంగారుముద్రను మెడయందు దాల్చెడి యోగమున్నది. ఈ వాక్యములన్నియు నా యారాధ్యదైవమగు శ్రీ సద్గురుమూర్తియే పలికించుచున్నాడు.

ఆ కనుపించెడి చెట్టుపై సద్గురు సత్యస్వరూపము సాక్షాత్కరించి నాచేత నీ రూపాయినోటుపై భవితవ్య సువర్ణాక్షరములను లిఖింపచేసె"నని చెప్పి పాదములయొద్ద కాచుకొనియున్న సుబ్బారావునకు సమర్పించిరి.

శ్రీ సుబ్బారావు, బావగారి దేహములో ప్రజ్వలించెడి శ్రీ లక్ష్మీ నృసింహ దివ్యస్వరూపమునకు సాష్టాంగనమస్సు లర్పించి "ఓ బావా! నీ ద్వారా యిప్పించిన యీ పవిత్రాశీర్వాద మహాభాగ్యమును, నా హృదయపేటికయందు భద్రము దాచి సద్గురునాజ్ఞయే నా జీవితాశా జ్యోతి యని గుర్తించి ప్రవర్తించెద" నని బావగారి పాదపద్మములను కన్నుల కద్దుకొనిరి.

## గ్రంథకర్తగారు కుటుంబముతో దక్షిణదేశయాత్రలు సేవించుట

దైవనిర్ణయమును మార్చుటకు సామాన్యవ్యక్తులకు శక్తి చాలదు. అతీంద్రియ జ్ఞానానందమయులగు సద్గురువులకే యదిలభ్యము.

ఈ గ్రంథకర్త యేమిపనులు లేకపోయినను వినుకొండకు వెళ్ళి రావలయునను సంకల్పము గలిగి వెంటనే ప్రయాణమై వినుకొండకు వెళ్లి పవిత్రవంతమగు శ్రీ యోగానందమఠమును చేరి శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరమూర్తికి ప్రణామము లర్పించి, పూజనీయురాలగు శ్రీమహా లక్ష్మీదేవికి నమస్సులర్పించిరి.

శ్రీ మహాలక్ష్మీదేవి "నాయనా! సుబ్బారావూ! శుభసమయ మునకే విచ్చేసితివి. నీ ప్రాప్త మెట్లున్నదో? మన వేంకటేశ్వరస్వామి వారి ప్రియశిష్యుడగు సన్నిధి శేషగిరిరావు, మీ సోదరుడు కోట సత్యనారాయణ కుటుంబసహితముగా మఱికొందరు భక్తులు, భక్తురాం డ్రెందరో దక్షిణదేశ యాత్రాస్పెషల్ రైలులో వెళ్ళుటకు ప్రయాణ మైనారు మంచిసమయము. ఈసమయము మిగిలిపోయిన మీరు దర్శించ లే"రని బోధింపగా సుబ్బారావు హృదయముప్పొంగి మేము ప్రయాణ మునకు సంసిద్ధమే యనిరి.

శ్రీ సుబ్బారావు ధర్మపత్నిని ప్రయాణముచేయించి పెద్ద కుమార్తెయగు కళావతిని తాతగారింటికి పంపించిరి. ప్రియపుత్రుడగు రామకృష్ణుని, గారాబుపట్టియగు విజయలక్ష్మిని వెంటబెట్టుకొని స్వగ్రా మము వీడి వినుకొండకు వెళ్ళి శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరస్వామి మొదలగువారితో విజయవాడ వాస్తవ్యులు మువ్వల ఆంజనేయులు, రాయల వెంకటేశ్వరరావు అధ్వర్యమున నడిపెడి రైలుపెట్టెయందు 1961 సెప్టెంబరు పదహారున సుఖాసీనులైరి. సాయంత్రము 3 గంట లకు 'మద్రాసు' సెంట్రల్ స్టేషనులో దిగి పట్టణదృశ్యములు తిలకించి సాధువుల యాశ్రమములు, పవిత్ర దేవాలయములు, సముద్రప్రాంతము, జంతుప్రదర్శనశాల మొదలగు దృశ్యముల నెన్నింటినో దర్శించిరి.

ప్రతి దినమును రైలుపెట్టెలో నుదయ మేడుగంటలకు మైకు ద్వారా శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరస్వామివారు ధ్యానశ్లోకములు పఠించి, పవిత్రమగు శ్రీ భగవద్గీతను పారాయణమొనర్చి యంపలి

మధురభావముల నరటిపండొలిచినరీతి చెప్పి యాత్రికుల హృదయము లలో సాధుభావముల నంకురింపచేయుచుండెడివారు.

సెప్టెంబరు పందొమ్మిదిన సమీపమందున్న తిరువళ్ళూరు వెళ్ళి కోనేటియందు యాత్రికులందరు స్నానములుచేసి శ్రీ వీరరాఘవస్వామి యాలయమును ప్రవేశించిరి. గ్రంథకర్తగారీ యాలయము ప్రవేశింప గనే శరీరము గగుర్పొడిచి యానందాశ్రువులు వెల్లివిరియ నావేశ పూరితులై "శ్రీ నారసింహా జయ నారసింహా"యని బిగ్గరగా గానము చేయుచు దేవునెదుట నృత్యము చేసిరి.

ఈ సంఘటనను వీక్షించుచున్న శ్రీ వేంకటేశ్వరస్వామివారు సుబ్బారావుతో "మనసద్గురుదేవులగు శ్రీ యోగానందమూర్తి యీ యాలయమూర్తిని ఎన్నోరోజులు సేవించిరి. శ్రీ సద్గురుదేవులు సంచ రించిన యీ పవిత్రక్షేత్రస్థలమునకు నీవు చేరినావు. కనుక శ్రీ సద్గురు దేవుని మనస్సానందముచెంది నీ హృదయమున ప్రవేశించి యాత్మా నందము ననుభవింపచేసినా"రని చెప్పిరి. యాత్రికులు తిరువళ్ళూరు నుండి మద్రాసుచేరి, యిరువదవ తేదీన మద్రాసువీడి, చెంగల్పట్టుచేరి, సమీపమందుగల 'పక్షితీర్థము' నకు పోయి యాలయ మూర్తులను సేవించిరి. కొండపైన వెండి బంగారుగిన్నెలలో పాయసమును పన్నెండు గంటలకే యిరువైపులనుండి రెండుపక్షులు వచ్చి పాయసమును కొంత భక్షించి యాలయముచుట్టును ముమ్మారు ప్రదక్షిణముచేసి పర్వులు తీసెడి దృశ్యమును కన్నులారగాంచిరి. ఆనాడే సమీపమందున్న 'మహాబలిపురము'చేరి పంచపాండవుల రాతిరథములు, నేనుగును, సింహ మును దర్శించి లైటుహౌస్ నెక్కి ప్రక్కనే పొంగులువారెడు సముద్ర కెరటములను దర్శించి యాత్రికు లందరు నా రాత్రికే చెంగల్పట్టు చేరిరి.

ఆ రాత్రికే బయలుదేరి యిరువదియొకటవతేదీ యుదయ మూరు గంటలకు శివకంచిలో దిగి కాలకృత్యములు నెరవేర్చి కోనేటియందు హాయిగా స్నానము లాచరించి, పూలు, పండ్లు, నారికేళ కర్పూరాది

వస్తువులతో యాత్రీకులందరు, ఏకాంబరేశ్వరుని యాలయము ప్రవేశించి, భక్తితో పూజించి నమస్సు లర్పించి, తీర్థప్రసాదములను స్వీకరించిరి. ఆలయము వెనుకభాగమున నాల్గుశాఖలతో విరబీగెడి వేదవృక్షమును, వేయిస్తంభముల కల్యాణమంటపమును దర్శించిరి. ఆలయము వీడి గుర్రపుబండ్లలో నాసీనులై శ్రీకచ్ఛపేశ్వరాలయము, జగజ్జనని జగన్మోహిని యగు కామాక్షిదేవి యాలయము, ఇరువది మూరల పొడవు గలిగి ఒక పాదము యూర్ధ్వమునకు, మరొక పాదము అధోముఖమునకు, మూడవపాదమును బలిచక్రవర్తి శిరస్సుపై మోపిన వామనమూర్తి గంభీరదృశ్యమును దర్శించిరి. శ్రీ వరదరాజస్వామి యాలయము ప్రవేశించిరి. వరదరాజస్వామి, దేవాలయముపై యంతస్తునం దున్నారు. భువనమోహన సౌందర్యముతో ప్రకాశించెడి వరదరాజస్వామిని తనివిదీర దర్శించి యాలయమందే గల వెండి బంగారు బల్లులను దర్శన స్పర్శనములను పొందిరి.

ఆరోజు ఆలయమందు షుమారు రెండువందల మంది బ్రాహ్మణులు దేవుని నూరేగింపుచు వేదమంత్రాలు వారందరు ఒకే శ్రుతితో యాలయమంతయు మార్మ్రోత మ్రోగునట్లు గానము చేసిరి.

ఆ రాత్రికే బయలుదేరి విళ్ళుపురం జంక్షన్ మీదుగా ఇరువది రెండవ తేదీ యుదయ మారుగంటలకు పాండిచేరిలో దిగి మహదానందముతో పట్టణము నానుకొనియున్న సముద్రమున స్నానములు చేసిరి. పాండిచేరి రాజవీధులను చూచి, తళతళ కాంతులతో కళకళలాడుచు దివ్యసౌరభమును వెలార్చెడి పవిత్రవంతమగు శ్రీ అరవిందాశ్రమమును దర్శించి శ్రీ అరవిందఘోష్ సమాధికి పుష్పము లర్పించి ప్రణమిల్లిరి. ఆశ్రమసేవలకే జీవితము నంకితమొనర్చిన తెల్లదొరసానియగు, 'మాత' యను నామెను దర్శించిరి. ఆమె యతివృద్ధు. భక్తులకు దర్శనమిచ్చు తలంపుతో ప్రతిదినమును 12 గంటలకు మేడపైభాగమునకు వచ్చి దర్శనమిచ్చుచుండును. ఆ రోజంతయు పాండి

చేరి రాజవీధుల సౌందర్యమును వీక్షించి, పాండిచేరినుండి, విళ్ళిపురం మీాదుగా యిరువదిమూడవ తేదీన యుదయము 8 గంటలకు చిదంబరం పుణ్యక్షేత్రము చేరినారు. ఆలయము ప్రవేశించి నటరాజస్వామిని దర్శించి గోత్రనామములతో పూజలు చేయించి చిదంబర రహస్య మనెడి తెరచాటు మారేడుదళముల దర్శించి యందలి రహస్యార్థము గ్రహించి యా రాత్రికే బయలుదేరి, యిరువదినాలుగు తేదీ ఉదయ మేడు గంటలకు మయూరము చేరి, మయూరేశ్వరస్వామిని దర్శించి పూజించి యానందించిరి.

వారు సాయంత్రమునకే మయూరమునుండి కుంభకోణము చేరి యాత్రీకులందరు శుచిస్నాతులై యాలయప్రవేశమై మూల విరాణ్మూర్తియగు శ్రీ కుంభేశ్వరస్వామిని వారి ధర్మపత్ని మంగళాంబను దర్శించిరి. అచ్చటనుండి పట్టాభిరామాలయమునకు పోయి స్వామిని దర్శించి, వెంటనే సారంగపాణి రథసారథి యాలయమును దర్శించి ఆశ్చర్యమానసులైరి. రథము, సారథి, గుఱ్ఱములు, యాలయము మొత్తము ఒకే రాతియం దమర్చిరి. శ్రీ సారంగపాణిదేవుల ధర్మపత్ని కోమలవల్లి తాయారుదేవిని దర్శించి, అక్కడనుండి నాగేశ్వరస్వామి యాలయము ప్రియనాయకి దేవాలయమూర్తులనుదర్శించి, ఇరువదైదున శ్రీ కాళహస్తీశ్వరాలయము, చక్రపాణిదేవాలయము, విజయవల్లి తాయారు ఆలయము శ్రీ విశ్వేశ్వరాలయము లన్నిటిని ఆనంద ముతో వీక్షించి. కుంభకోణమునుండి 'మధ్యార్జునము' అనగా తిరువడ-మరుదూర్ వెళ్ళి బ్రహ్మహత్యాది మహాపాపములను మటుమాయ మొనర్చెడి శ్రీ జ్యోతిర్మహాలింగేశ్వరుని దర్శించినారు. ఈ యాలయ ముఖమండపము చాల పెద్దది. పోయిన ద్వారములలో తిరిగి రాకూడ దనెడి నియమము యీా యాలయమందే కలదు. కారణము, చోళరాజు గుఱ్ఱపుస్వారీలో వెళ్ళుచున్న సమయమున బ్రాహ్మణబాలుడు గుఱ్ఱపు తాడనముచేత మరణించెను. ఆ బాహ్మణబాలుని హత్యాదోషము బ్రహ్మరాక్షసిరూపముతో రాజు వెనువెంట పయనించి అఖండమగు

శిరోవేదన ఆ రాజునకు సంభవింపచేయుచున్నది. ఆ రాజు బాధ కోర్వ లేక భగవత్సేవతో నీ పాపపరిహారమౌనని సర్వపుణ్యక్షేత్రములు దర్శింపసాగెను. రాజుగారు గర్భాలయప్రవేశముగువరకు బ్రహ్మహత్యా దోషము శిరోవేదనరూపముతో తీరని వెత గల్గింపసాగెను. గర్భాలయ ప్రవేశమై భగవదారాధన సంపూర్తిచేసి చోళరాజు బయటకు వచ్చు వరకు గర్భాలయద్వారము ప్రక్కనే బ్రహ్మరాక్షసి కూర్చొని వేచి, కాచి గర్భాలయప్రాంగణము దాటి కాలుకదపగనే రాజుగారికావేశించి బాధింపసాగెను. చోళరాజు చేయునదిలేక చేసినకర్మ ననుభవించుచు ననేకాలయమూర్తులను దర్శించి, సేవించి విసుగుతో చిట్టచివరకీ జ్యోతిర్మహాలింగేశ్వరు నాలయము ప్రవేశించిరి. బ్రహ్మరాక్షసి వెన్నంటి వచ్చుచు గర్భాలయద్వారముప్రక్క కాచుకొని సుఖాసీనమై యున్నది. చోళరాజు పాపము నశించినది. చోళరాజు తనలో 'ఓ జ్యోతిర్మహాలింగేశ్వరా! ఈ చోటువీడి వెనుకకు మరలినచో బ్రహ్మ రాక్షసి కాచుకొని యున్నదని, గర్భాలయమందే ప్రక్కగోడకు రంధ్రముచేసి వెళ్ళిపోయి మనశ్శాంతిని పొందిరి. చోళరాజుగారు వెళ్ళిపోయిన మార్గము రాతి స్తంభములతో మంటపమును నిర్మాణము చేయించి వారొక శపథముచేసిరి. ఈనాటినుండి యెవ్వరీ యాలయ మందు ప్రవేశించినను దైవదర్శనమును చేసికొని వెనుకకు మరలక చోళరాజుగారు వెళ్ళిన మార్గమందే యాత్రీకులు వెళ్ళవలెను. ఈనాటి వరకు గర్భాలయద్వారముప్రక్క బ్రహ్మరాక్షసి కూర్చొనియేయున్నది. ఈభయముచేత యాత్రీకులు గర్భాలయముజొచ్చి భయముతో వెను కకు మరలక చోళరాజుగారెళ్ళిన మార్గమందే వెళ్ళుచుందురు.

వీరెల్లరు యీ నియమమును పాటించి తిరువడమరుదూర్ గ్రామము వీడి కుంభకోణము చేరిరి. యాత్రీకబృంద మా దినముననే కుంభకోణము నుండి తంజావూరు చేరిరి.

ఇరువదారున తంజావూరు పట్టణమంతయు తిరిగి విశేషములను చూచిరి. బృహదీశ్వరాలయమునకు వెళ్ళి బృహదీశ్వరుని దర్శించి

నారికేళములు సమర్పించి కర్పూరము వెలిగించి, "ఓ ప్రభూ! బృహదీశ్వరా! సంసారసముద్రమును దాటించి, శాంతియుతమగు నీ నిలయమునకు చేర్చుము తండ్రీ!" యని ప్రార్థించిరి. బృహదీశ్వరాలయపు గాలిగోపురము మహాశిల్పు లెంతో నేర్పుతో నిర్మించిరి. గాలిగోపురపు నీడ, మూడు వేళలలో నెప్పుడు భూమిమీద పడనిరీతి, గోపురము మీదనే యుండునటుల నా మహాశిల్పులు ప్రజ్ఞతో నిర్మించిరి. పేరు ప్రఖ్యాతులు గాంచిన నందీశ్వరుని దర్శించిరి. ప్రత్యేకముగా నొక గద్దెను నిర్మించి యాగద్దెపై నంత పెద్దనందీశ్వరుని, విద్యుచ్ఛక్తి లేని రోజులలో యంత్రసహాయము లేనిరోజులలో నెట్లు పైకి చేర్చిరో, కాని చూచువారల కాశ్చర్యము నానందము గలుగుచుండును. తంజావూరునకు సమీపమందే ప్రపంచ విఖ్యాతిగాంచిన కృతులను రచించిన శ్రీ త్యాగరాజస్వామివారి జన్మభూమి యగు తిరువయ్యార్ మహాక్షేత్రమునకు యాత్రికబృందముతో బాటుగ సుబ్బారావు వెళ్ళి కావేరి నదియొడ్డున స్వయంజ్యోతివలె ప్రకాశించెడి మహాభక్తశిఖామణి యగు శ్రీ త్యాగరాజస్వామివారి సమాధిని దర్శించి, ప్రణమిల్లి హృదయపూర్వక నమస్సు లర్పించిరి. పంచనదీశ్వరాలయము ధర్మసంవర్ధని దేవాలయముల దర్శించిరి. ఈ దేవాలయములను దర్శింపవలయునే గాని వర్ణింపనలవికానివి. ఆనాటి రాజులు ఆనాటి శిల్పులు ఆనాటి పౌరులు నెట్టి ఆస్తిక్యమూర్తులో! యీ మహత్తర నిర్మాణములే మనకు ప్రత్యక్షప్రమాణములు.

ధర్మసంవర్ధని దేవాలయ మెన్నో వందల సంవత్సరములనాడు కట్టించినది. ఐననేమి, ఈ నాడు చెక్కిన శిల్పమువలె నూతన శోభతో నందలి ప్రతిమలు విరాజిల్లుచుండును. పాలరాతితో గర్భాలయ మఖండమైన కాంతితో వెలుంగుచున్నది. గర్భాలయముల నెన్నెన్నో దర్శించిరి కానీ యీ ధర్మసంవర్ధనిదేవి గర్భాలయపు పనితనము, మరెచ్చటను సుబ్బారావునకు కానరాలేదు అది వేయికన్నులతో దర్శించిన తృప్తిగలుగును.

తిరువయ్యార్ నుండి యాత్రీకులందరు తంజావూరువచ్చి, భోజనములు చేసి శయనించిరి. సాయంత్రము 4 గంటలకు లేచి యాత్రీక బృందము తంజావూరు మహారాజావారి కోటలోపల ప్రవేశించి రకరకముల, రంగురంగుల చిత్రలేఖనములను దర్శించిరి. రాజదర్బారున ఆరు వందల సంవత్సరములనాడు వేసిన రంగులన్నియు నీ నాటికి నూత్న కాంతితో వెలుగొందుచున్నవి. ఆ రాత్రికే బయలుదేరి తంజావూరు వీడి సూర్యోదయమగువరకు తిరుచునాపల్లి చేరిరి. ఈ తిరుచునాపల్లి రైల్వేస్టేష నెంతో రమణీయముగా నున్నది. చూడముచ్చటైన 'అండర్ గ్రౌండ్' కలదు.

సెప్టెంబరు ఇరువదియేడవ తేదీ యుదయము యాత్రీకబృంద మీ తిరుచునాపల్లినుండి సమీపముననున్న శ్రీరంగ మను మహాక్షేత్రమునకు వెళ్ళిరి. శ్రీరంగనాయకస్వామి యాలయముచుట్టును పూలమాల వలె కావేరినది ప్రవహించుచున్నది. ఈ దృశ్య మమితానందము గొల్పుచుండును. దక్షిణకావేరిలో స్నానసంకల్పములు పూర్తిగావించి, గ్రామ మధ్యభాగములో వెలింగెడి శ్రీరంగనాయకస్వామి యాలయము ప్రవేశించిరి. కన్నులు మిఱుమిట్లు గొల్పినవి. యొకటిగాదు రెండు కాదు 'సప్తప్రాకార శ్రీరంగనాయకా' యన్నటులే, ఏడు ప్రాకారములు విరాజిల్లుచున్నవి. నాల్గుముఖముల మహోన్నతములగు సింహద్వారము లున్నవి. ఒకటి రెండు మూడు ప్రాకారములలో గ్రామ పౌరులు, వివిధ రకములగు వ్యాపారములు సాగించుచు సంసారములు చేయుచు స్వామి సేవించుచు జీవయాత్ర సాగించెదరు. మిగిలిన నాల్గు ప్రాకారములు పుష్పతో, కళకళలాడుచుండును. శ్రీరంగనాయక స్వామి ముందు, బంగారు బలిపీఠము ధ్వజస్తంభము తళతళకాంతులతో యలరారెడు శ్రీరంగనాయకస్వామిని దర్శించి పూజించి తీర్థ ప్రసాదముల గైకొనిరి. శ్రీ స్వామి సన్నిధిలో నున్న శ్రీదేవి భూదేవి శ్రీరంగనాయకి మూర్తుల దర్శించిరి శ్రీరంగనాయకుని రూపము మరపురానిది. పదహారుమూరల పొడవున స్వామి పవళించి

నారు. సాక్షాత్తుగ శ్రీ వైకుంఠనిలయమనియే నొక్కి వక్కాణింప వచ్చును. సందేహము లేదు.

శ్రీరామ లక్ష్మణ సీత ఆంజనేయమూర్తులను, వెయ్యి స్తంభాల మండపమును దర్శించిరి. శ్రీరంగనాథుని యాలయము దర్శించ వలయునేకాని యాలయ సౌందర్యమును గూర్చి యెన్ని పంక్తులు వ్రాసినను కొంతయే.

శ్రీరంగనాథుని యాలయ మానాటి చోళరాజు లెట్టియాధ్యాత్మిక విభూతిని యనుభూతినిపొంది నిర్మించిరో కాని, సామాన్యమైన పని కాదు. సర్వవేదాంత సారస్వతమంతయు నుత్తమమానవుల కీ రంగ నాథుని యాలయమే బోధించును. సందేహమే లేదు.

జీవునకు సప్తావరణములవలె నీ యాలయమునకు ఏడు ప్రాకారము లున్నవి. ఆలయములో నుండెడి ధ్వజస్తంభమువలె చలనరహితమై దేవునికై ప్రాకులాడెడి జీవుడు, తన దేహాలయమున నున్న, వెన్నెము కను చక్కగా నిల్పవలయును. గర్భాలయమునకు వెళ్ళుటకు ముందే బలిపీఠముండును. ఆ బలిపీఠాశయమేమో కాదు. భగవద్దర్శనము కావలెననిన, జీవగుణము లన్నియును బలిచేయవలయును. కోరికలను రూపుమాపవలెను. ఆనాడే దైవక్యపలభింపగలదని యది సూచించును.

శ్రీ రంగనాయకస్వామి కిరువైపుల ముప్వురుభార్యలుగలరు. సంసారదృష్టిగల కలిమానవు లదిచూచి "ఓహో! స్వామివారి కొక భార్యకాదు, ముప్వురున్నారు. మన కొకరేగదా!" యని తమలో తాము సంతసమును పొందుచున్నారు.

శ్రీ రంగనాయకస్వామివారి పాదములయొద్ద నిర్వురు భార్యలు, శిరోభాగమువైపు నొక భార్యయు యాత్రీకులకెల్లరకు దర్శనమిచ్చు చునే యుందురు. ఈ యదార్థసత్యములన్నియు ఈ గ్రంథకర్తగారి కెప్పటికప్పుడు శ్రీ సద్గురునృసింహ దివ్యశక్తిమూలమున తేటతెల్ల మగుచుండును.

శ్రీ రంగనాయకస్వామి వారెప్పుడు యోగనిద్రావిభూతిలో విరాజిల్లుచుందురు. అట్టి వేదవేద్యునకు, ఇడా పింగళ సుషుమ్నా నాడు లనే భార్యలనుగా రూపొందించిరి. శిరోభాగమునైపుననున్న శ్రీ స్వరూపమే సుషుమ్నానాడి. ఇడా పింగళ నాడులను త్యజించి సుషుమ్నానాడిద్వారా సహస్రారమున వెలింగెడి నన్నుచేరి నిత్యానంద మును పొందుమో జీవుడాయని యా దేవుడు సదా మనకు ప్రబోధము చేయుచున్నాడనెడి సద్భావమును పాఠకమహాశయులకీ గ్రంథకర్త సుబ్బారావుగారు వ్యక్తముచేసిరి.

బలిపీఠముదాటి గర్భాలయము ప్రవేశించగనే గంటయొకటి వ్రేలాడుచుండును. అనగా భగవత్సన్నిధికిచేరుముందు నీకపాలములోని ప్రణవమును ప్రమోగించవలెను. ఆ ప్రణవధ్వనితో నీ చిత్తచాంచల్యము సమసిన మరుక్షణమే గర్భాలయమూర్తియగు శ్రీమన్నారాయణు నెదుట నారికేళము పగులగొట్టి భగవంతునివైపునకు టెంకాయచిప్ప లను మరల్చి కర్పూరమును వెలిగించి మనస్సు పరమేశ్వరునియందు లగ్నముచేసి రెండుచేతు లొకటిగా చేర్చి నమస్కరింతురు. ఈ భావ మేమో సామాన్యులు తెలిసికొనలేక తలకొకరీతి సంభాషించుచు దైవ దూరు లగుచున్నారు.

అనేకజన్మలనుండి వెంబడించి వచ్చెడి కర్మవాసన లను పీచును తొలగించి సత్వగుణమగు పరమాత్మను తెలియనివ్వక యావరించిన మాయ యనెడి పై యావరణమును తొలగించి నారికేళము పగుల గొట్టినరీతి నీ మాయావరణమును పగులగొట్టి, మాయ విడివడినవెంటనే భగవత్పదార్థమగు సత్వగుణము సత్యగుణమగు శుద్ధసత్వమగు తెల్లని స్వరూపముతో జ్యోతిర్మయమూర్తిని దర్శింపవలయు ననెడి యా ధర్మ సూత్రమునకై యా టెంకాయలోని తెల్లనిపదార్థమును యదార్థమగు పరమాత్మముందు పెట్టుచున్నారు. జీవుడే దేవుడు. జీవరూపము దైవ రూపములో నంతర్లీనము చేయవలెనను భావమునకు నిదర్శనముగా జీవరూపమగు కర్పూరమును దైవరూపమగు నగ్నియందుచేర్చి వెలి

గించి హారతి నొసంగుచున్నాము. దృశ్యస్వరూపమగు నీ పాంచభౌతిక ప్రకృతియంతయు నశించును. సర్వము నాస్తి, ఏమియులేదు. అంతయు హుళక్కి-యని బోధించుటకే ప్రతిదినము సంధ్యమున మంగళహారతి నిచ్చెదము. ఎంతకాలమునుండియో యీ మంగళహారతిని విధిగా జరుపుచున్నాము. నిజమైన విధిని మరచినాము. మానవహృదయములో నున్న యహంకార, మమకారములకు మంగళహారతి నివ్వవలయును. తదుపరి మంగళప్రదమైన, సర్వాత్మయగు పరమాత్మ సాక్షాత్కారమును పొందవలెను. ఇట్టి స్థితి నొందినవారే తీర్థయాత్రన్వేషణకు సరియగు ఫలమును పొందినవా రయ్యెదరు.

ఏతదనుభూతి నొందనినాడు యాత్రలెన్ని చేసినను, నాలయములెన్ని దర్శించినను, నారికేళములెన్ని పగులగొట్టినను, కర్పూరమెంత వెలిగించినను, కోనేళ్ళలో బుడకోళ్ళవలె నెన్నిమారులు మునకలు వేసినను, ధనమెంతగ వెచ్చించినను ఫలముమాత్రము శూన్యము. "ఇల్లు గుల్ల ఒళ్లుగుల్ల" అన్న సామెతయే సార్థకమగును.

శ్రీరంగనాథుని యాలయమున రకరకములగు నిత్తడి, వెండి, బంగారు, గాజు, మట్టి మొదలగువానితో తయారుచేసిన వివిధరకములగు వస్తుసామాగ్రి యమ్మెడి దుకాణములు క్రిక్కి-రిసియుండును.

సాయంత్రము 4 గంటలకు యాత్రీకుల మందరము శ్రీరంగము నుండి మూడుమైళ్ళ దూరముననున్న జంబుకేశ్వరము చేరితిమి. ఆలయము పెద్దది. గర్భాలయములో నీ రూరుచుండును, యంత్రసహాయముతో గర్భాలయములో నీరు సదా తోడుచుందురు. ఈశ్వరుడు నీటిలో మునుగుచు, తేలుచు చూచువారల కాశ్చర్యము గొల్పుచుండును. అదియొక సజీవాకృతి సంస్ఫురించును.

ఈ జంబుకేశ్వరుని సహధర్మచారిణి అఖిలాండేశ్వరి. ఈ దేవి యాలయ మీశ్వరాలయముకంటె చాలపెద్దది. అండపిండ బ్రహ్మాండములను మహాశక్తితో నుజ్జీవింపచేయు లోకమాతగుట చేతనే యీ

దేవి అఖిలాండేశ్వరి యని పిలువబడుచున్నది. వేయి స్తంభముల మండపము దర్శనీయమైనది.

జంబుకేశ్వరుని సేవించి తీర్థప్రసాదములు గైకొని ప్రొద్దు గ్రుంకునప్పటికి శ్రీరంగము చేరి తనివిదీరక సత్రశాలలో నుండుటకు మన స్నాప్పక శ్రీ రంగనాయకాలయమునకు వెళ్ళి గర్భాలయ సమీప స్తంభముకడ ప్రశాంతముగా కూర్చొని శ్రీ రంగనాథుని సేవించెడి భక్తబృందమును కనులార దర్శించి శ్రీ సుబ్బారావు యాత్రిక బృందముతో బాటుగ నపరిమితానందమును పొందెను. 'ఆహాహా! మానవనిర్మితమగు నీ యాలయములోనే యింతవైభవముగా నున్నది. సత్యమై నిత్యమై యాదిమూలమై వెలింగెడి భగవంతుడు నిర్మించిన యీ మానవ దేహాలయములో సహస్రారమను గర్భాలయమున వెలింగెడి పరంజ్యోతి స్వరూపమగు పరమాత్మ దర్శనమును పొందిన మహనీయులెట్టి బ్రహ్మానందమును పొందెదరో తజ్ఞు లెరుంగుదురు.

సెప్టెంబ రిరువది ఎనిమిదవ తేదీ యుదయము శ్రీరంగమునుండి తిరుచునాపల్లికి వెళ్ళి పట్టణ మధ్యభాగముననున్న కొండపై వేంచేసిన శ్రీ మాతృభూతేశ్వరాలయమునకు చని మాతృభూతేశ్వరుని దర్శించిరి. కొండ మొదటిభాగమునుండి కొండశిఖరముననున్న ఈశ్వరాలయము వరకు పాలరాతితో నందమైన మెట్లమర్చిరి. మొదటినుండి చివరవరకు, యాత్రీకుల సౌకర్యమునకై సూర్యరశ్మి పడనీయక నినుపదూలములు వేసి పెద్దకట్టడము కట్టిరి. అది యెంతయో గంభీరముగా నుండును. ఈశ్వరుని రాణియైన సుగంధకుంతలాంబను దర్శించి కొండశిఖరమున నున్న గణేశ్వరాలయమును చేరి యాత్రీకులు, కొండ శిఖరమునుండి తిరుచునాపల్లి పట్టణ దృశ్యమును, మెలుదారములో పూలహారమువలె తెల్లని నురుగులతో ప్రవహించెడి కావేరీ నదీమతల్లిని దాని ప్రక్కన కనుపించెడి శ్రీరంగదృశ్యము కన్నులపండువుగా దర్శించెడుతఱి పొందిన యానందమునకు మేర లేదు,

మానవుడై జన్మించిన వాడిట్టి మహత్తర భగవద్దృశ్యములు విధిగా దర్శింపవలెను. జీవదేవ సమన్వయసిద్ధి నాందిగ, మానవ జీవితాంతమున విధిగా నొకసారియైనను పవిత్ర దేవాలయములను దర్శింపవలయును. కొందఱు నయాపైసయైనను ఖర్చుచేయుటకు మన స్సొప్పక భార్యాపుత్రుల లంపటమున చిక్కి, విడివడుటకు ప్రయ త్నింపక సంసారమే స్వర్గము, మనయిల్లే దేవాలయము, గృహిణియే యారాధ్యదైవమని, సంతానమే జీవితాశాజ్యోతు లని, మూఢవిశ్వాస ముతో, మొండివాదములతో, కామెర్లరోగులవలె, నెక్కడ తిరిగిన నేమి ప్రయోజనము. సంసారములో నుండియే సాధించవలయునని మెట్టవేదాంతము లిట్టివారు చెప్పుచుందురు. ఇట్టి మూఢుల కెన్ని యుగములకైనను ముక్తిలేదు.

ఆ రాత్రికి బయలుదేరి, ఇరువదితొమ్మిదవ తేదీపగలు 12 గంట లకు పాంబన్ స్టేషనుకు చేరితిమి. అటనుండి బయలుదేరి సాయంత్రము 4 గంటలకు ఇంజనీరుల ధీశక్తియుక్తులతో సముద్రముపై నిర్మించిన బ్రహ్మాండమగు వంతెన మీదుగా రామేశ్వరము రైలుస్టేషనుకు చేరితిమి.

రామేశ్వర మనెడి రైలుస్టేషను చిన్నది. పోలీస్‌స్టేషనువలె నుండును. రైలుస్టేషను నుండి 3 ఫర్లాంగులలోనున్న శ్రీ రామేశ్వర మహాక్షేత్రమునకు చేరి బ్రాహ్మణసత్రములో యాత్రికులు మకాము చేసిరి.

ఆ నాటి సాయంత్రము శ్రీ రామలింగేశ్వరాలయమునకు చని యపరిమితానందము, నమితాశ్చర్యము యాత్రికులు పొందిరి. ఈ రామ లింగేశ్వరాలయ మన్ని యాలయముల కన్న మిన్నయైనది. బహు పురాతనమైనది. ప్రాకారత్రయము గలిగి మహోన్నతమై మహాశిల్ప కళతో, వందలకొలది రాతిస్తంభములతో, సాక్షాత్కైలాసమువలె కళకళలాడుచు, తళతళలతో నిత్యనూతనభంగిమలతో నిది యలరారు చున్నది.

మూఢమానవుల హృదయములలో నావరించిన యజ్ఞాన మను కటికి-చీకటిని రూపుమాపి జ్ఞానజ్యోతిని వెలిగింపచేయుటకై, భూలోకమున సాక్షాత్కరించిన భోళాశంకరుని శ్రీ రామలింగేశ్వరస్వామిని దర్శించితిరి. ప్రక్కనేయున్న కాశీవిశ్వనాథుని దర్శించిరి. ఆ రాత్రి పది గంటలకు స్వామివారి ధర్మపత్ని పర్వతవర్ధని యమ్మవారిని లక్షా యాబదివేల రూపాయలు విలువగలిగిన బంగారుపల్లకియం దుంచి యాలయపు మూడవప్రాకారములో, వివిధరకములగు మంగళధ్వనులు చెలంగ, శివభక్తులందరు పల్లకివెంట "హరహర మహాదేవ శంభో! శంకరా!" యను ధ్వను లాలయమంతయు మార్మ్రోగ కరతాళ ధ్వనుల హరభజనలు చేయుచున్నతరి యా యాత్రికబృందము హర నామ భజన యొనర్చుచు పల్లకి వెంట తిరిగిరి.

శ్రీ స్వామివారి బంగారు పల్లకిని బ్రాహ్మణులమధ్యకు చేరి యీ గ్రంథకర్తగారు పదిగజములుమోసి ప్రక్కకు తొలగిరి.

రకరకముల భాషాసాంప్రదాయములకు చెందిన భక్తులు, భక్తురాండ్రు వివిధభాషలతో గర్భాలయముముందు నృత్యము చేయుచు హరనామమును కీర్తించిరి.

గర్భాలయముముందు ప్రతిదినమును రాత్రి 8 గంటలకు విద్యుక్తముగ మంగళవాయిద్యములు మ్రోగుచుండును. భక్తులు హార్మోనియము, మృదంగము, కంజర, ఫిడేలు, తాళములు, చిఱుతలతో శివ నామ భజనచేసెదరు. భాష తెలియకపోయినను భావము భక్తిభావమే గావున నీ భజనను కన్నులారగాంచి చెవులార విని యీ గ్రంథకర్తగారానందమును పట్టజాలక యా భక్తసంఘము మధ్యలో నాసీనులై శివనామభజన యొనర్చి, తెనుగుకీర్తనలు గానమొనర్ప నా కన్నడ భక్తులు శ్రుతి పక్వముగా జంత్రవాద్యములమేళవించి యమితానందము పొంది వారిభాషలో నేమో మాట్లాడిరి. గ్రంథకర్త యేమియు బదులు

మాటాడక 'ఈశ్వరవిలాసము ఈశ్వరవిలాసము ఈశ్వరవిలాస' మని ముమ్మారు నుడివి నమస్సు లర్పించిరి.

ఆ కన్నడభక్తు లానందముతో తెనుగువారు తెనుగువారని, నమస్సులర్పించి, యీ గ్రంథకర్త సుబ్బారావును గాఢాలింగనము చేసికొనిరి. వ్యక్తులు వేరైనను, భాషలు వేరైనను, ప్రాంతములు వేరైనను నాత్మయొకటే యనుటకు వీరి యానందావేశమే మనకు ప్రత్యక్ష ప్రమాణము.

ముప్పదియవ తేదీ తెల్లవారుజామున లేచి కాలకృత్యములు నెర వేర్చి (శ్రీ) రామలింగేశ్వరాలయమునకు చేరగా నా రామలింగేశ్వరునికి అర్చకస్వాములు మంత్రపూతముగా క్షీరాభిషేకము చేయించు చుండిరి. యాత్రీకులెల్లరును, రెప్పలార్పక ప్రశాంతచిత్తులై దర్శించిరి.

భగవంతుడు సత్వమయుడు శుద్ధసాత్విక స్వరూపుడు. శుద్ధ ప్రవృత్తితో మెలంగెడి మానవులకు మాత్రమే ఈశ్వర సాక్షాత్కా రము లభించుననుట కాదర్శముగా లింగస్వరూపమగు భగవంతునకు తెల్లనిపాలతో నభిషేకము చేయించుచున్నారు. యోగాగ్నితో సదా ప్రజ్వలించెడువాడు పరమేశ్వరుడు. ఆ కారణమున నీశ్వరు యోగాగ్నికి శాంతిగా నభిషేకములు చేయించుచుందురు. జలము కపాలముపై పడునట్లొక కలశమును వ్రేలాడకట్టెదరు.

యోగముతో రమించెడి నాత్మ బాహ్యప్రవృత్తి చెందవలెనన్న కర్ణములయొద్ద 'భోం భోం' మ్మని శంఖములు పూరించెదరు. జేగంటలు కొట్టెదరు. 'హర ఓం' యని ప్రణవమును జపించెదరు. ఆదిమూల మగు ఓంకార శబ్దమును గానము చేసెదరు.

ఈ నిదర్శనము లన్నియు దర్శించిన మనతత్త్వము మనకే బోధ పడును. మనతత్త్వము పరతత్త్వములో నేవిధముగా నేకీభవించునో ఆ మహోపదేశములన్నియు మనకు ప్రబోధము చేసిరని స్పష్టమగు

యాత్రికు లీశ్వరక్షీరాభిషేకమును దర్శించి క్షీరమును గ్రోలిరి. ఆంజనేయుడు తెచ్చిన కాశీలింగమును దర్శించిరి. కాశీవిశాలాక్షీ దేవిని దర్శించిరి. ఉదయ మూరుగంటలకు ఊరి వెలుపలనున్న రామతీర్థము, లక్ష్మణతీర్థము, సీతతీర్థము లనెడి కోనేరులలో స్నానమాచరించిరి. లక్ష్మణతీర్థము రామతీర్థముల కోనేళ్ళలోచేపలు విపరీతముగానున్నవి. ఈ కోనేళ్ళలోని చేపలను జాలరులను పట్టనీయరు. యాత్రీకులు వేసెడి పిండిపదార్థములు పండ్లు మొదలగువానిని ఈ చేపలు భక్షించి జీవనము చేయుచు సంతోషముతో షికారులు చేయుచుండును.

శ్రీరామలింగేశ్వరాలయములోనే యిరువదిరెండు తీర్థములున్నవి. ఈ తీర్థములలోని నీటితో స్నానములు చేసెదరు. ఈ యిరువది రెండుతీర్థములు బావుల రూపములోనున్నవి. కోటితీర్థము, సర్వతీర్థమనెడి బావులు రెండున్నవి. ఈ కోటితీర్థజలమును యాత్రీకులు పాత్రలతో భద్రపరపించుకొని స్వగృహములకు తీసికొని వెళ్ళుచుందురు.

సాయంత్రము నాలుగు గంటలకు రామేశ్వరమునకు మూడు మైళ్ళలోనున్న గంధమాదన పర్వతమును దర్శించిరి. గంధమాదన పర్వతారోహణముచేసి యాలయములోనున్న శ్రీ రామచంద్రమూర్తి పాదముద్రలను దర్శించి సాయంత్ర మూరుగంటలకు రామేశ్వరము చేరిరి.

అక్టోబరు ఒకటవ తేదీ యుదయము ఒంగోలు తాలూకా యేడుగుండ్లపాడు వాస్తవ్యులు శ్రీ మద్దాలి సుబ్బయ్య శ్రేష్ఠిగారు అనగా వీరికి సార్థకనామము 'హరేరామ్' గారని పిలువబడు చుందురు. శ్రీ హరేరామ్‌గారి భక్తసంఘముతో కలసి రామేశ్వరము ప్రక్కనే పాంగులువాటెడి సముద్రమున, పడవలో నాసీనులై నరసింహ నామ భజనతో యాత్రీకులు సముద్రప్రయాణము చేసిరి. కంటిచూపు మేరకు సముద్రమే! రెండుగంటలు సముద్రప్రయాణముచేసి ధనుష్కోటి యను పవిత్రస్థలమున పడవలుదిగిరి.

ఇచ్చట బంగాళాఖాతము, హిందూమహాసముద్రము రెండూ నేకమగును. సముద్ర సంగమస్నాన మిచ్చటనే! సింహగర్జనలతో నురుగులుగ్రక్కుచు, భయంకరధ్వనులతో సముద్రము మ్రోతలు వెట్టుచు నురవళ్ళు పరవళ్ళు త్రొక్కుచు, నాకాశమెత్తున పెద్దపెద్ద యలలతో పొంగులు వాఱుచుండును. ధనుష్కోటియొద్ద పితరులకు పిండ ప్రదానములు చేసి నవధాన్యములతో పూజలు చేసెదరు. ధనుష్కోటినుండి రామేశ్వరము చేరుసరికి పండ్రెండుగంట లాయెను.

ఆ రాత్రియే యాత్రీకులందరును ప్రయాణమై శ్రీ రామలింగేశ్వరాలయమునకు జని పరమేశ్వరుని దర్శించి వీడుటకు మనస్సొప్పక, తప్పక, రామేశ్వరము వీడి రెండవతేదీ యుదయ మూడుగంటలకు రామనాథపురము రైలుస్టేషనులో దిగి వెంటనే బస్సులలో దేవీపట్నము చేరిరి. అచ్చట శక్రతీర్థములో స్నానము లాచరించి యూరి నానుకొనియున్న సముద్రమున స్నానములు చేసిరి. సముద్రపుతీరమున శ్రీ రామచంద్రమూర్తి యిసుకతో కుప్పలు చేసిన నవపాషాణములను దర్శించి దంపతులతో మంత్రోక్తముగ పూజలు చేయించి బ్రాహ్మణులకు దానము లొసంగిరి.

శ్రీరామచంద్రమూర్తి రావణసంహార మొనరించి వచ్చుచు నిసుకతో కుప్పలుచేసి నవగ్రహములకు పూజలుగావించు తఱి సముద్రుడలలతోవచ్చి రాముని ముందున్న యిసుక కుప్పలను తనలో కలుపుకొనిపోవుచుండెను. ఈ విధముగా ముమ్మారుజరిగెను. సముద్రునియాగడము జూచి శ్రీరామచంద్రమూర్తి "ఓ సముద్రుడా! నీ వీ స్థలములో నలలు లేక ప్రశాంతిగా నుండుదువుగాక" యని యానతిడెను. రామచంద్రుని వాక్యానుసారము సముద్రు డలలులేక ప్రశాంతిని పొందెను. శ్రీరామచంద్రమూర్తి నవగ్రహములను పూజించి "ఈ యిసుకకుప్ప లిట్లే శాశ్వతముగా నుండునుగాక" యని యాజ్ఞాపింప, నీ నాటికి సముద్రపు

నీటిలో మునుగుచు తేలుచు నట్లే యవి శాశ్వతముగా నున్నవి. యాత్రీకులు దేవీపట్నము నుండి రామనాథపురము వచ్చి తృప్తిగా భోజనము చేసి సత్రశాలయందు విశ్రమించిరి.

సాయంత్రము నాలుగుగంటలకు గ్రంథకర్త జ్యేష్ఠపుత్రుడగు రామకృష్ణారావును వెంటతీసికొని బస్సులో రామనాథపురమునుండి, దర్భశయనము వెళ్ళి యచ్చటనున్న జగన్నాథాలయమును దర్శించిరి. వేరొక యాలయమున శ్రీరామచంద్రమూర్తిని దర్శించిరి. శ్రీరాముడు దీర్ఘవిచారముతో లంకకుపోవుమార్గము దెలియక యాలోచనతో నచట దర్భశయనుడై యుండె గావున నా ప్రదేశమున కా నామము కలిగినది.

రావణదుర్మార్గము నరికట్ట శక్తి లేనివాడైన విభీషణుడు దర్భశయనుడైన రాముని ప్రాపుగోరిన దృశ్యము. వేరొకదృశ్యము సముద్రుడు రామునకు మార్గమివ్వనిసమయమున రాముడు కోపారుణాలోచనుడై బాణమును వింట సంధింప, సముద్రుడు భయపడి "నా తప్పును సైరింపుము ప్రభూ!" యని వేడుకొనెడి రత్నాకరుడు ఆతని ధర్మపత్ని యగు మహోదధిని మేము దర్శించితిమి. పట్టాభిరామాలయమును, జగన్నాథస్వామి ధర్మపత్ని పద్మావతీదేవిని యాత్రీకులు దర్శించిరి. ఈ యాలయప్రాంగణమున పెద్ద రావిచెట్టు గలదు. సంతానములేని వారీ రావిచెట్టుక్రింద నాగశిలల ప్రతిష్ఠింతురు. వేలకొలది నాగశిలలు ప్రతిష్ఠింపబడియున్నవి.

దర్భశయనమునుండి రామనాథపురమును చేరి యాత్రీకులు మూడవ తేదీ యుదయము రామనాడు నుండి మధ్యాహ్న మొంటి గంటకు అందమైన మధురకు చేరిరి. మధురవీధులు చాల రమణీయముగా నున్నవి. జగత్ప్రసిద్ధమగు మీనాక్షి దేవి యాలయమునకు జని దేవిని కన్నులపండువుగా దర్శించిరి. సోమసుందరేశ్వరాలయమును దర్శించిరి. ఈశ్వరాలయము, మీనాక్షీదేవాలయము లతిసుందరములైనవి. అత్యద్భుతమగు శిల్పసౌందర్యముగల స్తంభములతో విరాజిల్లుచున్నవి.

ఈశ్వరాలయముముందు ముఖమండపమున పెద్దపెద్ద స్తంభములపై వీరరసముట్టిపడెడి విగ్రహముల నతిరమణీయముగ మహా శిల్పాచార్యులు తీర్చిదిద్దినారు. అందు ముఖ్యమైన విగ్రహములను కొన్నిటిని మాత్ర మిందు తెల్పెదను. . .వీరభద్ర, భద్రకాళి విగ్రహములు రెండు స్తంభములయం దమర్చిరి. ఒక్కొకవిగ్రహము నాలుగుమూరల పొడవు గలిగి ప్రళయరూపములతో వికటాట్టహాసముతో వీరవిహారయాత్ర కన్నటుల ప్రకాశించుచున్నవి.

ఆ విగ్రహములప్రక్క స్తంభములయందు అగ్ని వీరభద్ర, అఘోరవీరభద్ర విగ్రహములు మహాశిల్పకళతో చూచువారలకు భయోత్పాతము గల్గించుచు లోకభీకరమై వెలుగొందుచున్నవి.

మీనాక్షీ దేవాలయములో వెయ్యి స్తంభముల మండప మలరారుచున్నది. ఒకభాగములో నందమైన పాలరాతిమెట్లతో పాలవంటి నీటితో నొకకోనేరు కలదు. ఈ కోనేటియందు హాయిగా స్నాన మాచరించి యాత్రీకులు దేవిని దర్శించుచుందురు.

వేయి స్తంభముల మండపములో నొకే స్తంభములో నిరువది నాల్గు స్తంభములు చీల్చబడి యింపుసొంపొనగూర్చును. ఈ చీల్చబడిన స్తంభములను చేతితో మీటిన వివిధనాదములు వినవచ్చుచుండును.

పట్టణప్రజలు ప్రతిదినము నాలయమునకు వచ్చి సోమసుందరుని, మీనాక్షీదేవిని దర్శించి తీర్థప్రసాదములు గైకొని వెళ్ళుచుందురు. దక్షిణదేశపు ప్రజలెంత యదృష్టవంతులో చెప్పనవసరములేదు. ప్రతిదినమును కాలకృత్యములు తీర్చుకొని నూతన వస్త్రములతో నారికేళ కర్పూరములతో నాలయమున కేగి భగవదారాధన చేసినతదుపరి యెవరెవరిపనులను వార లవలంబించెదరు. ఇదియొక సదాచారము.

జగన్మోహిని వలె ప్రకాశించెడి మధురమీనాక్షిని దర్శించిరి. ఎన్ని గంటలు దర్శించినను గర్భాలయము వీడి వచ్చుటకు మనసు కుదుర్రదు.

ఎంతో పూర్వపుణ్యముండిననే గాని యిట్టి మూర్తుల దర్శన భాగ్యము లభింపదు. ఇట్టి పవిత్రపుణ్యస్థలములయందు జన్మించి నిత్యము మూర్తులను దర్శించెడి యీ పురప్రజల భాగ్యమేమనవచ్చును ! మన పూర్వపుణ్యము ననుసరించియే పవిత్రపుణ్యస్థలములయందు జన్మించెదము. ఇట్టి విషయములను గుర్తించి మానవుడు సత్కార్యము లొనర్పవలయును. ధర్మజీవన మొనర్పవలెను. ధర్మమార్గమున చరింపవలెను. పుణ్యకర్మలను పూనికతో నొనర్పవలెను. సాధుపురుషులను సేవించవలెను. సద్గ్రంథములను పఠించవలెను. సజ్జనసాంగత్య మొనర్పవలెను. సర్వభూతములను సమత్వదృష్టితో తిలకింపవలయును. సత్యమును పాటించవలయును. ఆచరణవేదాంతము నలవరచుకొనవలయును. ఇన్ని శ్రమలు చేసినగాని, జగజ్జనని యగు మీనాక్షి కృప ప్రసరింపదు. పూలు సమర్పించి నారికేళములు కొట్టి కుంకుమార్చనలు చేసినంతమాత్రమున నామె కృప గలుగదు. కలుగునని తలచుట వట్టి చిత్తభ్రమ.

నాటి సాయంత్ర మారుగంటలకు, గుర్రపుబండ్లపై శ్రీ తిరుమల నాయక్ రాజావారి రాజభవనమును దర్శించిరి. వందలాది పెద్ద పెద్ద స్తంభములతో నీ దివ్యభవన మలరారుచున్నది. త్యాగమూర్తులు దేవీభక్తులగు నీ తిరుమలనాయకరాజావారే మధురమీనాక్షీ సుందరేశ్వరాలయములను కట్టించిరి. మధురమీనాక్షీ దేవాలయమునకు నాల్గువైపుల పెద్ద ఎత్తైన గాలిగోపురములు గలవు. నాల్గు గోపురములు నాల్గురాజవీధులమధ్య నలరారుచున్నవి. తిరుమలనాయక్ రాజావారి మేధాశక్తి బహువిధముల మెచ్చదగినది. మధుర పట్టణమంతయు వీక్షించి, గ్రంథకర్త యాత్రీకబృందమునకు నాధ్యాత్మిక విషయములు ప్రబోధము చేయుచు సంఘముతో బాటుగ రైలునొద్దకు చేరిరి.

రాత్రి పదిగంటలకు రైలు బయలుదేరినది. యాత్రీకులు నాలుగవ తేదీ యుదయ మారుగంటలకు శ్రీవిల్లిబుత్తూరు చేరిరి. వైష్ణవ

సాంప్రదాయ మట నెక్కువ. శ్రీరంగని యాలయము రంగని భార్య ఆండాల్ అమ్మవారి యాలయమును దర్శించిరి. ఆలయ ప్రాకారపులోపలి భాగమున మూడువైపుల గోడలపై మహావిష్ణువు శేషశాయియైన దృశ్యము, దశావతారము లతిసుందరముగా చిత్రింపబడియుండెను. ఆలయములో లక్ష్మీనృసింహమూర్తిని దర్శించినారు. ముఖమండపమున నతి సుందరముగా మలచబడిన శిల్పరాజములను దర్శించిరి. స్తంభములలో నమర్చబడిన, రతీదేవి-మన్మథ, అర్జున-కర్ణ, భీమ-దుర్యోధన రూపములు దర్శనీయములు.

యాత్రికులు ఐదవ తేదీన ప్రయాణమై శ్రీవిల్లిబుత్తూరు వీడి, శంకరనారాయణకోయిల్ స్టేషనులోదిగిరి. గ్రామములోని దేవాలయమున ప్రవేశించి, మూలవిరాటు శంకరనారాయణస్వామిని దర్శించి యాశ్చర్యమును చెందిరి. ఈ రూపమును ముఖ్యముగా మతద్వేషమ్యముగల మానవులు తప్పక దర్శింపవలెను. కుడివైపున నీశ్వర రూపము. తలపైన నెలబాలుడు, మొలయందు పులితోలు, సర్పభూషణములు, నొకచేత త్రిశూలము, లలాటభాగమున నొకవైపు విభూతిరేఖలు, అదే విగ్రహమున సగభాగమున ననగా నెడమ భాగమున విష్ణురూపము. నిలువుబొట్టు, రత్నకిరీటము కంఠమున కస్తూరి మాలలు, చేతియందు ధర్మచక్రము పట్టుపీతాంబరములు ధరించి యుండెను. భారతదేశమున నిట్టి శివవైష్ణవ సమైక్యస్వరూప మగు మూర్తు లరుదుగ నున్నవి.

శివునకు విష్ణువునకు భేదములేదని బోధించుటకే యిట్టి యాలయముల నెంతో నేర్పుతో కూర్పుచేసి నిర్మాణము గావించిరి. ఆలయము లోపలిభాగమున గోడలపై పెద్దపెద్దవి యందమైన రంగులతో వినాయకస్వామిని షోడశరూపములుగా చిత్రించిరి. ఈ యాలయములో శంకరలింగేశ్వరుని ధర్మపత్నిని గోమతీదేవిని సుబ్బారావు యాత్రికులతో గలసి దర్శించిరి.

యాత్రీకులు సాయంత్రము నాలుగు గంటలకు రైలుపెట్టెలో ఆసీనులైనారు. రైలు బయలుదేరినది. షిన్‌కోట రైలుస్టేషను చేరి భోజనములుచేసి విశ్రమించిరి.

ఆరవతేదీ యుదయము షిన్‌కోటలో బస్సునెక్కి కుర్తాళ మను గ్రామము చేరినారు. ఈ గ్రామమున పెద్ద యాలయముగలదు. కుర్తాళేశ్వరుని, వారిధర్మపత్నియగు వేణువాగ్వాదిని దేవిని దర్శించిరి. పరాశక్తి దేవాలయము దర్శించిరి. మౌనస్వామి యాశ్రమమునకు వెళ్ళిరి. యాత్రికులందరు శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరస్వామివారి యాదేశానుసారము భగవద్గీతాపారాయణ మొనర్చిరి.

ఈ కుర్తాళమున మనోహరమైన జలపాత మున్నది. ఎత్తైన కొండలనుండి జలజల ప్రవహించుచుండును. కుర్తాళ ప్రజలందరు నిత్యము ప్రాతఃకాలమందే లేచి విధిగా శరీరమునకు నూనె పూసుకొని జలధారలక్రింద నిల్చొని హాయిగా స్నానము చేయుచుందురు. స్నానముచేసిన ప్రతివ్యక్తి కుర్తాళేశ్వరాలయమున ప్రవేశించి స్వామిని సేవించి ప్రక్కనేయున్న యాలయమునకు వెళ్ళి వేణువాగ్వాదిని దేవిని దర్శించి తీర్థప్రసాదములను తీసికొని స్వగృహములకు చేరుచుందురు.

యాత్రీకులు కుర్తాళము నుండి తెంకాశి వెడలి శ్రీ కాశీ విశ్వనాథుని సేవించిరి. ఆ రాత్రి మూడుగంటలకు షిన్‌కోటనుండి బయలుదేరి గంభీరారణ్యమును దాటి మధ్యలో మూడు కొండబిలము లను నిర్గమించి నేడవతేదీ యుదయ మూరుగంటలకు క్విలన్ స్టేషను చేరిరి. ఈ స్టేషనునుండియే కేరళరాష్ట్రము ప్రారంభమగును. ఆనాడు తొమ్మిదిగంటలకు కేరళరాష్ట్రమునకు రాజధానియగు తిరువేంద్రము చేరిరి. తిరువేంద్రము మిక్కిలి యందమైన పట్టణము. యాత్రీకులు తిరువేంద్రము రాజవీధుల దర్శించుచు చిట్టచివరనున్న యనంతపద్మనాభ స్వామి యాలయమునకు వెళ్ళి ఆలయసమీపమున విశాలమైన కోనేటి యందు స్నానము లాచరించి పూర్వాచారపరాయణులై చొక్కాలు

ప్పి యాలయ ముఖద్వారమునొద్ద పహరాకాయుచున్న సేవకుల యొద్ద భద్రపరచి కండువాలు మొలకు బిగియించి విమలోర్ద్వపుండ్ర నామములు ధరించి క్రమశిక్షణతో నొకరివెంట నొకరు నిశ్శబ్దముగా శ్రీ పద్మనాభస్వామి యాలయమున ప్రవేశించిరి.

తిరువాన్కూర్ మహారాజుల యాధ్వర్యమున నీ యాలయార్చన కార్యక్రమములు జరుగుచుండును. అనుదిన మా మహారాజావా రాల యమున కాచారనియతులై చేతులుమోడ్చి నమస్సు లర్పించుచు నాలయమూర్తియగు శ్రీ అనంతపద్మనాభస్వామిని దర్శించి తీర్థప్రసాద ములు స్వీకరింతురు. తత్క్షణమే మిగిలిన యాత్రికు లాలయస్వామి నర్చింపెదరు. గర్భాలయములోపలకు జనెడి యాచారము లేదు. యాత్రికబృందము గర్భాలయముముం దుండియే పద్మనాభస్వామిని నేత్రపర్వముగా దర్శించిరి. అనంతపద్మనాభస్వామి శేషశాయిపై పవళించియుండెదరు. మూడుద్వారములద్వారా యా దేవుని దర్శింప వలయును. మొదటిద్వారమున శిరస్సును; రెండవద్వారమున స్వామి వక్షస్థలము, చేతులు; మూడవద్వారమున శ్రీ స్వామివారి పాదపద్మ ములను భక్తితో దర్శించిరి. మూడుద్వారములలో పెద్దపెద్ద నేతి జ్యోతులు వెలుగుచుండును. ఆలయమున వేలకొలది జ్యోతులు వెలిగించెదరు.

కోనేటి నానుకొనియున్న పవిత్రాశ్రమ మగు శ్రీ అభేదానంద స్వామివారి యాశ్రమమునకు యాత్రికులు వెళ్ళిరి. స్వామివారప్పు డాశ్రమమందు లేరు. ఉత్తరదేశమున పర్యటనము చేయుచున్నారని శిష్యులు చెప్పిరి. ఆశ్రమభక్తులందరు వారిభాషలో పరవశత్వమున భజనలు చేయుచున్నారు. ఈ గ్రంథకర్త సుబ్బారావు ఆశ్రమభక్తుల మధ్య సుఖాసీనుడై సద్గురునిదలచి నృసింహభజనచేసి, శ్రీ శంకరా చార్య విరచితమగు భజగోవిందశ్లోకములు, వానిభావముతోగల తెనుగు తోహరలు చెప్పగా నాశ్రమభక్తులు పరవశత్వమున గాన మొనరించిరి.

తిరువేంద్రమము చాల పెద్దపట్టణము. రాజవీధిలోని శేషముగా ఏనుగు దంతములతో నతిరమణీయముగా చిత్రించబడిన శిల్పము లమ్మెడి దుకాణములు వందలాది గలవు. ఈ గ్రంథకర్తగారు అడుగెత్తు సరస్వతి విగ్రహమును జూచి వెలయెంతని యడుగగా నేడువందలయేబది రూపాయలనిరి. సాయంత్ర మా పట్టణ చివరభాగమునను్న విమనాశ్రయము, రబ్బరుఫ్యాక్టరి మొదలగువానిని దర్శించిరి.

విమానాశ్రయమునొద్ద సిటీబస్సులో నాసీనులై యాత్రీకులు మకాము చేరుటకు నిశ్చయించిరి. ఈలోగా నొక యంతరాయ మేర్పడినది. ఆ నాడు శ్రీనీలం సంజీవరెడ్డిగారికి తిరువేంద్రపట్టణప్రజలు ఘనస్వాగతము చేసిరి. ఈ యూరేగింపు వర్ణింపనలవి కానిది. బ్రహ్మారథములో సంజీవరెడ్డి సుఖాసీనుడై వివిధరకములగు విద్యుత్కాంతులతో దేదీప్యముగా వెలుంగుచున్నాడు. కమ్యూనిష్టుపార్టీకి బలమైన యాపట్టణము పూర్తిగా మారి కాంగ్రెస్ పార్టీని బలపరచినది.

ఏనాటి కెవరెట్లు మారెదరో! ఆ యనంతపద్మనాభస్వామి కేయెరుక. "సామాన్యమానవుల కేమి తెలియురా! సాంబారు తప్ప" యన్నట్లు లా దైవలీలలు అత్యద్భుతములు అత్యాశ్చర్యములు, ఆనంద సంధాయకములు. ఆహా హా! ఏమి ఆ యూరేగింపు! శ్రీ సంజీవరెడ్డిగారాసీనుడై యున్న రథము ముందు, వెనుక రక్షకభటులు తుపాకులు చేతపూని క్రమశిక్షణతో యూరేగింపు విజయవంతము చేయుచున్నారు.

ఆ యూరేగింపులో ధ్వనులు మిన్నుముట్టినవి. "జై జై భారతమాతా, జై జై త్రివర్ణ పతాక, జై జై సంజీవరెడ్డి!" యనెడి నినాదవాక్యములు మార్మోగిత మ్రోగినవి. సముద్రఘోషవలె నున్నది. ఈ యూరేగింపునకు నగరమున తిరిగెడి సిటీబస్సులన్నియు స్తంభించిపోయినవి. సిటీబస్సులో పైయంతస్థునను్న గ్రంథకర్తయగు సుబ్బారావు బస్సుదిగి యూరేగింపులో పాల్గొనిరి. ఆ ప్రజాప్రవాహములో గ్రంథకర్త ప్రయత్నములేకనే వారితోకలసి శ్రీ సంజీవరెడ్డిగా

రుపన్యసించెడి సభావేదికయొద్దకు చేరిరి. ఆ సభావేదిక యత్యంత రమణీయముగా రంగురంగుల సెట్టింగులతో వందలకొలది ట్యూబు లైట్లతో దేవేంద్రభవనముగ మెరసిపోయెను. లక్షలకొలది ప్రజలు కనుచూపుమేర క్రిక్కిరిసియుండిరి. తెనుగుభాష మచ్చునకైనను లేదు. శ్రీ సంజీవరెడ్డిగా రాంగ్లమున నిడుచున్న యుపన్యాసమును భాషా ప్రతినిధియొకరు మార్చి మళయాళములో చెప్పుచున్నారు. ఈరచయిత గారు ఓహో! అర్థముగాని భాష అయోమయమని వేదికవపలి యర్థరాత్రికి మకాము చేరిరి.

మరునాడు తెల్లవారుజామున లేచి కాలకృత్యములు ముగించి, యాత్రీకబృందము శ్రీ పద్మనాభస్వామి యాలయమునకుజని ప్రశాంతముగా పద్మనాభుని ధ్యానించి దర్శించిరి. ఈ యాలయమందే వంట చేయించి నిత్యము రెండుపూటలు బీదబాలికా విద్యార్థుల కుచితముగ పిండివంటలతో సహా భోజనమిడుదరు. ఆలయార్చకులు ఆలయమునకు సంబంధమగు సేవకులకు నిత్యము భోజన మిచటనే పెట్టెదరు. బీద బాలురు భోజనముచేయు సమయమున గుంపులు గుంపులుగా కాకులు వచ్చి కా–కా–కా యని యరచుచు నచటనున్న మెతుకులను భక్షించుచుండును. ఆ కాకుల నెవ్వరు మందలింపరు. అందదియొక నియమము.

యాత్రీకులు పగలు పండ్రెండు గంటలకు త్రివేంద్రములో బస్సునెక్కి నాగర్‌కోయిల్ యనెడి పట్టణమున దిగిరి. వెంటనే బస్సులో నాసీనులై నాగర్‌కోయిల్ నుండి సాయంత్రం మయిదు గంటలకు సముద్రము నానుకొనియున్న కన్యాకుమారి యనెడి చిట్టచివరి గ్రామమును దర్శించిరి. బస్సుస్టాండునుండి సిమెంటు రోడ్డుపై పరుగు పరుగున వెళ్ళి సముద్రము నొడ్డునకుచేరి భారతదేశమున మరెచ్చట చూడలేని సూర్యాస్తమయ దృశ్యమును రెప్పలార్పక యొకే దృష్టితో దర్శించిరి. మూడువైపుల సముద్రమే! ఆకాశము నంటుకొనిపోయిన సముద్రము! షుమారు కొన్ని గజముల యెత్తున సముద్రపు

టలలు లేచి పడుచుండును. అల వెంటనల, దాని వెంటనే మరొకయల ! ఎంత కాలమునుండి యీవిధముగ తరంగములు వచ్చుచుండెనో! ఇంకెంత కాలము వరకీ విధముగా నుండునో ! ఇది ప్రకృతి రహస్యము. పరమాత్మ దర్శనమును పొందిన సద్గురోత్తములకే యిది యెరుక.

గ్రంథకర్త సుబ్బారావు యాత్రీక బృందముతో గలసి లోకచక్షువగు శ్రీ సూర్యభగవానుడు శరవేగముతో సముద్రగర్భములోనికి చొచ్చుకొనిపోవు యా మహత్తరదృశ్యమును దర్శించిరి. ఈ సమయములో పొందెడి యానందమును రచనారూపములో వర్ణింపలేము. ఆ యనుభూతి ననుభవించవలసినదే !

ఆ రాత్రి యెనిమిది గంటలకు సముద్రము నొడ్డునే నిర్మించిన యాలయమునకు వెళ్ళి దేవీకన్యకయనెడి మాతృమూర్తిని దర్శించి పూజించి నారికేళ నైవేద్యము లొసంగి హారతులిచ్చి దేవీకృపకు యాత్రీకులు పాత్రులైరి.

సముద్రపు కెరటములలోనే లక్షలకొలది రూప్యములు వెచ్చించి పాలరాతితో బహురమణీయముగా మహాత్మాగాంధీజీ సమాధిని కట్టించిరి. ఆ రాత్రి నిండుపున్నమి. గాంధీదేవుని సమాధి మందిరముపైన ఈ గ్రంథకర్త సుబ్బారావు, శ్రీ వేంకటేశ్వరస్వామివారు, శ్రీ సన్నిధి వేంకటశేషగిరిరావుగారు విశ్రమించిరి. వెయ్యి విమానము లొకేసారి యెగిరిన నెంతధ్వని గల్గునో యంతటి ధ్వనితో పున్నమినాటిరాత్రి సముద్రపుఘోష వినవచ్చుచుండెను. సముద్రపు టొడ్డున శయనించిన యాత్రీకుల కారాత్రి నిద్రయే లేదు. భగవత్ సృష్టివిలాసమున కచ్చెరువొందుచు నానందముతో, సముద్రపు టలలను వారు దర్శించిరి. జీవితమున మరపురాని మనోహర దృశ్యమది.

తొమ్మిదవ తేదీన కన్యాకుమారినుండి కారులో శుచీంద్రమునకు పోయి త్రిమూర్తి స్వరూపమును, అనసూయ అత్రి దంపతులను దర్శించి కన్యాకుమారిచేరి భోజనములుచేసి వెంటనే కన్యాకుమారినుండి

కారులో ఆసీనులై నాగరకోయిల్ బస్సుస్టాండులో దిగి వేరొక కారులో ప్రవేశించి నాంగినెటి యనెడి పట్టణము చేరిరి. నాంగినెటిలో వానమామలై యనెడి యాలయమునకు జని తోతాద్రి పెరుమాళ్లు, శ్రీదేవి-భూదేవి రూపముల దర్శించి యాలయములో నొకప్రక్క భవనములోనున్న వ్యక్తిని శ్రీరామానుజాచార్యులనుదర్శించి నాంగినెటిలో బస్సునెక్కి రాత్రి పదిగంటలకు తిరునల్వేలి చేరిరి.

పదియవతేదీ యుదయము తామ్రపర్ణి యనెడి నదియందు స్నానముచేసి సిటీబస్సులో నల్లియప్పన్ కోవెలకు వెళ్ళి యాలయమంతయు తిరిగిచూచిరి. ఈశ్వరుని, కాంతిమతీదేవిని చూచిరి. శివాలయమున ధ్వజస్తంభము, ముందుభాగమున మండపమునందు పెద్దవి నాలుగు స్తంభము లున్నవి. వానిలో రెండు స్తంభములు చాలపెద్దవి. ఒక్కొక స్తంభములో నలభైతొమ్మిది చీలికలు కలవు. ఏడు స్తంభములొకమ్రోత, మిగిలిన యేడును మరొక మ్రోత. నలభైతొమ్మిది స్తంభములు నేడేడు జట్లుగా చీల్చబడినవి. స రి గ మ ప ద ని యేడక్షరము లీ స్తంభములోనే చేతితో కొట్టిన ధ్వనించుచుండును. యాత్రీకులా స్తంభము లన్నియు మ్రోయించిచూచిరి. ప్రణవధ్వని వినవచ్చినది. ఇచ్చటనుండి యాత్రీకులు షణ్ముఖాలయమునకు వెళ్ళిరి. ఈ కుమారస్వామి యాలయమున శక్తిపీఠమును దర్శించిరి. దేవాలయము ప్రక్క దేవుని పూజకై పూలతోటయున్నది. పూలతోటలో కైలాసగిరి, గిరిపైన పార్వతీపరమేశ్వరులను ప్రమథగణము ప్రార్థించునటుల నిర్మాణము చేసిరి.

యాత్రీకులు సాయంత్రము రెండుగంటలకు ప్రయాణమై రైలులో నారుగంటలకు తిరుచుందూర్ మహాక్షేత్రము చేరిరి. తిరుచుందూర్ నగరమును పరిశీలించుచు సముద్రపుదరిన నిర్మించిన విశాలమైన యాలయమున నున్న శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామిని దర్శించిరి. ఆలయము మూడుప్రాకారములుగలది. సముద్రతీరమున బాణగంగను దర్శించిరి.

సుబ్రహ్మణ్యేశ్వరమూర్తి వింటి నాకర్ణాంతములాగి బాణమును విడువ యది పాతాళమునకు పోయి శుద్ధగంగ నుద్భవింపచేసెను. పాతాళ భాగములో నున్న శుద్ధగంగ నందరును గ్రోలి తృప్తులైరి.

రైలుస్టేషనుయొద్దకుజనెడి త్రోవలో శివకుశేందరస్వామి ఆలయమును వారి ధర్మపత్ని యానందవల్లి తాయారుదేనివి దర్శించిరి.

ఆ రాత్రి పదిగంటలకు రైలుపెట్టెలోచేరి యాత్రికులెల్లరును బిగ్గరగా హరేరామ నామస్మరణచేయగా స్టేషనుమాష్టర్ మొదలగు నుద్యోగులు ఆశ్చర్యముతో వారి పెట్టెచుట్టును చేరి యెనోఘడియలు ప్రశాంతముగా విని యానందించిరి. భాష యర్థముగాకపోయినను పవిత్రమగు భగవచ్ఛబ్దతరంగములే, వారిమనస్సుల నానందింపచేసినవి. ఆ కారణముచేతనే శ్రీ త్యాగరాజాది మహనీయులు నాదోపాసనతో భగవత్సన్నిధానమును పొందిరి. నాదబ్రహ్మమని మన వేదములు బోధించుచున్నవి. "క్షీరాన్నమును గ్రుడ్డివాడు భక్షించినను నానందమునేపొందున"ట్లా తమిళసోదరులు భగవన్నామామృతమును తనివి దీర పానము చేసిరి.

పదకొండవ తేదీ తిరుచుందూరునుండి వెనుకకు మరలి యాత్రికులు తిరునల్వేలికి పోవుచుండిరి.

శ్రీ యోగానంద మఠస్థాపకులగు శ్రీ స్వామివారు, గ్రంథకర్త సుబ్బారావు, మరికొందరు భక్తులు మాత్రము, మధ్యలో ఆళ్వార్ తిరునగర్ స్టేషనులో దిగిరి. మిగిలిన యాత్రికులతో బండి వెళ్ళి పోయినది. శ్రీ వేంకటేశ్వరస్వామివారు వద్దనున్న భక్తులతో నూరి నానుకొనియున్న తామ్రపర్ణినదిలో స్నానము లొనర్చి, కోవెలకు పోయి, శ్రీ దేవీభూదేవీ సహిత శ్రీ మన్నాదినారాయణుని, ఆదినాయకి, కురునాయకి నీలాదేవి, రూపములను వీక్షించిరి. ఆలయములో నతి పురాతన వృక్షరాజమగు చింత చెట్టును దర్శించిరి. ఈ చింత చెట్టును

చూచువారల చింతలు రూపుమాయును. ఈ వృక్షరాజము మొదలు కడ చీలిపోయి యేడు కొమ్మలుగా పెరిగినది. ఈ చెట్టునందు, 'నమ్మాళ్వార్'అను మహాభక్తుడు చెట్టును చీల్చుకొని జన్మించినాడని ప్రతీతి యని ఆలయార్చకులు నుడివిరి.

ఆలయము వీడిబస్సులో నాసీనులై శ్రీవైకుంఠమనెడి క్షేత్రమునదిగిరి. శ్రీవైకుంఠములోనున్న యాలయమునకు వెళ్ళి మూలవిరాట్ శ్రీవైకుంఠనాధన్, వీరి భార్యలు వైకుంఠనాయకి, చోరనాధనాయికి మూర్తులను దర్శించి, శ్రీ వైకుంఠమునుండి బస్సులో పండ్రెండు గంటలకు తిరునల్వేలిచేరి మిగిలిన యాత్రీకబృందమునుకలిసికొనిరి. రాత్రి పది గంటలకు పొగబండి బయలుదేరినది. పండ్రెండవ తేదీ మధుర చేరినారు. ఆ మధ్యాహ్నమే బయలుదేరి మూడుగంటలకు దిండిగల్ జంక్షన్ చేరి, సాయంత్ర మారుగంటలకు పళని చేరిరి. కొండపై భాగమున నాలయములో బాలసుబ్రహ్మణ్యస్వామివారు వేంచేసియుండిరి. స్వామిరూపము ముద్దులు మూటగట్టుచు పాలుగారెడి చెక్కిళ్ళతో మాతృమూర్తుల మనస్సుల నాకర్షింపచేసి యమితానందము చేకూర్చెడి బాల స్వరూపము. పదమూడవ తేదీన, పళనినుండి వెనుకకు మరలి దిండిగల్ జంక్షన్ చేరి, పదిగంటలకు తిరుచినాపల్లి చేరిరి. సాయంత్రము నాలుగుగంటలకు బయలుదేరి, పదునాలుగవ తేదీ యుదయ మారుగంటలకు తిరువణ్ణామలై చేరిరి.

అరుణాచలేశ్వరాలయము ప్రవేశించి శ్రీ అరుణాచలేశ్వరుని దర్శించిరి. ఆధ్యాత్మికతత్త్వవేత్తయగు భగవాన్ రమణమహర్షి తపోదీక్షయందున్న పాతాళమందిరమును దర్శించిరి. అరుణాచలేశ్వరుని, ధర్మపత్ని అణ్ణామలై దేవిని దర్శించిరి. అరుణాచలేశ్వరాలయ గాలిగోపురములు పండ్రెండును దర్శనీయములైనవి. అరుణాచలేశ్వరాలయమునుండి యూరివెలుపలనున్న భగవాన్ శ్రీ రమణమహర్షి పవిత్రాశ్రమమును ఆత్మానందముతో దర్శించిరి. శ్రీ రమణమహర్షి సమా

ధిని, శ్రీ రమణ భక్తులు భోజనముచేయు మందిరములను, శ్రీ రమణ మహర్షి యాధ్యాత్మిక గ్రంథమండలిని, యాశ్రమములోనున్న పూదోటను నాశ్రమరక్షణలో గల గోమాతలను దర్శించి, యాత్రీకులు యాశ్రమమందే భోజనములు గావించిరి. శ్రీ రమణమహర్షి, కఠిన నియమములతో కొండపైన తపస్సుచేసిన పవిత్రస్థలమును దర్శించి భగవానుని స్మరించిరి. పదునైదవ తేదీ రాత్రి 3 గంటలకు తిరువణ్ణామలై వీడి కాట్పాడి జంక్షన్ మీదుగా మరునాడుదయ మూడుగంటలకు పాకాల జంక్షన్ చేరి యటనుండి పదిగంటలకు దిగువతిరుపతి చేరిరి.

ఎగువతిరుపతికి వెళ్ళి శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శింపవలయునని దిగువతిరుపతి బస్సుస్టాండు చేర, నెగువ తిరుపతిలో బ్రహ్మోత్సవములని జనులు తండోపతండములు విడుదలనిండుగ బస్సుటిక్కెట్లకై క్రిక్కిరిసి యుండిరి. ఆ ప్రజాప్రవాహమునుచూచి టిక్కెట్లు తీసికొనిరాలేమనుకొని, యా యేడుకొండల వేంకటరమణుడే మనలను తన సన్నిధికి చేర్చుకొనగలడను దృఢనిశ్చయముతోనుండిరి. టిక్కెట్లకొరకు వరుసగా వేలాదిప్రజలు సంచులు చంకలకు తవిలించుకొని పెట్టెలనెత్తిన పెట్టుకొని యిరువైపులవారిని జాగ్రతగాచూచుచు అప్పుడప్పుడు జేబులలోగల మనిపర్సులను తవిడి చూచుకొనుచు "హా వేంకటేశ్వరా! గోవిందా!" యని స్మరించుచు కాళ్ళతీపులతో, కళ్ళ మంటలతో, వొళ్ళు నొప్పులతో విధిలేక నిలిచి గంటలతరబడి కాలమును వెళ్ళబుచ్చుచు టిక్కెట్లకొరకెవరికివారే యాత్రీకులు తహతహలాడుచుండిరి. ఎవరికివారే టిక్కెట్ తెచ్చుకొనవలయునని నియమము దేవస్థానముకమిటీవా రిట్లు నిర్ణయించిరి. ఆ కారణముచే స్త్రీలును వరుసక్రమములో నిలిచి చంటిపిల్లలతో, చంకబరువులతో నోపిక వహించి నిల్చొనియుండిరి. కొందరు "ఛీ! పాడుసంసారము భగవద్దర్శనమునకు సంసారము ప్రతిబంధకమే! ఈ పిల్లసంచుతో యాత్రచేయు దానికంటె, నింటియొద్ద 'హరీ! కృష్ణా' యనుచు నతిథులకు పట్టెడన్న

మిడిన నీ వేంకటేశ్వరదర్శన పుణ్యమునకు పదిరెట్లుఫలము లభించు"నని యనుకొనసాగిరి.

యాత్రీకు లతిప్రయాసలకోర్చి స్వామిదర్శనము, బ్రహ్మోత్సవము కన్నులార దర్శింపవలయునను కాంక్షతో క్యూలో నిలిచి ఆంజనేయుని వాలమువలె మెలికలు తిరుగుచు మెల్లగా ముందుకు సాగుచుండిరి. వారు ముందునకు వెళ్ళి కటకటాలలో నెంబరువారీగా బెంచీలమీద ఆసీనులగుచుండిరి.

కాళ్ళనొప్పులతో విసిగివేసారి 'బ్రతికితిమిరా, పరమేశ్వరా!' యని యనుకొనుచున్నంతలో నారోగ్యశాఖోద్యోగులు "నాయన లారా! యాత్రలో ననారోగ్యములుగల్గును! మీ కింజక్షన్ చేసెద" మని వెంటనే చేయసాగిరి. ఇంజక్షన్ చేయించుకొన్నవారికే యెగువ తిరుపతి టిక్కెట్లని ఘంటాపథముగా చెప్పసాగిరి.

"తప్పదురా, బాబూ!" యని యనుకొనుచు నొకరివెంట నొకరు ఇంజక్షన్ చేయించుకొని టిక్కెట్టు తీసుకొని పరువులుదీయుచు నెంబరువారీ బస్సులలో, నెవరికివారే ముందుముందుగా ఆసీనులైరి. యాత్రీకులందరు సుఖాసీనులై రెండుగంటల కెగువ తిరుపతి బసు-స్టాండులో దిగిరి. కల్యాణఘట్ట మను హాలులోపలకు వెళ్ళి, వెయ్యి రూపాయ లొసంగినను నా మీసములను తీయించన నెడి వీరులు ధీరులు సైతము, శ్రీ స్వామివారి పేరిట తలనీలా లొసంగిరి. తదుపరి బంగారు కోనేటియందు స్నానములు చేసి యాత్రీకు లెల్లరు విమలోర్ధ్వపుండ్ర నామములను పెట్టించుకొనిరి. నారికేళ కర్పూరాదులు తీసికొని గోవిందా! గోవిందా! వేంకటరమణా! సంకటహరణా! యనెడి సుశబ్దములతో దేవాలయ ముఖద్వారమును దర్శించిరి. యాత్రీకు లందరు ధర్మదర్శనమునకై బారులుదీరి కిటకిటలాడుచు నిల్చియుండిరి. యాత్రీకులసంఖ్య యానా డంతయింతని వర్ణింపలేము. వేలకొలది ప్రజలతో శ్రీ వేంకటేశ్వరాలయము మునిగిపోయినది. మరుసటిదిన

ముదయమే రథోత్సవము, బ్రహ్మోత్సవమును కన్నులార దర్శించిన ప్రజలందరు, మరల నొకసారి స్వామిని దర్శించి వెళ్ళవలయునని స్వామి సన్నిధియందే నిలిచి యుండిరి.

యాత్రీకులు క్యూలోనే యొకరినొకరు క్రిక్కిరిసి శరీరము తిమ్మిరి యెత్తి మొద్దుబారిపోయినను, స్థలము వీడిన స్వామి దర్శనము లేదను తలంపుతో నిల్చియుండిరి. ఈ దృశ్యమును జూచిన యాత్రీకబృందము వారందరు, స్వామి దర్శనమునకు వెళ్ళలేమని నిస్పృహ చెందిరి. సాయంత్రమువరకు స్వామి దర్శనమున కేగెడి ప్రజాప్రవాహమును మాత్రము దర్శించుచు హోలునందే ఆసీనులైరి.

పదునేడవ తేదీ యుదయము రథోత్సవమునకై వెండిరథము నలంకరణ గావించుచుండిరి. ఆహా హా! ఏమి యా రథ సౌందర్యము! తెల్లని కాంతులతో మెఱసిపోవుచున్నది.

బంగారు ధ్వజస్తంభమునొద్ద శ్రీ స్వామివారిని బంగారు తూగుటూయెలయం దుంచి పవళింపుసేవ చేసినారు. ప్రజ లమితానందముతో స్వామిని తిలకించిరి.

దేవాలయ గాలిగోపురము పలురకములగు విద్యుద్దీపముల కాంతులతో ప్రకాశించినది. స్వామి నివాసము చేసెడి గిరిగహ్వరము మాఱ్ఱోగునట్లు గర్భాలయమున పఠించెడి వేదమంత్రములు మంత్రపుష్పము మొదలగు మంత్రాంగమంతయు దూరశ్రవణయంత్రములతో వీనులకు విందొనగూర్చుచున్నవి. యాత్రీకబృంద మెన్నో యాత్రలు చేసిరి కాని వా రింతటి జనసమూహమును మరెచ్చటను దర్శింపలేదు. 'కలియుగవైకుంఠ' మనెడి నామము తిరుపతికి సార్థకమైనది.

ఏ హోటలు చూచినను నే యంగడి చూచినను నే సత్రమును వీక్షించినను నే స్థలమును దర్శించినను ప్రజాసమూహమే! వివిధ సంప్రదాయములకు చెందిన భక్తులందరిని నేడుకొండలస్వామి సన్నిధిని యాత్రీకబృందము దర్శించిరి. ఆ స్వామి మహిమ ఎంతయని వర్ణింప

గలము. సర్వసేవలను సాంగోపాంగముగా దర్శించిరి. ఐనను నేమి ప్రయోజనము! శ్రీ స్వామి వారి దర్శనము మాత్రమే కలుగ లేదు.

ఈ గ్రంథకర్త తనలోతాను, నే నొంటరివాడ నయిన నందరి కంటె ముందే యతిప్రయాసలకోర్చి శ్రీ స్వామిస్వరూపమును చూచెడి వాడనే! సంసారముతో వెళ్ళితిని గనుక స్వామిని చూడ లేకపోతిని. అందులకే మహనీయులు "నాయనలారా! సంసారి మోక్షమును పొందుటకంటె, సూదిబెజ్జములో నేనుగును దూర్చుటే యతి సులభ" మనినారు ఆ సాధువాక్య సారాంశము స్వానుభవముతో గ్రంథకర్త తెలిసికొనెను.

శిలామూర్తులను దర్శించుటకే యీ మాయాసంసారము ప్రతి బంధక మైనప్పుడు నిరాకారుని, త్రిగుణరహితుని, సర్వాంతర్యామిని సూక్ష్మస్వరూపుని, జగదారాధ్యుడగు శ్రీ వేంకటేశ్వరుని దర్శించుట యెంతటి కష్టమో విజ్ఞులైనవారు గుర్తించెదరుగాక!

గ్రంథకర్త దక్షిణదేశయాత్ర లన్నిటిని దర్శించి చివరకు తేల్చు కొనిన పరమసత్య మిదియే!

కవిగాని, పండితుడుగాని, విద్వాంసుడుగాని, మహాగాయకుడు గాని నీ ధరామండలమును బరిపాలనముచేసెడి చక్రవర్తిగాని, బికారి గాని యనిత్యమగు సంపదలతోగూడి తెరమీాద బొమ్మలవలె నటించెడి భార్యాబిడ్డల, బంధువర్గములతో కలసిమెలసి తిరుగుచు, నా-నీ యను భేదభావములతో, నహంకార మమకారాది గుణములతో నున్న మానవులకు మాధవదర్శనభాగ్యము లభించుట ముమ్మాటికి కల్ల! వృథాశ్రమయేయని గ్రంథకర్త గుర్తించిరి.

ఎన్ని జన్మలకైనను, నెన్ని యుగములకైనను ధనధాన్య భోగ భాగ్యములు, దారాసుతాదులపైనున్న మమకార మణంచుకొని, సర్వ సంగ పరిత్యాగ మొనర్చి, ప్రశాంతభావములు రేకెత్తించు గంగాది నదుల పరిసర ప్రాంతారణ్యములందు, పవిత్రాశ్రమము లేర్పరుచుకొని

నియమముగా, నిర్దోషముగా దైవధ్యానాదులు తపోసమాధు లొనర్చిన గాని ఏడుకొండలపై నుండెడి వేంకటారమణుని దర్శనభాగ్యము లభింపదు.

ఏడుకొండలనగా చెట్లు, పుట్టలు, గుట్టలు, బిలములు, నదులు మొదలగు వస్తుజాలములతోనున్న ఈ కొండలు కానే కాదు. మానవ శరీరములోనున్న యేడుచక్రములే యేడుకొండలు. ఆధార, స్వాధిష్ట, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయ, సహస్రారములే యీ యేడు కొండల కాంతర్యనామములు.

మానవు లిలా దలతురు. చుక్కల పర్వతము నెక్కుట చాల కష్టమని వాకొనుచుందురు. దాని అంతరార్థమేమొ! అర్థాపేక్ష మానవుల కయోమయము. చుక్కల పర్వతారోహణ చక్కగా పై భాగమును చూచుచు నెంతయో ప్రయాసతో, నతి జాగ్రతతో నెక్కవలయును.

ఆధ్యాత్మిక తత్త్వవేత్తలగు సద్గురువుల దృష్టిలో, చుక్కల పర్వత మనగా నిదికాదు. స్థిరచిత్తముతో నూర్థ్వదృష్టితో దర్శించెడి స్వయంజ్యోతి కేంద్రమగు సహస్రారమే! సహస్రారమున కోటి సూర్యులకాంతితో వెలింగెడి జ్యోతిర్మయమూర్తి యగు పరమాత్మను దర్శించిననాడే, మానవజీవిత గమ్యము పొందినట్లగును.

మానవజీవిత పరమావధియే జీవేశ్వరైక్యము. అట్టి జీవేశ్వర స్థితిని పొందిననాడే సంసారబంధము లన్నియు సడలిపోయినట్లు దానిని పొందినవారే, జరామరణములు లేని నిత్యానందమగు మోక్షసుఖమును పొందినవా రయ్యెదరు.

అట్టి స్థితిని పొందుటకే, తీర్థయాత్రలు, దానధర్మములు, నన్న సత్రములు, రామాలయములు, సప్తాహములు, సాధుసంతర్పణలు, పురాణశ్రవణభజనాదులు, ఏకాహ సప్తాహ షోడశాహాది కార్యక్రమ ములు, ఆశ్రమములు, గీతాపారాయణములు, కోటిబిల్వార్చనలు,

నగర సంకీర్తనలు, నామస్మరణలు, ప్రార్థనలు, స్తోత్రములు, శ్రీరామ నామలేఖనములు, శ్రీరామాలయ ప్రదక్షిణములు, ఆంజనేయస్వామి వారికి ఆకు పూజలు మొదలుగా గల కార్యక్రమము లెన్నెన్నో మానవులు చేయుచున్నారు.

పైన జెప్పిన వన్నియు చేయుచున్నారు. చివరకు మిగులునది సున్న, ఫలము శూన్యము. కారణమేమి? వారు ఎన్ని, సత్కార్యము లొనర్చినను, మూలసూత్రమగు సత్యమునకు దూరులగుచున్నారు. సత్యస్వరూపుడు భగవంతుడు. కనుక, సత్యవాక్యసంపన్నులకు భగవంతుడు ప్రత్యక్షమగును. సత్యము, శాంతము నీలో గలిగిననాడే ప్రశాంతిగల్గును. ప్రశాంతి యనగానేమి? ప్రకృతి బాధలకు చలింపక స్థితప్రజ్ఞతో నుండుటయే!

ఇట్టి ప్రశాంతి నొందుటకే యేడుకొండలస్వామిని దర్శించవలయును. ఇట్టి దృష్టితో పరికించినచో వెయ్యిమంది కొక్కరైనను, సార్థకత జెందుటలేదని గ్రంథకర్త సందేహము. వేంకటేశ్వరస్వామి యానతి యేమో! ప్రశాంతితో నాలించి పాలించి యనుభవించుడు.

ఈ తిరుపతి యాత్రాశయమును తెలిసికొనుట సామాన్య ప్రజా కోటికి అసాధ్యమైనది. మన పెద్దలు సృష్టించిన యీ యాలయ నియమములు బహువిచిత్రములు. కుల మత వర్గ విభేదములేక చిన్న పెద్ద తారతమ్యమును దలచక చంటిపాప మొదలు చావసిద్ధమైన వృద్ధులు సైతము తెలిసియో, తెలియకనో యాలయనియమములు యందరు వీనిని పాటించుచున్నారు. నూటికొక్కరైనను ఆహా! పరమపవిత్రమగుమానవ జన్మ నెత్తియు పుణ్యస్థలములకు చేరియు, భగవదారాధన చేయుటకు బదులు నింద్యకర్మములగు శిరోముండనము పాదరక్షతాడనములతో, సంచులు ఖాళీలుచేసి యాశలడగించుకొనుటకు మారుగా లక్షాధికారులము కావలెను, ఉన్నతోద్యోగములు చేయవలెను, సంతానములు కావలెనను నైహికవాంఛలతో, హృదయాందోళనలతో నాలయ

మును పీడి యహంకార మమకారములతో సభ్యతలేక వర్తింపుచు త్రొక్కిడితో తత్త్వమేదో తెలియక పుణ్యమునకు బదులు పాపపు మూటలతో, రాగి యిత్తడి కంచు పాత్రలతో పాత్రతను గోల్పోయి స్వగృహములకు చేరుచుందుమని దలచరుగదా!

దివ్యతిరుపతి సత్యాశయములను గుర్తింపుడు.

కృతయుగమున నీ ధరామండలమును మహారాజు లెందరో బరిపాలించిరి. ఆ మహారాజులలో మొదటివారగు శ్రీ హరిశ్చంద్ర మహారాజు సత్యస్థయిర్యములను పరీక్షింప నెంచి శ్రీ వసిష్ఠ, విశ్వామిత్ర మహర్షులు పందెము వేసికొనిరి. ఆ పందెము లెట్టివో యాలింపుడు. శ్రీ విశ్వామిత్రమహర్షి "ఓ వసిష్ఠమునీంద్రా! హరిశ్చంద్రుని చే నసత్యము నాడింపనిచో, నేను హిమశైలమున వాయుభక్షణతో చేసిన తపఃఫలమున నర్ధాంశము ధారవోసి హరిశ్చంద్రు మహిని పెక్కు మహాయుగము లేలించద"నని శపథము చేసెను. వెంటనే వసిష్ఠమహర్షి "ఓ విశ్వామిత్రమహర్షీ! మా హరిశ్చంద్రుడే సత్యము దప్పి చరించినచో, నేను శిరోమండనము గావించుకొని వాడవాడల నూరేగెద"నని శపథ మొనర్చిరి. ఈ సత్యాశయము ననుసరించి యాడిన నుడి దప్పిన వారికి శిరోముండన మానాటి శిక్ష. ఇదే విధముగా ద్వాపరయుగమున పాండవు లరణ్యసంచారసమయమున దుష్టుడగు సైంధవు డొంటరి పాటుగానున్న ద్రౌపదిని పరాభవించెను. ఆ పరాభవమును గుర్తించిన పాండవులు, సైంధవుని బట్టి నెత్తి గొరిగించి చివాట్లు బెట్టి సాగనంపిరి. ఆడినమాట దప్పినవారికి పరస్త్రీవ్యామోహకులకు నెత్తి గొరిగించి పంపుట యానాటి యాచారము. ఆనాటి యాచారమే, యీ నాటికి దివ్యక్షేత్రమగు తిరుపతికొండపై జరిపించుచున్నారు.

ఇంకొక విశేషము :

శ్రీ వేంకటేశ్వరాలయమునకు వెళ్ళి దేవుని దర్శించిన ప్రతి వ్యక్తికి శ్రీ స్వామివారి వెండిపాదరక్ష తలపై మోపెదరు. గర్భాల

యము ప్రక్కనే, కటకటాలమధ్య నున్న దిఙాణములో యాత్రీకులందరు చెల్లించవలసిన మొక్కుబడులను సమర్పించెదరు. మొక్కుబడు లన్నిటిని పూర్తిచేసికొని శ్రీస్వామివారికి నారికేళ నైవేద్యము లొసగి స్వగ్రామములకు చేరుచుందురు. యాత్రాశయము విజ్ఞుల కెల్లరకు బోధపడును. "తలలు బోడులైన తలపులు బోడులా" యని నుడివిన, మన వేమనయోగి వాక్యము జగద్విదితమే! తలలు బోడులైనంత మాత్రమున ప్రయోజనము లేదు. తలలో జనించెడి నీచగుణములను సమూలముగా రూపుమాపవలెను. అట్టి స్థితిని పొందిననాడే శ్రీ వేంకటేశుని సన్నిధి తలనీలాలు సమర్పించిన సత్ఫలితమును పొందుదురు. అంతవరకు నెన్నిమారులు తిరుపతి వెళ్ళినను శిరోముండనము చేసికొన్నను ఫలము మాత్రము శూన్యము. జీవితమున వక్రమార్గముల త్రోవననుసరింపక పాదరక్షా తాడనములను పొందక, శరీరాభిమానమును, ధనాశను వీడి, దైవదర్శనమునుపొంది తరించవలెనను. సదాశయసంపత్తి ప్రజలెల్లరకు ప్రబోధము చేయుటకే దివ్యతిరుపతిలో యిట్టి యాలయాచారములను విజ్ఞులు సృష్టించిరి.

లౌకికులు కొందరాపద మ్రొక్కులు మ్రొక్కి యాపదదాటిన పిదప దేవుని సొమ్మును బంధుమిత్రాదులకు వెచ్చించి స్వామివారికి పదోవంతో పదునారవవంతో సమర్పించెదరు. సర్వవ్యాపియగు శ్రీ వేంకటేశ్వరస్వామి లౌకికుల భక్తిని గుర్తించి కొండదిగకముందే మహోపద్రవములను తటస్థింపచేయును. తక్షణమే 'ఓ వేంకటరమణా! మా తప్పులను సైరింపుము ప్రభూ! నీకు పదివేల వరహాలు లొసంగెదము. మరల నీ కొండకు వచ్చెద మీ గండము గావు'మని దండములిడి చేసిన తప్పును గుర్తించి క్షమించుమని ప్రార్థించి వడ్డీతో స్వామిబాకీ దీర్చుచుందురు. ఈ అజ్ఞానపు మానవుడు శ్రీ తిరుపతికొండ కనేకమారులు వెళ్ళి ముడుపులు చెల్లించి నంత్యకాలమున చివరదశలో ప్రియసుతుల నందరిని తనవద్దకు పిలిచి, "నాయనలారా! శ్రీ తిరుపతిస్వామికి మనము

పదివేల రూపాయల మూడు సంగాప్పై సొలు నిర్వాణానికి మీరు తప్పక శ్రీ స్వామివారికి చెల్లించు" మని ప్రకృతిభాషలలో ప్రాణములను విడుచును.

ఎన్ని నేర్చినను నెంత యార్జించినను సత్యము దప్పినవాడు సర్వేశ్వరుడు క్షమింపడు. సత్యస్వరూపుని సత్యదృష్టితో సత్యమార్గముతో సత్యవాక్పాలనా దీక్షతో సర్వభూత సమదృష్టియను సమదర్శనను పొందవలెను.

గర్భాలయమునందు సదా ప్రతిష్ఠానించేసి యూ దేవుని సందేశమును శ్రద్ధతో భయభక్తులతో ప్రశాంతముగా వినినవారికి వారే ధర్మపథగాములై మీ జీవితములను ఇకనైనను సరియైన మార్గమున త్రిప్పుడు.

"ఓ యాత్ర చేసిన మానవులారా! అసలు విషయము తెలియక, నెంత కాలము తిరిగినను మీకేమిపోయి! ఇప్పటికైన నుంచినది లేదు. వాచా వేదాంతములు మాని యాచరణలో పెట్టుడి. నా సందేశమును మరువకుడు.

"ఓ మానవులారా! మీ పుట్టెలలో నున్న దుష్టవాంఛలను, దానవప్రవృత్తులను, తుచ్ఛపుబుద్ధులను, పాపపుచింతనలను నాకొండకు వచ్చి తుడిచివేయుడు. పవిత్రమగు బ్రహ్మజ్ఞానమను నీటియందు మునుకలు వేయుడు. మూడుమతములు నొకటే! ముమ్మూర్తులు నొకటే! యను పరమసత్యమును గ్రహించి, సూవర్ణముగా చుక్క బొట్టు అడ్డబొట్టు నిలువుబొట్టులను, సమన్వయము చేసి విమలోర్ధ్వ పుండ్రనామమును ధరింపుడు. మీకుగల ధనాశాపిశాచమును నా సన్నిధిలోనే పూర్తిగా పారద్రోలుడు. మూర్ఖులకు బుద్ధివచ్చురీతి నా సన్నిధికి రప్పించి మీకు విజ్ఞానమును బోధించుటకై పాదరక్షను మీ తలపై మోపుచుంటిని. ధర్మమార్గమును దప్పినవారికి నేకదా! అవమానకరమగు నింద్యమగు కర్మలకు గురిచేయుట. పందెము వేసి యోధి

పోయినవారి ననగా, నొకపని చేసెదనని చేయలేకపోయినవారికి, తల గొరిగించి పాదరక్షప్రయోగమునకు గురిచేయించుటే! యీ కలిమానవులకు తగినశిక్ష యని గుర్తించి యిట్లు చేయించుచుంటిని. ఎన్ని విధముల నయోక్తిగా మందలించినను, కలికల్మషహృదయులు కనుక, వెంటనే మరచి, పాతపాటనే పాడుచుందురు. అజ్ఞానపుబాటలలోనే యాడుచుందురు. ఇట్టి మూఢహృదయులు పలుసారులు నా కొండకు వచ్చినను తలనీలా లర్పించినను, సహస్రకలశపూజలు చేయించినను, నేను ఆనందమును పొందను. మీ హృదయముల తీరు నాకు తెలియనిది కాదు. సర్వకాలసర్వావస్థలయందును, మీ హృదయకుహరమున దాగి, మీ రొనర్చెడి పాప పుణ్య మిశ్రమకర్మలకు తగినఫలమును కలుగచేయుచుందు" నని స్వామి హెచ్చరించుచున్నాడు.

నెంత వ్రాసినను కొందరికి మాత్ర మనుమానము కలుగుచునే యుండును. ఓహో! ఈ కవిగా రంతయు నా సద్గురుకృపాబలమే! నేను నిమిత్తమాత్రుడను, యీ వేదాంతరహస్యములు మతాశయమూలసూత్రము లన్నియు నా సద్గురుశక్తిప్రసారముచేతనే నేను వ్రాసితి నని ప్రారంభముననే ప్రస్తావనయందు వ్రాసిరి.

ఓ కవిగారు! పాపముచేసిన ప్రతివ్యక్తికి శిక్ష నుండవలసినదే! పరస్త్రీవ్యామోహకులకు, ఆడిన నుడి దప్పినవారికి, శిరోముండనమని, ఒకనియమమున్నదని నుపమానములతో ప్రబోధముచేసిరి. మాకెంతో యానందము, కానీ, నోరెరుగని పసిబాలురకునైతము, దివ్యక్షేత్రమగు తిరుపతికొండపై విధిగా శిరోముండనము గావించుచుంటిరి. వీ రెప్పు డసత్యమాడిరో యనెడి సందేహము కొందరికి మాత్రము సంభవించుట సహజము.

సందేహనివ రి యే సర్వశుభప్రదము. ప్రతివ్య__యు అసత్యము ఆడియేయుండెను. ఎట్లనిన మాతృగర్భమునందు ప్రవేశించిన ప్రతి ప్రాణియు నేడవమాస మాదినుండి పదోమాస ప్రారంభము వరకనేక

బాధలకు గురియై గర్భనరక మనుభవించుచు పూర్వస్మృతి గలిగి దిక్కు-లేని యీ జీవుడు రక్షకుడగు దేవునితో ఓ దేవా కృపజూడవా గతి గానవా నాకేదిదారి. నేననేక జన్మలెత్తుచు సంసార సముద్రమునబడి తృప్తిలేక నీదుచు కాలగతిచెంది చెప్పలేనన్ని యోనుల ద్వారా జన్మించి స్త్రీపాపు వీడి ఈ గర్భనరకము లనుభవించుచున్నాను. సిగ్గు వచ్చినది. యీ నరకమునువీడి భువిమీద పడినప్పటినుండి నిన్ను మరు వను. సంసారమును విషమని భావించి సర్వసంగములను త్యజించి నిన్ను చేరుటకై సద్గురువులచేరి వారి ప్రబోధములను విని మరువక మననము చేసి నాజన్మను చరితార్థము చేసికొనెద ప్రభో! యని పలుమారులు ప్రమాణములుచేసి ప్రణామము లర్పించును. ఆ దేవుడీ జీవుని ప్రార్థ నాలించి భువిపైకి పడద్రోయును.

భగవదాదేశముతో భువిపైకి వచ్చిన యీ బాలుడు దేవుని వాక్యమును మరువక మననము చేయుచు ధ్యానసమాధిని పొంది యుండును. ప్రకృతి పురుషుల స్పర్శచే నపవిత్రమైన జలమును నా బాలుని ముఖముపై ముమ్మారు చల్లెదరు. వెంటనే ఆ బాలుడు ధ్యాన సమాధిని వీడి దేవునితో శపథము చేసిన విషయమును మరచి, క్వా, క్వా, క్వా యని నేడ్చును. కలిలో మెలగెడి యీ బిడ్డడు ఆడిన నుడి తప్పిపోయెను. ఈ తప్పిద మొనర్చిన ప్రతిబిడ్డకు పుట్టువెంట్రుకల నెప ముతో దివ్యతిరుపతిలో శిరోముండనము చేయించుచున్నారని నుడువగా సందేహాము గల ఆ కొందరును విషయమర్థము చేసికొని హాయిగా నిద్రించిరి.

శ్రీ స్వామివారి హెచ్చరికను గుర్తించి ప్రవర్తించి జీవితమును సరిదిద్దుకొని దైవభక్తితో ధర్మజీవనముచేసెడి వ్యక్తులు కొండకువెళ్ళక గృహమందున్నను భయములేదు! అజ్ఞాని యరణ్యమందున్నను వ్యర్థమే! విజ్ఞాని సంసారమందున్నను స్వర్గమే!

పదు నేడవ తేదీ ఎగువతిరుపతి నుండి బస్సులలో వంకలు వంకలు తిరిగెడి రోడ్డుపై ప్రయాణము చేయుచు హాయిని, నానందమును, నాధ్యాత్మిక భావముల కలిగించెడి నరణ్యము నధిగమించుచు దిగువ తిరుపతి చేరిరి. ఆలయమున కేగి శ్రీ గోవిందరాజస్వామిని, లక్ష్మీదేవిని దర్శించిరి.

నే యాలయమున కేగినను దేవునిప్రక్కనే దేవత మనకు దర్శన మగును. ఏమి గుడులు ఏమిగోపురములో అంతయు మాయగానున్నది. ఎక్కడ జూచినను దేవతల ప్రక్కనే అందమైన అలంకరణతో స్త్రీ స్వరూపము మనకు గోచరించుచున్నది. మన ఇంటిలో ఇల్లాలి పోరు పడలేక ప్రశాంతి కొరకాలయముల కేగ, అచ్చటను ఇల్లాలి పోరే మనకు ప్రత్యక్షమగుచున్న దనెడి ననుమానము తప్పక గలుగును. దీని రహస్యమేమో వినుడు :

మానవులందరు ప్రకృతి బాధలకు తాళలేక ఎప్పుడో ఒకప్పుడు దైవప్రార్థనలకు దిగవలసినదే! తప్పునది కాదు. మానవులు సంసార శ్రమలకు గాసిజెంది, శాంతియనునది లేక మనశ్శాంతి కొరకాలయముల కేగిన ప్రజలకా మూర్తి ప్రబోధము చేసెడి పరమసత్య మిదియే!

ఓ అభావ వైరాగ్యమూర్తులారా! స్వభావ వైరాగ్యమును పొందుడు. పరమాత్మ నగు నా ప్రక్కనే ప్రకృతిని స్త్రీమూర్తిగా మలచి నిలిపిరి. ప్రకృతిబాధలతో సతమతమై నా సన్నిధికి చేరిన మీరు, యా ప్రకృతిపై మనస్సుంచక నన్నే నమ్మి నాయందైక్యమును పొందుడు. ప్రకృతిని జయించుట అసాధ్యమైనది. ప్రకృతి శాశ్వతమైనది కాదు. స్త్రీస్వరూపమును చూచి భ్రమించి దాని మాయలకు చిక్కి విడివడుటకు శక్తిలేక అనేకజన్మలు నెత్తుచుంటిరి. స్త్రీరూపముపై విరక్తిగలుగుట కొరకే ఆలయములలో అచ్చటచ్చట వస్త్రవిహీనమైన స్త్రీరూపములను ఆలయములపై, గాలిగోపురములపై చెక్కిరి. ప్రత్యేకముగా, వస్త్రవిహీన స్త్రీరూపములనే గర్భాలయమందుంచి పూజించుచున్నారని ఆ మూర్తి ప్రబోధము.

ఈ విషయమం దనుమానము పాఠకులకు తప్పక గలుగును. పాఠకమహాశయు లనుమాన నివర్తికై మచ్చునకు నొకదానిని మాత్రమే తెలుపుచున్నాను.

కర్నూలునకు సమీపమున చరిత్రప్రసిద్ధమైన సిద్ధక్షేత్ర మొకటి గలదు. ఆ సిద్ధక్షేత్రమే అలంపురక్షేత్రము.

ఈ అలంపురక్షేత్రమహిమ అనంతమైనది. ఇందులకు నిదర్శనము– దక్షిణాపథమందలి ప్రాచీన శైవక్షేత్రములలో శ్రీ శైలము పురాణ ప్రసిద్ధమైనది. ఆ మహాక్షేత్రమునకు నాలుగు దిక్కులలో నాలుగు ద్వారములున్నవి. తూర్పున త్రిపురాంతకము; దక్షిణమున సిద్ధవటము; పశ్చిమమున అలంపురము; ఉత్తరమున ఉమామహేశ్వరము ద్వారము లుగ పరిగణింపబడినవి. స్థలపురాణమున నీ క్షేత్రము భాస్కరక్షేత్ర మని, పరశురామక్షేత్రమని, దక్షిణకాశి యని వర్ణింపబడినది.

ఈ అలంపురక్షేత్రములో గల బాల బ్రహ్మేశ్వరాలయమందే, ముందరిశాలలో ద్వారమునకు ఉత్తరమున ఒక చిన్నగుడి. ఆ గుడి యందు జోగుళాంబ యనెడి దేవత గలదు. ఈ దేవతకు వస్త్రము లేదు. చూచుటకే అసహ్యము. నిత్యానాథసిద్ధుని రసరత్నా కరములో ఈ దేవత 'యోగాంబ' అని పేర్కొనబడినది. అష్టాదశ దేవీపీఠములలో నీ జోగుళాంబయు చేరియున్నది.

విషయములను పెంచినకొలది పాఠకులకు శ్రమ యని నింతటితో సంపూర్తిచేసితిని. అనుమానములను పోనాడి నిందలి భావములన్నియు, నగ్నసత్యములనియు, శ్రీ నృసింహప్రేరితము లనియు విశ్వసించవలెను.

పదునెనిమిదవ తేదీ రాత్రి 3 గంటలకు యాత్రికబృందము దిగువ తిరుపతి వీడి, ధర్మవరము స్టేషనులో దిగిరి.

ఆ మరునాడు, వారు కాలకృత్యములు నెరవేర్చి ధర్మవరమునుండి బస్సులో బుక్కపట్నము చేరి, చెరువుబాటన కిటకిటలాడు జనులతో కలసి పుట్టపర్తి చేరిరి. అచట శ్రీ సత్యసాయిబాబా వారి ప్రశాంతి నిలయమును దర్శించి యమితాశ్చర్యానందములను పొందిరి.

యాత్రీకులందరు శ్రీ సాయిబాబావారిని దర్శించవలయు నను ప్రేమతో జనులమధ్య నలిగి నలిగి సదనము లోనికి వెళ్ళుటకు శక్తి జాలక ఒకప్రక్కనే నొదిగి తలలు పైకెత్తి శ్రీసాయిబాబాస్వామి దర్శన మెప్పు డెప్పు డనెడి యావేశాందోళనలతో దర్శింపవలెనని వీక్షింపసాగిరి.

ఈ గ్రంథకర్త సుబ్బారావుగుప్తగారు, ఆహాహా! ఏమి ప్రజలు ఏమి ప్రజలు! ఉన్న సత్యాన్ని వదలి యెచ్చటో సత్యమున్నదని పరుగులు దీయుచు, బాబాను దర్శించినచో మా సంసార బాధలు కష్టములేకనే సమసిపోత వనెడి పేరాసతో నీ విధముగా త్రొక్కిస లాడుచున్నారు. పవిత్రాశ్రమ మగు ప్రశాంతినిలయమున కేతెంచియు నశాంతినే పొందుచున్నారు. కలికాలమహిమ! యీ కలికల్మషమును సమూలముగా తుడిచివేయుటకు సిద్ధులుకూడ వద్దనుకున్నారేమో తెలియకున్నది. మానవులు మహాత్ములను యేసదాశయముతో దర్శించవలయునో తెలియకున్నారు. కొద్దిమంది తెలిసినవారున్నను, 'పదుగురాడు మాట పాటియై ధరజెల్లు' నన్న వేమన్న వాక్యము ననుసరించియే! యీ పదుగురు పాడెడి అజ్ఞానపు పాటనే వారు పాడుచు, వీరి యాటలకే నలవాటై సుఖములు, సౌఖ్యములు, భోగములు, భాగ్యములు, సంతోషములు, సంతానములు, రాగములు, రోగములు, అవీ ఇవీ అన్నీ కావలెననుచు, సంసారములు వదలి, సాయి బాబా పంచను పడిగాపులు గాచి, స్వార్థసుఖాలకై తపించుచు, దిండులేని పరుపైనను నేద్చుచు, ధనం – ధనం – ధనమ్మని జపించుచు అహోరాత్రులు విభూతికై తీర్థాలకై ఆరాటపడుచున్నారు.

శ్రీ సత్యసాయిబాబాగారి యాశ్రమము అందముగా ధనవంతుని మందిరమువలె ధగధగ మెరసిపోవుచున్నది. ఆ రోజే విజయదశమి.. దేవీ కుంకుమపూజ చేయించిరి. ముత్తైదువులకు మనోహరమైన పట్టు గుడ్డలను, దేవికుంకుమ, విభూతి తీర్థప్రసాదములను వినియోగము చేసిరి,

శ్రీ సాయిబాబాగారి దర్శన మందక కొంద అతిప్రయాసలకు గుఱియగుచున్నారు. ఆశ్రమమున కిరువైపుల నిర్మించిన గదులలో నైహిక బాధలకు, శరీరరుగ్మతలకు గుఱియైనవా రెందరో దూరదూర ములనుండి వచ్చి స్వయంపాకములతో నివాసముచేయుచు నిత్యము సాయిబాబా భజన ప్రార్థనాదులలో పాల్గొనుచు తీర్థప్రసాదులను స్వీకరించుచు మాసములాదిగా నివసించుచున్నారు. వేలాది ప్రజలు వచ్చినను, నూటికొకరైనను, జన్మరాహిత్యమున కగు మార్గము ప్రబోధము చేయుడని కోరుటలేదు. ప్రకృతిశక్తి యీ విధముగ నట ప్రళయనాట్యము చేయుచున్నది.

'బాబా! బాబా!' యనుచు కాకులవలె గోలచేయుచు క్రమ శిక్షణ యణుమాత్రమైనను లేక యక్రమప్రవర్తనతో పెద్ద చిన్న తారతమ్యము లేకయే, కోతులవలె నొకరిపై నొకరెక్కుచు, "ఇది యాశ్రమము బాబాగా రొచ్చుచున్నారు. ప్రశాంతిగా నుండు"డని యెవరికి వారే బిగ్గరగా నరచుచున్నారు.

ఆహా! ఏమి చిత్రము! ఈనాటి ప్రపంచములో నెట్టి భక్తులు తయారగుచున్నారు! ఇట్టి భక్తులవలన యిట్టి భక్తసంఘముల వలన లోకమున కేమి లాభము! లోకమున శాంతికి బదులుగ నశాంతి యెక్కువైనది. న్యాయమునకు బదులు అన్యాయము, పుణ్యమునకు బదులు పాపము, సకామమునకు బదులు దుష్కామము మొదలగు అక్రమము లెన్నియో ప్రబలిపోయినవి.

ఆ పరమేశ్వరు డేనాటికైనను దొంగిభక్తులను, దొంగభక్త రాండ్రను బూడిదచేయక వదలడు. సత్యము గ్రహించలేని మూర్ఖ మానవు లెన్ని యాశ్రమములు తిరిగినను నెన్ని తీర్థయాత్రలు సేవించి నున నేమియు ప్రయోజనము లేదు.

పగలు 12 గంటలకు శ్రీ సాయిబాబాగారు, విరియబోసికొనిన తలతో, కంఠము మొదలుకొని పాదాగ్రము వరకు పట్టులాల్చి వేసికొని

ప్రశాంతి సదనము పై భాగమున మహారాజు నడకతో ప్రజాసమూహ మును వీక్షించుచు సాక్షాత్కరించిరి.

ప్రజలందరు నల్లులు సాచి రెప్పలార్పక వారిని దర్శింప సాగిరి. శ్రీ బాబాగారు హాలులో వెండిసింహాసనముపై సుఖాసీనులైరి. గ్రంథ కర్తగారు హాలులోపల అతికష్టముతో చొక్కాలనష్టముతో బాబా సన్నిధానమునకు వెళ్ళిరి. బాబాగారి కిరువైపుల బ్రాహ్మణులు వేదోక్తవిధితో మంత్రములు చదువుచుండిరి. ఒక భాగములో భాజా భజంత్రీలు మంగళవాద్యములు మ్రోగించుచున్నారు. ఒక భాగములో భక్తులు షిరిడీబాబా భజన చేయుచున్నారు. హాలంతయు కిటకిటలాడి పోయినది. ఆశ్రమము నలువైపుల వేలకొలది ప్రజలు ప్రశాంతముగా దర్శించుట కవకాశములేక నిరాశతో గగ్గోలు పడుచున్నారు. ఆశ్ర మము నిండుగ మూడు భాగముల ముప్పాతికవంతు ఆడువాండ్రే!

ఇరువురు బ్రాహ్మణు లొక మట్టిపాత్ర నెత్తి బోర్లించిరి. దానిలో నేమియు లేనట్లుగానుండెను. బాబాగారు మట్టిపాత్రకు తగిలి తగలనట్లు వ్రేలితో ముమ్మారు ఓంకారమును గీయగా పాత్రనుండి బూడిద సన్నగా ధూళివలె రాలుట ప్రారంభమయ్యెను. కొంతసేపట్లే రాలినది. రాలిన బూడిద సుమా రొకమానె డుండును. దీనినే విభూతియోగ మనియు, దీనిని దర్శించవలెననియు నొకరినొకరు ప్రాణములు తీసికొను చుందురు.

హాలునిండను గోడలపై శ్రీ సాయిబాబా ఛాయాచిత్రములు, సింహముపై పెద్దపులులపై బాబా ఆసీనులైనట్లు, వివిధప్రాంతములలో ఘనస్వాగతమిచ్చిన మనోహరదృశ్యము లెన్నెన్నో యందమైన చిత్రము లతో నమర్చబడి యున్నవి. బాల్యమాదిగా నేటివరకు గల్గిన పరిణామ దృశ్యములు మదపుటేనుగుపై నంబారీలో నూరేగినట్లు, కోటు, బూటు, సూటు వేసికొన్న చిత్రములెన్నో ప్రశాంతిభవనములోనున్నవి.

క్రింద రాలిన బూడిదను బాబాగారే దోసిలితో నెత్తి ముమ్మా రా బిందెలో పోసిరి.

ప్రక్కనేయున్న రేకుల షెడ్డులో వంటబ్రాహ్మణులచే వండించి భోజనపదార్థములన్నియు దెప్పించి భక్తులందరకు తృప్తిగా భోజన మిడిరి. సాయిబాబాగారు పంక్తిలో నిలిచి "ఓ నాయనలారా! భగవత్ప్రసాదమును తృప్తిగా తిను"డని చెప్పుచు వడ్డనవారితో "ఏమండీ! విరివిగా వడ్డించండి జాగ్రత్త" యని చెప్పసాగిరి.

ఈ గ్రంథకర్త సుబ్బారావు నాశ్రమమంతయు పరిశీలించి వెళ్ళు వరకు పంక్తి నిండిపోయెను. కూర్చొనుటకు జాగా లేదు. షెడ్డు మొదటి యందే నిలువబడి మౌనముతో "ఓ లక్ష్మీనృసింహా! సద్గురు యోగానందప్రభూ! నీ పాదదాసునికి భోజన మీయలేవా! ప్రొద్దుగ్రుంకు సమయమైనది. ఆకలివేయుచున్నది" యని ప్రార్థించి, యెదురుగానున్న సాయిబాబా శిరస్సును జూచి "వీరనృసింహా! నీ తలవలెనే బాబాగారితల యున్నది. నీ నృసింహ స్వరూపమే నాకు బాబాగారి హృదయ దర్పణములో సాక్షాత్కరించినది ఏమి నీ కృప" యని లోలోన దలచి బాబాగారికి బిగ్గరగా 'నమోనమః' యనిరి.

శ్రీ సద్గురు నృసింహశక్తి వారిలో చేరినది. వెంటనే బాబాగారు, గ్రంథకర్తవైపు దృక్కులు ప్రసరింపచేసి 'కూర్చో నాయనా!' యని సెలవీయ దోమదూరు సందులేని పంక్తిలో నేనుగుదూరు నంత ఖాళీవచ్చెను. తత్క్షణమే, నృసింహ భక్తుడగు సుబ్బారావు కూర్చొనిరి. అన్నము కూరలు నేయితో విస్తరి యొకటి తీసికొనివచ్చి ముందుంచ 'జై! సద్గురునృసింహా' యని తృప్తిగా భోజనముచేసి శ్రీ వేంకటేశ్వర స్వామివారి వెంట పయనమై, యాత్రికబృందముతో పుట్టపర్తి వీడి బుక్కపట్నము చేరి బస్సులో రాత్రి 8 గంటలకు పెనుగొండ చేరి, యా రాత్రికే హిందూపురము చేరి విశ్రమించిరి.

ఇరువదియవ తేదీన యాత్రీకులు హిందూపురమునుండి బస్సులో లేపాక్షి యను చిన్నగ్రామము చేరి, కొండపైనున్న దుర్గాలయమును, నాలయము ప్రక్కఖాళీస్థలములో నొక చట్టురాతిలో చెక్కబడిన నాలుగుమూరల శివలింగము, నా లింగముపైన నేడుపడగలు విప్పి

యున్న సర్పరాజమును దర్శించిరి. ఆలయమంతయు నతిజీర్ణావస్థలో నున్నది. గర్భాలయము దప్ప చుట్టునున్న కట్టుబడులు పూర్తి గాకయే నిలిచిపోయినవి. శివలింగములు స్థాపించుటకై యెంతయో రమణీయముగా చేయించిన పానవట్టములు, మూలపీఠములు, లింగాకారములు లేకయే యాగిపోయినవి.

అంతయు నీశ్వరేచ్ఛ! ఏది యెట్లు జరుగవలయునో యా లింగ స్వరూపియగు పరమేశ్వరునకే యెఱుక! ఆలయమంతయు వీక్షించి యూరిచివర, నొక కొండచట్టులో మలచి తీర్చిదిద్దిన బసవేశ్వరుని దర్శించిరి. 'లేపాక్షి బసవయ్యా! లేచిరావయ్యా' యనెడి లోకోక్తి నా ప్రాంతమున గలదు. ఆ ప్రాంతముననే కాదు. ఇంతటి బసవేశ్వర స్వరూప మేప్రాంతమునను లేదు. యాత్రికబృందము పర్యటనము చేసిన దక్షిణదేశమున నిట్టి బసవేశ్వరరూప మెచ్చటను కాంచలేదు.

కొండలోనున్న యొక పెద్ద గండశిలను, శిల్పనైపుణ్యముగల మహామేధావి నందిగా మార్చినాడు. ఈ నందీశ్వరుని చుట్టుకొలత యిరువదేడు గజములు. ఆ నందిముఖము సమతలమునకు నాలుగు గజములన్నర. ఆ నందికంఠమున మూరవెడల్పుగల గంటలు, మువ్వలు రెండు వరుసలుగా చెక్కబడియున్నవి. చాల పనితనముగా చెక్కినాడు.

యాత్రికులు లేపాక్షినుండి హిందూపురము చేరిరి. వారు తెల్ల వారు జామున నాలుగుగంటలకు హిందూపురమునుండి బయలు దేరిరి.

ఇరువదొకటవ తేదీన పదిగంటలకు బెంగుళూరుచేరి పట్టణ దృశ్యములు వీక్షించి అందమైన లాల్ బాగ్ పార్కు దర్శించి ఆ రాత్రికి మైసూరు చేరిరి. ఇరువదిరెండవ తేదీ మైసూరు పట్టణదృశ్యములెల్ల తిలకించిరి. సాయంత్ర మారుగంటలకువెళ్ళి లక్షలాది బల్బులతో వెలింగెడి రాజాగారికోటను, మహారాజా శ్రీ జయచామరాజ వొడయార్ గారిని దర్శింపవలెనని కొంతతడవు వేచి మకాము చేరిరి.

ఇరువదిమూడవ తేదీన యాత్రికబృందము పట్టు తయారుచేయు పరిశ్రమలను దర్శించవలయునని వెళ్ళిరి. ఆ పరిశ్రమయందు పట్టుచీరెలు

తయారుచేసెడివిధ మంతయు పరిశీలించిరి. మానవుడు భగవత్సృష్టి నే విధముగా నుపయోగించుకొనుచుండెనో వారెల్లరు దర్శించిరి.

పట్టుపురుగుల పరిశ్రమ సమీపముననున్న శాండిల్ ఫ్యాక్టరీకి వెళ్ళిరి. పెద్దపెద్ద గంధపు దూలములు పెద్దగుట్టలుగ నున్నవి. ఈ గంధపు దూలములను యంత్రములద్వారా ముక్కలు చెక్కలుగా మార్చి పొడిచేసి మెత్తగా పిండివలె తయారుచేయుదురు.

గంధపుపిండిఅంతయు సలసలక్రాగెడి నీటిగంగాళములలో పడిపోవు చుండును. వేడినీటితో గంధపుపొడి కషాయమువలె కలసిపోయి కొన్ని మార్పులతో గాజునీసాలలో బొట్లుబొట్లు పడుచుండును. ఆ యావిరి రూపమున పడిన ద్రవపదార్థమునే "మైసూరు చాందిని అత్తరు" పేరుతో విక్రయించెదరు. అచ్చట సెంటు పీపాలకు పట్టి యుంచెదరు. సెంటుఫ్యాక్టరిని పరిశీలనచేసి బయటకు వచ్చువరకు సెంటుతుంపరలు శరీరములపైబడి వారమురోజులవరకు గ్రంథకర్త, యాత్రీకుల శరీర ములు గంధపువాసనలు పరిమళించినవి.

మహారణ్యమున సృష్టింపబడిన పెద్దమ్రానులనుండి యతి సువా సన గల సెంటును తయారుచేయు విధానమును గుర్తించిరి. మానవుడు సాధించలేని పనులు లేనేలేవని యాత్రీకులందరును గుర్తించిరి.

సాయంత్రము మైసూరునుండి రైలులో నంజన్‌గూడు అనెడి గ్రామము చేరి శ్రీ కంఠేశ్వరాలయమున ప్రవేశించి మూర్తిని దర్శించి వెంటనే ప్రాకారములను నిర్గమించి మైసూరుచేరిరి.

ఇరువదినాల్గవ తేదీన యాత్రికులందరు మైసూరునంతయు తిరిగి రాత్రి యెనిమిదిగంటలకు రాజాగారికోటలో ప్రవేశించిరి. రాజదర్బారు ముందు రాజదర్శనమునకై లక్షలకొలది ప్రజ లాసీనులైరి. రాజావారు చాముండేశ్వరీదేవి పూజకొరకు వెళ్ళినారు. రాజదర్శనమునకు లక్షల కొలది ప్రజలు తహతహలాడుచున్నారు. ఈ యాత్రీకులకు రాజ దర్శనముపై నుండు మమకారము నిజముగా దైవముపై లేదు. సూక్ష్మ

పదిమందిమాత్రము సాధుపురుషులను, పుణ్యాశ్రమములను దర్శించుటకు తహతహలాడెదరు. యాత్రీకులెల్లరు రాజదర్శనము చేసి కోటలోనున్న ఆలయమూర్తులను దర్శించి మకాము చేరి ఆ రాత్రికి బెంగుళూరు చేరిరి.

ఇరువదైదవ తేదీన బృందమంతయు బెంగుళూరు పట్టణము పరామర్శించి రాత్రికి రైలుపెట్టెలో చేరి ప్రశాంతిలేక మాట్లాడసాగిరి. వారి లౌకికధోరణిని వినిన గ్రంథకర్త సుబ్బారావు "ఓ మాతృదేవతలారా! మనము యాత్రలెన్నిటినో చేసితిమి. మూర్తుల నెన్నింటినో దర్శించితిమి. ఏమి ప్రయోజనము ?

'బొగ్గు పాల కడుగ పోవునా మలిన మన్నటుల' మన హృదయముల కావంతైన శాంతి చేకూరలేదు. తీర్థయాత్రాన్వేషణ ఎందులకేర్పరచిరో తెలియలేకున్నారు.

"ఆలయములో మూర్తి చలనరహితమైన పాషాణప్రతిమగా మన దృష్టికి గోచరించును. ఆ పాషాణ రూపములో నున్న భగవన్మూర్తి మూఢమానవులకు గొప్ప వేదాంతసూత్రమును ప్రబోధము చేయుచున్నది.

"ఓ ఐహికావేశపీడితప్రజలారా! మీ యాత్రాన్వేషణ లెందుకో? మీ కేమి హాయి ? స్వగ్రామసీమలు వదలి కుటుంబ జంజాటములతో పాపాలను పోగొట్టుకొని పుణ్యపు మూటలను నెత్తికెత్తుకొని స్వగృహములు చేరవచ్చునుకదా యని కలలుకనుచున్నారు. మీ కల లన్నియు కల్లలే!

"తీర్థయాత్రాశయ మేమనగా! పెద్ద పెద్ద దేవాలయములు నిర్మించి పూర్వులు గర్భాలయములో చిన్న లింగమును స్థాపించిరి. ఆలయప్రాకారములకు, ఆలయ స్తంభముల కుపయోగించిన వన్నియు పాషాణములే! గర్భాలయములోనున్న ఈశ్వరలింగము పాషాణమే! ఈ పాషాణములకు లేనివిలువ, యా గర్భాలయమున స్థాపింపబడిన యా చిన్ని పాషాణమున కున్నది. దీని కారణమేమో! సామా

న్యులు గుర్తించుటలేదు. పెద్దలగువారు గుర్తించి గుర్తెరిగి, యాత్మా నందమును పొందుచున్నారు. ఆలయ ప్రాకార మంటపాదులకు ముందొక పరీక్ష యున్నది. ఆ పరీక్షలో నుత్తీర్ణులయినవారికి గర్భాలయమూర్తి శాంతిస్థానమును లభింపచేయును. ఆలయము ముందతిథు లెందరో కాళ్ళులేక కళ్ళులేక కదలలేక మెదలలేక 'అలో లక్ష్మణా' యని యేడ్చుచు 'పట్టెడన్నము బాబూ' యని కలువరించుచున్నారు. నీ తోటిమానవులలోనున్న, పరమాత్మను గౌరవింపక, మాటలులేని పాషాణప్రతిమల యెదుట సాగిలపడి ప్రార్థనలు సల్పినంతమాత్రాన ప్రయోజనము లేదు.

"భగవానుని స్వరూపము పాషాణముతో నిర్మించుటకు కారణము లేకపోలేదు. పాషాణమువలె స్థిరచిత్తముతో భగవానుని ధ్యానింప వలయును. భగవద్దర్శనమును పొందవలయు నన్నచో, చిత్తచాంచల్య మును తొలగించి, సునిశ్చలభావముతో దేహాలయమున ప్రకాశించెడి పరమాత్మను దర్శింపవలయును. నామరూప క్రియారహితుడు. ఏమిలేని దానికిగుర్తు సున్న. గుండ్రముగానుండును. ఆ శూన్యభావమును గోచరింపచేయుటకై, గర్భాలయమున గుండ్రని లింగస్వరూపమును స్థాపించిరి. నామరూపములులేని స్వయంజ్యోతిర్మయమూర్తియగు వెలుగే భగవంతుడు. ఆ వెలుగు పోయిననాడు శివాకారమగు నీవు శవాకారమై యెవ్వరికి పనికిరాక నిప్పులపాలై నీటిలో కలసిపోయెదవు. ఇదియే భగవద్రహస్యమని యీ పరమేశ్వర లింగస్వరూపము ప్రబోధము చేయుచున్నది. ఇంతటనైన జాగ్రత గలిగి, ప్రశాంతిని పొందుడు."

యాత్రీకబృందమంతయు గ్రంథకర్తగారి వేదాంతప్రబోధసార మును గుర్తించి పరమానందమును పొంది ప్రశాంతచిత్తులై మౌన ముతో భగవధ్ధ్యాన మొనర్పసాగిరి. రైలుబండి బెంగుళూరునుండి ప్రయాణము సాగించినది.

ఇరువదారవ తేదీన యాత్రీకబృందము ఆరుగంటలకు హరిహర రైలుస్టేషను చేరి ఊరి నానుకొనియున్న తుంగభద్రానదిలో స్నానములు చేసి దగ్గరలోనున్న హరిహరాలయమునకు వెళ్ళి దేవునిదర్శించిరి. ఆలయములోనున్న స్తంభములు పిడిసానవలె మెలికలు తిరిగియున్నవి. ఇరువదేడున 'హరిహర'లో రైలెక్కి తొమ్మిదిగంటలకే హుబ్బలి జంక్షన్ చేరిరి. వీరు హుబ్బలిలో ప్రసిద్ధి చెందిన శ్రీ సిద్ధారూఢస్వామి మఠమును దర్శించిరి. సిద్ధారూఢస్వామి మఠము సమీపమున భవనమున నివసించెడి శ్రీ మౌనస్వామివారిని దర్శించి భక్తితో నమస్సులర్పించిరి.

శ్రీ మౌనస్వామివారు పదునెనిమిది సంవత్సరములనుండి, ఎవ్వరితోను మాటలాడక మౌనదీక్షతో నున్నారు. శ్రీ సిద్ధారూఢస్వామి శిష్యరత్నమే ఈ మౌనస్వామివారని యాశ్రమములోని పెద్దలు చెప్పిరి. ఈ ఆశ్రమమున భక్తమండలి వారి ప్రాంతీయ భాషయగు కన్నడములో భజన, భగవత్ప్రార్థన గీతాపారాయణాది కార్యక్రమము లన్నియు నిర్వహించిరి.

ఇరువదేడవ తేదీన పగలు గం. 1-30 లకు శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరస్వామివారు, సన్నిధి శేషగిరిరావుగారు, గ్రంథకర్త శ్రీ కోట సుబ్బారావు మొదలగువారు గోకర్ణ మహాక్షేత్రమును దర్శించవలయునని హుబ్బలినుండి బస్సులో ప్రయాణమైరి. బస్సు బయలుదేరి ముప్పదిమైళ్ళు వెళ్ళువరకు గుట్టడవి. అంతలో యల్లాపూర్ చేరి, అచ్చటనుండి హంకోలకు టిక్కెట్ తీసికొని ఆసీనులైరి. ఇచ్చటనుండి మహారణ్యము. భయంకర సింహశార్దూల గజాది మృగములకు, క్రూర సర్పములకు నాలవాలము. చూపరులకు భయాందోళనాశ్చర్యముల నీ మహారణ్యము చేకూర్చును.

విశాలమైన యా మహారణ్యమున పెద్దపెద్ద కొండలోయ లున్నవి. కొండలోయల పైభాగమున బస్సులు వెళ్ళుచుండును. బస్సులో కూర్చొని క్రిందిభాగమును దర్శించిన యగాధమగు లోయ లెన్నో

గాంచనగును. విశాలమైన వటవృక్షములు, నేపమ్రానులు, మామిడి వృక్షములు పెద్దపెద్దవెదురుపొద లెన్నియో గాంచనగును. రకరకము లైన ముండ్లపొదలు, ఒక్కొకపొద మదపు టేనుగవలె విర్రవీగియున్నది. ఆ మహారణ్యములో, రోడ్డు పామునడకవలె మిట్టపల్లములతో మెలికలు తిరిగి యున్నది. ఆ ఘోరారణ్యములో కొండల పై భాగముల యందు సమతలములో నడవిజాతుల వారెందరో నివాసము చేయు చుందురు. పది-పదునారు గుడిసెలు వేసికొని కొద్దికొద్ది మళ్ళుగట్టుకొని వరి మొక్కలు నాటి ధాన్యమును పండించి పొట్టబోసు కొందురు. ఆ అడవి నాయకు లేప్రక్కకు వెళ్ళవలయునన్నను నల్లబై మైళ్ళు దాటిపోయిననే జనసంచారమును గాంచెదరు. దుంపకూరలతో, సెలయేటి నీళ్ళతో, తేనెపట్టులతో, వేటాడిన జంతుమాంసముతో వారు పొట్టలు నింపు కొనుచు నా యరణ్య భాగములలో నెంతో యానందముతో కాలము గడుపుచుందురు.

"ఆహా! మానవజన్మకు మితము లేదుకదా! పెద్దపులులను, క్రూరసర్పములను సదా దర్శించెడి యీ కొండ జాతులవారికి నిజముగా నా పరమేశ్వరుడు దప్ప దిక్కెవ్వరు? దిక్కు లేనివారికి దేవుడే దిక్కన్న" సామెత వీరివలన సార్థకమైనది. మనము మనబిడ్డలకు మందులు మ్రాకులెన్నియో యిచ్చుచుందుము. ఎంతయో ఆప్యాయ తతో నారోగ్యమును కాపాడుచుందుము. ఐనప్పటికి నూటికి తొంబై మంది ఋగ్మతల పాలగుచుందురు. దిక్కు మొక్కు మందు మంచిలేని యీ కొండజాతి వారి బిడ్డ లెంతయో యానందముతో హాయిగా కళకళ లాడుచు బలముగా పెరుగుచుందురు. దీనికంతటికి కారణ మార్తత్రాణపరాయణుడగు శ్రీ లక్ష్మీనృసింహుని యనంత కృపా కటాక్షముగాక యితరమే మున్నది.

మహారణ్యములో మస్తికట్ అను కుగ్రామములో పార్వతీ దేవి ఆలయమును దర్శించి సాయంత్ర మారుగంటలకు హాంకోల

బస్సుస్టాండు చేరి, వెంటనే వేరొక బస్సులో నాసీనులై రాత్రి యెనిమిది గంటలకు గోకర్ణము చేరిరి.

అచ్చట పండాగారి పెంకుటి భవంతిలో చేరిరి. ఊరి నానుకొని అరేబియామహాసముద్రము పొంగులు వాఱుచుండును.

ఇరువదెనిమిదవ తేదీన శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరస్వామి వారితో కలసి గోకర్ణాలయమున ప్రవేశించి, రావణబ్రహ్మచే మొట్టికాయలు తిన్న వినాయకుని దర్శించిరి. గోకర్ణగర్భాలయమున ప్రవేశించి నలుచదరపు రాతి మధ్యభాగమున నావు చెవి యాకారముతో నున్న రంధ్రములో నభిషేకపు తీర్థము నిండియుండగా, అర్చకస్వామి యానీరమును తోడి ఈశ్వర లింగమును సాక్షాత్కరింపచేసెను. ఆలింగమే యాత్మలింగమని వారు చెప్పిరి. యాత్రికబృందము అంగుళప్రమాణములో శుద్ధసాత్త్విక స్వరూపముతో నున్న లింగమును దర్శించి అమితాశ్చర్య మానసులైరి. భగవాను డణుస్వరూపు పరమసత్యము నిది చాటుచున్నది.

గోకర్ణేశ్వరుని సేవించి తీర్థప్రసాదములు పుచ్చుకొని ప్రాసాద మందిరముల వీడి యాత్రికబృందమునకు వీడ్కోలు చెప్పి శ్రీ వేంకటేశ్వరస్వామివారు, ఈ గ్రంథకర్త సుబ్బారావు, సజ్జనమూర్తి, సాధు హృదయులగు శ్రీ సన్నిధి శేషగిరిరావుగారు ముగ్గురు కలసి నేకాభిప్రాయులై గోకర్ణమునుండి బస్సులో నుదయము 7 గంటలకు బయలుదేరి యెనిమిదిన్నరగంటలకు కున్ట అను గ్రామము చేరిరి. అచ్చట అఘనాశని యను నది ప్రవహించుచున్నది. ఆ నదిని దాటుటకు టిక్కెట్టు ఆరుపైసలు. రెండు బల్లకట్టుపడవలు యొకటి చేసినారు. వీరున్న బస్సునే యీ బల్లకట్టుమీదికిచేర్చి గొలుసు బిగించినారు. బస్సుదిగి బల్లకట్టుపై నిలిచి యాత్రికులు ముగ్గురు మనోహరముగా ప్రవహించెడి నదిని వీక్షించుచుండిరి. యాత్రికు లెక్కిన బల్లకట్టుపడవ కొక పెద్దగొలుసును బధించి యీ గొలుసును స్టీమ్‌లాంచీకి తగిలించిరి,

ఆ స్టీములాంచి ప్రోతలతో పొగలుగ్రక్కుచు నదిలో పరుగులుదీయు చున్నది. ఈ దృశ్యము చాల వింతగా నున్నది. ఈ అఘునాశిని మహా నది నాలుగుమైళ్ళదూరములో సముద్రమున నేకీభవించును. ఈ సముద్రసంగమ స్థలములో అఘనాశనీదేవి యాలయ మున్నదని పల్లె కారులు చెప్పిరి.

అవ్వాలి యొడ్డునకు చేరి బస్సులో ఆసీనులై పగలు 11 గంటలకు వన్ ఆవర్ చేరిరి. ఫలహారములుచేసి నరావతి నదిపై మనిషికి తొమ్మిది నయాపైసలిచ్చి పడవలో యాత్రికులు ముగ్వురు అవ్వాలిగట్టు చేరిరి. మధ్యాహ్న మొంటిగంట కొడ్డున నేయున్న కాసరగూ డను గ్రామము చేరిరి. వెంటనే బస్సులో చేరి యొకరూపాయి అణాన్నర చార్జితో వీరు సాయంత్రము మూడుగంటలకు భట్ కా లను గ్రామము చేరిరి.

రోజంతయు నాహారము లేదు. ప్రాణ ముస్సు రనుచు శ్రీ స్వామి వారితో 'ఆకలి ఆకలి'యని చెప్పగా వారునియమముగా చేసెడిఫలహారము మినుపపిండి, శేషగిరిరావునకు, సుబ్బారావునకు మేడికాయ ప్రమాణ ముగ నిచ్చిరి. 'ఇదేమహాప్రసాద'మని పుచ్చుకొని వారు మంచితీర్థమును గ్రోలిరి. "ఓ ఉడిపీనిలయా! బాలగోపాల! కృష్ణమ్మా! మమ్ము నీ సన్నిధికి జేర్చరా! తండ్రీ" యనుచు ప్రార్థనసేయుచున్నతరి "ఆహా! సగుణస్వరూపతో నున్న బాలగోపాలుని దర్శించుటయే యింత ప్రయా సగా నున్న దే! నిర్గుణస్వరూపి యగు నా బాలగోపాల స్వరూప సందర్శనము! ఇం కెంతకష్టమో! యూహింపు" డని శ్రీ వేంకటేశ్వర స్వామి చెప్పగా, మిగిలిన యిర్వురును "నిజమే స్వామి! తమ రస్ఖలిత బ్రహ్మచర్యదీక్షా దురంధరులు. సర్వేంద్రియ ప్రవృత్తుల నరికట్టిన ధీశాలురు. సాధుమూర్తులు. మీరు నిరాహారదీక్షతో శ్రీ మొల్ల మందల కోటేశ్వరుని కొండపై త్రయోదశవత్సరములు కఠిన నియ మములతో తపస్సుచేసి పరమేశ్వరుని కృపకు పాత్రులైన యోగీశ్వర మూర్తులు. ఆకలిబాధను హతమార్చిన సిద్ధమూర్తులు. మేము ఫల

హారము లెన్నో చేసితిమి. ఏమి ప్రయోజనము! ఒకరోజు సాదము లేనంతమాత్రాన తహతహలాడితి"మని విన్నవించిరి.

దయార్ద్రహృదయులగు (శ్రీ) స్వామివారు "నాయనా! శేషగిరి రావు, సుబ్బారావు 'సాధనమున పనులు సమకూరు ధరలో' నన్న వేమనయోగి సూక్తి ననుసరించి మీరు భోజనముచేయువారు నిరాహారులైనందున మీ ప్రాణము లుస్సురనుచున్న"వని చెప్పిరి.

యాత్రీకులు ముగ్వురు భట్ కాల్ నుండి బస్సులో ఆసీనులై బైందుకూర్ చేరిరి. అది యైదుగంటలసమయము. బైందుకూర్ లో బస్సునెక్కి కుందాపూర్ వెళ్ళిరి.

వీరు పంచనదిని దాటి యవ్వలితీరము చేరిరి. పంచనదిలో పడవలో వెళ్ళెడి సమయము రాత్రి 8 గంటలసమయము; చీకటి యలముకొన్నది. ఆకాశము కారుమబ్బులతో నావరించినది. ఉరుము లురుముచున్నవి. మెరపులు మెఱయుచున్నవి. వర్షము పై పడునట్లున్నది. ఆ గోపాలుడే యీ నదిని దాటించగలడను ధైర్యముతో కృష్ణనామమును స్మరించిరి.

పడవలో నెవరో బాటసారులు మన యాత్రీకుల వెంటనే యాసీనులైరి. వారికి మన తెనుగుభాష రానేరాదు. వేంకటేశ్వర స్వామివారు త్యాగరాజకీర్తనలు గానముచేసిరి. గ్రంథకర్తగారు 'కరుణశ్రీ' శ్రీ జంధ్యాలపాపయ్యశాస్త్రి రచనగావించిన పద్యరత్నములు కుంతీకుమారి ఘట్టము చదివి యానందింపచేసిరి. పడవనడిపెడివారు తెలుగుభాష తెలియకపోయినను నెంతయో యానందముచెందిరి. తీరముచేరి రాత్రి యెనిమిది గంటలకు కుందాపూర్ లో ప్రవేశమై అన్నపూర్ణాహోటలునందు మకాముచేసిరి.

ఇరువదితొమ్మిదవ తేదీ యుదయము బస్సులో నాసీనులై కుందాపూర్ నుండి మాంబుకల్ గ్రామముచేరి సీతానదిని పడవలో దాటిరి. ప్రక్కనే 'కుముద' యను గ్రామము గలదు. వెంటనే బస్సు

నెక్కి భద్రగిరి గ్రామమునొద్ద బస్సుదిగి సువర్ణనదిని దాటి తీరముచేరి యేడుగంటలకు కల్యాణపురము చేరిరి. వెంటనే బస్సునెక్కి యాత్రీకులు ముప్పురు యుదయముననే 8 గంటలకు ఉడిపి చేరిరి. ఎన్నోయాత్రలు చేసితిమిగాని గోకర్ణమునుండి ఉడిపికి వచ్చెడి మార్గము బహు ప్రయాసలకు లోనైనదని యాత్రీకులు తలచిరి.

యాత్రీకులు ఉడిపిలోగల ఫేజువారి మఠములో ప్రవేశించిరి. ఆ మఠము రెండంతస్థుల భవనము. వినుకొండ శ్రీ యోగానంద మఠాధ్యక్షులగు శ్రీ వేంకటేశ్వరస్వామివారికి పూర్వ మెప్పుడో ఫేజు మఠాధ్యక్షులు దేశసంచారము చేయుచు వినుకొండకు వచ్చి స్వామివారితో వేదాంతచర్చ జరిపి పరిచయము చేసికొని వెళ్ళిరి. ఆ పరిచయ కారణముగా ఫేజువారి మఠములోపలకీ యాత్రీకులు ముప్పురు ప్రవేశించిరి. మఠాధ్యక్షులగు శ్రీ విశ్వేశ్వరతీర్థస్వామివారు మైసూరు ప్రాంతము వెళ్ళిరని అచ్చటి సేవకులు వీరితో చెప్పిరి. శ్రీ స్వామివారు ఆ సేవకులతో మీ స్వామివారు మాకు పరిచయమని చెప్పగనే యా మఠమందున్న వ్యక్తు లెంతో యాదరమున స్వామివారికి తదితర వ్యక్తులకు నొకగది నిచ్చి యాతిథ్యమిచ్చిరి.

ఉడిపిలో గల శ్రీ బాలకృష్ణాలయము చుట్టును నష్టదిక్కులలో, నష్ట మఠములు విశాలములై ప్రశాంత వాతావరణముతో నలరారుచున్నవి. బాలకృష్ణాలయము వెనుకభాగమున మండపములో నున్న మహాభక్తశిఖామణి కనకదాసు విగ్రహమును దర్శించి యాత్రీకులు నమస్సు లర్పించిరి. ఆలయములో నున్న కోనేరునకు 'మధ్వాచార్య తీర్థ' మనిపేరు. మధ్వాచార్యు లున్నంత కాలము నా యందమైన చిన్న కోనేటి తీర్థమునందే స్నానమాచరించి జపతపోధ్యానాదులు విధిగా నిర్వర్తించిరట! ఈ మధ్వాచార్య తీర్థముతోనే యాలయస్వామి యగు శ్రీ బాలకృష్ణునకు మహానైవేద్యాది పదార్థము లన్నియు తయారు గావించి మహానివేదన చేసెదరు.

ఈ యాలయములో నిత్యాన్నదానము యథావిధిగా క్రమ శిక్షణముతో జరుగుచుండును. ఆలయములో నొక భాగమున కామ ధేనువులవలె గోవు లెన్నో తిరుగుచున్నవి. ఈ గోమాతల క్షీరమును నిత్యము భక్తితో శ్రీ బాలకృష్ణునకు నైవేద్యమునకు వినియోగము చేసెదరు. భారత దేశమున మన యీ బాలకృష్ణునకు జరిగెడి నివేదన యెచ్చటను జరుగదు. నిత్యము రకరకములగు పిండివంటలతో భక్ష్య భోజ్య చోష్య లేహ్య పానీయాదులతో, నిచ్చటి యాలయార్చకులు దేవాలయమునకు సంబంధించిన యున్నతోద్యోగవర్గము మొదలగు వ్యక్తులెందరో సంతృప్తిగా భోజనములు గావించుచుందురు. ఆలయ ములో గోవులు నివసించుటకు వసతిగా గోశాలను నిర్మించిరి. అవి కమ్మనిమేత మేసి హాయిగా కడవలకొలది క్షీరము నొసంగుచున్నవి. గోమాతలబిడ్డ లగు లేగదూడ లాలయములో విచ్చలవిడిగా తిరుగుచు భక్తులతో కలసి మెలసి యెంతయో యానందముతో గంతులు వేయుచుండును.

ఈ యాలయములో మూర్తి యొకప్రక్కకు తిరిగి యుండెను. ప్రేక్షకమహాశయు లందఱు నుత్తరపుగోడ గవాక్షములద్వారా దేవుని దర్శింపవలయును. ముఖద్వారమున నెవ్వరు వెళ్ళరాదను నియమము గలదు. ఈ నియమమునకు కారణమేమి ?

పూర్వము పంచమవర్ణమునకు చెందిన కనకదాసను భక్తుడు కలడు. కనకదాసు నిత్యము కృష్ణనామము స్మరించుచు భజన గావించుచు నృత్యము చేయుచుండెడివాడు. ఒకనా డాలయమూర్తియగు శ్రీ బాల కృష్ణ స్వరూపమును దర్శించి యానందము చెందవలయునను గంపె డాశతో నాలయము ప్రవేశింపగా కులమతతత్త్వములతో పెనుగు లాడెడి యాలయార్చకులు "ఛీ మూర్ఖుడా ! పంచముని యింటజన్మించి పవిత్రాలయమునకు రాజొచ్చితివా ? నీ కిచ్చటస్థానములే"దని బయటకు గెంటివేసిరట !

పరమ భక్తాగ్రేసరుడు, శాంతమూర్తి, సత్యవాదియగు నా కనకదాసుడు "ఆహా! సదా బాలగోపాలుని పాదపద్మములయందు నివసించుచు సత్యము గ్రహించక నీ-నా భేదభావముతో నజ్ఞానముతో నన్ను పొమ్మనుచుంటిరా? సరే! అటులేపోయెదను. మీరు శాంతితో గర్భాలయమునందే యుండు"డని కనకదాసు వెళ్ళిపోయెను.

వెళ్ళిపోయిన కనకదాసు అమితావేదనతో "ఆహా! జ్ఞానవిహీనులు బ్రాహ్మణు లయ్యెదరా? సర్వమానవ హృదయాంతరాళములయందు ప్రకాశించెడి యాత్మజ్యోతిని దర్శించినవారే నిజమైన బ్రాహ్మణులు.

"ఓ కరుణారసమూర్తీ! బాలగోపాలా! నందకుమారా! దాసపోషకా! దీనబాంధవా! సర్వకర్మలకు సాక్షీమాత్రుడవై యుండెడి యో దొరా! ఈ దీనుని మొర నాలింపవా! నవనీత-చోరా! నీకు కులమత తత్త్వాలున్నవా? హెచ్చుతగ్గుల తారతమ్యముకూడకలదా స్వామీ! బ్రాహ్మణులని, బ్రాహ్మణేతరులని, మాలమాదిగలని నామములు సృష్టించి, సర్వవ్యాపివైన నీకడ్డు తెరలు నిర్మించి యాలయములు కట్టించి యర్చన లేర్పరచి దీపములని, ధూపములని, నైవేద్యములని, నారికేళములని, పానీయములని, పాశములని, పరమాన్నములని ఎన్నియో రకము లేర్పరచి మాటలులేక మౌనముద్ర వహించిన నీ యాశయ మేదో గుర్తించక, లేనిపోనిమాటలు వల్లించుచు నాచరణలేని నీతు లెన్నో బోధింపుచు నసలు విషయము మరచి వేదములు చదివితిమని, మేమే దేవుని బిడ్డలమని తోటిమానవుల నేవగించుకొనుచు స్వప్రజ్ఞతో నాలయ ముఖ్యాశయములను మంటగలుపుచు హాయిగా జీవనము చేయుచున్న యీ యజ్ఞానపుబ్రాహ్మణులు చేయు పూజలు నీకు నచ్చినవా ప్రభూ!" యని, యాలయముప్రక్కనే పద్మాసనాసీనుడై యచంచలమైన దివ్యభక్తితో శరీరమునే మరచి మనస్సును బాల కృష్ణునియందు చేర్చి కదలక, మెదలక, స్వామిభక్తినివదలక, కన్నులు మూసి ధ్యానసమాధిని బొందెను.

"ఆహాహా! ఏమి ఆ కనకదాసుభాగ్యము! జాతి మత తత్త్వములు చూడక నిజమైన ధ్యాననిష్ఠయే మోక్షమునకు మార్గమన్నటుల జగదాచార్యుడగు శ్రీ బాలగోపాలమూర్తి కనకదాసచంచల భగవన్నిష్ఠకు మెచ్చుకొని యాపత్సమయములోనున్న భక్తునికోర్కె నెగ్గింప దలచి మూల విరాణ్మూర్తియగు శ్రీ బాలకృష్ణస్వామి కనకదాసు వైపునకు మరలి జ్ఞానచక్షువు నొసగి కనకదాసుని రక్షించెను.

కనకదాసు భగవత్సాక్షాత్కారమునుపొంది బాహ్యదృష్టిని పోనాడి, యాత్మదృష్టితో బాలకృష్ణ దివ్యస్వరూపమును దర్శించుచు ప్రపంచమును వీడెను.

ఆనాటినుండి నేటివరకు ఉడిపికి వెళ్ళిన యాత్రికు లెవరైనను, కనకదాసుగారు దర్శించిన మార్గముననే దర్శింపవలయును. ముఖ ద్వారమున వెళ్ళి దర్శించెడి నియమము లేదు. బాలకృష్ణవిగ్రహము మరలిన గోడకు నలుచదరముగా తొమ్మిదిరంధ్రము లేర్పరచిరి. యాత్రీకు లందఱు నీ గోడరంధ్రములనుండియే దర్శించవలయును.

ఈ బాలగోపాలునిరూప మెంతయో చూడముచ్చటగొలుపును చాలకాలము క్రిందట మధ్వాచార్యులవారు దేశపర్యటనము చేయుచు గంగానదిలో పడవప్రయాణము చేయుచున్నతరి గంగానది యలలలో గోపీచందనపుగడ్డ వచ్చుచుండగా జూచి, యేమది యని యనుకొనుచున్నంతలో పడవదాపునకు రాగా నా గోపీచందనపుగడ్డను తీసికొని కొన్నిరోజులకు ఉడిపి చేరి శిష్యులసమక్షమున నా గోపీచందనపుగడ్డను పగులగొట్ట నం దతి సుందరమైన బాలకృష్ణవిగ్రహ ముండెను. ఆ బాలకృష్ణుని శ్రీ మధ్వాచార్యులవారు నట స్థాపించి యఖండజ్యోతిని వెలిగించిరి. ఎన్నియో శతాబ్దములనాడు వెలిగించిన యా దివ్యజ్యోతి నేటికి వెలుగుచుండును.

బాలకృష్ణుని యాలయ ప్రాంగణములో చక్కని కోనేరు త్రవ్వించిరి. త్రివేణీ సంగమ మనగా అలహాబాద్ సమీపమున గంగా

నది, యమునానది, సరస్వతీనది మూడును సంగమించును. ఈ పవిత్ర త్రివేణీ సంగమస్థల జలమును సువర్ణకలశములతో నింపి మదపుటేనుగుల కుంభస్థలములపై నిడి శ్రీ మధ్వాచార్యులవారు శిష్యసంఘములతో భగవతత్త్వము లుపన్యసించుచు నీ పవిత్రత్రివేణీ తీర్థమును, కాలినడకలతో కొన్నిమాసములకు ఉడిపి చేర్చి బాలగోపాలు నాలయప్రాంగణమున త్రవ్వించిన కోనేటిగంగలో సువర్ణకలశములయందున్న త్రివేణీ తీర్థము కలిపి శ్రీ మధ్వాచార్యులవారు శిష్యులతో నీ తీర్థము త్రివేణీ తీర్థమువలె పరమపావనమై యలరారు నని యానతిచ్చిరి.

యాత్రీకులు ఉడిపియాత్ర సంపూర్తి గావించుకొని మధ్యాహ్నా మొంటిగంటకు బస్సులో ఆసీనులై శ్రీ మొగ్గకు టిక్కెట్ తీసికొని ప్రయాణము సాగించి మధ్యలో నున్న సోమేశ్వరము చేరిరి. సోమేశ్వరములో బస్సుదిగిరి.

ఈ సోమేశ్వరము నుండి నాలుగుమైళ్ళవరకు యెత్తైన కొండశిఖర మెక్కి, నిట్టనిలువుగా క్రిందికి దిగవలయును. ఈ మహారణ్యమునందు ప్రభుత్వమువా రెంతయో నేర్పుగా నీ బస్సురోడ్డును నిర్మాణము గావించిరి. ఈ మార్గములో పెద్దబస్సులు వెళ్ళుట కవకాశము లేదు. చిన్న జీపుకారులు మాత్రము వెళ్ళుచుండును.

ఆరితేరిన డ్రైవర్లు నడిపెడి రోడ్డుగాని సామాన్యమైనది గాదు. శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరస్వామివారు, శ్రీ సన్నిధి శేషగిరిరావు, ఈ గ్రంథకర్త, ముగ్గురు జీపులో నాసీనులైరి. ఎన్నెన్నియో యెత్తైన కొండమార్గములలో పయనించిరి. సోమేశ్వరమునుండి శ్రీ మొగ్గకు వెళ్ళెడి ఈ కొండమార్గ మత్యాశ్చర్యకరమైనది. అతిభయంకరమైనది. నిలువుగోడకు బల్లి ప్రాకిన విధాన, జీపు పరుగులు తీయుచున్నది. డ్రైవరుబాబు "నాయనలారా! జాగ్రత్తగా పట్టుకొనుడు. పట్టుదప్పినచో, ప్రమాద"మని చెప్పుచు శ్రీ నృసింహాకళావతారులగు సద్గురు శ్రీ యోగానందమహర్షి కృపచే గమ్యము చేర్చినాడు.

గ్రంథకర్త, యాత్రీకులు సాయంత్ర మయిదుగంటలకు ఆకుంభి గ్రామము చేరిరి. ఇచ్చట జీపు మారి లైన్ బస్సులో యాత్రీకులు మువ్వురు సుఖాసీనులైరి. మహారణ్యసీమ, భయాంతోళనకరమగు దృశ్యముల నెన్నిటినో గాంచి యానందాశ్చర్యములను పొందిరి. రాత్రి 8 గంటలకు శ్రీమొగ్గ చేరిరి.

ముప్పదియవ తేదీన తెల్లవారకముందే యాత్రీకులు మువ్వురు కాలకృత్యములు నెరవేర్చి శ్రీమొగ్గలో బస్సునెక్కి పగలు పండ్రెండు గంటలకు హాస్పేట చేరిరి.

యాత్రీకసంఘముతో యాత్రీకులు మువ్వురు కలసి అందరు, హాస్పేటనుండి బస్సులో హంపీక్షేత్రమునకు వెళ్ళి విరూపాక్షాలయము, విఠలాలయము, సప్తస్వరమండపము, రాతిరథము, రాజతులాభారము, రామలక్ష్మణసీతాంజనేయ విగ్రహములు, విశాలమగు బొజ్జతో నాత్మా నందమును పొందెడి వినాయక విగ్రహమును, గంధమాదనము, ఋష్య మూకాద్రి, పంపాసరోవరము, రాజవీధులను, గజశాల లశ్వశాలలు మొదలగు శిథిలస్థలములను, రత్నములను రాసులు పోసి యమ్మకము చేసిన వాణిజ్యమందిరముల నెన్నిటినో గ్రంథకర్త, యాత్రీకబృందము దర్శించిరి.

కొన్ని దృశ్యములు పూర్తిగా జీర్ణించిపోయినవి. కొన్ని నామ మాత్రముగా నిలిచియున్నవి. ఆనాటి శిలాశాసనఫలకములను దర్శించిరి. హంపీక్షేత్ర శిథిలదృశ్యములు వీక్షించిన ప్రతిభారతీయుడు కంట తడి పెట్టక మానడు.

ఆనాటి రాజకాంతలు జలక్రీడలాడిన స్నానఘట్టములు బావురు మనుచున్నవి. ఆనాడు మహారాజులు నిర్మాణము చేయించిన రాజ మందిరములు రాణివాసపు భవనములు నీనాడు కళావిహీనమై కాల గర్భములో కలిసిపోయినవి.



హరికథాధ్యాపకులు — "భక్తిప్రచారక" శ్రీ ఆత్మకూరి గురుబ్రహ్మగుప్తగారు

కథాధ్యయనాపరులు — "కీర్తన కంఠీరవ" శ్రీ కోట సుబ్బారావుగుప్తగారు.

ఆనాడు మార్మోతమ్రోగిన రణభేరీలధ్వని, మదపుటేనుగుల ఘీంకారములు, అశ్వముల సకిలింతలు, సైనికపాదఘట్టనములు, రథచక్రముల యొరిపిడులు నీనాడు గుర్తుకు దెచ్చుకొనిన కన్నీరు మున్నీరగును. ఇట నొక పరమసత్యము గోచరించును. 'య దృశ్యం తన్నశ్యం' అనెడి యార్యో జ్ఞప్తికి వచ్చును.

గ్రంథకర్త తనలో 'ఒకనాటికి మనమేడలు మన సకలసౌభాగ్యములు మన యాలుబిడ్డలు, యావత్తు నీ స్థితికి రావలసినదే' నని మనస్సున దలచి ఓహో! అంతయు శూన్యమే! స్థూలదృష్టికి గోచరింపని పరమాత్మయే సత్యము, నిత్యము, శాశ్వతమని గుర్తించి భగవత్ప్రార్థన యొనర్చిరి.

యాత్రికబృందము 1961 నవంబ రొకటవ తేదీన హాస్పేటనుండి గుంటకల్ చేరి వెంటనే పయనమై యారాత్రికే వినుకొండ చేరిరి. మరునాడుదయ మారుగంటలకు గ్రంథకర్త సుబ్బారావుగుప్త కుటుంబముతో శ్రీ యోగానందమఠాధిపతులగు శ్రీ స్వామివారితో మాతృదేవి శ్రీ మహాలక్ష్మీదేవిగారితో వీడ్కోలు చెప్పి నమస్సు లర్పించి నాధ్యాత్మికభావపుమాటలతో స్వగ్రామమగు కొండాయపాలెము చేరి గ్రామపౌరులకు యాత్రావిశేషములన్నియు నానందముతో పూసగ్రుచ్చినటుల విన్నవించిరి. పౌరులెల్లరు విషయమును గుర్తించి యత్యానందమును పొంది వేనోళ్ళ పొగడిరి.

# పంచమ ఖండము

## శ్రీ సద్గురుసన్నిధిన ప్రహ్లాదకథను గానముచేయుట

గ్రంథకర్త తనలో నా యారాధ్యదైవమగు శ్రీ సద్గురుదేవుల సన్నిధిలో ప్రహ్లాద కథాగానము చేయనైతినే ప్రభూ యని చింతింప సాగిరి.

1962 జనవరి యొకటవ తేదీన, సుబ్బారావు తన బావగారి గ్రామమగు కుంకలగుంటకు వెళ్ళి కొంతధనము దెచ్చి భారీవ్యాపారము చేయవలెననెడి సంకల్పముతో ప్రియజనకుడగు శ్రీ లక్ష్మీనారాయణ గారితో "నాయనా! నేను బావగారింటికి పోయివచ్చెద"నని విన్న వించెను.

కన్నకొమరుని హృదయాంతర్గత వ్యాపారదృష్టిని గుర్తించిన శ్రీ లక్ష్మీనారాయణునకు శ్రీ నృసింహదివ్యశక్తి అప్పటికప్పుడే ఆవే శించి కేకలువేసి, పండ్లు పటపట నూరుచు "ఏమిరా! సద్గురునాజ్ఞ మీరి తిరుగుచుంటివా? సంవత్సరము పూర్తికావచ్చినది. ఆరాధనకు వెళ్ళి ప్రహ్లాదకథ చెప్పరా!" యని బిగ్గరగా కేకలువేసి బుసలు కొట్టుచు ఊపుచున్నంతలో శ్రీ లక్ష్మీనారాయణుని కోడలు శ్రీమతి హనుమాయమ్మ "ఓ నృసింహస్వామీ! నేను నాపతి తమ రేదిక్కని, నమ్మికొని యహరహము నీ సేవయే చేయుచున్నాము. మమ్ము రక్షణ చేయవలసిన మీరే భక్షించెదమనిన నీయిలలో దిక్కెవ్వరు ప్రభూ!" యని పాదములంటి వేడుచున్నతఱి నృసింహావేశపూరితులగు శ్రీలక్ష్మీ నారాయణున కావేశ మణుమాత్రమేని శాంతింపక నాలుక బయటకు చాపి క్రిందపడి బాహ్యస్మృతి వీడిరి.

బయట గుమ్మములోనున్న నరహరి పాదదాసుడగు సుబ్బారా వీదృశ్యమును గాంచి పరువులతో వచ్చి ప్రియజనకుని పాదకమలము లకు సాష్టాంగ నమస్కృతు లొనర్చిరి. నృసింహావేశ మణుమాత్రమేని

శాంతిబొందలేదు. ఆవేశముతో బుసలుకొట్టెడి తండ్రిపాదములను తలపై నుంచుకొని 'ఓ యోగానంద సద్గురుస్వామి! సాధురక్షకుడవు, నా జీవితాశాజ్యోతివి. పిపీలికాది బ్రహ్మపర్యంతము వ్యాపించిన ఓ పరమాత్మా! 'దాసుని తప్పులు దణ్ణముతో సరి' యనెడి పెద్దలమాట మన్నించవా ప్రభూ' యని కన్నీరు గార్చగా సాధురక్షణుడగు నృహరి శాంతించి 'ఓరీ! యీరోజే సద్గురు సన్నిధికిపోయి, ప్రహ్లాద కథాగాన మొనర్చి సత్యవాక్య పరిపాలకుడవుగ' మ్మని చెప్పిరి.

ఆనాటి సాయంత్రమే గ్రంథకర్త సద్గురు నామస్మరణతో పితృదేవులపాదములపై ప్రణమిల్లి వారి యాశీర్వాదమునుపొంది కొండాయపాలెము వీడి మార్కాపురము చేరి సమీపమందు దివ్యకాంతులతో వెలుగొందెడి సద్గురు స్థానమగు, శ్రీ కపిలగిరికివెళ్ళి జీవసమాధికి ముమ్మారు ప్రదక్షిణాపూర్వకముగ ప్రణామము లొనర్చి మాతృమూర్తియగు శాయమ్మగారికి,నాత్మసోదరుడగు లక్ష్మయ్యగారికి నమస్సు లర్పించి గతవిషయమంతయు తెలియచేసిరి. వారలమితాశ్చర్యమును పొంది సద్గురుమూర్తిని వేనోళ్ళ పొగడిరి.

గ్రంథకర్త యట పదునైదురోజులు సద్గురు సన్నిధిలోనుండి సద్గురుమంత్రమును సదాజపించుచు దినమొకక్షణముగ గడిపిరి. శ్రీ సద్గురు సార్వభౌములు సమాధినిష్ఠను పొందిన పవిత్రదివసము సమీపించినది. 1962 జనవరి పదునెనిమిదియవ తేదీన గ్రంథకర్త కాలోచిత కృత్యములు నిర్వర్తించి శ్రీ సద్గురుని భజించి హరికథాగానమునకు కావలసిన మృదంగ, వాయులీనములకై మార్కాపురము వెళ్ళి మాట్లాడి సాయంత్రమునకు సద్గురుసన్నిధికి తప్పక రండని చెప్పి శ్రీ సద్గురుసన్నిధికి చేరిరి.

శ్రీ సద్గురు దేవుని యారాధనా మహోత్సవమును కన్నుల పండువుగా దర్శించవలయునని వినుకొండ నుండి శ్రీ యోగానంద మఠాధ్యక్షులగు శ్రీ స్వామివారు, శ్రీ చేవూరి కోటయ్య, శ్రీ గంగిశెట్టి గురు

నాథము, శ్రీ కనమర్లపూడి మల్లిఖార్జునము, శ్రీ కోట లక్ష్మీనారాయణ, శ్రీ సత్యనారాయణాది భక్తులెల్లరు విచ్చేసిరి. శ్రీ సద్గురు సార్వభౌముల ప్రియశిష్యులు శిష్యురాండ్రెందరో దూరదూరములనుండి విచ్చేసిరి.



గిరిపైన శ్రీ లక్ష్మీనృసింహాలయ దృశ్యము

మార్కాపురమునుండి సద్గురుభక్తులు భక్తురాండ్రు సమితా సక్తితో నారికేళాది ఫలములతో విచ్చేసిరి. సద్గురుదేవులే మా యిలవేల్పని నమ్మి భజించెడి శ్రీ దోగిపర్తి సత్యనారాయణాది భక్తులందరు విచ్చేసి సద్గురుసేవలో పాల్గొనిరి.

సాయంత్ర మైదుగంటలైనది. భక్తబృందములు శిష్యసంఘములు, గ్రంథకర్త సుబ్బారావునుచూచి 'ఏమండీ హరిదాసుగారు కథయేమి చెప్పెద'రనిరి.

"ఓ నాయనలారా! మన సద్గురు దేవునికథయే మన కథలన్నిటికి నాదర్శమైనది, పూజనీయమైనది. మన సద్గురు దేవులు నృసింహాభక్తిని వేనోళ్ళచాటిరి. శ్రీ నృసింహాకళావతారమే మన సద్గురుమూర్తి. ఆ కారణముచే నీ పవిత్ర దివసమున, నీ పవిత్రపుణ్యక్షేత్రమగు ఈ కపిల గిరియందు మన సద్గురుసన్నిధిన శ్రీ మహాభక్త ప్రహ్లాదుని దివ్య భవ్య జీవితగాథను మీకు బోధచేసి నా జీవితమును తరింపచేసికొనెద మీ హృదయముల కానందమొనగూర్చెద"నని గ్రంథకర్త విన్నవించిరి.

శ్రీ సద్గురు దేవుల ప్రియశిష్యులెల్లరు 'నాయనా ప్రహ్లాదుని కథ మా హృదయముల కెంతో యాహ్లాద మొనగూర్చు"ననిరి.

హరిదాసు సుబ్బారావు శ్రీ వీరనృసింహమూర్తి స్తంభోద్భవ సమయమునకు కథాగానమును సమాప్తి నొందించవలయు ననెడి సదాశయముతో స్నానసంధ్యాది విధుల నెరవేర్చి పీతాంబరధారియై భక్తితో విమలోర్ధ్వపుండ్రనామములు మేనెల్ల ధరించి తులసిమాల దాల్చి, అష్టాక్షరిమంత్ర మష్టోత్తరశతము సంపూర్తి చేసి, కాళ్ళకు గజ్జెలుగట్టి చిటుకలు చేతదాల్చి శ్రీ సద్గురు దేవునకు సాష్టాంగ నమస్కృతు లొనర్చి, హరికథాధ్యయన మొనర్చిన భక్తిప్రచారక శ్రీ ఆత్మకూరి గురుబ్రహ్మముగుప్త భాగవతారుగారిని మనస్సున దలచి కథ ప్రారంభముచేయ సంకల్పించిరి.

శ్రీ నృసింహస్వామి పరీక్షయా యన్నటుల మృదంగవాయు లీనములు కారణాంతరములచేత రాలేరి.

శ్రీ సుబ్బారావు "భక్తియే ముక్తికి మూలసూత్ర"మని మది తలచి మృదంగవాయులీనముల మది దలచక వినాయక, సరస్వతి ప్రార్థనలు ముగించి శ్రీ సద్గురుశక్తిని భక్తితో, అభినందనలతో వర్ణించి మహాభక్త ప్రహ్లాదకథ ప్రారంభముచేసి భక్తితో చెప్పసాగిరి. భక్తు లందరు నాసీనులై ప్రశాంతముగా వినసాగిరి.

భక్తులందరు నాసీనులై ప్రశాంతముగా వినసాగిరి. ప్రహ్లాద కథను చెప్పుచు భక్తిపారవశ్యముతో దుఃఖావేశములతో కథను రక్తితో పూర్తి చేసి శ్రీ సద్గురు యోగానందమహర్షుల యపారకృపకు పాత్రులైరి.

కథను వినిన శ్రోతలలో గ్రంథకర్త పెదతండ్రి కుమారులగు శ్రీ కోట సత్యనారాయణగారు సంతోషస్వాంతులై సోదరుడగు శ్రీ కోట సుబ్బారావుగుప్త భాగవతారునకు ప్రేమపూర్వకముగా నూతనవస్త్రము లొసగి యాశీర్వాదము చేసిరి. హరిదాసుగారు తన యన్నయగు శ్రీ సత్యనారాయణగుప్తకు, వారికుటుంబమునకు శ్రీ సద్గురు మూర్తి యాయురారోగ్యైశ్వర్య భక్తిజ్ఞాన వైరాగ్యములు కలుగ చేయవలెనని ప్రార్థించి శుభాకాంక్షలను దెల్పిరి. కొబ్బరి ముక్కలు, వడపప్పు, పానకములను శ్రీ నృహరికి సమర్పించి భక్తబృందమునకు బంచిరి. చివరకు నరహరి భజనగావించిరి.

ఈ గ్రంథకర్త స్వగృహము చేరి సద్గురుని మనస్సున ధ్యానించుచు సద్గ్రంథములను పఠింపుచు సత్యముదప్పక సమత్వదృష్టితో కులవృత్తిని జేయుచు తామరాకుపై నీటిబిందువువలె సంసారసముద్రమున మునుగక నిమిత్తమాత్రముగ చరింపుచు శ్రీ హరిని గురించి చింతన చేయుచు నాత్మవిచారముతో దినమొక క్షణముగ గడుపసాగిరి. వీరి మనోభావములను గుర్తించి వీరి బంధువులు వీరితో 'యేమండీ హరిదాసుగారు మన కులవృత్తియగు వ్యాపారమును మాని సదా సద్గ్రంథ పఠనము స్వామిభక్తితో నెంతకాలమిట్లు సంసారమును సాగించెద'రని యడుగ వారితో హరిదాసుగారు 'నాయనలారా! సంసార సముద్రములో నున్నాము. ఈ సంసారసాగర తరంగములలో పడుచు లేచుచు తీరమును చేరెడి శక్తిలేక గాసిచెందెడి మానవులకు వ్యాపార మొకటి తోడైనచో వానిగతి దుర్గతియే గాని సద్గతిలేదు. వ్యాపారము యనగా వ్యామోహము, లోతుగలిగినది యని భావము. సముద్రములోబడి

కొట్టుకొనెడి మానవుడు వ్యామోహపు సుడిగుండపు లోతులలో పడిన వాడిక పైకివచ్చునదియే లేదని హరిదాసుగారు చెప్పగా విన్న బంధువు లందరు యదార్థమేనని ప్రశాంతితో నుండిరి.

## అంగలకుదురు దాసకుటిని దర్శించుట

గ్రంథకర్త యొకనాటి యర్ధరాత్రమున తనలోతానీ విధముగా సంకల్పించుకొనిరి. నేను రేపుదయమే పయనమై తెనాలి సమీపమున నున్న అంగలకుదురు పోయి దాసకుటి యాశ్రమముచేరి ఆంధ్రవాల్మీకి యని పేరువడసిన శ్రీ వాసుదాసస్వామి రచించిన 'మందరము' శ్రీ రామాయణ మహాకావ్యమును తీసికొనివచ్చి గ్రామపౌరులకు వినిపించ వలయు ననుకొనిరి.

1962వ సంవత్సర మాగష్టు పదునొకటవ తేదీన ధర్మపత్ని యగు హనుమాయమ్మ పతితో 'స్వామీ కొట్లోనేమియు సరకులు లేవు. ఉన్నరొఖ్ఖము తీసికొనిపోయి చిల్లరసరకుల వరకైనను తీసికొనిరండి. గృహములో మనకైనను కావలయునుగదా' యని చెప్పిరి. సరేయని ప్రయాణమై కొంతరొఖ్ఖమును తీసికొని స్వగృహమువీడి వినుకొండ చేరి యారాత్రి గడపి తెల్లవారు జాముననే మేల్కొని దైవప్రార్థనచేసి ప్రయాణమై వినుకొండనుండి గ్రంథకర్త గుంటూరు వెళ్ళిరి.

పన్రెండవ తేదీన గుంటూరు నుండి తెనాలి వెళ్ళెడి రైలులో సుఖాసీనులై అంగలకుదురు వెళ్ళెడి తఱి, ప్రతిస్టేషనులోను విమలోర్ధ్వ పుండ్రనామములు మేనెల్ల ధరియించి శ్రీ రామనామస్మరణతో భక్తు లెందరో క్షీరపుకడవలు శిరములపై నిడి రైలుపెట్టెలో చేరుచుండిరి.

ఆ భక్తాదులను చూచిన గ్రంథకర్త రమానందముతో, 'ఓహో! వీరు వ్యాపారమునకేగెడి వారలు కాదు. వీరివేషములు భాగవత శేఖరులని చెప్పుచున్నవి. అపశబ్దములకు తిలోదకములిడి పరమ పవిత్రమై బహుబంధ లతాలవిత్రమై విరాజిల్లెడు శ్రీరామ నామస్మరణ

చేయుచున్నారని గుర్తించి 'ఓ ఆత్మసోదరులారా! ఈ మధుర క్షీర మంతయు నెక్కడకు తీసికొనిపోవు చున్నా'రని అడిగిరి.

ఆ భక్తవరులు సంతోషస్వాంతులై, "ఎక్కడికేమిటి నాయనా! అంగలకుదురు గ్రామమున వెలసిన శ్రీ వాసుదాసస్వామివారి పవిత్రాశ్రమమున, శ్రీ సుబ్బదాసుగారు, నేడు శ్రీ సీతారామలక్ష్మణ మారుతి మూర్తులను క్షీరాభిషేకముతో ముంచి తేల్చెదరు. వారి సదాశయమును విని మేమందరము శ్రీరామ కార్యమునకు పరిశుద్ధ మగు నీ మధురక్షీరమును మా శక్తికొలది భక్తితో తీసికొని పోవు చున్నా" మనిరి.

శ్రీరామచంద్రుని పాదసేవకుల వాక్యములు వినిన గ్రంథకర్త మనసానందాబ్ధి నోలలాడినది. దైవకృప నెంచతరమా! యని సద్గురు శ్రీ యోగానంద నరసింహస్వామిని వేనోళ్ళ పొగడుకొనుచు అంగల కుదురు స్టేషనులో దిగి, పాలబిందెలు శిరములపై నిడి శ్రావ్యమైన కంఠధ్వనులు మిన్నుముట్ట శ్రీరామభజనతో వెళ్ళెడి దాసబృందముతో కలసి కరతాళధ్వనులతో శ్రీరామభజనతో పవిత్రాశ్రమము చేరిరి.

ఆహాహా! ఏమి యానాటిదృశ్యము. ఆశ్రమప్రాంగణమంతయు పాలకడవలతో నిండిపోయినది. పీతాంబరములు ధరించి మేనెల్ల విమ లోర్ధ్వపుండ్రనామములతో మెడలయందు శ్రీరామచంద్ర లక్ష్మణాది మూర్తులు చెక్కబడిన సువర్ణపుబిళ్ళలతో, భక్తులు శ్రీరామనామ స్మరణలు చేయుచు నృత్యములు చేయ మొదలిడిరి. నీ-నా యనెడి భేదములేక కళకళలాడుచు తళతళలాడుచు భక్తులందరు పరవశ త్వముతో భజనలు చేయసాగిరి.

ఉదయముననే శ్రీ వాసుదాసుగారి ప్రియశిష్యులగు శ్రీ సుబ్బ దాసుగారు, వేదవిహితముగ రజిత సింహాసనమున శ్రీరామ లక్ష్మణ సీతా మూర్తులను పీఠమం దుంచి, వేదమంత్రములతో, భక్తులెల్లరు భక్తితో సమర్పణచేసిన క్షీరముతో, క్షీరాభిషేకము చేయసాగిరి,

అంగలకుదురు సాధ్వీమతల్లు లెల్లరు క్షీరపుపాత్రలతో విచ్చేసి యాశ్రమమున జరిగెడి క్షీరాభిషేకదివ్యదృశ్యమును వీక్షింపసాగిరి. భక్తులెల్లరు నాశ్రమమున ప్రశాంతచిత్తములతో, సుఖాసీనులై శ్రీరామకైంకర్యమును రెప్పలార్పక వీక్షింపసాగిరి. ఆనాటి యయోధ్య పౌరులకంటె దాసకుటిభక్తసంఘ మెంతయో యానందము పొందినది.

గ్రంథకర్త సుబ్బారావు, శ్రీ సుబ్బదాసుగారు చేసెడి క్షీరాభిషేకమును తదేకదృష్టితో వీక్షించుచు వేదాంతభావము లన్నియు మనస్సునకు దెచ్చుకొని, తనలో తా నానందించుచు నానందాశ్రువులు రాల్పసాగిరి.

పెద్ద యిత్తడి రేకులో రజత సింహాసనము నుంచిరి. శ్రీరామచంద్రమూర్తుల నభిషేకము చేసిన యతి పవిత్రక్షీరము నొకబొట్టైన క్రిందపడక రేకుయందు పడిన క్షీరమంతయు నొకే మార్గమున క్రింద పడున ట్లొనర్చిరి. అభిషేకక్షీరము క్రిందికి, వచ్చునంతలో బిందెలు బెట్టియుంచెదరు. బిందెలు నిండగనే భక్తులందరు నెవరెవరి, కెన్నెన్ని కావలయునో తీసికొనిపోయి శ్రీరాముని పేర పొంగళ్లు చేసికొనసాగిరి.

అభిషేకపు క్షీరధార గంగా స్రవంతివలె నెడతెగక పడుచునే యుండెను. భక్తులు దూరదూరములనుండి క్షీరమును దెచ్చి శ్రీరామచంద్రునకు సమర్పణచేయసాగిరి. వందలాది భక్తులు క్షీరపుబిందెలతో నాశ్రమమునకు రాజొచ్చిరి. ప్రాతఃకాలమునుండి సంధ్యాసమయమువరకు శ్రీ సుబ్బదాసుగారు క్షీరాభిషేకము చేయుచునేయుండిరి. తదేకదీక్షతో చేసెడి యీ క్షీరాభిషేక దివ్యదృశ్యమును నిజముగా దర్శించినవారే ధన్యజీవులు. ఆశ్రమభక్తులు తదితర గ్రామవాసులు శ్రీ రామచంద్రుని దివ్యచరణారవిందములను దర్శించుచు కరతాళధ్వనులు మిన్నుముట్ట శ్రీరామభజనతో నా రోజంతయు నిరాహారులై భగవన్నామామృతమును తనివిదీరగ్రోలుచు నృత్యములు చేయుచు తన్మయులై బ్రహ్మానందమును పొందిరి.

రాత్రి 8 గంటలకు క్షీరాభిషేకము పూర్తియైనది. గ్రామ పౌరులెల్లరు, నానందామృతమును గ్రోలి తృప్తులై తీర్థప్రసాదములను పుచ్చుకొని స్వగృహములకు జనిరి. మిగిలిన భక్తులందరు శ్రీ సుబ్బదాసుగారి యాశ్రమమున శ్రీరామభగవానుని తీర్థప్రసాదముల నారగించి, తృప్తిగా భోజనములు గావించిరి.

మరునాడుదయము ఈ చరిత్ర రచయిత సుబ్బారావు, శ్రీ సుబ్బదాసుగారి పాదపద్మములకు ప్రణమిల్లి "స్వామీ! నిజముగా తమ జీవితమును సార్థకము చేసికొనినారు. తమ రొనరించిన క్షీరాభిషేక దివ్యదృశ్యము నా జీవితములో మరపురానిది. నా హృదయమంతయు ద్రవించినది. క్షీరాభిషేకయదార్థ తత్త్వమేదో నా యంతరాత్మ వ్యక్తము చేసినది.

ఆదిమూలమగు స్వయంజ్యోతి స్వరూప మహాతత్త్వమే శ్రీరామ తత్త్వము. శుద్ధ సాత్త్వికస్వరూపమే శ్రీరామచంద్రుని స్వస్వరూపము. సర్వశక్తులకు నిలయమై తనంతట తానే వెలిగెడి యా పరబ్రహ్మ స్వరూపమే శ్రీరామపరబ్రహ్మము. శ్రీరామచంద్రుని నిజరూపమున కాదర్శముగా రజితవిగ్రహములను తెల్లని క్షీరముతో నభిషేకమును చేయుచున్నారు. తెల్లని గుణములచే భగవానుని పొందవచ్చుననెడి పరమసత్యమును నేను గుర్తించితిని స్వామీ!" యని విన్నవింప, శ్రీ సుబ్బదాసుగారు "నాయనా! నీపేరేమి, నీ నివాస మెచ్చట" యని యడిగిరి. "స్వామీ! నా పేరు సుబ్బారావు. నా నివాసము వినుకొండ సమీపగ్రామమగు కొండాయపాలె" మని గ్రంథకర్త సమాధాన మిచ్చిరి.

శ్రీ సుబ్బదాసుగారెంతో యానందముతో గ్రంథకర్తను తన వెంట తీసికొని యాశ్రమప్రాంగణమును దర్శింపచేసి చివరకు శ్రీ రామాయణ మహాకావ్య గ్రంథమండలిని చూపి "శ్రీ వాల్మీకి రచించిన శ్రీ రామాయణ మహాకావ్యమును ఒంటిమిట్ట గ్రామమున నవతరించిన

శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు 'మందర' మనెడి పేరుతో నపార కృషితో ఈ మహాకావ్యమును నాంధ్రుల కందించిరి నాయనా!" యని నుడివిరి.

మందరరామాయణ గ్రంథములను దర్శించిన గ్రంథకర్త తనలో ఆహా! ఈ రామాయణ మహాకావ్యమును తీసికొనిపోయి సంపూర్తి పారాయణ మొనరింపవలెనను సదాశయముతో వెంటనే బాలకాండ-అయోధ్యకాండ - ఆరణ్యకాండ-కిష్కింధకాండ-సుందరకాండ - యుద్ధకాండ-ఉత్తరకాండ లనెడి యేడుకాండలను తీసికొని, చిల్లరసరుకులు తెమ్మని ఇచ్చిన రొఖ్ఖము తొంబది రూప్యములు శ్రీ సుబ్బదాసుగారికి సమర్పించి గ్రంథకర్త గౌరవపురస్సరముగ నమస్సు లర్పించిరి.

శ్రీ సుబ్బదాసుగారు తొంబది రూప్యములు తీసికొని యానందాశ్చర్యములతో "నాయనా! శ్రీరామచంద్రమూర్తి కరుణ మీపై సంపూర్తిగా ప్రసరించినది. లేకున్న యొకేసారి ఈ రామాయణ మహాకావ్యమును తీసికొనవలె నను సత్సంకల్పము గలుగుట దుర్లభము.

"ఈ రామాయణ మహాకావ్యమును మందరముగా తెనిగించి యాంధ్రలోకమునకు, మహోపకార మొనర్చిన పుణ్యహృదయుని సార్థకనామము - సుబ్బారావే! అట్టి లోకోత్తరమూర్తికి శిష్యుడనై వారి మహదాశయములను నా హృదయమున జీర్ణింపచేసికొని వారి నామముతో నాశ్రమమును నెలకొలిపి వారి యనువాదమగు ఈ రామాయణ మహాగ్రంథము ననేక వ్యయప్రయాసలకోర్చి ముద్రణయొనర్చి ప్రచార మొనర్చెడి నా నామధేయము సుబ్బారావే!

"దైవనిర్ణయముగా నీ యంతరాత్మ ప్రేరణతో 'దాసకుటి'ని దర్శించి పరమపవిత్రమగు శ్రీరామచంద్రుని క్షీరాభిషేక దివ్యదృశ్యమును ప్రశాంతితో వీక్షించి, ఈ రామాయణ మహాకావ్యము నత్యంత భక్తిశ్రద్ధలతో త్యాగహృదయముతో కొన్నట్టి నీ నామధేయము సుబ్బారావే!

"నాయనా! దైవనిర్ణయ మత్యంతాశ్చర్యకరమైనది. నీ భవితవ్యస్థితి, లోకోపకారములగు మహాకార్యములు చేసెడి యోగమున్నదని నాయంతరాత్మ తెలుపుచున్న"దని చెప్పిరి. నావిని యానందాశ్రువులతో శ్రీ సుబ్బదాసుగారికి ప్రణామము లొనర్చి సెలవు తీసికొని యాశ్రమభక్తులకు వీడ్కోలు చెప్పి శ్రీ రామయణ మహాకావ్యమును శుభ్రవస్త్రమున పదిలపరచి, శ్రీరాముని కృపను గొనియాడుచు నానాడే గ్రంథకర్త వినుకొండ చేరిరి.

గ్రంథకర్త, పదునాలుగవ తేదీన స్వగ్రామము చేరుటకు నాగార్జున సాగర్ వెళ్లెడి బస్సులో సుఖాసీనులైరి. కండెక్టర్, "ఓ సుబ్బారావు గుప్తగారు! ఆ బస్తాలో సరుకు లే"మని యడుగగా, గ్రంథకర్త "నాయనా! సరుకు లేమియు లేవు. మానవుల యజ్ఞానమును పారద్రోలి విజ్ఞానులుగా, మార్చి, ధర్మపథమున నడిపించెడి మహాగ్రంథము, శ్రీ రామాయణ మహాకావ్య" మనిరి.

కండెక్టర్ బస్తాను చేతితో నెత్తిచూచి "ఓయ్ బాబో! రామాయణమంటే సామాన్యమా – కాడెద్దులబరువనెడి సామెతగా నింతబరువున్న దేమయ్యా అనుమాన" మనిరి.

సుబ్బారావుగుప్త నవ్వుచు "ఓ సోదరుడా! అసత్యములాడి యన్యాయములు చేసెడి వ్యక్తిని కాదు. దర్శించు డని" బస్తా విప్పి సద్గ్రంథమగు శ్రీ రామాయణమును చూపగా కండక్ట రాశ్చర్యముతో "సెహాభాష్ యదార్థము. మీ వైశ్య సంఘమునందును యదార్థవాదు లుండెద రనెడి లోకోక్తి ఈనాడు నాకు ప్రత్యక్షానుభవ"మని నుడివిరి.

ఈ గ్రంథకర్త స్వగృహము చేరి యానాటి రాత్రి శ్రీ రామాయణ మహాకావ్యమును భక్తితో పూజించి నారికేళాదులను సమర్పించి పారాయణ ప్రారంభించిరి. గ్రామపౌరులు విచ్చేసి భక్తితో శ్రీ రామా

యణ కథాశ్రవణము చేసి యంత్యమున శ్రీహరి భజన యొనర్చి తీర్థ ప్రసాద స్వీకరణతో స్వగృహములకు జనిరి.

గ్రంథకర్త తనతోడివా రొనరించెడి వ్యాపారము ననేక పర్యాయములు చేసి యపజయమునే పొందిరి. తనలో "నే నెంత వెఱ్ఱినైతిని 'కులవృత్తి మానకురా గువ్వల చెన్నా' యనెడి నుడి ననుసరించి వ్యాపారములు చేసి ధనమంతయు వ్యయముచేసితిని. ఆహా! పెట్టిన రోజులు లేనినా డెంత శ్రమచేసినను ఫల మిసుమంతయు గానరాదు. పెట్టినదినములు కలసివచ్చిననాడు మట్టిగొన్నను బంగారమౌను. మానవుని శక్తియుక్తు లెందులకును పనికిరావు. శ్రీమన్నారాయణుడు నిష్పక్షపాతి; సాక్షీమాత్రుడు.

"గతజన్మలలో చేసిన పుణ్య మిశ్రమకర్మల ననుసరించియే యీ జన్మలో సుఖదుఃఖములు, లాభనష్టములు జయాపజయములు గౌరవాగౌరవములు, నఖండసన్మానములు సంభవించును. కలసిరాని నాడు చేతులుమోడ్చి శ్రీహరిని ధ్యానించుటయే మిగుల శ్రేయోదాయకము." అని యనేకరీతుల తలపోసిరి.

శ్రీ రామాయణ పారాయణమును సంపూర్తి గావించుట.

గ్రంథకర్త శ్రీ వాసుదాసుగారు రచించిన మందరరామాయణమును నియమ నిష్ఠలతో, భక్తిప్రపత్తులతో పారాయణానంతరము శ్రీహరి భజన భక్తులందరిచే చేయించుచు, నారికేళ నైవేద్యము లర్పించుచు పారాయణము సాగింపదొడగిరి. శ్రీరామాయణ పారాయణము యథావిధిగా నొక సంవత్సరమునకు సంపూర్తియైనది. బాల కాండ మొదలు ఉత్తరకాండవరకు పారాయణమొనర్చి యందలి భావములను విప్పిచెప్పి గ్రామపౌరుల మనస్సులను వీ రానందింపచేసిరి.

అనుదినము విధిగా గ్రామపౌరులలో నే యొకభక్తుడో నారికేళ నైవేద్యకర్పూర నీరాజనము లొసగి భక్తితో శ్రీరామాయణ కథా శ్రవణము చేసిరి.

కథాశ్రవణము చేసిన భక్తబృందము" ఏమండీ సుబ్బారావుగారు! మనమందరము కలసి యీ పవిత్ర రామాయణమునకు పూజలొనర్చి యేకాహము చేసికొందు"మని యడుగ గ్రంథకర్త "సరే" యనిరి. భక్తులు, భక్తురాండ్రు నెవరికివారే హృదయము లుప్పొంగి శ్రీరామ చంద్రమూర్తి సేవాకైంకర్య మహోత్సవమునకు భక్తితో విరాళము లను సమర్పించిరి.

ఈ గ్రంథకర్త మరునాడు ది 25-11-63 న గృహమంతయు పరి శుభ్రము చేయించిరి. భక్తులందరికి శ్రీరామనామస్మరణలో పాల్గొను డని విన్నవించి నారికేళకర్పూరాది వస్తువులకై వినుకొండకు వెళ్ళి సర్వము సమకూర్చుకొని మృదంగ వాయిద్యములతో దూరశ్రవణ యంత్రములతో సాయంత్రమునకు స్వగృహము చేరిరి.

పతి ప్రయత్నము గుర్తించినసతి గృహాంగణమంతయు పరి శుభ్రపరచి ఉపవాసదీక్షతో పానకము వడపప్పు స్వామినైవేద్యము మొదలగు పదార్థము లన్నియు సమకూర్చెను.

గ్రంథకర్త లోలోన నానంద మొందుచు సమీపగ్రామమగు బొగ్గరము లో నివసించెడి మామగారికి శుభవార్త తెలియజేసి, పురో హితులగు బ్రహ్మశ్రీ ప్రతాపగిరి రామకృష్ణయ్యశాస్త్రి గారిని వెంట తీసుకొని స్వగృహము చేరిరి.

శ్రీ రామాయణ పారాయణమును భక్తితో పూర్తిగావించిన రైతుసోదరులందరు పగలంతయు వ్యవసాయాది కార్యక్రమములలో పాల్గొని స్వగృహములకు చేరి స్నానాది కార్యములు త్వరలో నిర్వ హించి శ్రీ రామాయణ పారాయణ సంపూర్ణ పూజాకార్యమునకు కావల సిన వస్తువులన్నియు సమకూర్చిరి.

బల్లపైన నొక యున్నతాసనము నమర్చి శ్రీలక్ష్మీనృసింహ మూర్తి, శ్రీ రామచంద్రమూర్తి, సద్గురుమూర్తి పటముల నమర్చి

శ్రీ మదాంధ్ర వాల్మీకి రామాయణ మహాగ్రంథములను శ్రీరాముని ముందుంచిరి. గ్రామములోగల యాబాలగోపాలము శ్రీ కోట లక్ష్మీ నారాయణశ్రేష్ఠి గారి గృహాంగణమంతయు నిండిరి. ముత్తైదువు లందరు నారికేళ ఫలాది వస్తువులను దెచ్చి శ్రీరామచంద్రుని చరణారవిందముల ముందుంచిరి.

బొగ్గరము నుండి శ్రీ కాకుమాను వెంకటకోటయ్య శ్రేష్ఠిగారు అల్లునకు కుమార్తెకు కట్నములు చదివింపు చేయింపుమని ధర్మపత్ని యగు వెంకటసుబ్బమ్మగారి కిచ్చిపంపిరి.

వెంకటసుబ్బమ్మగారు నత్యాదరమున నమితాసక్తితో నల్లుడు చేసెడి శ్రీరామాయణ పారాయణ సంపూర్తి పూజాకార్య క్రమము, ఏకాహామహోత్సవమును కన్నులారా దర్శించి తరించవలయు ననెడి యాశతో కొండాయపాలెము చేరిరి.

పీఠముపై శ్రీ సత్యనారాయణ మండపమున శ్రీరామచంద్రాది మూర్తులు శ్రీ రామాయణ మహాకావ్యమును నింటినిండ నిండిన భక్తులను భక్తరాంద్రను మైకుముందు రామనామభజన యొనర్చెడి యల్లుని దర్శించి వెంకటసుబ్బమ్మగారు యమితానందమును పొందెను.

శ్రీ సుబ్బారావుగుప్త వారి ధర్మపత్ని హనుమాయమ్మ పీఠములమీా దాసీనులై శ్రీరామాయణమును విధివిధానముగా పూజలు గావింపదొడగిరి.

పౌరోహితులగు బ్రహ్మశ్రీ ప్రతాపగిరి రామకృష్ణయ్యశాస్త్రి గారు. శ్రీరామాయణ మహాకావ్యమునకు దంపతులచేత పూజలు చేయించి కర్పూరహారతి నొసగిరి.

మృదంగవాయిద్యములు వీనులవిందుగా మ్రోయ గ్రంథకర్త కలికల్మష నివారణ మంత్రమును భక్తుల కీవిధముగా చెప్పిరి. 'హరే రామ హరేరామ రామరామ హరేహరే - హరేకృష్ణ హరేకృష్ణ

కృష్ణకృష్ణ హరేహరే' యని నుడువ భక్తులందరు కరతాళ ధ్వనులతో శరీరములనే మరచి రామనామభజన చేయసాగిరి. ఆ రాత్రి యంతయు శ్రీ కోట లక్ష్మీనారాయణగారి దివ్యభవనము శ్రీరామనామస్మరణతో మార్మోగెను. ఈ దృశ్యమును కన్నులార వీక్షించిన శ్రీ కోట లక్ష్మీనారాయణగారు 'హరేరామ' నామమును రక్తిగా భక్తితో కీర్తించిరి. సుబ్బారావాత్మానందముతో శ్రీరాముని ముందు నృత్యమొనరించిరి.

శ్రీ స్వామి ప్రసాదములను భక్తులు భక్తురాండ్రు స్వీకరించి జాగరణ సలిపి స్వగృహములకు జనిరి.

## గ్రంథకర్తకు శ్రీ సద్గురు సంఘటనలు

సుబ్బారావున కేమియు దోచక 'అహా! నేను వృథగా నింటి యందుండుటయేమి లాభము? జాగ్రతతో వ్యాపారము చేసిన లాభ మెందులకురాదని భావించి నేతివ్యాపారము చేయసంకల్పించుకొని వెన్న ఖరీదుచేసి కరగబెట్టి నేయిని డబ్బాలలో బోయుటకు డబ్బామూత తీయవలెనని కొడవలితో మెల్లగా గొట్టగా 'వ్యాపారము నీదికాదురా' యన్నటుల కొడవలి పెళ్ళున రెండుముక్కలాయెను. ఈ సంఘటన కచ్చెరువొందుచు నేతి నమ్మకముచేయుటకై వినుకొండకు వెళ్ళి శ్రీ చేవూరి కోటయ్యశ్రేష్టి నేతికొట్టునకుపోయి యమ్మకముచేసిరి. అది యేమిచిత్రమో కాని జీవితములో నెన్నడును జరగని చిత్ర మింకొకటి తటస్థించెను.

కొత్తకండువా యెచ్చటనో మరచిపోయిరి. మనస్సున కుందుచు స్వగృహముచేరి గత జీవితవ్యాపారనష్టములను దలచుచు "అహా! నాకు వ్యాపారదుర్గతిలేదు. నా గతి సద్గతి" స్వామిభక్తి, సద్గురు సదాశయ ప్రచారముదప్ప నే నేది చేసినను చివరకు నష్టము, కష్టము గలుగును, నే నేమిచేయవలయునురా నరసింహా!" యనెడి సమయ

మందే కన్నతండ్రియగు శ్రీ లక్ష్మీనారాయణునకు నృసింహస్వామి యావేశమై "ఓరీ! నీకు బుద్ధిలేదురా! వ్యాపారము వద్దనగా వినక చేయుచున్నావు. నీ చేతికి బొచ్చవచ్చును. వ్యాపారము వద్దురా! నా యాదేశము ననుసరింపక నీవిక బ్రతుకలేవురా!" యని వీరావేశముతో పండ్లు పటపట నూరుచు నాలుక చాచిరి.

గ్రంథకర్త భయకంపిత హృదయుడై కన్నీరు గార్చుచు గద్గద స్వరముతో "ఓ సద్గురుప్రభూ! నీ యాజ్ఞను తప్పక పాటించెదను. నా జీవితము నాధ్యాత్మిక దృష్టితో, నా ముష్మికచింతనతో నీకు నంకిత మొనరించెద ప్రభూ!" యనుచు పాదములపై వ్రాలినతరి, నృసింహావేశము శాంతిబొందెను.

గ్రంథకర్త పినతల్లి కుమారుడు శ్రీ చందోలు వెంకటేశ్వర్లు నరసరావుపేటలో వస్త్రముల వ్యాపారము చేయుచు సగభాగమునకు సుబ్బారావుగారిని నుండవలసినదిగా కోరిరి. వీరి హృదయము సదా సద్గురు జీవితచరిత్ర పూర్తిచేసి సహృదయుల యార్థిక సహాయముతో ముద్రణవేయించి ప్రజలకందించవలయు ననెడి సదాశయముతోనుండిరి.

బంధువుల యొత్తిడితో గ్రంథకర్త, నిష్టము లేకపోయినను కష్టముతో, సగభాగమున కొప్పుకొని వ్యాపారసముద్రమున మునుకలు వేయుటకు ప్రయాణమై జుగుప్సతో, వినుకొండలోనున్న శ్రీ యోగానంద మఠమునకు వెళ్ళి యీ వ్యాపారవిషయమును మేనత్తగారగు శ్రీ మహాలక్ష్మీదేవికి విన్నవించెడి సమయమున శ్రీ వీరనృసింహామూర్తి శ్రీ మహాలక్ష్మీదేవి హృదయమున చేరి యావేశముతో బాహ్యస్మృతి వీడి "ఓరీ సుబ్బారావు వ్యాపారము వద్దురా! వద్దురా!" యని బిగ్గరగా కేకవేసి పడిపోయెను. దగ్గరనున్న మేనల్లుడు సుబ్బారావు "తల్లీ! నా యనుమానము నా యారాధ్యదైవము నీలో చేరి యాదేశించిరని, వస్త్రముల వ్యాపారము నాకు వద్ద"ని శపథము చేసి విరమించుకొనిరి.

భగవదారాధన చేయువారికి, భగవన్నామమే శరణ్యమని భావించువారికి, సత్కర్మదీక్షానిరతులకు, సత్యదృష్టితో మెలగెడివారికి కష్టములు మెండు. ఈ రహస్యము, గుర్తించుట యతి ప్రయాస. 'మంచి బంగారమునకే దెబ్బలెక్కు' వనెడి సామెత సర్వులకు విదితమే!

గ్రంథకర్త సదా నృసింహు నారాధించుచు "పరమభక్తాగ్రేసరుడగు ప్రహ్లాదుని కథయే నా జీవితాశాజ్యోతియు శ్రీ సద్గురుస్వామి ధ్యేయసిద్ధికి నాంది" యని భావించి యహర్నిశలు, శ్రీ హరినామధ్యాన చిత్తుడై సంసారయాత్ర సాగించెడి కాలమున, శ్రీ దైత్యరాజ సభాస్తంభవిజృంబమాణ గంభీర నరకంఠీరవాకారుడగు శ్రీ నృసింహమూర్తి శల్యపరీక్షలను రెంటినొసంగిరి. ఆ రెండు పరీక్షలలో గ్రంథకర్త సుబ్బారావు శ్రీ సద్గురు కృపాబలముతో నఖండవిజయమును పొంది సద్గురు భక్తిని హృయమున పెంపొందించిరి.

అందు మొదటిపరీక్ష : ది 1965 వ సంవత్సరము మే 13వ తేదీకి, సరియగు విశ్వావసు నామసంవత్సర వైశాఖశుద్ధ త్రయోదశి గురువారమున గ్రంథకర్త శ్రీ సద్గురు స్థానమున శ్రీ లక్ష్మినృసింహ జయంతి మహోత్సవ సందర్భమున శ్రీ ప్రహ్లాద హరికథాగాన మొనరించెడి ప్రయత్నములో నుండిరి. భక్తాదులు కథాగానము వినుటకు సుఖాసీనులైరి. అదే సమయమున సద్గురు శ్రీ యోగానంద మహర్షి ప్రియశిష్యుడు శ్రీ అన్నమనేని వీరయ్యచౌదరిగారు వచ్చి "నాయనా సుబ్బారావు! జరిగిన సంఘటన తమకు తెలియచేయవలయును. ఐనను నోరాడుట లేదు. తప్పినది కాద"నుచు, తడబడు మాటలతో "మీరు నృసింహ జయంతికి వచ్చినవెంటనే మీ భార్యమనసు తారుమారై, సద్గురు దేవుని సన్నిధికి వెళ్ళవలెనను దీక్షతో పుత్రపుత్రికామణులతో ప్రయాణమై వినుకొండకు చేరెను. అకస్మాత్తుగా మీ తృతీయపుత్రుడగు ప్రహ్లాదమూర్తి మరణించె"నని తెలియ జేసెను.

గ్రంథకర్త యీ విపత్కరవార్తను విని "హా లక్ష్మీనృసింహా! నన్నిట్టిపరీక్షకు గురిచేసితివా?" యని యొక్కమారు పల్కి, 'గతజల సేతుబంధన మెందులకు గడచినదానికి వగచుట విజ్ఞుల లక్షణము కా'దని పరమ వైరాగ్యముతో పట్టుపంచదాల్చి, నృసింహనామమును ఫాలభాగమున దీర్చి, చిటికలు చేతబట్టి శ్రీసద్గురుసన్నిధి మహాభక్త ప్రహ్లాదునికథ గానమొనర్చి సద్గురుశక్తిని వేనోళ్ళ చాటుచు, ప్రేక్షకులను చూచి "ఓ మహాశయ సంపన్నులారా! జననము – మరణము, రెండును సమానమే! వారివారి కర్మానుగుణముగా నీ ప్రపంచమునకు ప్రాణులు వచ్చుచు పోవుచుందురు. వారి కర్తవ్యములను వారు సక్రమముగా సమయమునకే చేసికొనుచున్నారు. వారిని చూచి కుందుట మన యవివేకముకదా!

"వివేకముతో మన కర్తవ్యములను మనము చక్కగా నిర్వహించుకొంద"మని చెప్పి శ్రీహరినామభజనచేసి భక్తులచేత చేయించి యీ రాత్రి జాగరణచేసిరి.

రెండవపరీక్ష : 1965 నవంబరు 28 వ తేదీ యుదయ మూరు గంటలకు బొగ్గరమున తాతాగారి గృహమున గ్రంథకర్త ద్వితీయ కుమారుడు ముద్దులు మూటగట్టెడి మూడేండ్ల బాలుడు తండ్రి భజన చేసెడి సమయములలో పద్మాసనాసీనుడై భక్తితో భజనచేసెడి సాధు మూర్తియగు నరసింహమూర్తి యనెడి బిడ్డ డకాలమృత్యువు కరాళ దంష్ట్రల కాహుతి యయ్యెను.

ఇర్వురు తాతయ్యలు మనుమని యకాలమరణమున కమితావేదన పొందుచు, "ఆహా! ప్రహ్లాద నామము, నరసింహమూర్తి నామములను కన్నకొమరుల సదా పిలుచుకొనవలయు ననెడి సద్వాంఛను గంగపాలొనరించితివా! శ్రీహరీ! 'గోరుచుట్టుపై రోకటిపోటా'. ప్రహ్లాదమూర్తి మరణించిన యీ సంవత్సరముననే నరసింహమూర్తిని పిలిపించుకొంటివా! ఏమి నీ లీలావిలాసము!"

"శ్రీ సద్గురుదేవుని జీవితచరిత్ర రచనను పూర్తిచేసి పుణ్యాత్మ్యాదయుల, ధనసహాయముతో గ్రంథముద్రణ గావించవలె నను సత్సంకల్పముతో సంచరించెడి, నాతని కిట్టి విసత్కార విషమసంఘటలను సంభవింపచేయుట న్యాయమా ప్రభూ !" యనిరి.

పితృదేవుల మాటలు, మామగారి మాటలు వినిన ఈ గ్రంథకర్త "ఎందులకు చింత, శ్రీహరి దయామయుడు. భక్తరక్షకుడు గాని శిక్షకుడు మాత్రము కాదు. హరిలీలలు మన కర్థము కావు.

"భద్రాద్రిలో శ్రీరామాలయమును కట్టించిన శ్రీకంచర్ల గోపన్న గారిని, కారాగృహమున బంధించి కటిక యుపవాసములను చేయించి, ప్రాణత్యాగమువరకు పరీక్షించి తన బిరుదునకే కళంకమని, శ్రీ గోపన్న గారి దృఢవిశ్వాసమునకు, రాముడే దాసానదాసుడై చేయునది లేక, పైకమంతయు చెల్లించి శ్రీ రామదాసునకు కారాగృహవిముక్తి నొందించెను.

"ఈ విధముగా తన్ను నమ్మినభక్తుల నెందరినో పరీక్షించి పరీక్షించి, చివరకు రక్షించినగాథ లెన్నో గలవు.

"అదేరీతి, నాకు శ్రీ నృహరి కఠినపరీక్షలను గలుగ చేసినాడు. ఎన్నిటికి గురిచేసినను, శ్రీ నృసింహుని నామస్మరణ మరువను, నృసింహుని పూజ విడువను. ప్రకృతి వక్రదృష్టికి జడియను. శ్రీ సద్గురు కృపాబలమే, నాకు భుక్తి శక్తి ముక్తి" యని నుడివిరి.

## తిరుణాల స్వరూపము - స్వస్వరూపము

కొంతకాలము మాత్రమే మురిపించి ముద్దుముచ్చటలు దీర్చి నడియేట పుట్టి ముంచెడి యీ ప్రకృత్యానందములకై యనర్థములకై యింత మమకారమేమిటో సామాన్యుల కయోమయము.

నిర్వికారుడు నిరంజనుడు నిరాకారుడు నిగమగోచరుడు త్రిగుణ రహితుడు నిత్యానందుడు జీవేశ్వరస్వరూపము నాదిమూల మగు

ప్రణవమునకు మూలకారణమగు చైతన్యస్వరూపము, స్వయంప్రకాశముతో సదా వెలింగెడి యాపరశక్తి, నిత్యనూతనకాంతులతో దశదిశల విరజిమ్ముచు స్వయంప్రజ్ఞతో సకలచరాచరములయందు నిండి నిబిడీకృతమై యీ జగన్నాటకము నాడించి పాడించి నవ్వించి ఏడ్పించుచున్నది.

ఆహాహా! ఆ మహత్తర దైవశక్తిని నూటికొక్కరైనను గుర్తించిరో లేదో యనుమానాస్పదము! అత్యాశ్చర్యకరము!

సత్వరజస్తమో గుణస్వరూపులగు నరులు పరిసరములయొత్తిడి మహిమచేత, వారివారి హృదయ సంస్కారానుగుణముగా మలచుకొని సగుణోపాసనతో రకరకములగు రూపములేర్పరచి, జిహ్వాచాపల్యము నణగించుకొనెడి యాత్మశక్తిని పెంపొందింపక పాపపుభావములుగలిగి, కులమతవర్గవిభేదములతో నీచసంభాషణలతో మానవత్వమునకు మంగళహారతులిడి దానవకృత్యములకు బాల్పడి, విజ్ఞుల వాక్యముల నిరసించుచు తలొకరీతి సంభాషించుచు యదార్థసత్యమును గుర్తించి యాత్మోద్ధరణ నొందుటకు ప్రయత్నముచేయక యాత్మశాంతికిదూరులై యశాంతి కధినాయకులై యాడంబరాట్టహాసములతో తిరుణాలలని, తీర్థములని,ఉత్సవములు యూరేగింపులని, ప్రతిజ్ఞలతో,పందెములతో, మతాతత్వములను పెనవేసికొని మూఢాచారములతో స్వార్థభోగాభిలాషులై పదుగురొసగిన యర్థము ననర్థకార్యక్రమములకు వెచ్చించుచు, సాధుహృదయులను సజ్జనమూర్తులను దైవభక్తిపరులను గేలిసేయుచు, తా మొనర్చెడి యజ్ఞానకార్యములే లోకోపకారములు భగవత్ప్రేరణములని మూఢభావములతో మొండివాదనలతో 'కామెర్లరోగివలె' తాము చేయునవే సత్కార్యములని తమవాక్యములే పరమధర్మములని, విఱ్ఱవీగుచు నిత్యనూతన ప్రభలతో సాధురక్షణకై సర్వస్థలములలో దైవసంపత్తిని రూపొందించిన వేదవేద్యుని జగద్వంద్యుని దృష్టికిదూరులై నానాటికి విజ్ఞానహీనులై యహంకార మమకారములతో సోహంభావమును పోనాడి ప్రగల్భము

లాడుచు, పరమేశ్వరుని సన్నిధిచేరియు చలనరహితమగు పాషాణ ప్రతిమకు మ్రొక్కులిడి "ఓ ఈశా! మహేశా! భూతేశా! మా పాపములను తొలగించి పుణ్యవంతులను పరిశుద్ధులను చేయుమనెడి ప్రార్థన లొనర్చుచు, నవకాశమును పురస్కరించుకొని ప్రక్కవారిని మోసగించుచు, వన్నెచిన్నెలతో నొయ్యారపు నటనలతో తిక్కెత్తిన రీతి తిరిగెడి పరభామల స్పర్శ దర్శనాభిలాషులై మూలనపడియున్న మనదేవు డేమిచేయుననెడి సంకల్ప వికల్పములతో, వినరాని మాటలతో, కనరాని చేష్టలతో లేనినొత్తిడిని సృష్టించుకొని వయ్యాపు కేకలతో 'శాంతిశాంతి' యనుచు, నారికేళ నైవేద్యములను నివేదన చేసి 'శ్రీ ఆంజనేయా! ప్రసన్నాంజనేయా!' యని పలుమారు భజించుచు 'మమ్ము కాపాడవా మారుతీ!' యని కోతిచేష్టలతో, మూలస్థానమును వీడి యారాత్రియంతయు జాగరణ నెపముతో తన తోటి సోదరులను గౌరవింపక తిరుణాలను నిరీక్షించు నాసక్తితో తరతమ భేదములను పాటింపక వక్రమార్గము లనుసరించుచు తృప్తి బడయక రంకులరాట్నమాది సాధనముల నధిరోహణచేసి తనముందు నాసీనులగు యువతీమణుల మేనికాంతులపై ప్రణయదృక్కుల ప్రసరింప చేసి తీపికోర్కెలకు హృదయఫలకమున పందిళ్ళమర్చి ప్రేమభావములతో నూయలలూగు సమయముననే రంగులరాట్నపు టధినేత యొక గొలుసు పుచ్చుకొని పిచ్చి పిచ్చి పాటలు పాడుచు, గిర్రున త్రిప్పుచుండును. రాట్నమందు తిరిగెడు యువతీయువకు లదే స్వర్గసుఖమనుకొని గట్టిపట్టుతో తిరిగితిరిగి చివరకు దిగిపోయెదరు.

వేలకొలది రూప్యములు ఖర్చుచేసి క్షేత్రపరిసరప్రాంత గ్రామ పౌరులు, వెదురుబొంగుల తడికల నొకరికన్నొక రెత్తుగా నిర్మించుకొని రంగురంగుల పటాలతో రకరకాల పూసకూర్పుల సెట్టింగులతో భరత నాట్యమాది ప్రదర్శనలతో రైతుసోదరులందరు కలసికట్టుగా నేకీభావముతో, రంకెలువేసెడి యాబోతులను ప్రభలకు కట్టి యా పశువుల సహాయముతో ప్రయాణమై, చలిమిడి పేలపిండి చలిదిమూటలను

ప్రభల జెక్కములకు గట్టి నారికేళనైవేద్య నీరాజనముల నొసగి 'హర హరా! చేదుకో కోటయ్యా' యనెడి సుశబ్దములతో, గ్రామములు వీడి చంద్రకోలలతో చేతికర్రలతో ప్రయాణములు సాగించి యనేక వ్యయప్రయాసలతో గమ్యము చేరుదురు.

ఏ సదాశయసంపత్తితో మన పూర్వులీ తిరుణాల తీర్థములను రూపొందించిరో కాని, సదాశయములను గుర్తించక నా ప్రభముందు, నా బండిముం దనెడి ద్వేషభావములతో నైక్యభావము నావలకు గెంటి, తగాదాలకు తారసిల్లి బడితపూజలతో పశుభావాలకు బానిసలై శాంతికి బదు లశాంతిని పొంది పరుగులు దీయుచు వినోదకార్యములు వీక్షించెదరు. తిరుణాల వినోదములు సర్వులకు ననుభవైకవేద్యములే!

వినోదములకు కట్నములనుపుచ్చుకొని కార్యభారనిర్వహణ కరుదెంచిన నాట్యకాంతలు వారి వారి స్వప్రజ్ఞతో జనరంజకమునకై, సిగ్గుబిడియము వీడి పిచ్చిగంతులతో, సినిమా నటనలతో, ఇంగ్లీషు డ్యాన్సులతో, గట్టి గట్టి కౌగిళ్ళతో ప్రజాభిప్రాయములను చూరగొని తిరుణాల ప్రజాసమూహము నుర్రూతలూగించును. ఇదే మంచి యదననుకొని యొద్దలేకపోయినను శ్రమతో పోగుచేసికొని రూపాయల నోట్లను దండలుగా గ్రుచ్చి నాట్యకాంతల మెడలలో స్వయముగా నలంకరణచేసి రసికు లొకడు చప్పట్లు గొట్టును. సమయనిరీక్షణతో నర్రులుసాచి యగచాట్లకు గుఱియైన ప్రేక్షకు లమితానందముతో చప్పట్ల మ్రోతలు మిన్నుముట్ట చేసెదరు.

తిరుణాల నిజస్వరూపమును గుర్తించువా రరుదైరి. తిరుణాల నిజస్వరూప మేమో కాదు. బంధువులను మిత్రుల నొకేసారి దర్శించుట సంభవింపదు. దర్శించవలెననిన నెంతో శ్రమ, యెంతో ధనవ్యయము. ఆ కష్టనష్టములులేక మన మందరము నెక్కడెక్కడో నివసించుచు నొకేరోజు, పవిత్రక్షేత్రమున దేవుని సన్నిధిలో ఇట్లు సమావేశమై, మనము యెవరెవరి ఈతిబాధ లెట్లున్నవో తెలిసికొని శక్త్యాను

సారము సహకరించవలెను. దేవుని విషయము సంపూర్ణముగా తెలిసికొని యాచరణతో నాత్మానందమును పొందిన వ్యక్తి లజ్ఞాన దశలో పరుగులుదీసెడి తన సోదర సోదరీమణులకు వైరాగ్య ప్రబోధము చేసి వారిహృదయములకు ప్రశాంతిని చేకూర్చవలెను. రకరకముల సంస్కారములుగల ప్రజలందరు శివరాత్రి జాగరణ నిర్వహించెదరు.

ఈ జాగరణ పదార్థ పరమార్థమెంత సదాశయ సంపత్తి ప్రబోధము చేయుచున్నదో విజ్ఞులకే యెరుక.

జాగరణ యనగా, మేలుకొనుటయనెడి లోకోక్తి. సర్వప్రాణులు మాయానిద్రలో మునిగి తేలుచు సతమత మగుచున్నారు. మనముందు వారెందరో మనవలె విర్రవీగి క్షణికమగు నీ ప్రపంచ భ్రాంతితో కంటికి గోచరించెడి ప్రతివస్తువును నిత్యము సత్యమని నమ్మి చివరకు మోసపోయిరి. అసత్యమగు నీ ప్రపంచమును సత్యమనుకొనుట, సత్యమై వెలింగెడి పరమాత్మ నసత్యమను భ్రాంతియే! ఇదే మాయ యనబడును.

అట్టి వట్టిమాయను తెలిసికొని జాగ్రతతో సత్ప్రవర్తనముతో, సాధుభావములు గలిగి చరించిననాడే నిజమైన జాగరణ ఫలితమును పొందినవారయ్యెదరు. ఈ జాగరణ రహస్యమును మరచి రెప్పలార్పక మేల్కొనినను, మేలుమాత్రము శూన్యము. వంటికో, కంటికో జబ్బేర్పడును. మానవత్వమును మంటగలిపి దానవత్వమునుపొంది మాధవత్వమును మరచి యజ్ఞానమార్గమున పరుగులు దీసెడి మానవులు తమ తప్పులనుగుర్తించి తా మొనర్చిన పాపములకు పశ్చాత్తాపమునుపొంది యా వేదనతో ధర్మపథగాములై తమజీవితములను సార్థకత నొందించిన నాడే శివరాత్రి జాగరణ సత్ఫలితమును పొందెదరు. ఈ భవ్య దివ్య నవ్యస్థితిని పొందక యెన్ని సంవత్సరములు జాగరణలు చేసినను రెంటికి చెడినవారై ఇహమునకు పరమునకు దూరులై కాళ్ళ తీపులతో కళ్ళ మంటలతో పాపపుమాటలతో స్వగృహములకు చేరుచుందురు.

"నృసింహా! ఇట్టి కలికాలపు భక్తులను ఎన్నటికైనను, శిక్షింతువో-రక్షింతువో-భక్షింతువో? కర్మఫల భోక్తలకే యెరుక.

'అజ్ఞులదృష్టికి - విజ్ఞులదృష్టికి ఎంతో వ్యత్యాసమున్నది. అజ్ఞుల దృష్టిలో ప్రకృతి వికృతిగా మారును. విజ్ఞులదృష్టిలో ప్రకృతి వికృతి యీ రెండును, దైవాకృతివలె దోచును.

అజ్ఞాని : సత్యవస్తువగు పరమాత్మను తెలిసికొనక యంతయు తెలిసినవానివలె తిరుగుచు ప్రకృతిని జయించ శక్తిలేక ప్రకృతి విషయలోలుడై తృప్తిని బడయక దినదినమునకు నాశను పెంచుకొని, రెప్పపాటున మృత్యువున్నదని గుర్తించక గొంతెమ్మకోరికలతో గాలిమేడలు నిర్మించుకొని హద్దులనుదాటి యాత్మస్తుతితో, పరనిందతో కాలమును వెళ్ళబుచ్చుచు, వేదవిజ్ఞానమంతయు కరతలామలకము, నాకు దెలియని దే మున్నదని పుణ్యపురుషుల పుణ్యస్థలముల దరిదాపులకైనను వెళ్ళక స్వప్రజ్ఞతో సర్వవిషయములను తనకుతానే సమన్వయపరచుకొని యంతయు నిచ్చటనే యున్నది, యీచోటు వీడినతఱి యేమగునో ఏరికి తెలియదనుచు, పండితప్రకర్షలతో సంస్కృతమూలగ్రంథములన్నియు మా మూలనున్నవనుచు, తోటివారిచే మెప్పువడయుచు తనపైగల కప్పును తొలగింప యత్నించక వాచా వేదాంతములను యుపమానములతో వల్లించి వల్లించి కాసులను ఖర్చుచేయక నిల్వచేసికొనుచు, నిదే ధ్యేయ మని నమ్మి నయాపైసేనియు ధర్మకార్యములకు వెచ్చించక దినదినము క్షీణించెడి యాయువుమాట మరచి, మనుమల మనుమరాండ్రపై నాటిన మమకార మణగించుకొనుటకు యత్నింపక తన తలపై నంటి వెంటతిరిగెడు నకాలమృత్యువుమాట మరచి, మానవజీవిత మనుగడను దూరముగా గెంటి, శరీరభ్రమతో శరీరస్థితిని పూర్తిగా మరచి తన సంఘమని, తన ప్రాంతమని, తన వంశీయులని, తన తనయులను మమకారములతో తన నిజాకారమును దర్శించుటకు బదులు, కాలక్రమమున శవాకారములను దర్శించుచు

శివమై వెలుగవలసిన తాను శవమై యీ భువి నశించును. జీవిత మంతయు కృషిసల్పిన వేదపఠనము, తర్క- వితర్క- కుతర్క- వాదముల ఫలితము. దేశదేశములు పర్యటనము చేసి యార్జించిన సువర్ణమణిమయ కంకణాదులు సర్వమును శవాలంకారములై నిరుపయోగములైనవి. ఇట్టి ప్రవర్తనగలిగినవా రెవరైనను నజ్ఞానులే! వీరినే శాస్త్రములందు శూద్రులనిరి.

సుజ్ఞాని : పిపీలికాది బ్రహ్మపర్యంతము పరమాత్మ వ్యాపించి యుండెను. సర్వభూత సమవర్తి శ్రీహరి. అట్టి హరిదర్శనమును పొంద వలె నను వ్యక్తి భయము భక్తి గలిగి, ప్రతి స్వల్పవిషయమునకు కర్మ బద్ధుడుగాక ధర్మబద్ధుడై సూక్ష్మబుద్ధితో పరిశీలన చేయుచు, నొరు లొనర్చిన తప్పులను మన్నించి, స్వార్థమపేక్షింపక వాని సద్ధర్మమును నిర్వహించుచు జాగరూకుడై, యొరుల రక్షణకు తాను కష్టనష్టములకు గురియై ధీరగుణముతో సర్వము నెదుర్కొని కులమతవర్గ విభేద రహితుడై దైవదృష్టితో సదా దైవభావనగలిగి, శక్తివంచన లేక స్వార్థత్యాగులను సంరక్షించుచు సద్గురువుల పూజించుచు 'సంసారము, సారహీనము – సన్న్యాసము సర్వశ్రేష్ఠ'మని తెలిసి మాయానిద్రనుండి మేల్కొనుటకు గట్టి ప్రయత్నమొనర్చి రాజమార్గమున పయనించి రాజరాజేశ్వరునిపొంది నిత్యానందుడై స్వయంప్రకాశముతో వెలిగెడి వారే సుజ్ఞానులు. వీరినే శాస్త్రములందు బ్రాహ్మణులనిరి.

సద్గురువులందరు ప్రబోధముచేసిన యొకటే ధర్మసూత్రము. "సంసారము బంధహేతువు – సన్న్యాసము బంధమోక్షము."

సంసారమనగా నేమి – సన్న్యాసమనగా నేమి?

సతీసుతులు లేకపోయినను, బ్రహ్మచారినని ముద్రవేసికొన్నను, నాశ్రమాదులు స్థాపించినను, నరణ్యము చేరినను, హరిభజన లొనర్చి నను, రాత్రింబవళ్ళు గీతాశాస్త్రాదులను పఠించినను, తీర్థయాత్రలు

సేవించినను, శిరోముండనము గావించినను, మహాక్షేత్రములలో కోటి బిల్వార్చనలు సహస్ర ఘటాభిషేకములు, యజ్ఞకర్మలు, నిత్యాన్న దానములు, కవిపండిత సత్కారములు, నొకటేమి, ప్రపంచమునగల సత్కార్యము లన్నియు సంపూర్తి గావించినను, వాని మనస్సు మాత్రము సదా యర్థమునకో యారోగ్యమునకో యశస్సునకో ప్రాకు లాడుచుండినచో సంసారియే యగును. ఇట్టి సంసారి హృదయము వినిర్మలముగా ప్రకాశింపదు. తన్ను తాను రక్షించుకొనలేని ఈ దొంగ సన్యాసులు, సామాన్యులగు సంసారుల నేమి యుద్ధరించగలరు! ఇదంతయు పచ్చిమోసమని విజ్ఞులగు నాత్మసోదరు లెల్లరు త్వరితగతిని గుర్తించగలరు.

భార్యా పుత్రుల గలిగి సంసార వ్యాసంగములతో 'ఉదరపోష ణార్థం – బహుకృత వేషం' అనెడి లోకోక్తి ననుసరించి వేషములు వేసినను, వ్యాపారోద్యోగము లొనర్చినను, తాను తానుగా నుండి శరీరపోషణకొరకు జీవయాత్ర సాగించుచు, నీ మేనులోగల, తానెవరనెడి విచారణతో నైహికవిచారము నంతము చేసి, యాత్మానందముతో సర్వమానవసౌభ్రాతృత్వము గలిగి సర్వమతసమత్వదృష్టితో నందరిని ప్రేమించుచు కొందరిని పూజించుచు ననిత్యభోగములను త్యజించి, మితాహారియై మితభాషియై యాశలను పెంచుకొనక క్రమదాంపత్య ముతో, సంసారమును స్వర్గముగా మార్చి, దేహమునే యాలయము చేసికొని తన్ను తాను గుర్తించి యాదర్శభావముల నలవరచుకొని, స్మరణ ధ్యాన భజనాదులు క్రమశిక్షణతో నిర్వహింపుచు, నాడంబర రహితుడై జీవితము క్షణభంగురమని తీవ్రముముక్షుత్వమును పొంది, దైనీముహూర్తమున లేచి, పద్మాసనాసీనుడై వెన్నెముకను చక్కగా నిల్పి ప్రణవధ్యానములతో విషయేంద్రియ ప్రవృత్తులను నిరోధించి, మనస్సును భ్రుకుటియందు నిల్పి సంకల్పరహితుడై యాత్మానందుడై యోగానందుడైన వ్యక్తి సంసారమం దున్నను సన్యాసియే!

ఈ పరమ రహస్యము సర్వులకు తెలియుటకు, సినిమా గేయరచనా పరులగు నా యాత్మసోదరులున్నై తము 'సంసారి దుఃఖి – సన్యాసి సుఖి' యని పేర్కొనిరి.

కవులు వ్రాసినను, పండితులు చెప్పినను, గాయకులు గానము చేసినను, శిల్పాచార్యులు జీవితము లర్పించి కళాఖండములను సృష్టించి నను, లౌకికుడు మాత్రము మారుటలేదు.

ప్రపంచోద్ధరణకై శ్రీ కంచర్ల గోపరాజు, శ్రీ కాకర్ల త్యాగ రాజు, శ్రీ బమ్మెర పోతరాజు లెంతో కృషిచేసిరి.

శ్రీ కంచర్ల గోపరాజు: భద్రాద్రిలో శ్రీరామాలయము కట్టించెను. ఆ రామాలయమే గోపన్న హృదయము. రాత్రింబవళ్లు ప్రపంచ వ్యామోహములకు గురియై సంసారమనెడి యుచ్చుల కళ్ళెమున చిక్కి విడివడు శక్తిలేని ప్రజాసమూహము నుద్ధరించుటకు భద్రగిరిపై తమ్మెల దమ్మక్క యారాధించెడి శ్రీ సీతారామలక్ష్మణ విగ్రహముల కచ్చెరు వొంది శాశ్వతముగా ప్రజలందరు సగుణోపాసనతో నిర్గుణబ్రహ్మమును పొందుటకు సులువుగా మణిమయ ప్రాకారమంటప గోపురాదులను నిర్మించి మూర్తులను స్థాపించి వివిధోత్సవ సేవాకైంకర్యాదులు విధిగా జరుగునట్లొనర్చి, తన దేహము రాముని గేహముగా మార్చిరి. ఆత్మను పరమాత్మయం దంతర్లీన మొనర్చెడి స్థానమే యాలయము. గోపన్న గారి హృదయపీఠిపై శ్రీసీతారామలక్ష్మణ మూర్తులు స్థాపించి యారాధించి యాత్మానందముతో శ్రీ హరిసాయుజ్యమును పొందిరి.

శ్రీ రామదాసుగారి యాత్మదృష్టికి రాము డనగా, అయోధ్యలో రాజైన దశరథునకు జన్మించిన బిడ్డడు కాదు. రాము డనగా స్వప్రకాశముతో వెలింగెడి యా పరతత్త్వ స్వరూపము. లక్ష్మణు డనగా నా రామబ్రహ్మను పొందుటకు, శక్తిలేక దూరముగా నుండి యా వేదనతో పరితపించెడి జీవుడే లక్ష్మణుడు. సీత యన నెవరను కున్నారో!

సంసారారణ్యమున పర్యటనము చేసెడి పరమాత్మ జీవాత్మల మధ్యనున్న మహామాయయే సీత.

ఇందుకు ప్రమాణముగా, రామాయణమున నరణ్యసంచార సమయమున రాముడు, రాముని వెంట సీత, సీత వెనుక లక్ష్మణుడు వెళ్ళుచుండిరి. లక్ష్మణస్వామి శ్రీ రామదర్శనమును పొందలేక "అన్నా శ్రీరామా! నీదర్శనము నా కెంతో దూరమైన"దనిరి. వెంటనే శ్రీరామ చంద్రమూర్తి "ఓయీ లక్ష్మణా! పొరబడుచున్నావా, నీ కతి సమీప మందే యుంటిని. ఐనను నన్ను దర్శింపవైతివి. నా–నీ మధ్యసీతయున్నది. ఆ సీతను ప్రక్కకు తొలగమని ప్రార్థింపు" మనిచెప్పిరి. తక్షణమే లక్ష్మణస్వామి "ఓ అమ్మా! సీతమ్మా! ప్రక్కకుతొలుగు"మని ప్రార్థించెను. లక్ష్మణుని ప్రార్థన నాలించి వెంటనే పాలించెను. మధ్యనున్నసీత ప్రక్కకు తొలగగనే లక్ష్మణు డపరిమితానందముతో శ్రీ రామ సాక్షాత్కారమును పొందెను.

ఈ రామాయణ కర్తయగు శ్రీ వాల్మీకిమహర్షి యీ చిన్న విషయము నెందులకు చెప్పిరో విజ్ఞులకెరుక.

మానవ దేహారణ్యమున చరించెడి దేవునిదర్శనము కావలె నన్నచో, జీవుడు మాయను దాటి సహస్రారమున ప్రకాశించెడియాత్మ జ్యోతిని గాంచవలెను. మాయను దాటుటకై యత్నింపక దాని కను గుణముగా తిరిగెడు మానవు డనేకజన్మము లెత్తుచు గర్భనరకము లనుభవించి దరిలేని సంసారజలధిలో కొట్టుకొనిపోవును.

ఈ పవిత్రాశయ సిద్ధికొరకే గోపన్న, భక్తరామదాసుగా మారి భవబంధమును త్రెంచి జీవితాంతమువరకు రామనామస్మరణలతో భజనలతో ధ్యానముచేసి, గానముచేసి, నిర్యాణసమయ మందైనను రాముని మరువక 'కరిమ్రింగిన వెలగపండువలె' సంసారచింత యణువైనను లేక శ్రీరామపరబ్రహ్మమును పొందిరి.

సీతవంటి భార్య లభించుట దుర్లభము. కైకవంటి భార్య దొరకుట సులభము.

శ్రీ కాకర్ల త్యాగరాజు : ఈ మహనీయమూర్తి శ్రీరామ పరబ్రహ్మ యథార్థస్వరూపమును రాగతాళ లయాదులలో వేలకొలది కీర్తనలను రచించిరి. తాను రచించిన కీర్తనలను తానే గానమొనర్చి, తనలోనున్న తానే యానందమును చెందిరి. తనలోనున్న తానానందించినతటి ఈ ప్రపంచపు బాధలన్నియు గుమిగూడి యాహ్వానములు చేసినను భయపడక వానిని గేలిసేయుచు 'రండి! రండీ!' యని యాహ్వానించుచు భక్తితో దరిద్రదామోదరుడయ్యు నఖండానందముతో బాష్పపూరిత లోచనుడై తంబురశ్రుతిని మేళవించుచు శ్రీరామునిముందు నృత్యమొనర్చి తన్మయులై మేను మరచెదరు.

తిరువయ్యార్ గ్రామవీధులలో శ్రీరామకథారచన గేయ గానముతో భిక్షాటనసేయుచు నెవ్వరి నడుగక తెచ్చి యిచ్చెడి భిక్షను స్వీకరించుచు సదా శ్రీరామ స్వరూపమునే వీక్షించుచు సర్వమానవ హృదయములయందు శ్రీరామజ్యోతిని దర్శించుచు మహారాజుల యాహ్వానపత్రికలను తృణములని భావించి తన వేలాది కీర్తనలను భగవదంకిత మొనర్చి జీవయాత్ర సాగించిరి.

సదా ప్రతిధ్వనించెడి యా శబ్దబ్రహ్మము నేనే! నాదమే పర బ్రహ్మ స్వరూపము. నాదబ్రహ్మమునందు మనస్సును లయమొందించ వలెను. సర్వభూతాంతరాత్మయగు పరమాత్మను పొందవలెను.

ప్రపంచరాగములను పోనాడి భవరోగమును నశింపచేయుటకై యనురాగముతో రాగాలాపనచేసిరి. ఆ రాగాలాపనయే ప్రాకృత రోగాలను నశింపచేయును. మేను మరచి మనస్సును భ్రుకుటియందు చేర్చి ప్రణవనాదానందుడై వెలసిననాడే సంగీతమును తెలసినవా డగును. ఇట్టి సంగీతామృతమును పానముచేసి కటిక దారిద్ర్యముతో శ్రీరామనామజపము తొంబదియారుకోట్లు జపించిన భక్తమూర్తి,

విజ్ఞాననిధి త్యాగమూర్తి. త్యాగరాజస్వామి తమ నామమును సార్థకము చేసిరి. సర్వసంగ పరిత్యాగముచేసిన త్యాగరాజులు వీరే. వీరికి వీరే సాటి. జీవితరథమును ధర్మపథమున నొడుదుడుకులు లేక నడిపించిన యమరమూర్తి.

శ్రీ బమ్మెర పోతరాజు : ఈ మహనీయమూర్తి 'ఒంటిమిట్ట' యం దవతరించి శ్రీరామచంద్రుని చరణారవిందములను భక్తితో పూజించుచు గృహస్థ జీవనముతో పగలంతయు క్షేత్రములను దున్ని రాత్రియంతయు భక్తి జ్ఞాన వైరాగ్యతత్త్వముతో ముక్తిని బడయ వచ్చు ననెడి పరమసత్యమును గద్యపద్యములతో కూర్చి, పేర్చి లోక మునకు మహోపకార మొనర్చిన త్యాగమూర్తి. కలము – హలము వీరి కత్యంత ప్రియమైనవి. వీరి మధురమోహన మంజుల ముగ్ధశైలిని చవిచూడనివారుండరు. ఇట్టి మహనీయుని దారిద్ర్యదేవత వరించినది. వరించి తరించినది. జీవితమంతయుకృషిచేసి, యొక్కొక రక్తపుబొట్టుగ నొక్కొక పద్యమును రచించి మానవులకు మహోపకారము చేసిరి. రత్నపురాసులను చూపిన మహారాజులకు పొత్తము నంకితమివ్వక యా పంటపొలంతి యల్లునకే భాగవతము నంకితమిచ్చి వీరి జీవితమును సార్థకమునొందించిరి గోపరాజు – త్యాగరాజు–పోతరాజై వెలసినది యా మహాశక్తి స్వరూపిణియగు పరతత్త్వమే !

ఆ పరతత్త్వమును పొందునంతవరకు మానవులు జరామరణ భయములను పొందవలసినదే !

ఇంట్లో బలము వొంట్లో బలము జారిపోయినతరి, మానవుడు సోలిపోయి తూలిపోయి కూలిపోయి చివరకు కాలిపోవును. ఈ వాక్య ముల సారము గ్రహించి, క్రమబద్ధమైన జీవితమును నడుపుకొనుటే మానవత్వము. ప్రకృతిని నమ్మి మోసపోయెదవు. పరమాత్మను నమ్మక నాశనమయ్యెదవు. జీవితమున నెన్నియో పెనుతుపాను లెదు

రోగ్ర్కానును. సుడిగుండములు సంభవించును. ఎన్ని సంభవించినను నీ భారము భగవానునిపై నిడి పురోగమించుటే మానవకర్తవ్యము.

'ఆలసించిన నాశాభంగము' 'మంచి తరుణము మించిపోవును' మాటిమాటికీ నీనరజన్మ లభించునది కాదు. బహుజన్మ సుకృతఫలము చే లభించినది. త్వరలో సద్గురువుల పంచజేరి, యీ మాయనిద్రనుండి మేల్కొని జగన్నాధునియం దేకీభంచుటకై ప్రయత్నింపుము. మహర్షుల వాక్యములను శిరసావహించి, నిన్ను, నీవు తెలిసికొనుటకై యత్నింపుము. సద్గ్రంథములను మహనీయుల జీవితచరిత్రలు సహరహము పఠింపుము. సద్గ్రంథాదేశములను సద్గురువుల సత్ప్రబోధములను శక్తివంచనలేక యాచరణలో నుంచుము. సత్యసూక్తులను నిత్యము పఠింపుచు నాచరించి యనుభూతి నొందిననాడు జ్ఞానివయ్యెదవు. అంతవరకు నజ్ఞానివే!

అజ్ఞాని సుజ్ఞానమును గ్రహించలేడు. సరసమార్గము ననుసరింపక, విరసమగు వక్రమార్గమున పరుగులు తీయసాగును. ఆచరణ వేదాంతమును వీడి, వాచావేదాంతములతో తాత్కాలిక గౌరవములను పొందుచు నంత్యమున, నశాంతిని పొందును.

వేదవేదాంగములు చదివినను, ధనకనకవస్తువాహనము లార్జించినను, పుత్రపౌత్ర దాసదాసీజనంబు లున్నను నాత్మకుప్రశాంతి లభింపదు.

ఆత్మశాంతిని పొంది యానందమయుడవై విలసిల్లవలయు ననిన నివిమాత్రము తప్పక తనలో ప్రకాశింపవలెను. 1. సత్ప్రవర్తనము 2. సదాచారము 3. సజ్జనమైత్రి 4. సద్గ్రంథపఠనము 5. సత్యదృష్టి 6. సాధుపూజ 7. సత్పాత్రదానము 8. సర్వేశ్వరభక్తి యనెడి నవరత్నములను పొందినవ్యక్తి శక్తి, రక్తి, ముక్తి యందర శాసక్తినై వెలుగొందును.

ఆనందదూరుడవై యహంభావముతో, నన్యాయముతో, నక్రమముతో, నసత్యములాడుచు సోమరివై నిన్ను నీవే పొగడుకొనుచు,

బలహీనులపై కురుకుచు, కారుకూతలు గూయుచు, చేయరాని కార్యములు చేయుచు నవరాని వినరాని మాటలతో తిరిగెడి పరమ నీచుల ప్రభావము గాలిలో దీపమువలె, నేనాడో యొకనాడంత రించును.

రంకెలు వేసెడి ఓ మూఢ మానవుడా! దైవదూరుడవై యీ ప్రపంచమున నెన్నాళ్లు మనగలవు. దైవవాణిని ద్రోసిపుచ్చి యేమి సౌఖ్యమును పొందగలవు. వృథాభ్రాంతులు వీడి సరియైన మార్గమున పురోగమింపుము. సచ్చిదానందమగు పరతత్త్వమును పొందుము. ఇంద్రియ కింకరుడవై పరిభ్రమణము చేయుటకంటే, నీశ్వర కింకరుడవై విషయేంద్రియ ప్రవృత్తులను జయింపుము. అహంకార మమకార ముల నావలకు గెంటి ఇంద్రియాశ్వముల పగ్గాలను నీ హృదయేశ్వరు డైన హృషీకేశున కప్పజెప్పుము. నిస్సంగుడవై నిర్భయుడవై జీవిత సంగ్రామములో నిలిచి విజయుడవు కమ్ము.

మానవ జీవితము గాలిలోని దీపమువంటిది. మెరపుకాంతివలె జలబుద్బుదము రీతి, యన్యాయార్జితమువలె, కులమత తత్త్వములతో పెనుగులాడెడి పండితప్రకాండుల యశస్సువలె మనకు చెప్పకయే యింటనో బయటనో నేడో రేపో కాలగర్భమున విలీనము కాగలదు. పనికిమాలిన యీ పాడుదేహములో నెందరో శత్రువులు మకాము చేసినారు. ఆర్గురు రాడించెడివారు. ముప్వురు ముంచెడివారు. పద్గురు రేడ్పించెడివారు. ఎనిమిదిమంది వెతలు బెట్టెడివారు. పదుగురు ప్రక్కకీడ్చెడి వారు. ఐదుగురు కావలివారు. ఇర్వురు వచ్చిపోయెడివారు. ఒకడు బిక్కుబిక్కు మనువాడు. ఈ వక్కటిని తెలిసికొనుటకే యీ గ్రంథ మంతయు వ్రాసినది. విజ్ఞులైన వారెల్లరును గ్రంథవిషయములను పఠించి, యందలి సారమును గ్రహించి ప్రయత్నముతో శ్రీ సద్గురు ప్రబోధామృతమును పానమొనరించి సర్వబంధములను వీడి ప్రశాంత చిత్తులై, యాత్మసాక్షాత్కారమును పొంది దైవస్వరూపులై ప్రకాశించెదరు గాక!

1966 వ సంవత్సరము సెప్టెంబరు పదునైదవ తేదీన గుంతకల్ పట్టణమున శ్రీ జగద్గురు శ్రీ గిరిరాజ సూర్యసింహాసన మఠాధీశ్వరులు, శ్రీశైల జగద్గురు వాగీశ పండితారాధ్య శివాచార్య మహాస్వాముల వారి ఆధ్వర్యమున శ్రీ వారి మఠమునందు శ్రావణమాస పూజా సమాప్తియగు మహాపర్వ దినమున గ్రంథకర్త శ్రీ కోట సుబ్బారావు గుప్త భాగవతారు సాయంత్రము 5 గంటల నుండి 6–30 కు, (శ్రీ స్వామి కేశవ తీర్థకృత) మహాభక్త ప్రహ్లాద హరికథాగానము చేసిరి. శైవ భక్తులు వైష్ణవ భక్తులెల్లరు పరమానందమును పొందిరి.



"కీర్తన కంఠీరవ" శ్రీ కోట సుబ్బారావుగుప్త భాగవతారుగారు

ఆ రాత్రి శ్రీశైల జగద్గురువులు కథాగానమున కపరిమితానందమును పొంది శయనించిరి. వీరికి దివ్యస్వప్నమొకటి సాక్షాత్కరించెను. వీరి వీరశైవ మతాచార్యులగు శ్రీ పండితారాధ్యులు సాక్షాత్కరించి

ఓ! వాగీశా! కథాగానము చేసిన భక్తున కీ బిరుదొసంగుమని దైవ వాణిని వెలిబుచ్చిరి. ర్తన కంఠీరవ' యనెడి వాణి శ్రీ వాగీశునకు వినవచ్చినది.

సప్టెంబరు పదునారవ తేదీ యుదయము గ్రంథకర్తగారు జగద్గురువులకు వీడ్కోలు చెప్పి నమస్సులర్పించిరి. జగద్గురువులు "నాయనా! నీకు మహర్దశయున్నది. నా ఆరాధ్యదైవము శ్రీ పండితారాధ్యులు సాక్షాత్కరించి బిరుదొసంగుమని చెప్పిరి. నీ ఉపాస్యదైవము శ్రీ నృసింహమూర్తి. ఆ కారణముచేత నీ ఇష్టదైవము పేరుగల బిరుదే నొసంగిరి. ఇది మహావిశేషము. శివ - కేశవులకు భేదములేదు. నాయనా!" యని చెప్పి వెంటనే బిరుదు పత్రముపై వారి చేతివ్రేలి యుంగరము మొహరువేసి గ్రంథకర్త సుబ్బారావున కొసగి కాశీపట్టు కండువా పైనగప్పి పూలమాల నొకటి కంఠమునవేసి అఖండాశీర్వాద మొనర్చిరి.

పరమానందముతో "ఓ స్వామీ! తమరు కరుణాహృదయులు. మా సద్గురువులగు శ్రీ యోగానంద మహర్షి స్వరూపమును తమ హృదయ దర్పణమున దర్శించుచున్నాను. వారే మీ రూపమున నాకీ బిరుదొసగి నారని భావించితిని. తమ జన్మభూమి 'హరిహర' గ్రామ సమీపము. హరిహర స్వరూప మీ విధముగా శ్రీశైల జగద్గురువులై యవతరించిరి. సందేహము లేదని చెప్పి శ్రీ వాగీశ పండితారాధ్యుల పాదపద్మములపై సుబ్బారావుగారు ప్రణమిల్లిరి.

వినుకొండ శ్రీ యోగానంద మఠాధిపతులగు శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వర స్వామివారు శ్రీ జగద్గురువుల సన్నిధిన గీతాప్రబోధ మొనర్చి, గీతలో గల పరమసత్యపరమార్థ తత్త్వమును ప్రబోధ మొనర్చి వీరశైవసంఘుసోదరుల హృదయములను ద్రవీభూత మొనర్చిరి. శ్రీ వాగీశపండితారాధ్య శివాచార్యమహాస్వామివారు, శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరస్వామివారిని గాఢాలింగన మొనర్చుకొని పరమానందమును పొందిరి. ప్రేక్షక మహాశయులెల్లరు ఇర్వర స్వాములను

దర్శించి "శివకేశవ సమైక్య స్వరూపమిదే! హరిహరాలయ మిదే" యనుచు హృదయపూర్వక నమస్సు లర్పించిరి. శ్రీ వాగీశపండితా రాధ్య శివాచార్యమహాస్వాములవారు, శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వర స్వామివారికి విశ్వప్రేమతో 'ఉపన్యాస భారతి' యనెడి బిరుద మొసంగి కాశీపట్టు శాలువను శ్రీ వేంకటేశ్వరస్వామివారిపై కప్పి గాఢాలింగన మొనర్చుకొని శ్రీ పండితారాధ్యులే మన మఠమునకు విచ్చేసి ధన్య దివ్యశైవ ప్రబోధము చేసిరని ఆత్మానందమును పొందిరి. శ్రీ వేంకటే శ్వర స్వామివారిని, ఈ గ్రంథకర్త సుబ్బారావును, తదితర భక్తులను శ్రీ జగద్గురుస్వామివారు వారి కారులో రైలుస్టేషను యొద్దకు బంపిరి. హరిహరనామ భజనతో మఠమునుండి రైలుస్టేషను చేరి స్వగృహ ములకు వేంచేసిరి.

ది 29-11-1966 న శ్రీశైలక్షేత్రమున శ్రీశైలక్షేత్రనగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్రమునందు, సప్తాహమహోత్సవము లందు అధ్యక్షులగు శ్రీ గ్రంధే రఘురామగుప్తగారి యాధ్వర్యమున ఈ గ్రంథకర్తగారగు 'కీర్తన కంఠీరవ' శ్రీ కోట సుబ్బారావుగుప్త భాగవతారుగారు పగలు 1 గంటనుండి 4 గంటలవరకు (శ్రీ స్వామి కేశవ తీర్థకృత) మహాభక్త కన్నప్ప హరికథాగానము చేసిరి. శ్రీ గ్రంధే రఘురామగుప్తగారు హరికథాగానమును వీనులవిందుగా విని, కథా గానములను గురించి, సంగీతసాహిత్యములను గురించి విపులముగా విమర్శించి, 'అన్నిటికి మించినది భక్తియే! భక్తిపారవశ్యమున మేను మరచి ఆనందాశ్రువులతో కన్నప్పనాయనారుని కథాగాన మొనరించిన మా బావగారు శ్రీ కోటసుబ్బారావుగుప్త భాగవతారుగారు భగవ ద్భక్తుల చరిత్రలనే యధ్యయన మొనర్చి ఆంధ్రదేశమంతట కథా గానము లొనర్చి సత్కీర్తిని పొందెదరని నే నాశించుచున్నాను. వీరి కథాగానములు దిగ్విజయము పొందవలెనని శ్రీ మల్లికార్జునస్వామిని ప్రార్థించుచున్నానని" చెప్పిరి.

కథాగానము చేసిన గుప్తగారికి శ్రీ రఘురామగుప్తగారు ప్రేమ పూర్వకముగా అర్ధనూటపదహారు రూప్యము లొసంగిరి. దాసుగారు భక్తులందరిచేత 'శివాయ పరమేశ్వరాయ - చంద్రశేఖరాయనమ ఓం, 'భవాయ గుణసంభవాయ - శివతాండవాయనమ ఓం' యనెడి శివ నామమును చేయించిరి. భక్తులందరు భక్తితో నొనర్చిన శివనామ స్మరణ ధ్వని గిరిగహ్వరమంతయు మార్మ్రోగెను. కార్యదర్శి శ్రీ మూర్తి వెంకటేశ్వర్లుగారు 'ఓ హరిదాసుగారూ! భక్తుల చరిత్రలు మాత్రము మీరు చెప్పగనే వినవలె'ననిరి. దాసుగారు, 'ఓ అన్నయ్యగారు మాన వుని దేమున్నది. అంతయు ఆ మహేశ్వరుని కృపాకటాక్షవీక్షణ ప్రసార'మని నుడివిరి.

## శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరస్వామివారు సద్గురు పీఠ మలంకరించుట

శ్రీ శ్రీ శ్రీ శ్రీలక్ష్మీనృసింహ కళావతారమగు శ్రీ శ్రీ శ్రీ పరమహంస శ్రీ యోగానంద నృసింహయోగీశ్వర సద్గురుస్వామి బాహ్యప్రపంచమున పరతత్త్వస్వరూపుడై వెలుగొందెడి దినములలో సర్వమానవ శ్రేయస్సభిలషించి ప్రియశిష్యులందరికన్న మిన్నయగు తనపాదదాసుడైన అబ్బూరు శ్రీ నారాయణస్వామివారిని తనవద్దకు చేర్చుకొని అవ్యాజకరుణాకటాక్షవీక్షణతో "నాయనా నారాయణా! నా అనంతరము ఈ గురుస్థానమునకు ఆధిపత్యము వహించి సర్వ సమర్థులై సత్యదృష్టితో సద్గురు సర్వశక్తిని సర్వమానవ హృదయ కేంద్రములలో ప్రసారము చేసెడి యోగ్యుడెవరో అట్టి వానికి ఈ సద్గురు పీఠమును సమర్పణచేసి నా బాధ్యతను నిర్వర్తించి, సభాస్తంభసంభూత మైన ఆ పరాశక్తి స్వరూపమగు శ్రీ వీరనృసింహుని ఆత్మాశయమును స్థిరపరచి ఆత్మానందుడనై యోగానందుడనై జీవసమాధి నిష్ఠను పొంది, నన్ను నమ్మి సేవించెడి ప్రియశిష్యులను భక్తులను జ్ఞానులను నా దివ్యశక్తి ప్రసారముచే జ్ఞానులగా మార్చుచు సదా ఆత్మ స్వరూపుడనై ప్రకాశించెదను. నీ యిష్టమేమిరా నారాయణా!" యనిరి.



శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరస్వామివారు సద్గురు పీఠ మలంకరించుట

ప్రతి యణువు సద్గురు స్వరూపమే! వేఱొండు లేదని ఏనాడో గుర్తించి శ్రీ సద్గురుదేవుల కనుసన్నలలో మెలగి సద్గురు హృదయానంద మును చేకూర్చిన ప్రథమశిష్యుడు శ్రీ నారాయణదాసు. సద్గురు వాక్య ములను వినిన శ్రీ నారాయణదాసు, "ఓ సద్గురునకు సార్వభౌమా! వీర నృసింహకళావతారమూర్తి! అఖండవిజ్ఞానఖనీ! నా హృదయసింహాస నముపై నీ మూర్తిని ప్రతిష్టించి నీవే నేనుగా, నేనే నీవుగా భావించి నీ ఆశయసిద్ధికై సర్వసంగపరిత్యాగ మొనర్చెద. అవసరమైనచో నా ప్రాణమునే తృణముగా పరిత్యజించెద" నని చెప్పిరి.

శ్రీ యోగానందమహర్షి ఆనందాశ్రువులతో, "శిష్యుడ వనిన నీవే! ఆనాడు బ్రహ్మముగారి మనస్సును సిద్ధ డెటుల ఆనందవారా శిలో ఈదులాడించెనో అదే విధముగా నాకీనాడు బ్రహ్మానంద మొన గూర్చితివి. నా బాధ్యత తీరిన" దనుచు శ్రీ సద్గురు యోగానంద నరసింహ యోగీశ్వరస్వామివారు, శ్రీ సద్గురు పట్టాభిషేక విధాన మంతయు చెప్పగా సూక్ష్మదృష్టిగల మన నారాయణదాసు చెప్పినది చెప్పినటుల విన్నది విన్నటుల ఆమూలాగ్రముగా వ్రాసుకొని తన హృదయపేటికయందు, పదిలముగా భద్రపరచిరి.

ఈ ప్రేమానుబంధము ఈ జన్మది మాత్రమే కాదు. ఎన్నో జన్మల నుండి వచ్చుచున్న దివ్యప్రేమానుబంధము. కర్పూరమునకు – అగ్నికి ఎట్టి సంబంధమున్నదో, పుష్పమునకు – గంధమునకు యే సంబంధ మున్నదో, జీవునకు – దేవునకు గల సంబంధమెట్టిదో, సతికి – పతికి గల అవినాభావసంబంధ స్వరూప, మేవిధముగా నుండునో, అట్టిదే ఈ గురు – శిష్య సంబంధము. శ్రీ స్వామివారు ఆదేశించిన గురు పట్టాభిషేక కార్యక్రమ వివరణమంతయు నారాయణస్వామివారికి దప్ప యే యితర ప్రాణికి తెలియదు.

ఈ విషయము జరిగిన కొన్నిరోజులకు శ్రీ నారాయణదాసు శ్రీ సద్గురుదేవుల సెలవుతో అబ్బూరు చేరిరి.

శ్రీ సద్గురు దేవుని దివ్యభవ్య అవ్యాయనవ్యాశక్తికి నిదర్శనముగా ఒక సంఘటన జరిగినది. వినుకొండలో శ్రీ యోగానందమఠమున ఒక రోజున శ్రీ నృసింహోపాసకులగు శ్రీ చేవూరికోటయ్యగారి హృదయ మందిరమున శ్రీ సద్గురు యోగానందమహర్షి దివ్యశక్తి ప్రజ్వలించెను. కోటయ్యగారి బాల్యమిత్రులు శ్రీ సద్గురు దేవుల ప్రియశిష్యులు శ్రీ గంగిశెట్టి వెంకటగురునాథముశ్రేష్ఠి, శ్రీ కనమర్లపూడి మల్లిఖార్జునముశ్రేష్ఠి, శ్రీ కోటయ్యగారి సన్నిధిలో సుఖాసీనులై యుండిరి. ఆదేసమయమున కోటయ్యా, ఏమిరా! కాగిత మొకటివ్వండన శ్రీ సద్గురుశక్తి ప్రసారమును గుర్తించిన మిత్రు లందించిరి.

ఆ కోటయ్యగారు సద్గురు దివ్యశక్తితో కన్నులు మూసుకొని సద్గురు సత్యస్వరూప దివ్యదర్శన మహద్భాగ్యముతో బాహ్యస్మృతి వీడి నాలుగుటావులు వ్రాసిరి. వ్రాయుట సంపూర్తి చెందగనే కోటయ్య బాహ్యస్మృతిని పొందిరి. మేనులోగల తాను వ్రాసిన వ్రాతలను నేను పవిత్రుడనైతినని కోటయ్యగారెంతో సంతసించిరి. ఏకాంతమందు శ్రీ సద్గురుమూర్తి కపిలగిరియందు ప్రియశిష్యుడగు నారాయణునితో నుడివిన గురుపట్టాభిషేక వివరమంతయు తేటతెల్లముగా కోటయ్యగారు వ్రాసిన లిఖితపత్రములయందు యణుమాత్రమేని భేదము లేక కనుపించుచున్నది.

శ్రీ నారాయణస్వామివారు సద్గురుస్థానమగు కపిలగిరికి వెళ్ళెడి సమయమున వినుకొండ శ్రీ యోగానందమఠమునకు విచ్చేసిరి. శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరస్వామివారు ఆత్మసోదరుని యోగక్షేమములు విచారించి "ఓ అన్నయ్యా! మన కోటయ్యగారు బాహ్యస్మృతిని గోల్పోయి గురుపట్టాభిషేక వివరమంతయు తేటతెల్లముగా పూసగ్రుచ్చినటుల వ్రాసి"రని కాగితములను దెచ్చియిచ్చిరి.

శ్రీ నారాయణస్వామివారు "నాయనా! వేంకటేశ్వరా! సందేహము లేదు. మన సద్గురుస్వామి నాకు చెప్పినది మనకోటయ్య హృదయ

మున చేరి వ్రాయించినది సద్గురుశక్తి యొకటే! ఇట్టియెడ సందేహా మేల స్ఫురించును. మన గురుస్థాన మలంకరించి భక్తిజ్ఞాన వైరాగ్యా దులను ప్రబోధ మొనర్చి సర్వమత సమన్వయదృష్టియగు మన సద్గురు సత్యదృష్టిని దశదిశలలో ప్రచార మొనర్చి శ్రీ సద్గురు స్థానమునకే సద్యశస్సును కలిగించి మాకెల్లరకు ఆత్మానంద మొనగూర్చు"డని చెప్పి కపిలగిరికి వెళ్ళిరి.

శ్రీ నారాయణస్వామివారే కొన్నిరోజులకు శ్రీ యోగానంద మఠమునకు విచ్చేసి "అమ్మా శ్రీ మహాలక్ష్మీదేవి! నీ ముద్దుబిడ్డ శ్రీ వేంక టేశ్వరునకే సద్గురు పట్టాభిషేకము చేయవలయునని మన సద్గురుప్రేర ణతో చెప్పుచున్నాను. ఈ యోగానాందమఠమందే సద్గురు పట్టాభి షేకము సంపూర్తి గావించెద"నని లగ్నమును నిర్ణయించి అబ్బూరు చేరిరి.

శ్రీ సద్గురు పట్టాభిషేకమును సంపూర్తి గావించవలెననుదీక్షతో అబ్బూరునుండి శ్రీ నారాయణస్వామివారు, హనుమద్దాసు మొదలగు వ్యక్తులతో ది 20-12-1966 వినుకొండలో వెలింగెడి శ్రీ యోగానంద మఠమునకు విచ్చేసిరి.

శ్రీ లక్ష్మీ నృసింహ కళావతారమగు శ్రీ శ్రీ శ్రీ పరమహంస శ్రీ యోగానంద నృసింహయోగీశ్వరమూర్తి అనుజ్ఞచే 'ప్రవచనభారతి' శ్రీ శ్రీ శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరస్వామి వారికి-

స్వస్తిశ్రీ పరాభవనామ సంవత్సర శు ౧౦ లు గురువారము అశ్వనీ నక్షత్రయుక్త మకరలగ్న పుష్కరాంశయందు ఉదయము గం. 9-01 నిముషములకు సరియగు ది. 22-12-1966 వ తేదీన శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరస్వామి వారికి ద్వాదశ నదనదీ పవిత్ర భస్మసమేత తీర్థసమ్మార్జనమున్నూ, ఛత్ర చామర దండ కమండల కిరీ టాది యతిరాజ పీఠాధిపత్యమున్నూ, వేదసమ్మతముగా సద్గురు మహా ఋషి సాంప్రదాయకముగా శ్రీ అబ్బూరి నారాయణదాసుగారి ఆధి

పత్యమున, శ్రీ వాసవి కన్యకాపరమేశ్వరీ దేవస్థాన అర్చకులైన "శ్రీ శాస్త్రి" వుడత్తు సుబ్బరాయ గుప్తగారిచే, శ్రీ సద్గురు దేవులగు శ్రీ యోగానంద నరసింహ యోగీశ్వరులు తన ప్రియశిష్యుడు ప్రేమ పాత్రుడగు శ్రీ నారాయణ దాసుగారికి యేకాంతముగా ఆదేశించిన విధివిధానముల ననుసరించి ద్వాదశనదీ తీర్థసమేతముగ మహాక్షేత్ర మృత్తికలతో పంచామృతములతో పురుషసూక్త శ్రీసూక్త నమక చమనములతో నూటయెనిమిది బిందెలు తీర్థముతో దివ్యాభిషేక మొనర్చి వేదసమ్మతముగా అగ్నిహోమ మొనర్చి వేదాధ్యయన మొనర్చుచు నృసింహనామ భజనలతో నాగస్వరాది వాద్యబృందము లతో శ్రీ సద్గురు దివ్యభవ్యనవ్య సింహాసన మధిరోహణచేసి వేదవిహిత ముగా శ్రీ కోట రామయ్యశ్రేష్ఠి దత్తుకుమారులగు శ్రీ లక్ష్మినారాయణ శ్రేష్ఠిగారు చేయించి సమర్పించిన రజతకిరీటమును ధరింపచేసి సింహాసన మున కూర్ధ్వభాగమున ప్రణవస్వరూపమగు ఓంకారమును ఇరు పార్శ్వ ముల శ్రీ లక్ష్మినృసింహ శ్రీ సద్గురు ఛాయాచిత్రముల నుంచి వాటిపై భాగమున ఛత్రమును ఇరువైపుల వింజామరలును, కుడిభాగమున బ్రహ్మచారియగు శ్రీ లక్ష్మయ్యను, ఎడమభాగమున బ్రహ్మచర్య దీక్షా దురంధరులగు శ్రీ నారాయణదాసు, కుడిప్రక్కన ఐదుగురు బాలికలచే కాషాయపు జెండాలను ఎడమభాగమున ఐదుగురు బాలురచే తెల్లని జెండాలను కుడిభాగమున గురుశిష్యులాంధ్రము ఎడమభాగమున శ్రీ యోగానంద నరసింహ మహర్షి శిష్యులను నియమింపచేసి శ్రీ సద్గురు సార్వభౌముల ఆదేశాను సారముగ శ్రీ నారాయణ స్వామివారు పుర ప్రముఖుల పండితవిద్వత్ జనుల సాధుపురుషుల సాధ్వీమతల్లులు ఈ గ్రంథకర్త "కీర్తన కంఠీరవ" శ్రీ కోట సుబ్బారావుగుప్త భాగవతారు మొదలగు వ్యక్తుల సమక్షమున గురుస్థానమొసగి గురుపట్టాభిషేక మొనర్చిరి. పండితశ్రేష్ఠులు పంచరత్నాది పఠనములు లెన్నియో భావగంభీరముగా గానమొనర్చిరి. ఇట్టిపవిత్ర కార్యక్రమముల చేతనే

విశ్వశాంతి చేకూరును. స్వామి శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వర సరస్వతీ సద్గురు మహారాజు యని నామకరణము చేసిరి.

ద్వాపర యుగాంతమున కురుక్షేత్రమున పాండవ మధ్యముడగు అర్జునునకు జగదోద్ధ ప్రవక్త అయిన శ్రీ కృష్ణ భగవానుడు చెప్పిన గీతాసందేశము మార్గశిర శుద్ధ ఏకాదశి అగుటచేత ఆ రోజున శ్రీ భగవద్గీతోత్సవమును సంపూర్తి చేసిరి. భక్తులెల్లరు శ్రీ స్వామివారొసంగిన గీతాప్రబోధామృతమును పానమొనర్చి తృప్తులైరి.

శ్రీకృష్ణ ప్రబోధితమగు భగవద్గీతకు శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వర సరస్వతీసద్గురు మహారాజుగారు తన సద్గురుదేవులైన శ్రీ యోగానంద నరసింహమహర్షి దివ్యశక్తి ప్రసారముతో వేదాంత రహస్యములను సర్వమానవ శ్రేయస్సభిళషించి అతివిపులముగా, వ్యక్తము చేసిరి. శ్రీ స్వామివారు వ్యక్తమొనర్చు భావపరంపరలన్నిటిని యతిజాగ్రతతో, ప్రియశిష్యుడు బ్రహ్మచారియు శాంతమూర్తియైన శ్రీ సన్నిధి వేంకటశేషగిరిరావు గుప్తగారు వ్రాసి తనజీవితమును భగవదంకిత మొనర్చిరి. వివాహము విశేషబంధమని గుర్తించి శ్రీ యోగానందమఠ కార్యక్రమములను యథాశక్తితో నిర్వహించుచు సాధుజీవితమును గడుపసాగిరి.

## శ్రీ సద్గురుస్థాన పరిపాలనా విధానము

శ్రీ సద్గురుదేవులు శ్రీ సద్గురుక్షేత్రమును పాలన చేయుటకై ప్రియశిష్యుడైన అబ్బూరు శ్రీ నారాయణస్వామిదాసును నియమించి శ్రీ నరసింహదేవాలయమునకు కొంతభూమిని, శ్రీ గురుమఠాలయమునకు కొంతభూమిని దఖలు వ్రాయించి కొండమెట్లప్రక్క మఠాలయమును నిర్మాణము చేయవలసినదని ప్రియశిష్యులకు చెప్పి తన సన్నిధిలో సేవ జేయుచున్న శ్రీ లక్ష్మణదాసు, శాయమ్మలకు స్థానాధిపత్యము నిర్వహించవలసినదని చెప్పి వీలుదస్తావేజు రిజిష్టరుచేయించి వీరిని నిత్య గురుపూజలు చేయుటకు నిర్ణయించి శ్రీ సద్గురు పీఠస్థానములో పరంపరాను

గతముగా నొక బ్రహ్మచారి యధిపతిగా నుండుటకు తగు నేర్పాట్లన్నియు చేసి, కొండపై శ్రీ లక్ష్మీనరసింహ దేవాలయములో పూజ చేయుట కొక వైష్ణవస్వామిని నియమించవలసినదని ప్రియశిష్యులకు చెప్పిరి.



స్వామి శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వర సరస్వతీసద్గురు మహారాజాగారు

1. మంచికంటి నరసింహారావు 2. శ్రీ మూర్తి చలమయ్య 3. శ్రీ దోగిపర్తి సత్యనారాయణ 4. శ్రీ దొడ్డా వేంకటసుబ్బారెడ్డి 5. శ్రీ ఆకుల గురవయ్య 6. శ్రీ గొంట్లా చలమయ్య 7. శ్రీ అచ్యుత రామకోటయ్య 8. శ్రీ డాక్టరు చెన్నయ్య 9. శ్రీ చేవూరి కోటయ్య

10. శ్రీ గంగిశెట్టి గురునాథము 11. శ్రీ కనమర్లపూడి మల్లిఖార్జునము గార్లను ఈ క్షేత్రపాలనకు మెంబర్లుగా నియమించి మనఃప్రశాంతినొంది 1960 వ సంవత్సరములో శ్రీ శార్వరినామ సంవత్సర పుష్య శు. ౧౩ లు తెల్లవారుజామున 3 గంటలకు శ్రీశ్రీశ్రీ పరమహంస పరివ్రాజకాచార్యా ద్వితీయ స్వయంప్రకాశులైన శ్రీ యోగానంద ఋషివర్యులు శ్రీమూర్తి యం దైక్యమొందిరి. దేవదుందుభులు మ్రోగెను. శుద్ధ చతుర్దశి దిన మున సాయంత్రమున సమాధి మూయబడెను.

శ్రీ కపిలగిరి క్షేత్రమున దానధర్మములు చేసినవారి వివరము

శ్రీ లక్ష్మీనృసింహాలయము, శ్రీ నరసింహస్వామి విగ్రహ ప్రతిష్ఠాపకులు శిష్యసహాయ సంపత్తితో శ్రీ యోగానంద సద్గురు స్వాముల వారు

ధ్వజప్రతిష్ఠాపకులు : శ్రీ బత్తుల చెన్నారెడ్డిగారు (మార్కాపురము)

విగ్రహ ప్రతిష్ఠాపకులు : శ్రీ గొంట్లా చలమయ్యశ్రేష్ఠిగారు (మార్కాపురము)

శ్రీ లక్ష్మీనృసింహస్వామివారికి రజితకిరీటాలంకారము చేయించిన వారు : శ్రీ చేవూరి కోటయ్యశ్రేష్ఠి, శ్రీ చేవూరి సత్యనారాయణగార్లు

శ్రీ లక్ష్మీనృసింహస్వామివారికి – రజతకరాళాలంకారము చేయించినవారు : శ్రీ అచ్యుత రామకోటయ్యగారు ... (మార్కాపురము)

శ్రీ స్వామివారి కొండపైకిమెట్లు గురుశిష్యుల సహాయసంపత్తితో కట్టించినవారు : శ్రీ దోగిపర్తి సత్యనారాయణశ్రేష్ఠిగారు ... (మార్కాపురము)

శ్రీ గురుప్రథమ సమాధి స్థాపితులు : శ్రీ చేపూరి సత్యనారాయణ గుప్తగారు ఇంజనీరు ... (వినుకొండ)

శ్రీ గురుమఠాలయస్థాపకులు దేవాలయ మఠాలయ నిర్వాహక సంఘమువారు ... శ్రీ సద్గురుస్వామి ద్రవ్యముతో కట్టించిరి.

శ్రీ గురు మఠాలయమునకు విపులవిరాళమిచ్చినవారు : ఆశ్రమ నివాసి శాయమ్మగారు

శ్రీ సద్గురుమూర్తికి భూదాన గోదాన రజతపాదుకాదాన వస్త్ర దాన శివలింగదాన రూప్యదానములను త్యాగబుద్ధితో సమర్పించిన వారు : ఎక్కలూరి శేషమ్మగారు (మార్కాపురము)

శ్రీ గురు మఠాలయమునకు శంకుస్థాపన చేసినపుడు, భక్తులు శిష్యులు నభిమానులు, నర్పించిన విరాళములు—

శ్రీ గురుమఠాలయములోపల శ్రీ సద్గురుస్వామివారి విగ్రహ స్థాపకులు : త్యాగమూర్తులగు కురంగి గాలెయ్యగారు (కంభము)

శ్రీ గురు మఠాలయము లోపల శ్రీ యోగానంద నరసింహ విగ్రహస్థాపకులు : శ్రీ తిరుమల శెట్టి వెంకటస్వామిగారు (కంభము)

శ్రీ గురు మఠాలయములోపల శ్రీ శివలింగ ప్రతిష్ఠాపకులు : శ్రీ ఎక్కలూరి శేషమ్మగారు (మార్కాపురము)

శ్రీ గురు మఠాలయము లోపల శ్రీ సద్గురు పాదుకాపీఠ ప్రతిష్ఠా పకులు : ఈ గ్రంథకర్తగారి పితృదేవులు, శ్రీ కోట రామయ్య శ్రేష్ఠి దత్తకుమారులు శ్రీ కోట లక్ష్మీనారాయణశ్రేష్ఠిగారు (వినుకొండ తాలూక) కొండాయిపాలెము

శ్రీ గురు మఠాలయము లోపల పెద్దగంట వేయించినవారు : శ్రీ కుంచాల వెంకయ్యగారు – పొన్నలూరు (రెడ్డిపాలెము)

| | |
|---|---|
| శ్రీ పడుచూరి అనంతరామయ్యగారు (చందలూరు) | రు 85–0–0 |
| ,, అన్నమునేని వీరయ్య చౌదరిగారు (కూకుట్లపల్లె) | 50–0–0 |
| సత్తెనపల్లి భక్త సంఘమువారు | 49–0–0 |
| కస్తల భక్త సంఘమువారు | 48–0–0 |
| శ్రీ పాలవాయి శేషయ్య గుప్తగారు | 25–0–0 |
| ,, గుర్రము లింగమ్మగారు | 21–0–0 |
| ,, దొడ్డా వెంకటసుబ్బారెడ్డిగారు (మార్కాపురము) | 15–0–0 |

శ్రీ ఊటుకూరి మహాలక్ష్మమ్మగారు రు 15-0-0

,, దూపుగుంట్ల నరసయ్యగారు (చందర్లపాడు) 11-0-0

,, జవ్వాజి లక్ష్మయ్యగారు (అచ్చంపేట) 11-0-0-

,, మహంకాళి పుల్లయ్యగారు (విజయవాడ) 11-0-0

,, చింతిరాల వెంకటసుబ్బమ్మగారు (మార్కాపురము) 10-0-0

,, నేరెళ్ళ వెంకటస్వామిగారు (ఫిరంగిపురం) 6-0-0

శ్రీ గురు మతాలయము లోపల క్రింద పాలీష్ రాళ్ళు పరపించినవారు :

శ్రీ మహంకాళి పుల్లయ్యగారు (విజయవాడ)

## శ్రీ లక్ష్మీనృసింహ నామావళి

పిడుగురాళ్ళ శ్రీరామతీర్థ సేవాశ్రమ స్థాపకులు శ్రీ శ్రీ శ్రీ
కేశవతీర్థ స్వామివారు రచించినవి

శ్రీ నారసింహ – హరినారసింహ – జయ లోకపల్లీశ గురునారసింహా!
శ్రీ కపిలగిరివాస – ప్రభునారసింహ !
జయనారసింహా – హరే నారసింహా !
ప్రహ్లాద వరదా – ప్రభునారసింహా !
భవభయవిదూరా – జ్వాలానృసింహా !
జ్వాలానృసింహా – ల క్ష్మీనృసింహా !
జయ మట్టపల్లీశ – మా నారసింహా !

## శ్రీ నృసింహ బహుపరాకులు

1. శ్రీదైత్యరాజ సభాస్తంభ విజృంభమాణ గంభీర నరకంఠీరవాకారా ! బహుపరాక్ !

2. సనకసనందన సనత్కుమారా సనత్సుజాత నారద ప్రహ్లాదాది మహాభాగవతోత్తమ సంస్తుత్య జగజ్జేగీయమాన దివ్యమంగళ విగ్రహా ! బహుపరాక్ !

3. శంఖచక్రగదా ఽభయముద్రా సంకలిత మహాచతుర్భుజాభిరామా బహుపరాక్ !

## విజ్ఞప్తి

శ్రీ కపిలగిరియందు ప్రతిసంవత్సరము వైశాఖ శు 13 త్రయోదశి దినమున శ్రీ సద్గురు దేవునిసన్నిధి శ్రీ లక్ష్మీనృసింహ జయంతి మహోత్సవము జరుగును. ప్రతిసంవత్సరము పుష్య శు 13 త్రయోదశి రోజున సద్గురుదేవుని యారాధన మహోత్సవము జరుగును.

ఈ దినమున హరికథ (లేక) దైవప్రబోధము విధిగా జరుగుచుండును.



శ్రీ గురు మఠాలయము

ఓమ్ తత్ సత్